శ్రీరస్తు

శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము

## ఆంధ్ర తాత్పర్యసహితము

(ఆదిత్య - బ్రహ్మ - బ్రహ్మాండ - పాద్మపురాణములు)

ఆంధ్రీకరణము :

ఆకులమన్నాడు పండిత ఆర్. పార్థసారథి భట్టాచార్యులు




తి. తి. దేవస్థానముల బుల్లెటిన్‌నుండి ఉద్ధరింపబడినది.

1962

ప్రకాశకులు :

తిరుమల - తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# విషయసూచిక



## ఆదిత్యపురాణము

1 వ అధ్యాయము :


శౌనకాదులనుగూర్చి సూతునిచే చెప్పబడిన భగవద్వైభవము 1
సూతుడు చెప్పనారంభించుట 2
దేవశర్మ కథ . . 5
దేవశర్మ స్తుతించుట .... 9


2 వ అధ్యాయము :


శ్రీ శ్రీనివాసుని దివ్యమంగళవిగ్రహసౌందర్యాదివర్ణనము 13


3 వ అధ్యాయము :


దేవశర్మ శ్రీ శ్రీనివాసుని స్తుతించుట .... 29


4 వ అధ్యాయము :


శ్రీ భగవానుని వైశ్వరూప్యాది వర్ణనము .... 40


## బ్రహ్మపురాణము


దిలీపుడు దూర్వాసుని ప్రశ్నించుట .... 65
వాయుదేవునకును ఆదిశేషునకును కలిగిన కలహవృత్తాంతము 68


2 వ అధ్యాయము :


శ్రీవేంకటాద్రియందు శేషకృత తపఃప్రభావ వర్ణనము... 75
శేషునకై భగవానుడావిర్భవించుట .... 76
స్వామిపుష్కరిణీమహిమ కథనము .... 78


3 వ అధ్యాయము :


వాయుదేవునకు భగవద్దత్తమగు విలక్షణశక్తిమత్త్వవరము 82
శంఖణచక్రవర్తికి శ్రీనివాసుడు ప్రత్యక్షమగుట .... 86

4 వ అధ్యాయము :
ముక్తిదములగు 'స్వామిపుష్కరిణి' మొదలగు సప్తతీర్థములు 91
5 వ అధ్యాయము :
శ్రీవేంకటాద్రియందలి అరువదియెనిమిదితీర్థముల - మహిమ కథనము 96
6 వ అధ్యాయము :
మనుతీర్థమాదిగా గల నూటయెనిమిది పుణ్యతీర్థములు 100
7 వ అధ్యాయము :
తొండమాను చక్రవర్తి పుట్టుకప్రకారము .... 102
8 వ అధ్యాయము
శ్రీవరాహదేవుడు స్వామితీర్థ వాయుదిశనుండుట ... 113
నిషాదునకు వరాహమూర్తి దర్శనమిచ్చుట . 115
9 వ అధ్యాయము :
శ్రీవేంకటాద్రియందలి పుణ్యతీర్థముల స్నానప్రశంసనము 120
10 వ అధ్యాయము :
శ్రీవేంకటాద్రియందు చేయదగిన మహాదానములు ... 125
విష్ణువర్ధనను ద్విజుని కథ .... 129
వేంకటాద్రియందలి దీపారోపప్రశంస .... 130

## బ్రహ్మోత్తరఖండము

వసిష్ఠుడు తనకు పౌరోహిత్యదోషనివృత్తికై యత్నించుట 133
11 వ అధ్యాయము :
నారదశాపమువలన తుంబురునకు ఘోణతీర్థప్రాప్తికల్గుట 151

## బ్రహ్మాండపురాణము

1 వ అధ్యాయము :
భృగునారదసంవాదాత్మక సూతోక్త శ్రీవేంకటా - చలమాహాత్మ్యము .... 160

నారదునిగూర్చి భగవానుని ప్రశ్న 167

నారదకృత భగవత్క్రీడార్హదేశప్రకాశనమ్ . 168

2 వ అధ్యాయము :

ఆదిశేషుడు భగవత్క్రీడాద్రియై యవతరించుట .. 170

భగవతోలక్ష్మ్యాదిమహిషీపరిజనైస్సహ క్రీడాచలగమనమ్ 171

అద్రిరూపధార్యన స్తస్య శిరఃపుచ్ఛపక్షప్రదేశవర్ణనమ్ . 172

3 వ అధ్యాయము :

భగవానుని క్రీడాచల వర్ణనము . 177

నారాయణుని స్తుతిప్రకారము .. 181

4 వ అధ్యాయము :

భగవానుడు లీలార్థమై వేటకు బోవుట . 186

వృషభాసురుని వృత్తాంతము . . 187

భగవన్తం ప్రతి సంహారాభ్యుపగన్తృవృషభాసురప్రార్థనా 190

వృషభాసుర వధప్రకారః . 192

అంజనాదేవ్యుత్పత్తిక్రమము 193

5 వ అధ్యాయము :

ఆంజనేయుని జననము . . . 196

6 వ అధ్యాయము :

వేంకటాచలాభిధాన హేతూపోద్ఘాతము 206

7 వ అధ్యాయము :

చోళరాజసుతోత్పత్తిక్రమము ... 213

8 వ అధ్యాయము :

చోళరాజసుతుడు పాతాళమునుంచి తండ్రికడకు వచ్చుట 221

ఆకాశవాణిప్రబోధముచేఆకాశరాజుకుమారునినభిషేకించుట 222

9 వ అధ్యాయము .

శబరునితో చక్రవర్తి శేషాచలమునకు వెళ్లుట .... 230

రాజపుత్రుడు స్తోత్రముచేయు ప్రకారము .... 232
భగవానుడు చక్రవర్తిప్రార్థనను ఆదరించుట 234

10 వ అధ్యాయము :
కృష్ణశర్మవృత్తాంతము, అస్థిసరోవరమహిమ ... 240

11 వ అధ్యాయము :
సింహోదుడను అసురుని కథ ... 248

## పాద్మ పురాణము

24 వ అధ్యాయము :
మేరుశిఖరమందుండు శుకుడు వేంకటాద్రికి వచ్చుట .... 263
వేంకటాచలవర్ణనమ్ .. 266
శుకుడు వేంకటాచలమందలి పుణ్యతీర్థములకేగుట . 269
కుమారధారాతీర్థమాహాత్మ్యము . 270
పాపనాశనతీర్థమాహాత్మ్యము .. 271
ఆకాశగంగాతీర్థమాహాత్మ్యము . . ,,
వ్రతతీవర్తసీతీర్థమహిమ – అశరీరివాక్యోపదేశము .... 272
అశరీరివాక్కునాదరించి శుకుడు పద్మసరోవరమున కేగుట 273
పద్మసరోవరవర్ణనము . ,,
శుకుడు పద్మసరసున శ్రీనివాసధ్యానపూర్వకముగ
స్నానాదులజేయుట . 274
పద్మసరోవరతీరమందలి దివ్యారామవర్ణనము .... 275

25 వ అధ్యాయము :
దివ్యారామమునందు శుకబ్రహ్మర్షి మహాతపస్సునుచేయుట 277
శుకముని తపోజ్వాలలచే లోకోపద్రవము కల్గుట .. 279
శుకుని తపమును భంగపరచుడని దేవేంద్రుడు –
రంభాదులతో చెప్పుట .... 280

మహేంద్రుని యెదుట రంభాదులు శపథము చేయుట 281
శ్రీనివాసధ్యానముచే జితకాముడగు బ్రహ్మర్షి నిజూచి- రంభాదుల పరిహాసము . 283
రంభాదుల మాటలను వినిన శుకుడు పరితపించుట . 286
26 వ అధ్యాయము
రంభాదుల ప్రలోభనమునకు భీతిజెందిన శుకుడు — శ్రీనివాసుని స్తుతించుట 289
శుకుడు స్తుతించిన దశావతారస్తోత్రము 290
శ్రీశ్రీనివాసునిగూర్చి శుకబ్రహ్మర్షి కోరిన ప్రార్థనము 293
రంభాదులు విసగి తమనే నిందించుకొనుచు - స్వస్థానమున కేగుట 294
భగవత్కృపచే శుకుడు ఇనుమడించినశ్రద్ధతో నుండుట 295
భగవంతుని సేవించిన శుకుడు పారవశ్యముజెందుట .... ..
శ్రీనివాసునికృపచే శుకునకు మోక్షప్రాప్తి 297
27 వ అధ్యాయము :
శుకుడు నిర్మించిన శుకపురమునందలి గృహనిర్మాణము 302
శుకపురినుండి శుకుడు శేషశైలమునకు వచ్చుట .. 304
స్వామిపుష్కరిణీతీరవర్ణనము 305
స్వామిపుష్కరిణీవర్ణనము 306
శ్రీనివాసుడావిర్భవించుట 307
శుకబ్రహ్మర్షికృత శ్రీనివాసస్తుతి 311
28 వ అధ్యాయము .
శ్రీ వరాహావిర్భావ వృత్తాంతము 313
పాతాళమునకు పోయిన భూమినుద్ధరించుటకై - మహావిష్ణువు అవతరించుట . .. 314
పాతాళమందు ధరణీదేవితో వరాహదేవుని నర్మప్రసంగము 316

వరాహదేవునికి భూదేవి చెప్పిన ప్రతివాక్యము 317
ధరణీదేవితోకూడి వరాహమూర్తి శేషాచలమునకు వచ్చుట 318
దుర్వాసుని శాపముచేత కిన్నర దంపతులు కిరాతులగుట 319
కిరాతదంపతులకు పుత్రోత్పత్తి మొదలగు వివరము .... ,,

29 వ అధ్యాయము

కిరాతుని సమీపమునకు వరాహదేవుడు వచ్చుట .... 322
వరాహమును చూచుటకు రాజు శేషాచలమునకు వచ్చుట ,,
రాజు వల్మీకమునుండి వచ్చెడి వరాహమును దర్శించుట 323
రాజునుగూర్చి అశరీరవాణి పలుకుట ... 325
వరాహదేవుడావిర్భవించుట .... 327
రాజునుగూర్చి భగవదాదేశము .... 329
కిన్నరమిధునమునకు శాపమోక్షప్రకారము .... ,,
శ్రీనివాసుడు స్వామిపుష్కరిణి దక్షిణతీరమందుండుట 330

30 వ అధ్యాయము :

శ్రీ నృసింహాచలమందలి నీలకంఠక్షేత్రవర్ణనము 331
నీలకంఠాశ్రమమునందలి పుష్కరిణీవర్ణనము ... 334
ఉపల వటవృక్షమూలమునందలి నీలకంఠాశ్రమవర్ణనము 336
నీలకంఠుని నృసింహారాధన సంకల్పము 337

31 వ అధ్యాయము :

నీలకంఠునిచే జేయబడిన నృసింహారాధన విధివర్ణనము 339
నృసింహ భగవానుని వర్ణనము ... 341
నృసింహసాన్నిధ్యముచే ఆశ్రమము విశిష్టత నొందుట 343
పాండవతీర్థమాహాత్మ్యము . . 344
నారాయణగిరిప్రభావకథనము .. 345

32 వ అధ్యాయము :

నారాయణాద్రియందు భైరవుడను క్షేత్రపాలుని ఉదంతము 346

పార్వతి నారాయణగిరియందు తపస్సుచేసి —
ఈశ్వరుని యర్ధాంగి యగుట .... 347
స్వామిపుష్కరిణీమాహాత్మ్యము 348

33 వ అధ్యాయము :

దైత్యులవలని బాధల నెరింగించుటకై బ్రహ్మాదులు
క్షీరాబ్ధికేగుట ... 360
బ్రహ్మాదికృత క్షీరాబ్ధినాథస్తోత్రము ... 361
బ్రహ్మాదిదేవతలయెదుట క్షీరాబ్ధినుండి లక్ష్మిచెలికత్తె
యుద్భవించుట .... 362
భగవానుని నివాసస్థలమును చెప్పి ఆమె వారల
కభయమిచ్చుట .... 363
బ్రహ్మాదులు నారాయణాద్రికి చేరుకొనుట . 364
శ్రీ స్వామిపుష్కరిణీతీరవర్ణనము 365
బ్రహ్మాదులు శ్రీనివాసదర్శనమునకై ప్రయత్నించుట .... 366
బ్రహ్మాదులొనరించిన 'జితంతే' స్తోత్రము 368
భగవదావిర్భావము .... 369
బ్రహ్మాదులు శ్రీనివాసుని స్తుతించుట ... ,,
శ్రీ శ్రీనివాసావిర్భావఘట్టము .. 370
భగవానుడు బ్రహ్మాదులను కుశలప్రశ్నలడుగుట .. 371
బ్రహ్మ దైత్యబాధలనుగురించి నివేదించుట .. 372
భగవానుడు అభయప్రదానమిచ్చుట .... 374
భగవానుడు రక్షోగణసంహారమునకై కుముదాక్షుని-
నియోగించి అంతర్హితుడగుట ,,
శ్రీనివాసావాసస్థలముయొక్క సర్వఫలప్రదత్వము 375
శ్రీనివాసావతార దేశకాలనిర్ణయము .. 376

34 వ అధ్యాయము


| | |
|---|---|
| భృగుపాదాహతినందిన భర్తపై కోపించిన లక్ష్మి-పాతాళమునకు పోవుట .. | 377 |
| లక్ష్మిని వెదకుచు భగవానుడు భూలోకమునకు వచ్చుట | 378 |
| భగవంతునుద్దేశించి అశరీరవాక్కు పలుకుట .... | 379 |
| భగవానుడు సువర్ణముఖరీతీరమునకు వచ్చుట .. | 380 |
| భగవానుడు పద్మసరోవరమును నిర్మించుట | 381 |
| భగవానుని తపఃప్రకారము . | 382 |
| ఇంద్రాదిదేవతలు తపోవిఘ్నము చేయజూచుట .. | ,, |
| భగవానుడు తపోవిఘ్నపరిహారమును సృజించుట ... | 384 |
| పద్మసరోవరమునుండి లక్ష్మి అవతరించుట | 385 |
| బ్రహ్మాదులు పద్మసరోవరమునకు వచ్చుట . | 387 |
| పద్మావతి భగవంతుని వరించుట | 388 |
| భగవానుడు పద్మసరోవరమునకు వరమిచ్చుట .. | 389 |
| నారదాదులును పద్మసరోవరమును ప్రశంసించుట ... | ,, |
| శుకచరిత్రవర్ణనము | 391 |
| ఛాయాశుకుని ఉత్పత్తిక్రమము | 393 |
| దేవల దేవదర్శన సంవాదము .... | 395 |
| ఉపసంహారము ... | 396 |




శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః
శ్రీయై పద్మావత్యై నమః
ఆదిత్యపురాణాన్తర్గత

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము

(ఆంధ్రతాత్పర్యసహితము)

ఆకులమన్నాడు ఆర్ పార్థసారథి భట్టాచార్యులు.

శ్రియః కాన్తాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్
శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మఙ్గళమ్
శ్రీ వేంకటాచలాధీశం శ్రియాఽధ్యాసితవక్షసమ్
శ్రితచేతనమన్దారం శ్రీనివాసమహం భజే.

జయత్యాత్మేశ్వరోన్నిద్రధ్యానసౌధప్రియాతిథిః
శ్రీమత్పత్రపురీవాసః శ్రీరామః సీతయా గృహీ
శ్రీనివాసం నమస్కృత్య గురూనౌఖేయసూత్రిణః
శ్రీనివాసాధ్వరీన్ద్రాద్యాన్ వేదాన్తార్థప్రకాశకాన్.
దేవభాషామయం కావ్యం వేంకటాచలవైభవమ్
ఆంధ్ర్యా వాణ్యా పార్థసూతో వివృణోతి యథామతి

—: శౌనకాదులనుగూర్చి సూతునిచే చెప్పబడిన భగవద్వైభవము :—

(శౌనకాదులు అడుగుచున్నారు)

శ్రీ వేంకటేశమాహాత్మ్యం శ్రీనివాస ప్రసాదతః
శ్రీప్రదం సర్వదా సూత దయయా ప్రోక్తవానసి॥ ౧
ఇతః పరం శ్రీనివాసః శ్రీపతిః సర్వశో హి నః
కథం ప్రీతో భవేత్సర్వ్యః హ్యభీష్టాని ప్రవర్షయన్ ॥ ౨
తద్వదస్వ కృపాపూర్ణ వేంకటేశకథామృతమ్
భగవన్ సర్వతత్త్వజ్ఞ దయాపాత్రం వయం తవ ॥ ౩

తా॥ భగవానుని అనుగ్రహముచే సర్వకాల సర్వావస్థలయందును శ్రీ ప్రదమగు శ్రీ వేంకటేశుని ప్రభావమును మాకు నీవు చెప్పియుంటివి. ఆ ప్రభువు

నకు మాబోటులయందనుగ్రహముకలిగి మా యభీష్టములను ప్రసాదించుటకు మేమేమి చేయవలయునో దయచేసి మాకు చెప్పగోరుచున్నాము. నీవు భగవత్తత్త్వవేదివియు ఆశ్రితపక్షపాతివియు గావున నీ సన్నిధానమున మేమీ ప్రార్థనము చేయుచున్నాము

(శ్రీ సూతుడు చెప్పుచున్నాడు)

శృణుధ్వం మునయో దివ్యం సావధానతయా త్విదమ్
యథాపృష్టం తథైవాహం వక్ష్యామి వచనం శుభమ్ ॥ ౪

వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన
వేంకటేశ సమోదేవో న భూతో న భవిష్యతి ॥ ౫

అద్భుతం చాస్య చరితం వర్ణితుం కేన శక్యతే
తథాఽపి తారకం సర్వపాపఘ్నం పుణ్యవర్ధనమ్ ॥ ౬

సువిచిత్రమపూర్వార్థం దేవర్ష్యాదిభిరాదృతమ్
లోకోత్తరం మహాశ్చర్యం వక్ష్యేఽహం సర్వసిద్ధిదమ్ ॥ ౭

శేషాచలే యన్మాహాత్మ్యమన్యక్షేత్రే న తత్క్వచిత్
తద్గతశ్రీనివాసస్య మహిమా నాన్యగః శుభః ॥ ౮

వేదేషు చ పురాణేషు వేంకటేశకథామృతమ్
వర్ణితం చేతిహాసేషు భారతాద్యాగమేషు చ ॥ ౯

మనోహరం తు సంశ్రావ్యమిహాముత్రేష్టదాయకమ్
జ్ఞానప్రదం విశేషేణ మహైశ్వర్యస్య కారణమ్ ॥ ౧౦

వైరాగ్యభక్తిసత్త్వాది ప్రదేంద్రియవశప్రదే
వేంకటాద్రౌ శుచిక్షేత్రేఽశుచిదోషో న విద్యతే ౧౧

తస్మాద్వేంకటనాథస్య నైవేద్యం గ్రాహ్యముత్తమమ్
తేన క్షేమః ప్రజానాం హి విపరీతే విపర్యయః ॥ ౧౨

తా॥ ఓ మహాత్ములారా! వినుడు. మీరు తలచినది నిజము. అనంతకోటి బ్రహ్మాండములలో శ్రీ వేంకటాద్రి దివ్యక్షేత్రమునకు మించినచోటులేదు.

అట్లే అచ్చట సాన్నిధ్యముచెందిన ప్రభుని మించిన దేవుడును లేడు. అత్యద్భుతమగు నా దేవుని చరిత్రమును ఉన్నది ఉన్నట్లు ఎవ్వడు చెప్పగలడు? ఐనను నా శక్తి ననుసరించి ఆ చరిత్రమును మీకు చెప్పగలను ఆ దివ్యచరిత్రము సంసార తారకము, పాపఘ్నము, పుణ్యవర్ధనము, అపూర్వార్థము దేవఋషులాదిగాగల సకల మహనీయులచే ఆదరింపబడినది లోకోత్తరమును ఆశ్చర్యజనకమును సర్వసిద్ధిప్రదమును ఐనది ఈ దివ్యక్షేత్రమందలి మాహాత్మ్యముగాని ఇచ్చటి ప్రభునిమాహాత్మ్యముగాని ఇతరత్ర లేదు వేదములు పురాణములు ఇతిహాసములు ఇతరమగు సమస్తవాఙ్మయమునందును ఈ ప్రభుని కథామృతము వర్ణింపబడని చోటులేదు అమృతమయ కథయగుటచే చెవులకు ఇంపుగను మనుజులకు తృప్తికరముగను ఐహికాముష్మిక ఫలప్రదమును జ్ఞానప్రదమును అఖండైశ్వర్యదాయకమును స్థితప్రజ్ఞతా జనకమును అగుచున్నది పరమపవిత్రమగు శ్రీ వేంకటాద్రి క్షేత్రమున అశుచియను విషయము ఉండదు కాగా శ్రీ శ్రీనివాసమూర్తికి నివేదనము కాబడిన మహాప్రసాదములను వేనినిగాని దృష్టిదోషము స్పర్శదోషము మొదలగు దోషములను గమనించక అందరును భక్తిశ్రద్ధలతో స్వీకరింపవలయును అట్లుచేయుట క్షేమకరము. ఇందు విషయమై సందేహించువారలకు మహాపాపము సంభవించి అనర్థము కలుగును.

కర్తాఽపి సృష్టిస్థితిసంయమాదేః ధర్తా రజస్సత్త్వతమాంస్యనహః ।
అనాద్యనంతో వచసాఽనిరుక్తః సదాఽఽశ్రయో దేవవరో వరేణ్యః ॥ ౧౩

తా॥ ప్రభువు జగత్సృష్టిస్థితిసంహారములకు కర్తయైనను రజస్సత్త్వతమో దోషములకు లోనైనవాడు కాడు. ఆతడు ఆద్యంతశూన్యుడు. వాఙ్మనసాగోచరస్వరూప స్వభావుడు ఉపాస్యుడు. సమాభ్యధికరహితుడు. పురుషోత్తముడు నై యున్నాడు

నిత్యం బ్రహ్మా శివః శేషగరుడేంద్రాదయో వరాః
పూజయన్తి మహాభక్త్యా వేంకటేశం శ్రియా సహ ॥ ౧౪
చరాచరగురుర్దేవః సర్వసాక్షీ మహేశ్వరః
జప్యస్తుత్యోఽర్చనీయశ్చ స్మర్యో ధ్యేయోఽఖిలైరపి ॥ ౧౫

తన్మనాస్తద్గతప్రాణో భక్త్యా తన్నామ సంస్మరేత్
గోదానాన్యశ్వమేధాద్యాః కన్యాదానాన్యసంఖ్యయా ॥ ౧౬

అసంఖ్యమేరుసౌవర్ణదానాన్యన్యాన్యనేకశః
తన్నామస్మృత్యతుల్యాని మాహాత్మ్యం కిముతాద్భుతమ్ ॥ ౧౭

ఇతి శేషేణ కథితం కపిలాయ మహాత్మనే
కపిలాఖ్యమహాయోగిసకాశాత్తు మయా శ్రుతమ్ ॥ ౧౮

తదుక్తం భవతామద్య సద్యః ప్రీతికరం హరేః
అతో వో మంగళార్థం చ శృణుధ్వం మునిసత్తమాః ॥ ౧౯

తా॥ ఒకక్షణమైనను యెడతెగక చతుర్ముఖుడును పరమశివుడును అనంత గరుడ విష్వక్సేనాది పరిషద్వర్గమంతయు లక్ష్మీసమేతుడగు శ్రీనివాసుని సేవింతురు చరాచరగురుడును సర్వసాక్షియునగు శ్రీనివాసుడు సకలచేతనులచేతను జపహూతార్చన ధ్యానాదులచే ఆరాధింపదగినవాడు. గోదానాది దశదానములేమి ఇతర మహాదానము లెన్నియేమి తన్నామస్మరణమునకు సాటిరావు. అట్టియెడ ఆ మహాప్రభుని నామస్మరణమహిమ యెట్టిదై యుండును? ఈ రహస్యము సహస్రశీర్షుడగు నాదిశేషునిచే కపిలమహామునికుపదేశింపబడగా కపిలముని నాకు చెప్పెను. ఆ పరమరహస్యమును నేనిప్పుడు మీకు చెప్పెదను. సావధానులై వినుడు.

శ్రీ వేంకటేశయాత్రార్థం గచ్ఛధ్వం సుదృఢవ్రతాః
విష్ణుసందర్శనం కృత్వా భక్తిమంతో జితేంద్రియాః ॥ ౨౦

స్తోత్రం కురుధ్వం బహుధా భగవద్గుణవర్ణనైః
స్వగుణోత్కర్షవిజ్ఞానాద్యథా ప్రీతిర్నిజే హరేః ॥ ౨౧

న తాదృశీ ప్రీతిరస్తి హ్యజ్ఞానాదన్యథామతౌ
భక్త్యా స్తోత్రేణ సంతుష్టస్సర్వేష్టాని ప్రవర్షతి ॥ ౨౨

భక్తిస్తోత్రవిహీనేషు దయావాన్ న భవేత్తథా
అత్ర వః కథయామీష్టమితిహాసం పురాతనమ్ ॥ ౨౩

యస్య స్మరణమాత్రేణ భక్తిర్విష్ణుపదాంబుజే

తా॥ ఓ మహనీయులారా! ఈ క్షణమే వేంకటాచలయాత్రకు బయలుదేరుడు భగవానునివర్ణించి జితేంద్రియులై భక్తితో భగవద్గుణవర్ణనముగల స్తోత్రముచేయుడు తనగుణములను స్తుతించువారలయందుగల ప్రీతి భగవానునకు మరియొకరియందు కలుగదు భక్తితో స్తుతించువారలకు సర్వాభీష్టములను ఒసగి యనుగ్రహించును. అట్టి భక్తిలేనివానియందు భగవదనుగ్రహము కలుగదు భగవద్భక్తితోస్తోత్రముచేసి సిద్ధిజెందిన ఒకానొక మహనీయుని చరిత్రమును చెప్పెదను

వాయుశిష్యో దేవశర్మా విష్ణుభక్తో జితేంద్రియః ॥ ౨౪

తపస్వీ బహునిష్ఠావాన్ సర్వదా విష్ణుచిన్తనే
మమతాహంకారవర్జో విషయేషు విరాగవాన్ ॥ ౨౫

షట్‌శత్రువిజయీ శాన్తః షట్తరంగ సుభంగకృత్
కుటుంబే న మనఃకారీ దారిద్ర్యాత్పీడితోఽపి చ ॥ ౨౬

భార్యయా ప్రార్థితో నిత్యం దారిద్ర్యాపగమేచ్ఛయా
భో నాథ! హే! పతే! స్వామిన్ ప్రసీద కరుణాకర ॥ ౨౭

క్షుధయా పీడితా బాలాః తవ పుత్రాశ్చ కేవలమ్
న శక్తాఽహమరణ్యేషు కందమూలార్జనాదిషు ॥ ౨౮

రక్షకో మమ నాన్యోఽస్తి శిశూనాం పాలనేఽపి చ
కృపాం కురుష్వ శిశుషు మద్విజ్ఞాపనమాశృణు ॥ ౨౯

కులస్వామీష్టదేవో నః జగద్రక్షణదీక్షితః ।
శరణాగతసంత్రాణశ్శ్రీనివాసః సతాం గతిః ॥ ౩౦

పాలకో హి బహూనాం చ భక్తానాం భక్తవత్సలః ।
తల్లక్ష్మీపతిపాదాబ్జం గత్వా తత్ప్రార్థనాం కురు ॥ ౩౧

తేన ప్రీతో భవేత్సద్యః తతోఽస్మజ్జీవనం భవేత్ ।
ప్రసీద త్వం దయాసింధో దయాం కురు దయాం కురు ॥ ౩౨

తా॥ వాయుదేవుని శిష్యుడగు దేవశర్మయను ద్విజోత్తము డొకడు పూర్వము కలడు. అతడు సమస్తాత్మగుణ సంపన్నుడగు విష్ణుభక్తుడు దారిద్ర్య పీడితుడయ్యును సంసారకూపమున మనసు పడనీయక సర్వదా భగవచ్చింతన మునసే కాలము పుచ్చుచుండెను. మహా శీలవతియగు నామహానీయుని యర్ధాంగి కుటుంబ పోషణమునకు కష్టముచెంది కుటుంబ యోగక్షేమనిర్వహణ మునకై ఉపాయమును చింతించి భర్త సన్నిధిని పలుమారు ప్రార్థింపసాగెను ఓ నాథా! నా యందనుగ్రహించి సంసార నిర్వహణమునకై తాము యత్నము చేయక తప్పదు. బిడ్డలు ఆకలి దప్పులచే కష్టపడుచున్నారు. వనమందు కంద మూలాదులనుతెచ్చి నేను వీరలను ఆదరింపజాలకున్నాను నన్నుగాని యీ బిడ్డ లనుగాని రక్షించుటకు నీకంటె ఇతర సహాయకులులేరు. నా ప్రార్థనను వినుడు మన కులదేవతయగు శ్రీనివాసుడు శ్రీవేంకటాద్రియందుకలడు గదా. ఆతడు జగ ద్రక్షణదీక్షితుడు, శరణాగతరక్షకుడు, జగత్కుటుంబి, భక్తవత్సలుడు. అనేక మంది భక్తులచరిత్రములచే ఈ సత్యము జగద్వితము. ఆ దేవుని సన్నిధికేగి మన దారిద్ర్యనివృత్తికై ప్రార్థింపుడు ఆతడు ప్రీతుడై మనల ననుగ్రహించును మనము సుఖముగా జీవింపగలము. ఇంతమాత్రము యత్నముచేయగలరని ప్రార్థించెను.

ఇతి దైన్యేన మహతా ప్రార్థితోఽహర్నిశం తయా
న స్వీచకార తద్వాక్యం తపోవిఘ్నభయాత్తదా ॥ 33
దిష్ట్యాట్య చాదృష్టపాకేన తద్గురుర్వాయురాగమత్
పతివ్రతాయాం శిశుషు ప్రసన్నః కరుణానిధిః ॥ 34
తపోఽవసానే సంప్రాప్తం స్వగురుం జగతాం గురుమ్
దృష్ట్వా ముదా దేవశర్మా సహసోత్థాయ చాదరాత్ ॥ 35
సాష్టాంగం తం ప్రణమ్యాథ బద్ధాంజలిపుటోఽభవత్

తా॥ ఇట్లు అతిదైన్యముతో భార్యపల్కిన పల్కులను తపోవిఘ్న భయముచే దేవశర్మ సరకుచేయకుండెను. అంతలో నొకనాడుఅదృష్టవశమున దేవశర్మ గురువగు వాయుదేవుడు దయతో దేవశర్మ భార్యయొక్కయు బిడ్డల యొక్కయు క్షేమమును మనసున చింతించి శిష్యుడగు దేవశర్మనాదేశింపుటకై

ఆతని యాశ్రమమున కేతెంతెను. ధ్యానావసానమున దేవశర్మయు గురునిరాకను గుర్తించి సంతుష్టాంతరంగుడై సాష్టాంగముగ బ్రణమిల్లి అంజలిబద్ధుడై యెదుట నిలచెను

తతో వాయుః ప్రాహ శిష్యం మధురం వచనం హితమ్ ॥ ౩౭

అంతట వాయుభగవానుడు ప్రసన్నుడై శిష్యునుద్దేశించి మధురోక్తిని హితమును చెప్పసాగెను.

'శ్రీమద్వేంకటనాదస్య యాత్రార్థం గచ్ఛ మా చిరమ్
తేనేహాముత్ర తేఽభీష్టసిద్ధిర్భవతి నాన్యథా ॥ ౩౮
లక్ష్మీపతేః దయాసిన్ధోః బ్రహ్మాదివరదాయినః
యాత్రాయాం నాస్తి సందేహః శీఘ్రం గచ్ఛ సుభక్తిమాన్' ॥
ఇతి దేవేనానిలేగ గురుణా స్వస్య చోదితః
ముహుర్ముహుర్ప్రేధితోఽద విష్ణుయాత్రామహాదరః ॥ ౩౯
గురూక్తమర్థం జగ్రాహ గురువాక్యే సదా రతః
గురూపదేశో బలవాన్ గురోరాజ్ఞాం న లంఘయేత్ ॥ ౪౦
ఇత్యర్థమనుసంధాయ ప్రతస్థే శేషపర్వతమ్
తత్ర శ్రీ వేఙ్కటేశస్య సందర్శనమహాదరమ్ ॥ ౪౧

ఓ దేవశర్మా! నీవు తత్క్షణమే శ్రీనివాసమహాప్రభుని దర్శనమునకై వేంకటాద్రియాత్రకు బయలుదేరుము. అట్టి దివ్యయాత్రచే నీకు ఐహికాముష్మిక ఫలములు సిద్ధించును. నీ వెంతటి యోగజ్ఞానసంపన్నుడవైనను శ్రీనివాసమహా ప్రభుని దర్శించక సిద్ధిపొందజాలవు. త్వరపడుము. అచ్చట సాన్నిధ్యము చెందియుండిన మహాప్రభువు దయాసాగరుడు, చతుర్ముఖుడాదిగాగల ముక్కోటి దేవతలకు వరప్రదానముచేయు ప్రభువు. అచ్చటకు యాత్రగా పోవుటనుగురించి నీవు యెంతమాత్రము సందేహించరాదు. నీవు ఆలస్యము చేయక వెంటనే ప్రయాణముకమ్ము. ఇట్లని గురుదేవునిచే యాజ్ఞాపింపబడిన దేవశర్మ, గురు దేవునిచే నిరుత్తరుడగునట్లు హృదయపరివర్తనము కల్గినవాడై దివ్యక్షేత్రయాత్ర

యందు పరమాదరమునుకలిగి వారి ఆదేశమును శిరసావహించెను సాధువులు గురువాక్యమును, ఆజ్ఞను మీరుట సంభవించదు గదా! గురూపదేశమునకంటె బలకరమగు హితము వేరొకయెడ లేదు అట్టిరహస్యమెట్టిదో తాత్కాలికముగ తెలియరాకపోయినను గుర్వాజ్ఞ అనుల్లంఘనీయమను మహోపదేశముచే సాధువులు గుర్వాజ్ఞను తప్పక గౌరవింతురు. శేషపర్వతయాత్రయనునది గురూపదేశ బలమున తనకు మహోపకర్మమనియు, అది మీరరానిదనియు నమ్మి, ఆతడు వేంకటాద్రినిలయుడగు శ్రీనివాసమహాప్రభుని దివ్యమంగళవిగ్రహదర్శనార్థమై వేంకటాద్రికి ప్రయాణమయ్యెను.

> ఆనందజ్ఞానదం విష్ణుమానందమయనామకమ్
> ఆనన్దేన దదర్శాయమానన్దనిలయాలయే ॥ ४२
> విహరన్తం శ్రీధరాభ్యాం నానాలీలావిలాసినమ్
> భక్తదర్శనమాత్రేణ ప్రసాదాన్మందహాసినమ్ ॥ ४३
> శ్రీ వేఙ్కటేశం తం నత్వా భక్త్యా చక్రేఽథ సంస్తుతిమ్

శ్రీ వేంకటగిరినాథుడు సామాన్యదైవముకాదు ఆనందమును, జ్ఞానమును ప్రసాదించగల ఏకైకదైవము. 'ఆనందమయః' అని ఉపనిషత్తులలో సర్వోత్కృష్టుడుగ ప్రస్తుతించబడినవాడు. అట్టి మహాప్రభుని దర్శించునప్పుడు ప్రాకృత చేతనున కానందము పరమకాష్ఠలో ఆవిర్భవించుట కాశ్చర్యమేమియున్నది? ఆనందజ్ఞానములను ఆనందమయుడు నగు అర్చారూపియగు ప్రభువునకు నిత్యనివాసమగు ఆలయమునకు ఆనందనిలయమనుపేరు ప్రసిద్ధమగుట ఉచితము. అట్టి 'ఆనందనిలయ' దివ్యవిమానమధ్యమున శ్రీశ్రీనివాసుని వీరశర్మ దర్శించెను. శ్రీనివాసుడును ఆనందనిలయ దివ్యవిమానమున వక్షఃస్థలమున నిత్యానపాయినియు, దివ్యమహిషియు నగు శ్రీ మహాలక్ష్మిని ధరించి, భక్తపరిజనములతో లోకోత్తరదివ్యలీలల ననుభవించుచు భక్తులు యెదుట కనుబడిన మాత్రమున 'స్మితభాషియు, పూర్వభాషియు' నగుచు మందస్మితవదనారవిందముతో ప్రకాశించుచు దర్శనమీయగా, దేవశర్మ బ్రహ్మానందానుభవమున మగ్నుడై తైలధారావదవిచ్ఛిన్నస్రోతోరూపమగు భక్తిపారవశ్యముచే యథాశక్తిగ మైమఱచి స్తోత్రముచేయ నారంభించెను.

(దేవశర్మ స్తుతిప్రకారము) —

'దయానిధే దయానిధే దయానిధే దయానిధే
నమో నమో నమో నమో నమో నమో నమో నమః ॥ ౪౪
శ్రీపద్మనాభ పద్మేశ పద్మజేశేన్ద్ర వన్దిత
పద్మమాలిన్ పద్మనేత్ర పద్మాభయధరారిభృత్ ॥ ౪౫
పద్మపాణే పద్మపాద సర్వహృత్పద్మ సంస్థిత
త్వత్పాదపద్మయుగళం ప్రణమామ్యతిసున్దరమ్ ॥ ౪౬
త్వత్పాదపద్మమాహాత్మ్యమప్యనంత త్రివిక్రమమ్
యత్కనిష్ఠాంగుళినఖమణ్యగ్రగుణసంయుతాన్ ॥ ౪౭
అనంతాన్ సువిశేషాంశ్చ పశ్యన్తి శ్రీర్నిరన్తరమ్
స్తోతుకామాక్షణాదీక్షహర్షదాఽఽశ్చర్యసాగరే
గహనే గాహమానాఽభూదనన్తశ్రుత్యగోచరే ॥ ౪౮

తా॥ దయాసముద్రుడవగు నీ పాదపద్మములకు అనంతప్రణామములు. నీవు చతురాననుని గనినవాడవు. మహాలక్ష్మికి భర్తవు. బ్రహ్మ, శివుడు, ఇంద్రుడాదిగా గల దేవతాగణములచే కీర్తింపబడువాఁడవు. పద్మమాలను ధరింతువు. పద్మములవంటి నేత్రములు కలవాడవు. శంఖచక్రములను అభయ ముద్రను, పద్మమును హస్తములలో ధరింతువు. పద్మములవంటి భుజములు, పాదములు కలవాడవు. సకలచేతనులయొక్కయు హృదయకమలములందు వసింతువు. పద్మములవలె మృదువులును, ఆహ్లాదజనకములునగు నీపాదములతి సుందరములు. నేనా పాదసేవ చేయుచున్నాను. ఓ అనంతా! త్రివిక్రమావ తారమున లోకోత్తరమగు నుపకారమును జేసిన నీ చరణమహిమ ప్రపంచమును ఆకర్షించుచున్నది. నీపాదములయొక్క కనిష్ఠాంగులినఖమణియొక్క అనంతము అగు కల్యాణగుణము లను విశేషములను కటాక్షించుచున్న శ్రీమహాలక్ష్మి ఆ మహిమను కీర్తించవలెనను ఆశతో కూడియు, సకలవేద వేదాంతములకు గోచరముకానట్టి ఆ మహిమను కీర్తింపజాలనిదై, సర్వకాలసర్వావస్థలందును ఆశ్చర్యమున మునిగి తేలుచున్నది.

త్వయోపదిష్టో యః పుత్రవాత్సల్యాచ్చతురాననః
త్వద్గుణానాం చ గణనాదానన్దమతులం భజన్ ॥ ౯౯

నాద్యాపివిరరామాఽసౌ గణనాద్దేవరాడపి
సహస్రవదనః శేషోఽశేషవేదార్థకోవిదః ॥ ౧౦౦

నాహం జానే ఇతి బ్రూతే యన్నఖాగ్రాగ్ర్యవైభవమ్

తా॥ పుత్రవాత్సల్యముతో నీచే ఉపదేశము కావించబడిన చతురాననుడు నీ గుణగణముల ననుసంధించుకొనుచు మహానందమును పొందుచున్నాడు. నీ కల్యాణగుణగణములను లెక్కించుటకు మొదలిడిన దేవేంద్రుడు తన గణన కార్యమునందే నేటికి నిమగ్నుడై యున్నాడు. సహస్రముఖములతో సర్వజ్ఞుడని ప్రసిద్ధిగల ఆదిశేషుడును నీ గుణతత్త్వమును యెఱుగలేనని యే సత్యమును పలుకుచున్నాడు.

అనన్తవేదా భాషన్తే హ్యన్యోన్యం ప్రవిచార్య చ ॥ ౧౦౧

తా॥ అనంతములగు వేదములు తమలో తాము పరామర్శించి యేక కంఠముతో దిగువరీతిని ప్రతిపాదించుచున్నవి.

ఏకైకస్మిన్నధికారే నియుక్తా ఏకైకశో బ్రహ్మపూర్వాశ్చ విష్ణో
సర్వేదేవాః స్వాధికారే నియుక్తాః సత్యాదిలోకేషు యథాక్రమేణ॥౧౦౨

భుఞ్జన్త ఇష్టాని మహాదరేణ భజన్తి శేషాచలగం రమేశమ్
వయన్త్వనన్యా హరిణా నియుక్తా వేదాః స్తోతుం తస్యగుణానుధావమ్॥

గుణాస్త్వనన్తాః పరమాత్మనో యత్పదో నఖాగ్రస్థగుణైకదేశమ్
స్తుతౌ మిళిత్వా వయమత్ర శక్తా వేదాస్త్వనన్తా జనితాస్తదర్థమ్ ॥ ౧౦౪

తా॥ శ్రీ మహావిష్ణుని దివ్యాజ్ఞచే నియమింపబడిన నియతాధికారములుగల్గి బ్రహ్మ మొదలగు సకలదేవతలును సత్యలోకమాదిగ ఆ యా లోకములందు తమ నియమితకార్యములను చేయుచు శ్రీవేంకటేశుని అనుగ్రహములనే ఇష్టార్థములను అనుభవించుచున్నారు. వేదరూపములుగ మేముకూడ భగవదాజ్ఞచే తన

గుణములను స్తుతించుటకై సృజియింపబడితిమి. కాని మేమందరము కలసి సమిష్టిగకూడ ఆ మహాపురుషునిపావనఖాగ్రమందలి కల్యాణగుణములలో ఏక దేశమునుకూడ తెలిసికొని ఆ పని చేయజాలకున్నాము.

ఏవం సునిశ్చిత్య గుణైకదేశమాహాత్మ్యమే తే త్వవిజానన్త ఏవ
ఉపక్రాన్తాః స్తోతుమథో గుణైకదేశోఽప్యనన్తాత్మ తయాఽభివృద్ధః ॥

తా॥ ఈ నిర్ణయమునకువచ్చిన అనంతవేదములును, అనంతుని అనంత గుణములలో కొంచెమునైనను కీర్తించెదమని యూహించి అట్లుచేయ నారంభించగా-ఒక్కొక్కగుణము సైతము అనంతమై కన్పట్టసాగెను.

తం వీక్ష్యతేఽన్యోన్యమథోచురేకం గుణం వదామో విసృజామ శేషాన్
ఆరేభిరే పూర్వవదేవ తేఽపి గుణా అనన్తా అభవచ్చ సోఽపి॥ ౫౬
గుణైః సుపూర్ణాః శుభదైరనన్తైః ప్రత్యేకశః కిరణానీవ పూష్ణః
విదిక్షు దిక్షూర్ధ్వమధశ్చ వేదా దృష్ట్వా గుణాన్ వ్యాపృతానిత్యవోచన్॥

తా॥ అంతట వేదములు తాము సంకల్పించినట్లుకాక ఆ గుణములలో ఏకదేశముకూడ అనంతముకాగా భయము చెంది అనంతగుణములలో ఒక గుణమునైనను కీర్తించదగునని యూరంభించగా, ఆ సంకల్పితమైన ఒక్క గుణముకూడ అనంతమాయెను. ఆ యాశ్చర్యము చూడ పది దిక్కులందును నిరంతరముగ వ్యాపించిన సూర్యకిరణముల రీతిని భగవానుని ఏకగుణము కూడ అనంతమై తెలియవచ్చినంతట తమలో తాము ఇట్లని చెప్పుకొనసాగెను.

ద్రష్టుంశ్రోతుంకీర్తితుంవాఽపిబోద్ధుమశక్యంనః కిముత స్తోతుమేతాన్
అస్మానతీతాన్వయమల్పసారాన్ కిం వర్ణయామోఽలమలంప్రశంసయా॥
ఇత్యుక్తవన్తః స్వమనోనుసారాద్గుణానేతాన్ వర్ణయామాసురంజః
తథాఽపి తే పావనఖాగ్రగేషు గుణేష్వనన్తేషు విభాజితస్య ॥ ౫౯

ఇత్యుక్తవన్తః స్వమనోనుసారాద్గుణానేతాన్ వర్ణయామాసురంజః
తథాఽపి తే పావనఖాగ్రగేషు గుణేష్వనన్తేషు విభాజితస్య ॥ ౬౦

గుణైకదేశస్య గుణైకదేశః ప్రవర్ణితోఽంశా బహవో న వర్ణితాః
ఏవం రమాఽజాహిపవేదముఖ్యాః శక్తానాఽసన్ దర్శనే త్వద్గుణానామ్ ॥

తా॥ ఉన్నది ఉన్నటుల భగవానుని కల్యాణగుణములను అనుభవించుటకో, వినుటకో, చెప్పుటకో, యెఱుగుటకో మనకు యోగ్యతలేదు స్తోత్రము చేయుటయనునది అసంభావితము. ఆ గుణములు మనజ్ఞానమునకు అందనట్టివి. మనము అల్పజ్ఞులము. ఇట్లు నిర్ణయమునకు వచ్చినవై తమకు గోచరమైనంత మాత్రమే ఆ గుణములను చెప్పెను. అనంతములగు నీ పాదనఖాగ్రగుణములలో ఒకదానిని వేరుచేసినను దాని ఏకదేశమునందలి ఏకకదేశమును మాత్రమే వేదములు చెప్పజాలినవి. అందును ఎన్నో అంశములు చెప్పబడనేలేదు. స్తోత్రమునకయ్యే యేర్పడిన వేదములు అనంతములయ్యు తత్త్వమును చెప్పజాలకపోయినట్లే నీ వక్షఃస్థలవాసినియగు నీ యర్ధాంగియు, పుత్రుడగు చతుర్ముఖుడును ఆదిశేషుడును కూడ నీ కల్యాణగుణముల మహత్త్వమును పూర్ణముగ తెలియజాలకున్నారు.

యత్సమస్తగుణాన్ విష్ణోః వర్ణనే శక్తివర్జితాః
అనన్తవేదాః తద్భూమన్ గుణాస్తే త్వమితాద్భుతాః॥ ౭౧

ఇతి శ్రీమదాదిత్యపురాణే శ్రీ వేంకటాచలమాహాత్మ్యే దేవశర్మకృత శ్రీనివాసపాదనఖాగ్రాదిమహిమవర్ణనం నామ ప్రథమోఽధ్యాయః.

తా॥ అనంతములగు వేదములచేత సమిష్టిగ కూడ తెలియజాలని నీ గుణములు అద్భుతములు. నీవు గుణపరిపూర్ణుడవు. నీకు నమస్కరించెదను.

ఇది శ్రీమదాదిత్యపురాణమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యము నందు దేవశర్మచే కీర్తింపబడిన శ్రీ శ్రీనివాసప్రభుని పాదనఖాగ్రాదిమహిమవర్ణనమనునది ప్రథమాధ్యాయము.

# రెండవ అధ్యాయము

—: శ్రీ శ్రీనివాసుని దివ్యమంగళవిగ్రహసౌందర్యాదివర్ణనము :—

(దేవశర్మ స్తుతింపమన్నాడు) —

ఇతోఽప్యధ త్వత్పాదాబ్జగతసౌందర్యమద్భుతమ్
స్వామిన్ త్వయా ప్రేరితశ్చేద్యథామత్యనువాదయే ॥ ౧

తా॥ ఓ ప్రభూ! నీపాదనఖాగ్రమునకంటె నీ పాదపద్మమందలిసౌందర్యమెంతో గొప్పది నీచే ప్రోత్సహింపబడి ఆ గొప్పవనమును నాకు తెలిసినంత మాత్రము కీర్తించెదను

వక్షఃస్థాఽపి రమాదేవీ తవ పాదామ్బుజే స్థితమ్
సౌన్దర్యమద్భుతం దృష్ట్వా సుందరీ మోహితాఽభవత్ ॥ ౨

విస్మితా ద్రష్టుకామాఽథ స్వస్య నేత్రద్వయేన వై
అశక్యం దర్శనం మత్వా త్రిరూపా చాభవత్తదా ॥ ౩

దక్షిణే శ్రీరూపిణీ చ వామే భూరూపిణీ స్థితా
నీలారూపా చ తత్రైవ త్రిరూపా నేత్రషట్కతః ॥ ౪

పశ్యన్త్యనన్యమనసా సౌన్దర్యాఖ్యరసాయనమ్
పిబన్త్యప్యన్వహం నాపి నివృత్తా తృష్ణయాఽధునా ॥ ౫

తా॥ త్రైలోక్యైకసుందరియగు మహాలక్ష్మి నీ వక్షఃపీఠముననే సర్వదా వాసముచేయుచున్నను నీ పాదపద్మములందలి సౌందర్యమునకు ముగ్ధయై తన రెండునేత్రములచే నీసౌందర్యమును సాకల్యముగ ననుభవించియు, తృప్తిజెందనిదై నీ కుడియెడమపార్శ్వములందు నిత్యానపాయినులగు శ్రీభూదేవులుగను, సన్నిధియందే నీళారూపిణిగను మూడు దివ్యావతారములను పరిగ్రహించి, ఆరు కండ్లతో నీ పాదాబ్జములందలి సౌందర్యరసాయనమును ఏకాగ్రచిత్తయై యనుభవించుచు అనివృత్తతృష్ణావిశేషయై యొప్పుచున్నది.

శ్రీసున్దర శ్రీనివాస నాభిస్థశ్చతురాననః
తవ పాదామ్బుజే రమ్యసౌన్దర్యే లగ్నమానసః ॥ ౬

అష్టనేత్ర్యా దివారాత్రం పశ్య౯ సౌన్దర్యమద్భుతమ్
నాలం నేత్రాష్టకమితి బహురూపీ తథాఽభవత్ ॥ ౭

తా॥ లక్ష్మీరమణా ! శ్రీనివాసా ! నీనాభియందుద్భవించిన చతుర్ముఖుడు నీ పాదకమలములందలి రమ్యసౌందర్యమున మగ్నమానసుడై తన యెనిమిది నేత్రములు చాలక నీ సౌందర్యమును దర్శించుటకై బహురూపియగుచున్నాడు.

శంకే చ కౌస్తుభం నాభౌ వైకుణ్ఠాదిత్రిధామసు
సత్యలోకే చ మేర్వాదౌ సర్వత్ర చతురాననః ॥ ౮
తతః పాదాబ్జసౌన్దర్యం రసజ్ఞాప్యమృతధిక్కరమ్
ప్రీత్యా పాతుమహోరాత్రమాసాద్య సుఖభోగినః
తృష్ణా శాన్తాఽధునా నాపి పాదసౌన్దర్యమీదృశమ్ ॥ ౯

తా॥ అట్టి యాతని బహురూపములు నాభియందు కౌస్తుభముగను, వైకుంఠము, శ్వేతద్వీపము, క్షీరాబ్ధిసత్యలోకము, మేరుపర్వతము ఆదిగా గల స్థానములందు చతురాననునకు రూపములుకలవు. ఇన్ని చోటులందుండి నీ పాద సౌందర్య సేవాసుఖము ననుభవించియు అతనికి ఆశ చల్లారలేదు.

శయ్యాఽఽసనాఽతపత్రాదిరూపీ త్వత్పాదసేవకః
శేషో బహుసహస్రాక్షః సదాన్తఃస్థో వ్యచిన్తయత్ ॥ ౧౦
అస్మత్స్వామ్యఙ్ఘ్రిసౌన్దర్యం విచిత్రసుమనోహరమ్
అదృష్టశ్రుతపూర్వం చ మహాగాధం విలక్షణమ్ ॥ ౧౧
సులక్షణం చ సందృశ్యం జగన్మోహనమోహకమ్
బహూని మమ నేత్రాణి సమీపే సర్వదా హరేః ॥ ౧౨
వాసశ్చేశప్రసాదేన త్వేవం భాగ్యభూన్మమ
ఇతి సంప్రీతిసంయుక్తః సర్వదాఽతిప్రియో హరేః ॥ ౧౩
నేత్రైః బహుసహస్రైశ్చ లక్ష్మీపతిపదామ్బుజే
అసమం చిత్రసౌన్దర్యం దృష్ట్వా దృష్ట్వా పునః పునః ॥ ౧౪

మహానన్దామ్బుధౌ మగ్నః ఏవం మేనే ఫణీ తదా

తా॥ 'నివాసశయ్యాసనపాదుకాంశుకోపధానవర్షాతపవారణాదిభిః' అనునట్లు అనేకవిధముల భగవత్పరిచర్యచేసెడి సహస్రశీర్షుడగు నాదిశేషుడు, అనేక సహస్రనేత్రములతో భగవత్పాదసౌందర్యమును బహువిధముల నిరంతరము అనుభవించుచు, 'ఆహా! రెండువేల నేత్రములు కలిగిన నాకు భగవత్సన్నిధియందు నివాసభాగ్యము కల్గుట నా యదృష్టము.' అని ఆనందాబ్ధినోలలాడుచు, ఆ సౌందర్యమును యేమరక తలచి తలచి ఇట్లని నిర్ణయముజేసికొనెను.

వసామ్యహం సదైవాత్ర పాదమూలే చమత్పతేః ॥ ౧౫

వైకుణ్ఠం వా న గచ్ఛామి త్యక్త్వా విష్ణుపదామ్బుజమ్
యస్మాదానన్దో భవేన్నిత్యం పాదసౌన్దర్యదర్శనాత్ ॥ ౧౬

వైకుణ్ఠ ఈదృశానన్దః కైవల్యేఽపి న విద్యతే
పాతాలమాత్రం గన్తవ్యం పాదమూలం యతో హరేః ॥ ౧౭

న స్థాస్యామి క్షణమపి యత్సౌన్దర్యామృతం వినా
ఇతి నిశ్చిత్య నాగేన్ద్రః పాదసౌన్దర్యమోహితః ॥ ౧౮

యత్ర యత్రేన్దిరేశస్య పాదమూలం ప్రవర్తతే
తత తత్ర సదా పాదసౌన్దర్యామృతపాయ్యభూత్ ॥ ౧౯

తా॥ నేను యెల్లపుడును నా ప్రభునిపాదములనే సేవింతును. నాకు వైకుంఠమువద్దు. నా ప్రభుని పాదసేవయందుగల ఆనందము శ్రీవైకుంఠమునందుగాని, కైవల్యసుఖమునందుగాని లేదు. పాతాళమున నా ప్రభుని పాదమూలము గలదు. నేనచ్చటి కేగిపోయెదను. ఆ సౌందర్యపరాకాష్ఠ ననుభవించుట కదియే ఉచితస్థానము. కావున నేను పాతాళమునకేగి ఆ దర్శనానందమనుభవింతును'. అని నిర్ణయించి పాతాళమున నా యానందము ననుభవించుచున్నాడు.

అథాచిన్త్యదేవం హి శంకరో లోకశంకరః
శేషస్య కిమహో భాగ్యం శేషాగేశప్రసాదజమ్ ॥ ౨౦

బహూనేత్రాణి తత్పాదసౌన్దర్యామృతసేవనమ్
ఏతద్ద్వయం దుర్లభం మే త్రినేత్రత్వాదహో బత ॥ ౨౧
భావిజన్మని శేషత్వ ప్రాప్త్యర్థం వా మహత్తపః
కరోమీత్యతివైరాగ్యాచ్ఛంభుః కైలాసగోఽభవత్ ॥ ౨౨

తా॥ అట్లే లోకశంకరుడగు పరమశివుడును భగవత్పాదమహిమనుచూచి చూచి, 'ఆహా! ఆదిశేషునకు శ్రీనివాసుని కటాక్షజమగు మహాభాగ్యము, ఆతని పాదసేవకై అనేకనేత్రములు కల్గుటయు, ఆ యన్నినేత్రములతో భగవత్పాదసౌందర్యమును తనివిదీర దర్శించుటయు నిట్లు రెండువిధమగు అదృష్టమాతనికి కల్గినది. మూడు నేత్రములు మాత్రమే కలుగుటచే నాకాభాగ్యము కలుగలేదు. నే నీ యభాగ్యమును సహింపజాలను. మఱొకజన్మమునందైనను అట్టిభాగ్యము నార్జించుకొనుటకై నేను తపస్సుచేసెదను'. అని విశ్వసించి తపోయోగ్యమగు కైలాసపర్వతమునకు పోయి తపము చేయుచున్నాడు.

శ్రీవేఙ్కటేశేన్దిరేశ జిష్ణుస్త్వవముఖామ్బుజాత్
జాతః సహస్రనయనోఽప్యేవం తవ పాదామ్బుజే ॥ ౨౩
అదృశ్యాశ్చర్యసౌన్దర్యం సమ్పశ్యన్నప్యహర్నిశమ్
ఇత్యచిన్తయదత్యన్తం పాదసౌన్దర్యమోహితః ॥ ౨౪
'అమృతస్య పురా పానే మే నాభూదీదృశం సుఖమ్
సౌన్దర్యమతిసామీప్యదోషాత్ సమ్యక్ న దృశ్యతే ॥ ౨౫

తా॥ ఓ ప్రభూ! 'ముఖాదింద్రశ్చ' అనునట్లు నీ ముఖమునుండి జననమందిన దేవేంద్రుడు సహస్రనేత్రములు కలిగి ఇచ్చటనే నీ పాదాంబురుహములను సేవించుచు, అందలి సౌందర్యవిశేషమును సేవించి ముగ్ధుడై ఇట్లని చింతింపసాగెను. ఆహా! నేను ఇంతకుపూర్వము అమృతపానము చేసినపుడు కూడ ఈ సేవచేగలిగిన ఆనందమును అనుభవింపజాలకపోతిని. అత్యంత సమీపమున వసించుటవలన సౌందర్యానుభవమును పరిపూర్ణముగ ననుభవింపజాలనని తోచినది.

ఇతోఽప్యతిశయానన్దః కిఞ్చిద్వ్యవహితే భవేత్
అతః స్వర్గస్థోఽనిమేషో యావన్నేత్రైరహర్నిశమ్ ॥ ౨౬
వీక్షే యావదలమ్బుద్ధి తతో మత్స్థానమావ్రజే
ఇతి స్వర్గగతస్యాపి యావన్నేత్రైః శ్రియఃపతే ॥ ౨౭
త్వత్తేజఃపుంజపాదాబ్జసౌన్దర్యామృతపాయినః
తృష్ణా శాన్తాఽధునా నాపి తస్మాత్స్వర్గే స్థిరస్థితిః ॥ ౨౮

తా॥ ఈ సేవానందము సమీపమునుండి యనుభవించుట కంటె దూర ప్రదేశమున నుండి అనుభవించుట యెక్కువ ఫలప్రదమని కూడతోచుచున్నది. కావున నేను అతి దూరముననుండెడి నా స్వస్థానమగు స్వర్గలోకమునకే మఱలి పోయి అచ్చటనుండి దూరముననుండి శ్రీవేంకటాద్రిని అందలి పరమపురుషుని రెప్పలార్పకుండ సహస్రనేత్రములతో రాత్రింబవళ్ళు తదేకస్మరణముతో "చాలును" అని పించుదాక సేవించుటయుక్తము. కావున అందుకై నేను స్వర్గలోకమునకేగి అచ్చటనుండి తాను తలచినతీరుననే సేవించుచు ఇంతదనుక తృప్తిజెందక ఆచోటు ఆ యనుభవమునకు తగినదేనను తలంపుతో అచ్చటనే స్థిరనివాసము నేర్పరచుకుని సేవించుచున్నాడు.

శ్రీశ! తే పాదసౌన్దర్యం లేఖానాం మహతామపి
యద్యేవం దుర్లభమభూదితరేషాం తు కా కథా ॥ ౨౯
విష్ణో! తే పాదరేఖానాం మాహాత్మ్యం లోకపావనమ్

తా॥ ఓ ప్రభూ! నీ పాదమహిమనెఱుంగుట బ్రహ్మాదులకును అశక్యము నాబోటి మానవులకు అల్పప్రజ్ఞులకు అసలే అగోచరము. నీ పాదములందలి రేఖల మాహాత్మ్యము లోకపావన చరిత్రము కలది.

విజ్ఞాపనం కరిష్యామి త్వపరాధం క్షమస్వ మే ౩౦
పాదమాహాత్మ్యశ్రోతౄణాం భక్తానాం భక్తవత్సల
మహాఽజ్ఞానతమో భిత్వా కృత్వా జ్ఞానప్రకాశనమ్ ॥ ౩౧
త్వన్మార్గదర్శనారాయ చక్రరేఖాం పదేఽధరః

తా॥ ఓ దేవా ! తత్త్వమెఱుగకయు ఉన్మత్తభాషితమునాకు తోచిన యంశ ము విజ్ఞాపింతును మన్నింపుము. నీపాదమాహాత్మ్యమును వినెడి భక్తులయొక్క అనాదిప్రాప్తమగు నజ్ఞానాంధకారమును పోగొట్టి వారలకు ఆత్మజ్ఞానమును ప్రసాదించుటకై అట్టి దివ్యశక్తిగల్గిన చక్రరేఖను నీ పాదములందు నీవు ధరించి యుందువని నా మతము — " సుదర్శన మహాజ్వాల కోటిసూర్య కోటిసూర్యసమ ప్రభ । అజ్ఞానాంధస్య మే దేవ విష్ణోర్మార్గం ప్రదర్శయ" అని గదా సదాచార్యులు సుదర్శనమహిమను కీర్తించుచున్నారు.

పాదమాహాత్మ్యమన్తృాణాం 'సాఙ్గవేదచతుష్టయమ్ ॥ ౩౨
ఇతిహాసపురాణాని పంచోఽపనిషదాత్మికాః
సర్వవిద్యా దదామీతి దరరేఖాం పదేఽధరః ॥ ౩౩

తా॥ పాదమాహాత్మ్యమును చింతించువారలకు సాంగములగు చతుర్వేద ములు ఇతిహాసపురాణములు పంచోపనిషన్మయములగు సమస్తవేదాంతశాస్త్రములు వీని నన్నింటిని వీటి సంపూర్ణానుభవమును అనుగ్రహించి ఉద్ధారణజేయుటకై సంకల్పించి నీ పాదములందు శంఖరేఖను ధరించియుందువు.

పాదమాహాత్మ్యధ్యాతౄణా 'ముపద్రవకరాన్ బలాన్
దైత్యరక్షఃపిశాచాదీన్ కూశ్మాండబ్రహ్మరాక్షసాన్ ॥ ౩౪
సంచూర్ణయామీతి హరే గదారేఖాం పదేఽధరః

తా॥ నీ పాదమాహాత్మ్యమును ధ్యానించెడి వారలను బాధించెడి దైత్యులు రాక్షసులు పిశాచములు కూశ్మాండబ్రహ్మరాక్ష సంగ్రహములాదిగాగల దుష్టులను సంహరించెదనను దీక్షను తెలియపరచుటకై పాదములందు గదా రేఖను ధరించి యుండవచ్చును.

పాదమాహాత్మ్యవక్తౄణా 'ముత్తమే మన్దిరే సదా ॥ ౩౫
పద్మయా భార్యయా సాకం పద్మజేన సుతేన చ
కుటుంబీ పద్మనాభోఽహం వసామీత్యేవ సూచయన్ ॥ ౩౬
పద్మరేఖాం పాదపద్మే పద్మేశ త్వం ధరన్నసి

తా॥ నీ పాదమాహాత్మ్యమును కీర్తించువారలకు వారల ఇండ్లయందు సర్వ కాలములందును "భార్యయగు పద్మావతి, పద్మసంభవుడగు చతురాననుడు పద్మనాభుడను నేను సకుటుంబముగ వసియింతు" వను విశ్వాసము కల్గించుటకై పాదము లందు పద్మరేఖను ధరించియుందువు.

విరజా మానససరో ధనుష్కోటిర్మహాఘహా ॥ ౩౭

గఙ్గాది సర్వతీర్థాని త్వత్పాదాబ్జే వసన్తి హి
సహస్రపత్రపూర్వాణి జాయన్తే తేషు నిత్యశః ॥ ౩౮

ఇతి సూచయితుం పాదే పద్మరేఖాం ధరన్నసి

తా॥ విరజానది "మానస సరోవరము ధనుష్కోటి, గంగాది సర్వతీర్థములు నీ పాదములందు వసియించుచున్నవి. ఆ తీర్థములందు సహస్రపత్రకమలములు ఉత్పన్నమగుచున్నవి అచ్చట పద్మోత్పత్తికి మరలకారణము నీపాదములే యని సూచించుటకై నీ పాదములందు పద్మరేఖను ధరించియుందువని కూడ తోచుచున్నది.

పద్మా హృత్పద్మసంస్థాఽపి పాదపద్మస్య మూలగా ॥ ౩౯

పశ్యన్తి నేత్రపద్మాభ్యాం తత్సౌన్దర్యమలౌకికమ్
ధ్యాయన్తీ చ స్వహృత్పద్మే తన్మాహాత్మ్యం శ్రుతీరితమ్ ॥ ౪౦

భజన్తీ కరపద్మాభ్యామంకేఽర్చనకరీ సదా
ఇతి సూచయితుం పాదే పద్మరేఖాం ధరన్నసి ॥ ౪౧

తా॥ యెల్లపుడును నీ హృదయపద్మమున వసియించుచున్నను పద్మావతి నీపాదపద్మములందుచేరి తన నేత్రపద్మములతో నీ పాదపద్మముల లోకోత్తర సౌందర్యమును కటాక్షించుచు వేదోదితముగ తన హృత్పద్మమున ధ్యానించుచు తన కరపద్మములచే సంవాహనముచేయుచున్నదని సూచించుటకై కూడ నీపాదములు పద్మరేఖలతో అలరారుచున్నవనియు తోచుచున్నది,

పాదపఙ్కజమాహాత్మ్యం లిఖిత్వైవ స్వహస్తతః
దాతౄణాం వైష్ణవాగ్రేభ్యో మహాఘౌఘవిభేదనమ్ ॥ ౪౨

కరోమీతి జ్ఞాపనాయ వజ్రరేఖాం పదేఽధరః

తా॥ నీపాదమాహాత్మ్యమును స్వహస్తాక్షరితో వ్రాసి భాగవతోత్తములకు వ్రాతను బహూకరించువారలయొక్క పాపములను భేదించుటకు వజ్రాయుధము నాపాదములందు రేఖగా సూచింపబడుచున్నదని చెప్పుటకు వజ్రరేఖను నీపాదములందు ధరించియుందువు.

మాహాత్మ్యస్యార్చకానాం తు గజాన్ కామాదిసంజ్ఞితాన్ ॥ ४३
అదమ్యాన్ దమయామీతిహ్యంకుశాఖ్యాం పదేఽధరః

తా॥ నీపాదసేవకులందు చేతనసహజములుగ సంభావితములగు అసాధ్య దౌష్ట్యము కలక్షుద్రఫలాభిసంధిరూపములగు నేనుగలను సంహరించుటకై శక్తిగల అంకుశమును జ్ఞాపకపరచుటకై నీపాదములందు అంకుశరేఖను ధరించియుందువు.

శ్రుత్వాఽదరేణ సంతుష్టాన్ భక్తాన్ ధ్వజవదుచ్ఛ్రితాన్ ।
కరోమీతి జ్ఞాపనాయ ధ్వజరేఖాం పదేఽధరః ॥ ४४

తా॥ నాయనుగ్రహముచే సంతుష్టులగు భాగవతులను ధ్వజమువలె 'త్రైలోక్యాదపిచోన్నతిమ్' అనునట్లు సాటివారలలో ఉచ్చైఃస్థానమునకు తెచ్చెదనను దీక్షనుసూచించుటకై నీపాదములందు ధ్వజరేఖను ధరించియుందువు.

అబగ్న్యనిలఖాహాం కృన్మహత్తత్త్వగుణత్రయైః ।
క్రమాద్దశగుణై రండ మావృతం వరమాద్భుత ॥ ४५
యన్నఖాగ్రా ద్వినిర్భిన్నం తత్పాదం కోను వర్ణయేత్ ।

తా॥ ఆకాశాది పంచభూతములాది గుణత్రయాంతముగ నేర్పడిన బ్రహ్మాండము నీపాదనఖాగ్రమునుండి జనించినదని నంతట నీపాదమహిమను వర్ణించుట కెవ్వరికి శక్యమగును ?

శేషోమహత్తప స్తస్త్వా త్వా మారాధ్య జగత్పతిమ్ ॥ ४६
త్వత్ప్రసాదాన్మహద్భాగ్యం యత ఆప సుదుర్లభమ్ ।
శయ్యాసనం పాదుకే తదాతపత్రమభూత్తవ ४७

తా॥ ఆదిశేషుడు ఘోరతపసుజేసి నన్నారాధించి నీయనుగ్రహమువే నీకు శయనముగను ఆసనముగను పాదరక్షగను ఛత్రముగను ఉపచరించుచు ఇతర చేతనదులభమగు మహాభాగ్యమును పొందెను.

తత్సుఖం తు రమా దృష్ట్వా మేనే శేషైకభాజనమ్ ।
అహ మేవానుభోక్ష్యామి మత్పతేరంగసంగజమ్ ౪౯

ఆతపత్రేణ యత్ప్రాప్తం పాదుకాభ్యాం చ యత్సుఖమ్ ।
సర్వభాగ్యం మమైవ స్యాదితి వక్షస్థితాఽపి సా ॥ ౫౦

వైకుంఠాదిషులోకేషు చతుర్దశసు వై తథా ।
బ్రహ్మాండాంతర్బహిశ్చాపి సర్వహృత్కమలేష్వపి ॥ ౫౧

మద్ధృత్పద్మే యదా యత్ర వర్తతే తత్ర తత్ర హి ।
క్రీడావనమభూ న్మందవాయుగంధాదిరంజితమ్ ॥ ౫౨

మల్లికాకేతకీజాతీచంపకైః కుసుమాన్వితైః ।
ఖర్జూరపనసద్రాక్షాకదళీనారికేళకైః ॥ ౫౩

బదరీమాతులుంగైశ్చ కపిత్థైశ్చూతదాడిమైః ।
జంబూజంబీరక్రమకప్రముఖైః ఫలనాయకైః ॥ ౫౪

పారిజాతైః కల్పవృక్షైర్నిత్యం తు ఫలసాంద్రకైః ।
శ్రీచన్దనేక్షుమందారైస్సంకులం మధుకాదిభిః ॥ ౫౫

తస్మిన్ సరస్స్వచ్ఛనీరం స్వర్ణసోపానమండితమ్ ।
నవరత్నాభకమలైస్సువర్ణాభకుశేశయైః ॥ ౫౬

పీతవర్ణైరుత్పలైశ్చ రక్తనీలోత్పలాన్వితమ్ ।
మత్స్యకచ్ఛపహంసాఢ్యం మత్తషట్పదనాదితమ్ ॥ ౫౭

తత్ర రత్నమయం క్రీడామండపం చాభవద్రమా ।
దివ్యం రత్నమయం తేజః పుండరీకమభూ స్ముదా ॥ ౫౮

తా॥ ఆదిశేషుడనుభవించు నానందమును తిలకించు చుండిన మహాలక్ష్మియు అసూయచెందినదా యనునట్లు తన భర్తయగు శ్రీనివాసునికి అంతరంగకైంకర్య మును తానేచేసి ఇతర దురవాపమగు నానందము ననుభవింపవలయునను నాగ్ర హముతో ఇట్లని చింతింపసాగెను. ' నాకు నాప్రియుని వక్షఃపీఠము నిత్యనివాసమై యున్న మాత్రమున తృప్తియగుపడలేదు. ఛత్రముగనో పాదరక్షగనో ఉండి అనుభవించగల స్వాతంత్ర్యము నాకు కావలయును వైకుంఠాది లోకములందును సకల బ్రహ్మాండములకును బహిరంతరములందును సకల చేతనకోటియొక్క హృదయగుహయందును నాహృదయమందును నా ప్రియుడు ఎక్కడెక్కడ ఏ దివ్యమంగళవిగ్రహమును ధరించి క్రీడించుచుండునో అక్కడక్కడ ఆతని క్రీడాహర్షపగు దివ్యవనముగనుండగలను. ఆక్రీడావనము. మృదువాతముచే పరి మళితముగ నుండునట్లును అందు మల్లికాజాజి చంపక కుసుమములును ఖర్జూర పనసద్రాక్షకదళీ నారికేళబదరీమాతులుంగకపిత్థ చూతదాడిమజంబు బూజంబీర క్రముక పారిజాతకల్పవృక్షములాది గాగల ఉత్తమఫలజాతులును ఫలసాంద్రము లగు శ్రీచందన ఇక్షుమందార మధుకాది దివ్యవృక్షములును ఉండునట్లును. అట్టి వనమున స్వచ్ఛోదకములు స్వర్ణసోపానములు నవరత్నప్రకాశములగు కమల ములు స్వర్ణకాంతిగల కుశేశయములు పీతవర్ణములగు ఉత్పలములు రక్తనీల వర్ణములుగల ఉత్పలములు మత్స్యకచ్ఛపహారి సాదిజల చరములు మత్తషట్పద ముల నాదముగల సరోవరము అమరియుండునట్లును ఆసరోవరమధ్యమున నొక క్రీడామండపముగనేను అవతరించగలను. అని సంకల్పించి అట్లే తన విభూ తిని పరిణమింపజేసి ఆమండపమధ్యమున నొక పీఠముగ గూడనయ్యెను.

తత్ర త్వామచర్చయంత్యంబా షోడశాద్యుపచారకైః ।
పాయసాన్నవ్యంజనాదిపంచభక్ష్యామృతాని చ ॥ ౨౯

నూతనవాని సువస్త్రాణి నానారుచిఫలాని చ ।
ఆర్ద్రికాదీని మూలాని స్వాదూని స్వర్ణపాత్రకే ॥ ౩౦

నిత్యతృప్తాయార్పయన్తీ పూర్ణకామాయ చాదరాత్ ।
నిరంకసర్వసారాయ సర్వసారాత్మికా స్వయమ్ ॥ ౩౧

తా॥ ఆదివ్యపీఠమున నమరియుండునిన్ను మహాలక్ష్మిషోడశోపచారములచే పూజించి పాయసాన్నాది మహాహవిస్సులను నివేదించి దివ్యవస్త్రాభరణాదులచే నలంకరించి వివిధములగు దివ్యఫలాదులను ఆర్ద్రికము (అల్లము) మొదలగు మూలములను మధురములగు పానీయములను బంగారుపాత్రములందు సమర్పించెను నిత్యతృప్తుడును అవాప్తసమస్తకాముడును సర్వసారుడునగు ప్రభునకు తదేతుల్య లక్షణములుగల ప్రభ్వి కైంకర్యముచేయ నారంభించెను

అథాఽఽత్మానం కల్పయన్తీ డోలామంచం మనోహరమ్ ।
సువర్ణశృంఖలాలంబం సువిశాలం సులక్షణమ్ ॥ ౭౨

ప్రవాళపాదసంయుక్తం సువజ్రఫలకై ర్యుతమ్ ।
ఓతం ప్రోతం స్వర్ణపట్టైః మాణిక్యస్తబకై ర్వృతమ్ ॥ ౭౩

జాంబూనదవితానాఢ్యం ముక్తాస్త్రిబకరంజితమ్ ।
భూరూపాఽభూత్స్వశయ్యం శయ్యా శ్రీరూపా సోపబర్హణమ్॥

నీలాఽభూత్పాదసేవార్థం తాంబూలం భోగసాధనమ్ ।
సువర్ణదండవ్యజనం విద్యుదాభసుచామరే ॥ ౭౪

వైడూర్యస్తబకచ్ఛత్రం పాదుకే రత్నపీఠకే ।
సర్వరాజోపచారేషు రాజచిహ్నాని యాని చ ॥ ౭౫

సర్వాణ్యభూద్రమాదేవీ దేవాయానన్త తేజసే ।
భోగ్యవస్తుస్వరూపేణ తవ సేవాభిలాషిణీ ॥ ౭౬

మహానందాంబుధౌ మగ్నా రమతే సా రమాత్వయా
రమసే రమయైవ త్వం వైకుంఠాదిషు ధామసు ॥ ౭౭

ప్రత్యేకావరణైః స్వస్వమూర్తిభిః బ్రహ్మపూర్వకైః ।
త్రిదశైః దశదిక్పాలైః సేవితః పరమాసనే ॥ ౭౮

తా॥ అట్లు దివ్యపీఠమగుటతో తనివిజెందక శ్రీమహాలక్ష్మి తాను ఆపీఠమందు బంగారుగొలుసులు ప్రవాలమయములగుకోళ్ళు వజ్రమయమగు ఫలకము కల ఒక డోలికామంచముగను మంచముపై పడుగు (నిలువు అడ్డములు)

బంగారుదారముతో నేయబడి మాణిక్యములతో అంచులుగలిగిన వస్త్రములు అపరంజిబంగారుతో నిర్మింపబడిన వితానము (చాందిని) కలిగి ముత్యాలసరములు గలిగియుండునట్లును పరిణతయై భూరూపమున శయ్యయు శ్రీరూపమున ఉపబర్హణముగను నీలారూపమున పాదసేవాపరయు అయ్యెను. తానే భోగసాధనమగు తాంబూలముగను సువర్ణదండముగల వ్యజనము (విసనకర్ర)గను చామరములుగను వైడూర్యస్తబకము (పేరులు)గల ఛత్రముగను రత్నపీఠముగల పాదుకగను ఇంకను భగవానుని యాస్థానమున వినియోగార్హతగల సకల రాజోపచార చిహ్నస్స్వరూపములను ధరించినదై అనంతతేజోవిరాజితుడగు మహాప్రభువునకు శ్రీమహాలక్ష్మి పరిచర్యచేయసాగెను. ఇట్లు సకలభోగ్యవస్తు స్వరూపిణియై భగవత్సేవాసుఖముననుభవించగోరిన లక్ష్మితో నీవు శ్రీవైకుంఠాది దివ్యదేశములందు విహరింతువు. ఈ విహారప్రదేశములన్నిటియందును బ్రహ్మ రుద్రేంద్రాదులు తమతమ అధికారోచితముగ దివ్యస్వరూపములను ధరించి మీ దివ్య దంపతులకు రక్షణమాచరింతురు.

శ్రీనివాస రమానాథ త్వన్నాభ్యబ్జే చతుర్ముఖమ్ ।
గిరీశమన్తఃకరణే హ్యంగేష్వింద్రాదిదేవతాః ॥ ౨౦

ఋష్యాదీంశ్చ యథావత్త్వం సర్వజీవాంశ్చతుర్విధాన్ ।
సృష్ట్వా తేష్వంతరావిశ్య బహిఃస్థిత్వాఽసి పాలకః ॥ ౨౧

అత్యంతభిన్నాస్తే సర్వే పృథగ్జీవా జడాత్మకాః ।
పారతంత్ర్యాదిదోషోఘైః స్వాతంత్ర్యాది గుణోర్జితః ॥ ౨౨

తా॥ ఓ శ్రీనివాసా ! నీవు జగన్మాతయైన మహాలక్ష్మికి ఆశ్రయమవు. నీ నాభియందు చతుర్ముఖుడు అన్తఃకరణమునందు పరమశివుడు ఇతరావయవములందు ఇంద్రాదులు ఋష్యాదులు కలరు. నీవు చతుర్విధజీవుల సృజించి వారి రక్షణార్థమై వారల కంతరాత్మవై బహిరంతరములందును ఉండి వారలను కాపాడుచున్నావు. సకలచేతనములు అచేతనప్రాయములుగ నుండు పృథక్స్వరూపములు నీవు పరతంత్రుడవుకాదు. స్వతంత్రాదిగుణములు కలవాడవు. నీకు అపేక్షలేదు. నిత్యతృప్తుడవు. పూర్ణకాముడవు. దయాపరుడవు సదాచరణము కల సత్యసంకల్పుడవు. బ్రహ్మేంద్రాదులునిన్ను భజింతురు. నీవు ప్రేరకుడవు నిత్యముక్తాత్మలకు నియామకుడవు.

నిరపేక్షో నిత్యతృప్తః పూర్ణకామస్త్వమార్ద్రహృత్ ।
సత్యకృత్సత్యసంకల్పో మాబ్రహ్మేశేంద్రవందితః ॥ ౭౩

సర్వేషాం ప్రేరకస్త్వం హి ముక్తాముక్తనియామకః ।
అఘట్యఘటనే శక్తో హ్యగణ్యగుణమండితః ॥ ౭౪

అచిన్త్యాశ్చర్యచర్యస్త్వం బ్రహ్మాండాన్తర్బహిస్థితః ।

తా॥ అఘటితఘటనా సమర్థుడవు. లెక్కకు మిక్కిలియగు కల్యాణగుణములు కలవాడవు. అచిన్త్యములగు నాశ్చర్యచర్యల నాచరింతువు. బ్రహ్మాండములకు లోను వెలుపలను వ్యాపించినవాడవు.

అణోరణీయాన్ మహతో మహీయాన్ సర్వగస్సమః ॥ ౭౫
సర్వాధారస్సర్వసాక్షీ సర్వాపేక్ష్యోఽతిసుందరః ।
సర్వోత్తమశ్చ సర్వజ్ఞస్సర్వస్వామీ చ సర్వదః ॥ ౭౬
సర్వశక్తోఽజ్ఞేయచర్యో వ్యక్తోఽవ్యక్తస్సనాతనః ।
శేషోఽశేషశ్చనిర్లిప్తః బ్రహ్మణ్యః శాశ్వతః శుభః ॥ ౭౭
చతుర్వర్ణైః సదా హీనః చతుర్ధర్మప్రదర్శకః ।
చతుఃపుమర్థదాతా చ చతుర్మోక్షప్రదః శ్రుతః ॥ ౭౮
అధోక్షజోఽప్రాకృతస్త్వమనంతమహిమా తవ ।

తా॥ ఓ ప్రభూ ! నీవు అణువులలో అణువువు. మహత్తులకంటె మహత్తువు. సర్వవ్యాపివి. సర్వసముడవు. సర్వాధారుడవు, సర్వసాక్షివి, అందరచేతను ఆశించబడెదవు. అతి సుందరుడవు. సర్వోత్తముడవు. సర్వజ్ఞుడవు. సర్వస్వామివి. సర్వఫలదాతవు, సర్వశక్తుడవు. నీ చేష్టలితరులకగోచరములు. వ్యక్తావ్యక్తోభయ స్వరూపివి. సనాతనుడవు. చేతనాచేతనులకు ప్రాప్యుడవు. అశేషస్వరూపివి. నిర్లిప్తుడవు. బ్రహ్మణ్యుడవు శాశ్వతశుభస్వరూపివి. చతుర్వర్ణముల కతీతుడవు. ధర్మచతుష్టయప్రకాశకుడవు. చతుర్విధపురుషార్థములనిచ్చువాడవు. సాలోక్యాది ఫలదాతవు. అధోక్షజుడవు. అప్రాకృత స్వరూపుడవు. నీ మహిమ గొప్పది.

మూలరూపీ హ్యనన్తస్త్వమవతారాస్తథా శ్రుతాః ॥ ౭౯

నామధేయాన్యనన్తాని జ్ఞానానందాదయో గుణాః ।
అనన్తవేదవేద్యస్త్రైరవేద్యోఽనన్తసౌఖ్యదః ॥ ౮౦

అహో భాగ్యమహో భాగ్యం రమేశ ! త్వత్పదాంబుజే ।
నివిష్టమనసాం సౌఖ్యమిహాముత్రాభివర్ధతే ॥ ౮౧

తా॥ నీవు సకలాధారమవు అనంతుడవు నీయవతారములనంతములు. నీ పేరులుకూడ అట్టివే జ్ఞానానందాది గుణములు అనంతములు. అనన్తవేదములచేతను తెలియశక్యముగాని వాడవు. అనన్తమగు మోక్షసౌఖ్యమునిత్తువు. ఓ రమాపతీ ! ఇదియేమి భాగ్యవిశేషము. నీ పాదాబ్జములయందు అర్పింపబడిన మనసుకలవారలకు ఇహపరములలో సౌఖ్యమువర్ధిల్లును.

తవ ప్రసాదలేశస్య లేశలేశాతిలేశతః ।
లవమాత్రం యైః సులబ్ధం తైరలబ్ధం న కించన ॥ ౮౨

చరిత్రాణ్యతిచిత్రాణి మహాన్తి చ బహూన్యపి ।
తవ నానావతారేషు దర్శయస్యనువర్తనామ్ ॥ ౮౩

తా॥ నీయనుగ్రహము పరమాణుమాత్రమైనను పొందిన పుణ్యాత్ములకు అందని మహాఫలము యేదియు ఉండదు. నీవు యెత్తిన అనంతములగు నీయవతారములన్నిటిలో ఒక్కొక్క అవతారమందును నీ స్వరూపస్వభావములను చిత్రవిచిత్రముగ చూపియున్నావు

కీటోఽపి త్వద్దయాలేశాత్సామ్రాజ్యమనుభుక్తవాన్ ।
త్వత్పాదపద్మసంపర్కలేశలేశాతిలేశతః ॥ ౮౪

దృషద్దివ్యాంగనాఽభూద్ధి చేతనానాం తు కిం బ్రువే ।
అత ఏవార్జునే సూతో బలేశ్చ ద్వారపో హ్యభూః ॥ ౮౫

ఇంద్రే త్వం దయయాఽత్యన్తం బలిం యాచితవానసి ।
గజేంద్రరక్షణే దూతాః ద్వారపాః వాఽప్యనాదిశః ॥ ౮౬

అన్వధావస్స్వయం శీఘ్రం క్షుద్రనక్రాన్ముముక్షయా ।

తా॥ నీకటాక్షలేశముచే అత్యల్పమగు కీటము సామ్రాజ్యసుఖమనుభవించినది. అట్లే నీపాదస్పర్శముచే పాషాణము దివ్యాంగనయైనది అచేతనములే అట్లగు నపుడు చేతనులతారణమునకేమి సందేహము? నీవు భక్తపరాధీనుడవై అర్జునునకు సారథిగను బలిచక్రవర్తి ఇంట ద్వారపాలకుడవుగను ఉంటివి. ఇంద్రుని గాపాడుటకై బలిచక్రవర్తియెదుట యాచకుడవై నిలచితివి. గజేంద్రుని రక్షించుటకై ఏ పరివారమునో పంపి కార్యసాధనముచేయదగియుండినను భక్తరక్షణత్వరతో ఒకక్షుద్రనక్రసంహారమునకై తొందరతో స్వయముగాపరుగెత్తితివి.

వైకుంఠం వా పరిత్యక్ష్యే న భక్తాం స్త్యక్తుముత్సహే ॥ ౧౭

మేఽతిప్రియా హి మద్భక్తా ఇతి సంకల్పవానసి ।

తా॥ నేను అవసరమునుబట్టి వైకుంఠమునైనను విడతునుగాని నా భక్తులను విడువజాలను. నాయోగక్షేమముకంటె నా భక్తులయోగక్షేమముల సంపాదనకై వారలను గమనించుట నాకు ప్రియము.

కామధేనుః కల్పవృక్షః చిన్తామణిరితి త్రయమ్ ॥ ౧౮

వేంకటేశ! త్వమేవాసి శేషాగే సర్వదానతః ।

దదాతి కామానన్నాదీన్ మణిర్ధేనుశ్చ తాదృశః ॥ ౧౯

న చాపవర్గం స్వర్గం వా తేషాం శక్తిశ్చ తాదృశీ ।

యది త్వం సుప్రసన్నోఽసి సర్వార్థాన్ సంప్రదాస్యసి ॥ ౨౦

తా॥ ఓ ప్రభూ! మాకు కామధేనువు కల్పవృక్షము చింతామణులతో కావలసినది లేదు. ఈ మూడు దేవలోక వరప్రదపదార్థములు కూడి సమిష్టిరూపమున శేషాద్రియందు సాన్నిధ్యముచెందిన నీవే ఆఫలముల నీయగలవు. ఆమూడు దివ్యపదార్థములకు అన్నవస్త్రాదులను మాత్రమే ఆశ్రితుల కీయగలయోగ్యతకలదు కాని అయ్యవి స్వర్గాపవర్గముల నీయజాలవు. నీ యనుగ్రహవశముచే అన్నవస్త్రాదిఐహిక భోగములనేగాక ఆ స్వర్గాపవర్గములుకూడ మాకు లభించగలవు.

జాత్యన్ధానాం చ చక్షూంషి దాసి త్వన్మూర్తిదర్శనమ్

బధిరాణాం చ శ్రోత్రాణి త్వత్కథాశ్రవణం తథా ॥ ౨౧

ఏడమూకం చవాచాలం కరోష్యత్యధ్యయనాన్వితమ్ ।
మందబుద్ధిం ప్రాజ్ఞతమం సాంఖ్యయోగసమాధిగమ్ ॥ ౭౨

అకరంచ కరౌదత్వా కరోషితవ పూజకమ్ ।
అపదం చ పదౌ దత్వా త్వత్తీర్థక్షేత్రగామినమ్ ॥ ౭౩

యద్యద్దుఃఖం భవేద్భృత్యే తత్తత్సద్యో హరిష్యసి ।

తా॥ ఓ ప్రభూ ! పుట్టు గ్రుడ్డివారలకు నేత్రదృష్టినిచ్చి నీ దివ్యమంగళ విగ్రహ సేవాసుఖమునిత్తువు. చెవిటివాండ్లకు చెవులనిచ్చి నీ దివ్యచరిత్రములను వినుపింపజేతువు. చెవుడు మూగవారలకు వాచాలత్వము ననుగ్రహించి స్వాధ్యాయపరులుగ జేతువు. మందబుద్ధులను నీ పాదార్చనచేయించెదవు పాదములులేనివారికి పాదములనిచ్చి ప్రాజ్ఞులజేసి సాంఖ్యయోగనిష్ఠులజేతువు. చేతులులేని వారికి చేతులనిచ్చి నీ యవతారప్రదేశములను పుణ్యతీర్థములను సేవింపజేతువు. వేయేల ! నీ భక్తులకు ఏ యే కొఱతచే దుఃఖముకల్గునో దానినంతను నీ యెదుట విజ్ఞాపనముచేసిన ఉత్తరక్షణములో తీర్చెదవు.

కుబ్జత్వం కుష్ఠితాం నానారోగానప్యాభిచారికాన్ ॥ ౭౪

హత్వా దాస్యంగదార్ఢ్యం చ సౌందర్యం చ దయోదధే ।
శ్రీనివాస ! బహూక్త్యా కిం భక్తసర్వార్తినాశనే ॥

సర్వార్థపూరణే చాపి త్వత్సమోఽన్దే న కుత్రచిత్
ప్రసన్నో నీలమేఘస్త్వం శ్రీభూవిద్యుత్సమన్వితః ॥ ౭౫

హృద్వ్యోమగః త్రితాపఘ్నో భక్తసర్వేష్టవర్షణః ।
అభీష్టాష్టమ వారాశౌ నిమగ్నోన్మజ్జనం నిజమ్ ॥ ౭౬

ఆనందాష్టమసుద్వీపే సంస్థాపయాసి చాదరాత్ ।
సర్వసౌఖ్యం దదాస్యత్ర స్వర్మ్ముక్త్యానన్ద వర్ధనః । ౭౭

ఇతి శ్రీ మదాదిత్యపురాణే శ్రీ వేంకటాచలమాహాత్మ్యే
భగవద్గుణకథామవర్ణనం నామ ద్వితీయోధ్యాయః

తా॥ మరుగుజ్జుతనము కుష్ఠరోగము ఇతర సకల పాపరోగములు చేత బదులు మొదలగు సకలానర్థములను పోగొట్టి నీ భక్తులకు నీవు శరీరదార్ఢ్యమును సౌందర్యమును ఇచ్చి కాపాడెదవు. నీవు దయాసముద్రుడవు. ఓ వేంకటేశా : వేయేల నీ భక్తులయొక్క అనిష్టములను తొలగించి సకలాభీష్టములను వారలకు ప్రసాదించుటలో నీకు సాటియగు ఇతరుడెవ్వరును ఈయనంతకోటి బ్రహ్మాండములందు వెతకినను అగుపడరు. నీవు సుప్రసన్నమగు నీలమేఘమవు, నీ పార్శ్వద్వయము నలంకరించియుండు అనపాయినులగు శ్రీదేవియు భూదేవియు మేఘాలంకారములన దగిన మెఱుపుతీగలు. నీవు భక్తుల మానసములను నాకాశమధ్యమున సంచరించెదవు. భక్తుల కేయే కోరికెలు కలవో ఆయా కోరికెలను సుభిక్షముగను సంపూర్ణముగను నీవు వర్షింతువు. ఇట్టి మనోరథప్రాప్తి సువృష్టిచే మనోరథసముద్రమను క్రొత్తసముద్రమొకటి లోకప్రసిద్ధ సప్తసముద్రముల జతలో అష్టమముగ సృష్టింపబడగా భక్తులానూతన సముద్రమునమజ్జనోన్మజ్జనముల సుఖము ననుభవించినంతట వారలనట్లే లోకప్రసిద్ధ సప్తద్వీపముల సహచరముగ సృష్టింపబడిన క్రొత్తదగు నెనిమిదవ ఆనందద్వీపమున జేర్చి అచ్చట వేదశాస్త్రోదితములగు సమస్తసుఖములను పరమ పురుషార్థపర్యన్తముగ బ్రసాదించి సుఖింపజేసెదవు

ఇది శ్రీ మదాదిత్యపురాణమునందలి శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున భగవద్గుణకథానువర్ణన మనునది రెండవ అధ్యాయము.

---

## మూడవ అధ్యాయము

### —: దేవశర్మ శ్రీ శ్రీనివాసుని స్తుతించుట :—

(దేవశర్మ చెప్పుచున్నాడు) —

అనన్తవేదసంవేద్య లక్ష్మీనాథాన్తకారణ
జ్ఞానానందైశ్వర్యపూర్ణ నమస్తే కరుణాకర ॥ ౧

నక్షత్రాణి చ గణ్యన్తే పాంసవశ్చ క్షణాదయః
త్వద్వీర్యాణి న గణ్యన్తే బ్రహ్మణా రమయాఽపి వా ॥ ౨

తథాఽప్యహం భక్తదాసదాసదాసో యథామతి
స్తౌమి త్వాం వేంకటాధీశ త్వద్భక్తః ప్రేరితస్త్వయా॥ ౩
శ్రీ వేంకటేశ! మత్స్వామిన్! జ్ఞానానందదయానిధే!
భక్తవత్సల భో! విశ్వకుటుంబిన్! అధునాఽవ మామ్॥ ౪

తా॥ ఓ శ్రీనివాసప్రభో! నీవు అనంతములగు వేదములచేతనే తెలియదగినవాడవు. లక్ష్మీపతివి, సృష్టిస్థితిసంహార కారణుడవు. జ్ఞానానం దైశ్వర్య పరిపూర్ణుడవు. కరుణాసముద్రుడవు. నీకు నా ప్రణామము. సామర్థ్యముగల ఒకానొక చేతనునిచే ఆకాశమందలి నక్షత్రములేమి భూమియందలి పాంసురేణువులేమి అనాద్యనన్త మహాకాలమందలి క్షణసమూహమేమి గణింపశక్యము కావచ్చును. అట్టివాని చేతగాని వేదవక్తయగు చతుర్ముఖుడు నీ యర్ధాంగియగు పద్మాలయ వీరలచేతకూడ నీ కల్యాణగుణములను లెక్కించ శక్యముకాదు. ఐనను నీ దాసదాసచరమావధి దాసుడనగు నేను అత్యల్పజ్ఞుడనైనను నీ దయచే నిన్ను స్తుతింప యత్నింతును. ఓ ప్రభూ! వాత్సల్యవశుడవై నన్నాదరించి నా స్తోత్రమును వినుము.

సత్యేశం సత్యసంకల్పం సత్యం సత్యవ్రతం హరిమ్
సత్యచర్యం సత్యయోనిం సత్యశీర్షం మహం భజే॥ ౫
శ్రవణాత్సర్వపాపఘ్నం మననాత్పుణ్యవర్ధనమ్
స్వధ్యానాత్సిద్ధిదం విష్ణుం ప్రేక్షణాన్మోక్షదం భజే॥ ౬

తా॥ ఓ ప్రభూ! నీవు సత్యమునకు ఈశుడవు, సత్యసంకల్పుడవు, సత్యస్వరూపుఁడవు. సత్యవ్రతుఁడవు. సత్యచర్యుఁడవు. సత్యయోనివి. సత్యశీర్షుఁడవు, నీ కథాశ్రవణము పాపములను పోగొట్టును, మననము పుణ్యమును వృద్ధిచేయును. ధ్యానము సర్వసిద్ధిప్రదము. దర్శనము మోక్షప్రదము.

శ్రీ వేంకటేశం లక్ష్మీశమనిష్టఘ్నమభీష్టదమ్
శ్రీ వేంకటేశం లక్ష్మీశం శ్రీనివాసం భజేఽనిశమ్॥ ౭
యదపాంగలవేనైవ బ్రహ్మాద్యాః స్వపదం యయుః

మహారాజాధిరాజం త్వాం శ్రీనివాసం భజేऽనిశమ్ ॥ ౮
అనంతవేదసంవేద్యం నిర్దోషం గుణసాగరమ్
అతీంద్రియం నిత్యముక్తం శ్రీనివాసం భజేऽనిశమ్ ॥ ౯

ఓ లక్ష్మీరమణా! నీవు భక్తుల అనిష్టములను పారద్రోలి అభీష్టమునిచ్చెదవు. చతురాననుడు నీ తనయుడు. నీ కటాక్షలేశముచే బ్రహ్మాది దేవతలు ఒక్కొక్కరును వారి వారి అధికారములలో అధిష్ఠించియున్నారు నీవు రాజాధిరాజువు. నీయందు దివ్యకల్యాణగుణములు తప్ప దోషగుణములుండవు. అతీంద్రియుడవు. నిత్యముక్తుడవు

స్మరణాత్సర్వదోషఘ్నం శ్రవణాదిష్టవర్షిణమ్ ।
దర్శనాన్ముక్తిదం వీరం శ్రీనివాసం భజేऽనిశమ్ ॥ ౧౦

అశేషశయనం శేషశయనం శేషశాయినమ్ ।
శేషాద్రీశమశేషం చ శ్రీనివాసం భజేऽనిశమ్ ॥ ౧౧

భక్తానుగ్రాహకం విష్ణుం సుశాన్తం గరుడధ్వజమ్ ।
ప్రసన్నవక్త్రనయనం శ్రీనివాసం భజేऽనిశమ్ ॥ ౧౨

తా॥ ఓ ప్రభూ! నీ స్మరణము పాపఘ్నము. నీ కథాశ్రవణము ఇష్టసాధకము. దర్శనము మోక్షదము. నీవు ఆశ్రితానాశ్రిత తరతమ భావములేక సకల చేతనులహృదయముననుండి ఆదిశేషునిపై పవ్వళించితివి. శేషాద్రిని ఒక అభిమాననిలయముగనుంచికొనినట్టి స్వతంత్రుడవు. గరుడవాహనారూఢుడవై భక్తుల ననుగ్రహించెడి చల్లనిచూపులలో ఆశ్రితులనాదరింతువు

భక్తభక్తిసుపాశేన బద్ధసత్పాదపంకజమ్ ।
సనకాదిధ్యానగమ్యం శ్రీనివాసం భజేऽనిశమ్ ॥ ౧౩

గంగాదితీర్థజనకపాదపద్మసుతారకమ్ ।
శంఖచక్రాభయకరం శ్రీనివాసం భజేऽనిశమ్ ॥ ౧౪

సువర్ణముఖితీరస్థం సువర్ణేడ్యం సువర్ణదమ్

సువర్ణాభం సువర్ణాంకం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౧౫

తా॥ ఓ ప్రభూ ! నీవు భక్తులచే భక్తిపాశమున కట్టదగినంత సులభుడవు. విరక్తశిఖామణులగు సనందనాదులు కూడ నిన్ను ధ్యానింతురు. నీ పాదము లందు గంగాది పుణ్యతీర్థములు పుట్టుచున్నవి శంఖచక్రములను ధరించి భక్తుల కభయమునొసంగి వరములనిచ్చెదవు. నీ నివాసము పుణ్యనదియగు సువర్ణముఖరీ తీరము నీవు అపరంజివంటి శరీరచాయగలిగి భక్తులచే కీర్తింపబడి భక్తులకు ఐశ్వర్యమునొసంగెదవు

శ్రీవత్సవక్షసం శ్రీశం శ్రీలోలం శ్రీకరగ్రహమ్
శ్రీమన్తం శ్రీనిధిం శ్రీడ్యం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౧౬

వైకుంఠవాసం వైకుంఠత్యాగం వైకుంఠసోదరమ్
వైకుంఠదం వికుంఠాజం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౧౭

తా॥ ఓ దేవా ! నీవు మహాలక్ష్మీకరగ్రహముచే ముగ్ధుడవై దివ్యమహిషిని జేసికొని ఆమెను అనపాయినిగ వక్షఃప్రదేశమున నిలుపుకొంటివి. నీవు శ్రీమంతుడవు. శ్రీనిధివి. శ్రీస్తోత్రప్రియుడవు. వైకుంఠమునే విడచి భక్తపరతంత్రతచే శ్రీవేంకటాద్రియందు వసియించుచు భక్తులకు మోక్షమునిచ్చుచున్నావు.

వేదోద్ధారం మత్స్యరూపం స్వేచ్ఛాకారం యదృచ్ఛయా
సత్యవ్రతోద్ధరం సత్యం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౧౮

మహాగాధజలాధారం కచ్ఛపం మంధరోద్ధరమ్
సుందరాంగం చ గోవిందం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౧౯

పరం శ్వేతవరాహాఖ్యం సంహృత్య ధరణీధరమ్
స్వదంష్ట్రాభ్యాం ధరోద్ధారం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౨౦

తా॥ వేదములనపహరించిన సోమకాసురుని సంహరించి వేదములను ద్ధరించి మత్స్యరూపివైయి ధర్మసంస్థాపనము చేసినట్టియు దేవపక్షపాతమువలన కూర్మరూపివైయి అమృతోత్పాదనమును సాధించినట్టియు, పాతాళమునుండి ధరణీమాత నుద్ధరించిన వరాహరూపివియు అగుదువు.

ప్రహ్లాదాహ్లాదకం లక్ష్మీనృసింహం భక్తవత్సలమ్
దైత్యమత్తేభదమనం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౨౧

వామనం వామనం పూర్ణకామం పావనమాణవమ్
మాయినం బలిసమ్మోహం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౨౨

ఇన్ద్వాననం కున్దదన్తం కురాజఘ్నం కుతారిణమ్
సుకుమారం భృగుఋషేః శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౨౩

శ్రీరామం దశదిగ్వ్యాప్తం దశేంద్రియనియామకమ్
దశాస్యఘ్నం దాశరథిం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౨౪

తా॥ భక్తశిరోమణియగు ప్రహ్లాదుని రక్షించుటకై నృసింహరూపియై హిరణ్యకశిపు సంహారముచేసినట్టియు అవాప్తసమస్తకాముడై యొప్పియు వామన మూర్తియై బలిచక్రవర్తిని యేమార్చినట్టియు పూర్ణచంద్రాననముతో అమరి భృగు వంశమున రామరూపియై దుష్టరాజుల సంహరించినట్టియు దశదిగ్వ్యాప్తములగు దశేంద్రియముల జయించగలిగి దశరథపుత్రుడై దశవదనుని సంహరించి నట్టియు శ్రీశ్రీనివాసుని నే భజించెదను.

గోవర్ధనోద్ధరం బాలం వాసుదేవం యదూత్తమమ్
దేవకీతనయం కృష్ణం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౨౫

నందనందనమానందమింద్రనీలం నిరంజనమ్
శ్రీయశోదాయశోదం చ శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౨౬

గోబృందావనగం బృందావనగం గోకులాధిపమ్
ఉరుగాయం జగన్మోహం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౨౭

పారిజాతహరం పాపహరం గోపీమనోహరమ్
గోపీవస్త్రహరం గోపం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౨౮

కంసాన్తకం శంసనీయం సంశాన్తిం సంసృతిచ్ఛిదమ్
సంశయచ్ఛేది సంవిద్ధం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౨౯

కృష్ణాపతిం కృష్ణగురుం కృష్ణామిత్రమభీష్టదమ్
కృష్ణాత్మకం కృష్ణసఖం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౩౦

కృష్ణాహిమర్దనం కృష్ణం కృష్ణోపవనలీలకమ్
కృష్ణాతాతం మహోత్కృష్టం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౩౧

బుద్ధం సుబోధం దుర్బోధం బోధాత్మానం బుధప్రియమ్
విబుధేశం బుధైర్బోధ్యం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౩౨

కల్కినం తురగారూఢం కలికల్మషనాశనమ్
కల్యాణదం కలిఘ్నం చ శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ ౩౩

తా॥ బాలుడై గోవర్ధన పర్వతమునెత్తి గోపగోపీగోసంఘముల రక్షించినట్టియు దేవకీగర్భమున నవతరించి రేపల్లెకువచ్చి నందయశోదుల రక్షణమున పెరిగినట్టియు ఇంద్రనీలశ్యామ విగ్రహము గలట్టియు బృందావనమును తన సంచారముచే పునీతము గావించి పూతనాసంహారాద్యమానుష చర్యలచే కీర్తింపబడిన యశస్సుగలట్టియు రాసక్రీడాదులచే గోపీజన చిత్తమును హరించినట్టియు కంసవధముజేసి భక్తుల సంరక్షణ్త్రతువు(?)సంపమును ప్రకటితము గావించినట్టియు పారిజాతాపహరణముజేసి దేవేంద్రుని గర్వభంగమును గావించినట్టియు మహాభారత కథానాయకియగు పాంచాలికి ఉపాస్యదేవతయై మహాభారతయుద్ధమును ధర్మసంస్థాపనకై సాగించినట్టి పరిపూర్ణవతారమగు శ్రీనివాసమూర్తిని నేను భజింతును తన ధర్మబోధచే దుర్బోధములగు రహస్యములను ఉపదేశించి ప్రపంచమును ప్రబుద్ధముజేసిన బుద్ధరూపియగు శ్రీనివాసునిశరణముజేరుదును కలియుగాంతమున దుష్టశిక్షణమును శిష్టపరిపాలనమునుజేసి ప్రపంచమునుద్ధరించుటకై యవతరించబోయెడి శ్రీనివాసుని నేను శరణమందెదను

హరిం హంసం కృష్ణం నరహరి మనన్తం మధురిపుం
హృషీకేశం యజ్ఞం కపిల మృషభం వాజివదనమ్ ।
నరం వ్యాసం నారాయణమనఘ మాత్మాన మమృతం
భజే దత్తాత్రేయం పురుషమథధన్వంతరిమపి ॥ ౩౪

అనన్తరూపస్వ మనన్తచర్య మనన్తవేదైరనువర్ణనీయమ్ ।
అనన్తనామానమనన్తదేవమనన్తకల్యాణగుణాభిరామమ్ ॥ ౩౧

అనన్తశక్త్యంశమనన్తవిక్రమంహ్యానన్తదేహే చ శయానమీశ్వరమ్
అనన్తసౌభాగ్యమనన్తనేత్రమనన్తపాదాదిమనన్తసౌఖ్యమ్ ॥

తా॥ హరి హంస, కృష్ణ నరహరి అనన్త మధురిపు హృషీకేశ యజ్ఞ కపిలవృషభహయగ్రీవ నర వ్యాస నారాయణ దత్తాత్రేయ ధన్వంతరి మొదలగు వివిధరూపములుగ ప్రశంసింపబడిన శ్రీనివాసమూర్తిని నమస్కరించెదను ఎవ్వని గుణశీలాదులనంతములో అనన్తములగు వేదములగును గోచరము కానట్టివో అట్టి అనన్త కల్యాణగుణపూర్ణుడగు అనన్తునకు నా నమస్కారము ఎవ్వని షాడ్గుణ్యపూర్తి అనంతమైనదో ఎవ్వడు తన నిత్యనివాసముగ ఆదిశేషుని దివ్యదేహమును శయ్యగా అమర్చికొని శయనించునో అట్టి ' సహస్రశీర్షా పురుషః ' అను విధముగ స్తుతింపబడెడి మహాపురుషునకు నా నమస్కారము

అసురాచలౌఘహర చక్రధరం దురితాచలౌఘహర వజ్రధరమ్ ।
కరుణాచలౌఘపరచిత్తధరం కనకాచలౌఘధరపద్మకరమ్ ॥ ౩౨

తా॥ దుష్టరాక్షస జులను శిక్షించుటకు సమర్థుడును ఆశ్రితరక్షకుడునగు శ్రీనివాసునకు నా నమస్కారము

భువనేషు వేంకటేశ్వర బహుపురుషార్థప్రదాననిపుణస్త్వమ్ ।
నోచేద్వ్యక్తతయా త్వం బహూన్నతాద్రిస్థలే కుతో వససి ॥ ౩౩

తా॥ ఓ ప్రభూ ! నీవు సకల పురుషార్థముల నిచ్చువాడవుగనుకనే అంద రకు అందుబాటులోనుండుటకై ఉన్నతమగు పర్వతశిఖరమున వేంచేసియున్నావు

గుణౌఘైరపారం స్ఫురద్రత్నహారం స్మరద్దోషహారం స్వభక్తేష్టపూరమ్ ।
భజే వేంకటేశం ఫణీశాద్రివాసం సదా మన్దహాసం శ్రియా సద్విలాసమ్ ॥

తా॥ ఓ దేవా : కల్యాణగుణపరిపూర్ణుడవును రత్నహారాలంకృతుడవును ధ్యానించినవారల పాపములను హరించి వారల ఇష్టముల నొసంగువాడవును మందహాసవదనారవిందుడవై లక్ష్మీయుతుడవగు నిన్ను నమస్కరించెదను

వేంకటేశచరణౌ తవ వన్దే సర్వతీర్థశరణౌ శరణౌ మే।
మావిధాతృశివవీశఫణీశేన్ద్రార్కసోమహుతభుఙ్ముఖవంద్యౌ ॥

తా॥ ఓ ప్రభూ! మూడుకోట్ల పుణ్యతీర్థములకు ఆటపట్టై మహాలక్ష్మి బ్రహ్మరుద్ర అనంత గరుడాదులచేతను సూర్యచంద్రాగ్నులాదిగాగల దేవతల చేతను భజింపబడెడి నీ పాదపద్మములే నాకు శరణము

శ్రీనివాసచరణౌ తవ వన్దే లోకపావన సుకుంకుమవర్ణౌ
శ్రీప్రదౌ కిల సురర్షినృపాణాం శ్రీబుగాది నిగమాగమవేద్యౌ ॥

తా॥ ఓ ప్రభూ! లోకపావనములును దేవఋషిమనుష్యాదులచేతను. అనన్తములగు వేదములచేతను కీర్తింపబడునట్టియు రుక్మవర్ణములగు నీ చరణములకు వందనము.

భజే భజకసౌఖ్యకృన్నిజ కటాక్షసంప్రేక్షణం
పరాత్పరతరం దరం దధతమబచక్రే గదామ్।
చతుర్భుజమధోక్షజం కమలజేశపూర్వార్చితం
వరోద్ధతఖలాన్ బహూన్ ఝడితి సంహరన్తం రిపూన్॥ ౪౨

తా॥ ఓ ప్రభూ! భక్తులనాదరించెడి కటాక్షదృష్టిగలిగి దివ్యాయుధములగు శంఖచక్రగదా పద్మములను ధరించెడి నాల్గుభుజములతో సేవనిచ్చుచు రుద్రాదులచే వరదానముచే గర్వించి సాధువుల హింసించెడి అసురులను సంహరించి దేవతాగణముచే అర్చింపబడెడి నిన్ను భజించెదను

అజ్ఞానసాగరసముత్తరణే ప్రశస్తం
సుజ్ఞానసేతురచనే నిపుణం బుధేడ్యమ్।
లక్ష్మీపతిం సురవరార్చితవేంకటేశం
దారిద్ర్యపూర్వదురితౌఘనిశాచరఘ్నమ్ ॥ ౪౩

తా॥ ఓ దేవా! చేతనులను అజ్ఞానసాగరమునుండి జ్ఞానసేతువును కట్టి లేవనెత్తికాపాడి దారిద్ర్యము మొదలగు పాపములనుండి కాపాడగల లక్ష్మీ నాథుడవగు నిన్ను భజించెదను.

లక్ష్మీనాథం కమలనయనం హారకేయూరభూషం
సర్వవ్యాప్తం బహుగుణభరం దోషదూరం దయాబ్ధిమ్ ।
స్వానాం తాపత్రయహరమజం నిర్విశేషం విశేషం
లోకాతీతం పురుషమతులం భావయామీష్టదేవమ్ ॥ ౪౪

తా॥ ఓ లక్ష్మీనాథా ' దివ్యాభరణభూషితుడువై ప్రేమదృష్టితో తిలకించుచు అఖిలహేయప్రత్యనీక కల్యాణగుణములుగలిగి ఆశ్రితదుఃఖహారుడగు పరమ పురుషుడవగు నిన్ను శరణము చెందుచున్నాను

శ్రీమద్వేంకటనాధపాదజనితా గంగా జగత్పావనీ
యస్యాపాంగనిరీక్షణం విధిభవేన్ద్రాగ్ర్యాది సర్వేష్టదమ్ ।
యన్నామస్మరణం మహాఘహరణం స్వర్గ్యం చ మోక్షప్రదం
యత్పాదాంబుజయుగ్మ సేవనరతో బ్రహ్మాదిభిః పూజ్యతే ॥

తా॥ ఓ ప్రభూ! త్రిజగముల పావనముచేసెడి. గంగానది నీ పాదములందు త్పన్నమైనది. నీ కటాక్షమే బ్రహ్మాదుల కాపదములనిచ్చినది. నీ నామస్మరణము మహాపాతకములను హరించి సకలపురుషార్థముల నిచ్చునది నీ భక్తులగు వారలను బ్రహ్మాదేవతలుసైతము పూజింతురు

దృష్ట్వాద్యత్యన్తదూరం నిగమనిచయవేద్యాత్మమాహాత్మ్యపూర్ణం
సర్వేషామాదిమిత్రం రవిశశినయనం పూర్ణకారుణ్యదేహమ్ ।
నిర్వాణం నిష్ప్రపఞ్చం నిరవధికసమామ్నాయసంపైరపాంగైః
గీర్వాణాద్యైరజస్రం స్తుతినతినియమైకాన్త భక్తైశ్చపూజ్యమ్ ॥ ౪౬

తా॥ ఓ ప్రభూ! నీ స్వరూపము కంటికికనుబడదు మనసుకు అందదు. నీ స్వరూపము శాస్త్రైకగమ్యము. నీవు చేతనులకు సహజబంధువు. కరుణా సముద్రుడవు నీవు యెల్లపుడు అనన్తములగు వేదములచేతను దివ్యసూరుల చేతను సేవ్యుడవగుచు దేవతలచే కీర్తించబడెదవు.

కింకరశంకరబహుకరుణాతవ బహుచరితం సమస్తభువనేషు ।
జ్ఞాపయసి భక్తిమద్భ్యః ఫణిపతిశుకశైలనారదప్రముఖైః ॥ ౪౭

తా॥ శంకరాదులు నీకు కింకరులై నీకరుణకు యెదురుచూతురు నీ చరిత్రము చతుర్దశభువనములందును వ్యాపించినది. భక్తులగు వారలకు నీ యనంత చరితమును మహాత్ములగు శుకబ్రహ్మర్షి మొదలగు సాధువులచే జ్ఞాపకపరచుచుందువు

వేంకటేశమనుస్మృత్య య ఆస్తే తస్య భూరిసుభగం దశదిక్షు ।
ఐహికం త్రిదివసౌఖ్యమతుల్యం మోక్షమాశు లభతే గుణసామ్యమ్ ॥

తా॥ శ్రీవేంకటేశ్వరుని నెవరుభజింతురో అట్టి వారలకు ఐహికలౌకిక సకలసంపదలును ఆముష్మికమగుస్వర్గము మోక్షపర్యన్త సుఖముసిద్ధించును.

శ్రీనిధిం త్విహ జహాతి మదాన్ధో యోఽస్య దుఃఖమనఘం దశదిక్షు ।
ఐహికం భసతి రౌరవకుమ్భీపాకపావకతమిస్రమముత్ర ॥ ౪౯

తా॥ మదాంధతచే ఎవ్వడు శ్రీ వేంకటేశ ప్రభుడనునిధినిచూడజాలడో అట్టివానికి దశదిశలందును ఇహలోకమున దుఃఖమే ఆవరించును లోకాంతరమందు కుంభీపాకాది నరకయాతనలును సంభవించును

విపద్ఘ్నం శుభదోద్గారం భక్తానాం వశవర్తినమ్ ।
లోకపూజ్యం రమానాథం భజేఽహం ప్రతి జన్మసు ॥ ౫౦

భక్తౌఘానుగ్రహార్థాయ త్యక్త్వా వైకుంఠముత్తమమ్ ।
ధరణ్యామవతీర్ణోఽసి వరేణ్యో వరదోఽర్చితః ॥ ౫౧

తా॥ ఓ ప్రభూ! భక్తులను ఆపదలనుంచి కాపాడి సుఖసంపదలనిచ్చెడి లోకారాధ్యా! శ్రీపతీ! రాగలయే జన్మయందైననిన్ను భజించెదను. భక్తులరక్షించుటకై పరమపదమును విడచి భూమియందు వేంకటాద్రియందవతరించి వరప్రదుడవై అర్చించబడుచున్నావు.

అత్యల్పమాత్రం పరవస్తు లోకే నైవాపహార్యం కిల సత్యసన్ధ।
జనైరనేకైః బహుజన్మయత్నైః ఆయాససాధ్యం బహుపాపంచయమ్॥
హరస్యశేషంస్మృతిమాత్రతస్త్వం వాణీమనోదృష్టిపథాద్యగోచరః।
విలక్షణస్థావరజంగమాత్మకం విక్షేబహూపాయవిశారదం త్వామ్॥

తా॥ ఓ ప్రభూ! నీవు సత్యసంధుడవు పరులసొత్తును అపహరించుట యుక్తముకాదు నానాకోటి చేతనులు అనంతకోటిజన్మములనుంచి సంపాదించి దాచిపెట్టుకొనిన పాపములను నీవు నీ నామస్మరణమాత్రమున హరించుచున్నావు నీ స్వరూపము వాఙ్మనసాగోచరమైనది విలక్షణస్థావర జంగమాత్మకముగ పరిణమించిన నీ స్వరూపము అత్యంతవిలక్షణమైనది.

తవ రూపాణ్యనన్తాని చరిత్రాణి తథైవచ
స్మరతాం భక్తిపూర్వం సు మహావిభవదాని చ॥ ౩౪

ఇహాముత్రాఽతుల్యసౌఖ్యప్రదాని మహతామపి
అల్పానాం కిము వక్తవ్యం స్వరూపోద్ధారకాణి చ॥ ౩౫

తా॥ ఓ ప్రభూ! నీ దివ్యరూపములు నీ దివ్యచరితములును అనంతములు. భక్తితో స్మరించువారలకు మహదైశ్వర్యమునిచ్చునవి. ఇహపరములందు అంతు లేని సుఖము నీయగలవి స్వల్పసౌఖ్యములనిచ్చుటలో సందేహమేమి!

ప్రపద్యే పుణ్డరీకాక్షమీశం భక్తానుకంపినమ్
లోకోత్తరం లోకనాథం పరాత్పరతరం విభుమ్॥ ౩౬

పుణ్యాత్త్వదయయా లబ్ధం విశేషాదకుతోభయమ్
భగవన్తం విశ్వవంద్యం భూతభవ్యభవత్ప్రభుమ్॥ ౩౭

యతో భూతాని జాయన్తే యేన సర్వమిదం తతమ్
యేన జాతాని జీవన్తి యం ప్రాప్స్యన్తి మహాలయే॥ ౩౮

దీపవిద్యుత్తారకాగ్నిచంద్రసూర్యాదిదీప్తిమాన్
యో యోగైర్యోగయోగ్యైశ్చాదృశ్యోదృశ్యోఽశ్రుత శ్రుతః॥

ఇతి శ్రీమదాదిత్యపురాణే శ్రీ వేంకటాచలమాహాత్మ్యే భగవద్గుణనామ మహిమానువర్ణనం నామతృతీయోధ్యాయము

తా॥ ఓ దేవా ! పుండరీకనయనా ! భక్తవత్సలుడును లోకోత్తరుడు లోకనాథుడు పరాత్పరుడు విభుడునగు నీ దయచే అభయముజెందితిని నీవు షాడ్గుణ్య పరిపూర్ణుడవు త్రికాలములకు ప్రభుడవు సకలభూతములును నీయందుత్పన్నమై నీచేవ్యాపింపబడి నీచే రక్షింపబడి నీయందే లయమగుచున్నవి నీకాన్తి సహస్ర రవిచంద్రులకాన్తికి మించినది నీవు యోగులకుసైతము దృశ్యాదృశ్యుడుగను శ్రుతాశ్రుతుడవుగను వెలయుచున్నావు

ఇది శ్రీమదాదిత్యపురాణమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున భగవద్గుణనామ మహిమానువర్ణన మనునది మూడవ అధ్యాయము

---

## నాల్గవ అధ్యాయము.

—: శ్రీభగవానుని వైశ్వరూప్యాది వర్ణనము :—

(దేవశర్మ చెప్పుచున్నాడు)—

శ్రీవేంకటేశ మత్స్వామిన్ ! ప్రణతార్తిప్రణాశన ।
జ్ఞానానంద దయాపూర్ణ మద్విజ్ఞాపన మాశ్రుణు ॥ ౧

యన్ముఖం బ్రహ్మజనకం యద్బాహూ క్షత్రకారణే ।
యదూరుభ్యాం వైశ్యకులం పాదాభ్యాం సేవకోఽభవత్ ॥ ౨

శిరసా ద్యౌరభూద్యస్య సహస్రాంశుశ్చ నేత్రజః ।
ముఖాత్పురన్దరోఽగ్నిశ్చ దిగ్దేవాశ్శ్రోత్రతోఽభవన్ ॥ ౩

శీతాంశుర్మనసో జాతః ప్రాణాద్వాయురజాయత ।
అన్తరిక్షం నాభితోఽభూత్పద్భ్యాం భూమిరజాయత ॥ ౪

తా॥ ఓ ప్రభూ ! ప్రణతార్తిహర ! నా మనవి నాలకింపుము. నీ ముఖము నుండి బ్రాహ్మణులు బాహువులనుండి క్షత్రియులు. ఊరువులనుండి వైశ్యులు పాదములనుండి శూద్రులు శిరస్సునుండి ద్యులోకము నేత్రములనుండి సూర్యుడు ముఖమునుండి ఇంద్రాగ్నులు శ్రోత్రములనుండి దిక్కులు మనసునుండి చంద్రుడు ప్రాణమునుండి వాయువు నాభినుండి అంతరిక్షము పాదములనుండి భూమియు జన్మించెను.

యత్కోమలాఙ్గైరభవన్ భువనాని చతుర్దశ
కోమలే నాభికమలే బ్రహ్మాణ్డం బ్రహ్మణా శ్రితమ్ ॥ ౫

తా॥ నీయవయవములనుండియే చతుర్దశభువనములు కల్గినవి నాభికమల మునుండి బ్రహ్మకాశ్రయమగు బ్రహ్మాండముకల్గినది.

శ్రియఃపతే కోఽపి జయేన్న మాయాం
యయా జనో ముహ్యతి వేదనార్థమ్ ।
తం నిర్జితాత్మానమనంతమాయినం
మాయాఽపహం త్వాం శరణం ప్రపద్యే ॥ ౬

తా॥ ఓ దేవా! యెంతటి శక్తిసంపన్నుడైనను నీ మాయను యెరుగ జాలడు. ఇట్లు నీ మాయచే సకలజగత్తును మోహింపజేయునిన్ను అట్టి మాయను నాకు ఆవరింపకుండ నుపసంహరింపజేయవేడెదను

నమోఽతర్క్యాయ తర్క్యాయ సగుణాయాగుణాయ చ
నమోఽనన్తాయాన్తకాయ వేద్యావేద్యస్వరూపిణే ॥ ౭

తా॥ ఓ దేవా! నిన్ను తెలిసికొనుటకు అసాధ్యమైనను భక్తులకు యెరుగ దగినవాడవు నిర్గుణుడవయ్యు సగుణుడవు అనన్తుడవును అన్తకుడవునగుదువు. అవ్యక్తుడవయ్యును వ్యక్తుడవగుదువు. అట్టి నీకు నమస్కారము.

సిద్ధిప్రదస్త్వం కిల దేవవర్య త్వత్ప్రేరితోఽహం తవ పాదమాప్తః
త్వత్పాదభక్తో బహిరన్తరాత్మనః కిమస్తివి జ్ఞాప్యమశేషసాక్షిణః ॥

తా॥ ఓ దేవదేవా! నీవు సకల సిద్ధులనిచ్చువాడవు. నీచే ప్రేరేపింపబడియే నేను నీ సన్నిధిని చేరినాడను నేను నీ పాదభక్తుడను. అంతర్బహిః ప్రదేశము లను సర్వసాక్షివై గమనించెడి నీకు నేనీ యంశమును తెలియపరుపనక్కరలేదు.

సుఖం నృపాలాః సురదేవముఖ్యాః బ్రహ్మాదయస్తే పదపద్మసంశ్రితాః
త్వత్కింకరాస్తేఽపి పృథగ్విభావితాః కురుష్వశంభో ముని దేవమిత్ర॥

తా॥ దేవతలు చక్రవర్తులు బ్రహ్మాదులు నీ పాదపద్మముల నాశ్రయించి సుఖించుచున్నారు. అందుచే వారలు నీకు కింకరులు తమతమ నియమిత కార్యములచేయుదురు. ఓ మునిదేవమిత్రమా. అందరికు క్షేమమును చేయుము

ఉత్పత్త్యధ్వన్య శరణ ఉపక్లేశదుర్గాంతకోగ్ర-
వ్యాలోత్కృష్టే విషయమృగతృష్ణాత్మగేహోరుభారః ।
ద్వన్ద్వశ్వభ్రే ఖలమృగభయే శోకదావేఽజ్ఞసార్థః
ప్రాప్తః పాదౌ శరణద కదా యామి తేఽకామవశ్యః ॥ ౧౦

తా॥ ఓ దయామయా। సంసారమార్గమునపోయెడి నాకేదిక్కులేక క్లేశదాయక మహారణ్యమున భయంకరక్రూరమృగములచే నిండి ఆత్మాత్మీయభిరణభారమున విషయమృగతృష్ణకులోనైనది ద్వంద్వమనుగోతికోపడి దుఃఖించెడి నాకు నీ పాదపద్మముల శరణములుగ గోచరించగా నీదరికి చేరునట్లనుగ్రహింపుము

భవాబ్ధితారం కటివర్తిహస్తం
స్వర్ణస్ఫురం రత్నకిరీటకుణ్డలమ్ ।
ప్రలమ్బసూత్రోత్తమమాల్యభూషితం
నమామ్యహం వేఙ్కటశైలనాయకమ్ ॥ ౧౧

తా॥ సంసారసముద్రమును దాటించగలట్టియు కటిహస్తము స్వర్ణాంబరము రత్నకిరీటకుండలములు ప్రలంబయజ్ఞోపవీతము ఉత్తమపుష్పాలంకారము వీట్లచే ప్రకాశించునట్టియు శ్రీవేంకటాద్రీశ్వరుడగు నట్టియు నీకు నమస్కారము.

జామ్బూనదైరాభరణైః ప్రదీప్తం వక్షస్స్థలే దక్షకుచోర్ధ్వభాగే
శ్రీవత్సలక్ష్మ్యాఞ్చిత దివ్యరూపం శ్రీవేఙ్కటాధీశమహం ప్రపద్యే ॥

తా॥ అపరంజినగలచే ప్రకాశించునట్టి దివ్యమంగళవిగ్రహము వక్షఃప్రదేశమున కుడిప్రక్కను శ్రీవత్సమనులక్ష్మీదేవి చిహ్నముతో కూడినట్టియు శ్రీవేంకటాద్రిప్రభుని శరణము వేడుచున్నాను

సంస్థితం సువిమానాంతర్విరించాద్యైశ్చ సేవితమ్
చామరవ్యజనచ్ఛత్త్రైః శరదిందుముఖం భజే ॥ ౧౩

తా॥ ఆనందనిలయ దివ్యవిమాన మధ్యమునవెంచేసి బ్రహ్మాదులచే ఛత్ర చామరాదులచే పరిచర్యచేయబడెడి పూర్ణచంద్రాననుడగు శ్రీనివాసుని సేవింతును

భక్తానుకంపీ గరుడధ్వజస్త్వత్
స్కన్ధం త్వమారుహ్య కిరీటకుండలీ ।
పీతాంబరశ్చాయుసుమందహాసః
శ్రీకౌస్తుభః చక్రవరాభయాన్వితః ॥ ౧౪

తా॥ ఓ దేవా! నీవు భక్తవత్సలుడవు, గరుడధ్వజుడవు, కిరీటకుండలములను పీతాంబరమును కౌస్తుభమును చక్రాయుధము వరదాభయహస్తములను ధరించి భక్తరక్షణత్వరతో వైనతేయుడను గరుడుని వాహనముగా నెక్కియున్నావు నీకు నమస్కారము

సజయో విజయశ్చైవ దృశ్యోఽదృశ్యః శ్రుతోఽశ్రుతః
సభాషణోఽభాషణశ్చ వాచ్యోఽవాచ్యో వృషోఽవృషః ॥ ౧౫
త్వత్పాదపద్మయుగళం శ్రేయ ఆసక్తమానసాః
విసృజ్యోభయతస్సంగం బ్రహ్మాద్యాః సముపాసతే ॥ ౧౬
మాహాత్మ్యం కేన సందృశ్యం రమాయా రమణస్యతే
యత్కించిద్ద్రష్టుమిచ్ఛామి మామునోఽమోమునశ్శుభమ్ ౧౭
సర్వప్రాణిహృదావాసం వాసుదేవం జగద్ధితమ్
శరణ్యాగ్రం దేవదేవం ప్రధానపురుషం భజే ॥ ౧౮

తా॥ ఓ దేవా! నీవు సజయుడవు విజయుడవు కూడ దృశ్యుడవు అదృశ్యుడవు శ్రుతుడవు అశ్రుతుడవు సభాషణుడవు అభాషణుడవు వాచ్యుడవు వాచ్యుడవుగానివాడవు వృషుడవు అవృషుడవు నీ పాదపద్మముల నాశ్రయించుటయే క్షేమకరమని నమ్మి ఇతరసంగమును విడచిన బ్రహ్మాదులు నిన్ను ఉపాసింప

చున్నారు. లక్ష్మికే ఆవాసభూమియగు నీ మాహాత్మ్యము నెరుగుటకెవ్వారికి శక్యము మాయాళియు అమాయకుడవునగునీ గుణలేశమును నేను తెలిసికొనుట కాశపడుచున్నాను సర్వచేతనులకు అంతర్యామివై జగద్ధితమునుచేసి శరణ్యుడవైనట్టియు పురుషోత్తముడవైనట్టియు నిన్ను శరణముజేరుచున్నాను.

నమోఽవ్యక్తాయ సూక్ష్మాయ పరాత్పరతరాయ చ
జగత్కారణకర్త్రే చ సాక్షిణేఽవ్యయమూర్తయే ॥ ౧౯

నమస్తే వాసుదేవాయ నమస్సంకర్షణాయ చ
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ యోగిహృత్పద్మవాసినే ॥ ౨౦

పంచభూతవిసృష్టాయ పంచమాత్రాత్మకాయ చ
జ్ఞానకర్మేన్ద్రియేశాయ హృషీకేశాయ తే నమః ౨౧

విష్ణవే వైష్ణవేశాయ జిష్ణవే జయదాయినే
ఇష్టప్రదాయ చేష్టాయ కృష్ణాయోత్కృష్టకర్మణే ॥ ౨౨

క్షరాక్షరోత్తమాయాథ స్వక్షరేశాక్షరాయ చ
కుక్షిస్థపక్షిసంఘాయ క్షయాక్షయకరాయతే ॥ ౨౩

నమో భవాయ భావాయ ధీరాయ పరమేష్ఠినే
వీరాయ వీరపురుషఋషయే పరమాత్మనే ॥ ౨౪

తా॥ అవ్యక్తుడును సూక్ష్ముడును పరాత్పరుడును జగత్కారణకర్తయు సాక్షియు అవ్యయస్వరూపియునగునీకునమస్కారము. వాసుదేవాదిచతుర్వ్యూహరూపి అంతర్యామియునగు నీకు నమస్కారము. పంచభూతములు పంచతన్మాత్రలు దశేంద్రియములు మొదలగు చతుర్వింశతితత్త్వములకు ఆదియగు నీకు నమస్కారము. సర్వవ్యాపియు భక్తత్రాణపరాయణుడును జేతవుజయదాతవుహితుడవు హితప్రదాత ఉత్కృష్టదివ్యచరిత్రముగల కృష్ణరూపియునగు నీకు నమస్కారము. నీకుక్షియందు సంరక్షించెడి చేతన జాలము కలవాడును వృద్ధిహ్రాసములకు మూలమవును క్షరాక్షరాత్మక చేతనుల కధిపతియగు పురుషోత్తముడవును ప్రణవస్వరూపియునగు నీకు నమస్కారము మంగళరూపియు భావరూపియు ధీరుడును పరమేష్ఠియు వీరపురుష ఋషిరూపియునగు నీకు నమస్కారము.

నమో నారాయణాభిఖ్యాఽసాధారణధరాయ చ
నమస్సమర్హణార్హాయ ధరణీధరరూపిణే ॥ ౨౫

అర్చ్యైరర్చ్యాయాచ్యుతాయాపి వంద్యవన్ద్యపదాయ చ
హిరణ్యగర్భగర్భాయ నమశ్శివశివాయ చ ॥ ౨౬

కందాయ శిపివిష్టాయ సచ్చిదానందరూపిణే
కర్మజ్ఞాననిరూపాయ శ్రుతిస్మృత్యాలయాయతే ॥ ౨౭

యమాయ నియమాయాప దానవ్రతకరాయ చ
తపస్వినే చ తప్యాయ తాపత్రయహరాయ చ ॥ ౨౮

తా॥ నారాయణుడను అసాధారణ వ్యవహారనామముకలిగిన నీకు నమస్కారము. భూవరాహరూపియగు నీవు గౌరవింపవగిన వారలకు గౌరవనీయుడవు. అర్చింపదగిన వారలచే అర్చింపవగినవాడవు. నమస్కరింపఁదగినవారలచే నమస్కరింపదగినవాఁడవు బ్రహ్మను కనినవాడు శివునకు శివప్రదుడవు. కందశిపివిష్టాది యాపములుగల సచ్చిదానందరూపివి యమ నియమాదులు దానవ్రతములు వీటిని స్వరూపముగాగలవాడవు తపముచేయువాడవు తపోరూపివి. తాపత్రయ హరుడవు.

యజ్ఞాయ విశ్వాయ సుమఙ్గళాయ సుతీర్థపాదాయ సుతారకాయ
ప్రపన్నలోకానుగుణాయ శమ్భవే శుద్ధాయ శశ్వద్గుణవర్మణే నమః॥

తా॥ ఓ దేవా! నీవు యజ్ఞస్వరూపుడవు విశ్వరూపుడవు. మంగళప్రదుడవు. తీర్థపాదుడవు తారకుడవు. భక్తులకోరి కెలనిచ్చెడివాడవు కల్యాణగుణవిశిష్ట దివ్యమంగళవిగ్రహముగలవాడవు నీకు నమస్కారము

కర్మిణేఽకర్మలిప్తాయ జ్ఞానాయ జ్ఞానదాయినే
నిత్యముక్తాయ హరయే నిత్యముక్తిప్రదాయినే ॥ ౩౦

తా॥ ఓ దేవా! నీవు లోకసంగ్రహమునకై విభవావతారములందు వర్ణాశ్రమోచిత కర్మలనాచరించెదవుగాని కర్మలిప్తుడవుకావు జ్ఞానస్వరూపుడవును జ్ఞానదాతవునగుదువు. నిత్యముక్తుడవై నిత్యముక్తినిచ్చెదవు. హరిశబ్దవాచ్యుడవు. నీకు నమస్కారము.

శుద్ధం వపుః పరమయోగమతుల్యసౌఖ్యం
భూమిం ద్యులోకముతతత్త్వమతిం సుభక్తిమ్ ।
వైరాగ్యమన్యసుగుణాన్ భజతాం దదానం
శ్రీశం దయోదధిమహం శరణం ప్రపద్యే ॥ ౩౧

తా॥ ఓ దేవా! నీవు పరిపూర్ణుడవు నిన్ను ఆశ్రయించిన భక్తులకు పరిశుద్ధదేహమును యోగమును నిరవధిక సుఖమును భూలోకద్యులోకరాజ్యమును జ్ఞానమును భక్తిని వైరాగ్యమును ఇంకను కోరదగిన సద్గుణములనన్నిటిని ప్రసాదింతువు లక్ష్మీనాధుడును దయాసముద్రుడవునగు అట్టి నిన్ను శరణమువేరుమన్నాను.

సులభం దుర్లభం వందే భగవన్తం సనాతనమ్
సదసత్ క్షేత్రగం విష్ణుం మూర్తామూర్తం శుభాశుభమ్ ॥ ౩౨
గోవిందం గోగణాతీతం కల్మషఘ్నమకల్మషమ్
ప్రతికల్పేఽనల్పకల్పతరుం సర్వార్థకల్పకమ్ ॥ ౩౩
దుష్టభావః ప్రమత్తో వా నామాద్యుచ్చారకోఽపి యః
బ్రహ్మహత్యాదిపాపాని దహత్యేవ చ నాన్యథా ॥ ౩౪
అజ్ఞానాదథ వా దంభాత్పుణ్యశ్లోకస్య నామ తే
యోవదేత్తాని నశ్యన్తి తూలరాశిర్యథాఽనలాత్ ॥ ౩౫
క్షుధితో దుఃఖితశ్శ్రాంతస్త్వన్నామ యది సంస్మరేత్
తస్య దుఃఖాని సర్వాణి నశ్యన్తి క్షణమాత్రతః ॥ ౩౬
సర్వాణ్యశుభజాతాని దురితాన్యపి యాని చ
తాని సర్వాణి లభతే మర్త్యః స్తాన్ వ్యస్మరేద్యది ॥ ౩౭

తా॥ ఓ దేవా! నీవు సులభుడవుదుర్లభుడవు, షాడ్గుణ్యపరిపూర్ణుడవు. సనాతనుడవు. సదసత్క్షేత్రములను వ్యాపించి మూర్తామూర్తరూపివైయుందువు గోవిందుడవు ఇంద్రియాగోచరుడవు అకల్మషుడవై కల్మషములహరించెదవు. సర్వదాకల్పవృక్షమవై సకలార్థములనిత్తువు ఎంతటి దుష్టుడైనను ప్రమత్తుడైనను

నీ నామోచ్చారణముచేసినచో అతనికి పూర్వము కల్గిన బ్రహ్మహత్యాది మహాపాపములు నశించును కాని పాపములు శాంతింపుటకై ఇతర ప్రాయశ్చిత్తము లేదు. తెలిసియో తెలియకనో పరిహాసమునకో యెట్లైన నీ దివ్యనామోచ్చారణముచేయు వాని పాపములు యెట్టి ఘోరరూపములైనను అగ్నియందుపడిన ప్రత్తి వలె నశించును అకలిదప్పులచే కృశించినవాడైనను నిన్నుస్మరించినచో అట్టి ఆకలి దుఃఖము కూడతీరి అతడు సుఖించును. నీ ఉపకారమును మరచినవానికి చెప్పరానికష్టములు దుఃఖములు కలుగును

న తీర్థయాత్రా న చ దానయజ్ఞా
వ్రతం తపోనార్చనమన్యదైవతమ్ ।
యచ్ఛ్రీనివాసస్య చ నామ కీర్తనం
తదేవ సర్వార్థసువృష్టికారణమ్ ॥ ౩౮

తా॥ శ్రీ శ్రీనివాసుని నామకీర్తనము వలన కలిగెడి పరిపూర్ణసుఖసాధము తీర్థయాత్రలు దానము యజ్ఞము వ్రతము తపస్సు అన్యదేవతారాధనము మొదలగు ఏయితర పుణ్యకార్యములచేతను కలుగదు

యాత్రా యజ్ఞా వ్రతా ధర్మదాన్యాన్యన్యాన్యసంఖ్యయా
తవ నామస్మృతేర్భక్త్యా కలాం నార్హన్తి షోడశీమ్ ॥ ౩౯
అహో భాగ్యమహో భాగ్యం విష్ణునామానువర్తినామ్
తేషాం దూరో యామ్యలోకః స్వర్గో మోక్షశ్చ యత్పదమ్॥ ౪౦
మాహాత్మ్యం విష్ణునామ్నో హి వర్ణితుం కేన శక్యతే
అజామిలో మృత్యుపాశాన్ముక్తో వైకుంఠగో యతః ॥ ౪౧
అయమేవ మహాధర్మో నరాణాం తారకం స్మృతః
విష్ణౌ సదాభక్తియోగః తన్నామగ్రహణాదిభిః ॥ ౪౨

తా॥ యజ్ఞదానవ్రతాదులెన్నియైనను భక్తితో నీ నామకీర్తనముచేయుటలో ఒక పీసముపాలునకు సరికావు. విష్ణునామసంకీర్తన మహాఫలమునేమని కీర్తింప వచ్చును ? విష్ణునామమును పాడెడి వారలకు యమలోకమే తెలియదు. వారి నిత్య

నివాసము స్వర్గమోక్షములే. నామమాహాత్మ్యము యొక్క మహిమచేతనే అజామీళుడు ముక్తిజెందెను. సంసారతారకమగు విష్ణునామమును పాడుటయే మహాధర్మము. ఇది భక్తియోగజన్యముకదా

నైకోఽజామిల ఏవ పాపజలధిం సంతీర్ణవాన్ నామతః
ప్రహ్లాదోఽపి గజేంద్రపూర్వబహవః దుఃఖాంబుధేరుత్తారితాః ।
యన్నామస్మరణామృతాంబుధినిమగ్నోఽద్యాపి గౌరీపతిః
యద్ధ్యానే నిరతాః ప్రజాపతి ముఖాః ప్రాప్తా మహావైభవమ్ ॥

తా॥ నామస్మరణముచేత తరించుటకొక్క అజామీలుడు మాత్రమే సాక్షి కాడు. నామస్మరణముచేతనే ప్రహ్లాదుడు గజేంద్రుడు మొదలగు నెందరో భక్తులు తరించిరి కైలాసవాసియగు పార్వతీపతియు చతుర్ముఖుడాదిగల దేవతలును భగవన్నామస్మరణమను మహానందములో మైమరచి తమ పదవులలో సుఖించుచున్నారు

యన్నామ వై సర్వజగద్దురన్త
దుష్కర్మభారాం శ్చ బహూన్ చినత్తి ।
స సర్వశక్తిః స హి విశ్వరూపః
ప్రసీద మామనిరుక్తాత్మ శక్తే ॥ ౪౪

అనుగ్రహార్థం భజతాం పదాబ్జ
మనామరూప స్త్వ గుణో హ్యజన్మా ।
నామాని రూపాణి గుణాన్ క్రియాశ్చ
జన్మాని గృహ్ణాసి నమః ప్రసీద ॥ ౪౫

తా॥ ఓ దేవా ! నీ నామస్మరణము సమస్తలోకములను దురన్తదుష్కర్మబంధములను ఛేదించగలదు, అట్టి సర్వశక్తియుతుడవగు నీవు శరణాగతుడగు నన్ను అనుగ్రహింపుము. నిన్ను ఆశ్రయించిన వారలనుద్ధరించుటకై నామరూపములు గుణజన్మములులేని నీవు కనులకగుపడునట్లు అనేక అవతారముల నెత్తి పేరులతో వెలసి కల్యాణగుణములతో ప్రకాశించి దివ్యచేష్టితముల జేయుచున్నావు.

జన్మాదిభిర్జనే మోహానుగ్రహావధికారతః
కరోషి సామ్ప్రతం భూయోఽనుగ్రహస్తు భవేన్మయి ॥ ౪౮

త్వదపాంగలవో భూయాదిహాముత్రేష్టవర్షణః
అన్యథా నాస్తి సందేహ ఇతి చిత్తే సునిశ్చితమ్ ॥ ౪౯

తా॥ ఓ ప్రభూ! నీ యవతారములచే భక్తుల అధికారి భేదములను అనుసరించి మోహమును అనుగ్రహమును చూపుదువు దీనుడనగు నా యందను గ్రహమునే చూపుము నీ కటాక్షలేశము వలననే ఇహపరముల సిద్ధి యేర్పడుట కానిచో కాదు ఇది నా నిశ్చయము

ఓం నమో వేంకటేశాయ పురుషాయ మహాత్మనే
మహానుభావాయ మహామాయినేఽమేయకర్మణే ॥ ౪౦

తా॥ ఓ వేంకటేశ్వరా! పురుషోత్తముడును మహాత్ముడును మహానుభావుడును మహామాయావియును అప్రమేయములగు చేష్టలజేయువాడును అగు నీకు నమస్కారము,

స్థలేషు దుర్గేషు జలేషు ఖేషు గర్భేష్వరణ్యేషు చ సైతవేషు
నామ్నైవ భావ్యం ఖలు సర్వలక్షణం మాయావినో విశ్వకుటుంబినస్తే॥

తా॥ స్థలము దుర్గము జలము ఆకాశము గర్భము అరణ్యములలో ఎట్టి సంకటములందైనను మాయావియు విశ్వకుటుంబియువగు నీ నామమును స్మరించినచో అది సంకటములదీర్చును

మహావిపత్సు త్వన్నామస్మరణే తద్వినాశనమ్
బహుసమ్పత్సు త్వన్నామ విస్మృతౌ తద్వినాశనమ్ ॥ ౫౦

తస్మాత్త్వన్నామసక్తోఽహం సర్వదా త్వదనుగ్రహాత్
త్వత్ప్రేరితస్త్వదీయత్వాన్మత్పుణ్యం త్వద్దయాబలమ్ ॥ ౫౧

న కదాచిద్భయమ్మేఽస్తి దివ్యనామరతో యతః
తథాఽపి తే కృపాలేశలేశలేశోఽస్తు మయ్యహో ॥ ౫౨

తా॥ ఓ దేవా! మహాపత్తులందు నీనామస్మరణముచే ఆపత్శాన్తికలుగును మహైశ్వర్యదశలోనిన్ను మరచినచో ఐశ్వర్యభ్రంశమగును, నీ యనుగ్రహబలమున నీ నామస్మరణమున ఆసక్తికలిగిన మహాభాగ్యము నా కిప్పుడు కలిగినది నీ నామస్మరణభాగ్యము నాకు సంక్రమించుటచే నా కెట్టి భయముగాని లేదు ఐనను ఈ భాగ్యము హ్రాసము కాకుండుటకై నీ కృపాలేశలేశలేశము నా యందనువర్తించుచుండు గాక

శ్రీశ చిత్రం చరిత్రం తే న జానే బహుదుష్కృతిః
సర్వజ్ఞం సర్వదా కిం త్వాం వదామి కృపయాఽవ మామ్ ॥
నామ్నా మహాఘౌఘహానిః మనఃకాయౌ తతశ్శుచీ
తద్దృష్ట్వా ప్రీయసే విష్ణో తతస్సత్కర్మసంగ్రహః ॥
కర్మణా జ్ఞానసిద్ధిశ్చ తేన ప్రీతి స్తవాద్భుతా ।
అపరోక్షమగర్భశ్చ ముక్తిరానన్దవర్ధనమ్ ॥ ౫౫

గోదానకన్యాదానాని పృథివీరేణుసంఖ్యయా ।
దుర్భిక్షే జాహ్నవీతీరే ప్రత్యహం కోటిభోజనమ్ ॥ ౫౬

త్వన్నామస్మరణా త్తుల్యం నామమాహాత్మ్యమీదృశమ్ ।
తస్మాన్నామస్మృతిస్సిద్ధా సులభా పురుషార్థదా ॥ ౫౭

ఓ దేవా! నీ శక్తిని నే నేమని పొగడుదును? నీవు సర్వజ్ఞుడవు. నన్ను రక్షింపుము. నీ నామస్మరణముచే మహాపాపములు నశించుట పాపనాశముచే మనస్సు శరీరము శుద్ధిజెందుట అట్టి మనశ్శరీర శుద్ధిచే నీ యనుగ్రహము దానిచే కర్మయోగప్రవృత్తి దానిచే జ్ఞానయోగాధికారము తత్సిద్ధి దానిచే నీ సంపూర్ణానుగ్రహము దానిచే ప్రత్యక్షసాక్షాత్కారము సంసారభేదము నిత్యనిరతిశయానంద ముక్తి అచటి బ్రహ్మానందానుభవము క్రమముగాలభింపును. అనేక గోదానములు

కన్యాదానములు కరవుకాలములో జాహ్నవీతీరమున ప్రతిదినము విడువక చేసిన కోటిబ్రాహ్మణసమారాధనము ఇవన్నియు నీ నామస్మరణమునకు తుల్యఫలవములు పై దానాదులు బహుయత్నద్రవ్యాది సాధ్యములగుటచే దీనజనులకు సాధ్యములు కాజాలవు సకల పురుషార్థములను సాధించిపెట్టగల నీ నామస్మరణము సకల జనసులభమైనదనుట యెంతయు నీ నామమహిమకు తగియున్నది

లోకోత్తరస్త్వయం మార్గః ప్రజానామకుతోభయః ।
యత్ర భక్తివశాస్సర్వే నామస్మృతిపరాయణాః ॥ ౩౮

తా॥ ఈ భక్తిజనకమగు నామస్మరణమార్గము చాలగొప్పది పండిత పామర ఆఢ్యానాఢ్యవివేకములేక సకలజనులును భక్తిపారవశ్యముచే నామస్మరణము చేయుట కవకాశమున్నది గదా.

యేనైకదా విష్ణుపదాబ్జయుగ్మే
సమర్పితం చిత్తమనన్యబుద్ధ్యా ।
యమోఽపి తద్దూతగణాశ్చ పాశాః
పశ్యన్త్యఘౌఘాశ్రయ మప్యహో న తమ్ ॥ ౩౯

ఇతి శ్రీమదాదిత్యపురాణే శ్రీవేంకటాచలమాహాత్మ్యే భగవద్గుణ నామ మహిమాను వర్ణనం నామ చతుర్థోఽధ్యాయః.

తా॥ ఒకసారియైనను ఎవ్వని మనసు విష్ణుపాదములయందు ధ్యానయోగముచే సమర్పింపబడిన దగునో అట్టివాడు ఒకప్పుడు మహాపాపియై నరకార్హుడుగతోచినను వాని దోషములను మరచి ఆతడు పుణ్యపురుడుగను మోక్షార్హుడుగను నిశ్చయించి యమధర్మరాజుగాని ఆతని దూతలుగాని యమపాశములుగాని వాని చెంతకు రాజాలవు

ఇది శ్రీమదాదిత్యపురాణమున శ్రీవేంకటాచలమాహాత్మ్యమునందు భగవన్నామమహిమాను వర్ణనమను నాల్గవ అధ్యాయము



# ఐదవ అధ్యాయము.

—: దేవశర్మ స్తోత్రముచే ప్రీతుడైన భగవానుడాతనికి వరమొసంగుట :—

(దేవశర్మ చెప్పుచున్నాడు)—

సర్వలోకజననీ కమలాలయా దేశకాలవితతా రమణీ తే ।
సా ఒతిమృద్వతసికాకుసుమాభోత్సంగగా చ తవ హృత్కమలస్థా ॥
బ్రహ్మశంకర పదార్పణదక్షా సర్వలోకశుభదా ద్రవచిత్తా ।
యత్కటాక్ష లవమాత్మపదస్థాః ప్రార్థయన్త్యజశివేంద్రముఖా హి ॥
భారతీప్రముఖసున్దరయోషిజ్జాలజైత్రబహుసుందరరూపామ్
ఆలిలింగిషసి యాం కరపద్మైః మందహాసవదనాం సరసస్త్వమ్ ॥ ౩

తా॥ ఓ దేవా! సర్వలోకమాతయు నిత్యానపాయినియు అతసీకుసుమ సుకుమారదేహయునగు శ్రీమహాలక్ష్మి నీ యొక్క హృదయ కమలమునందును ఉత్సంగమందును సన్నిహితయైయున్నది బ్రహ్మశంకరాదులకు తనకటాక్షముచే వారల పదవులను ఈయగలిగి తన దయార్ద్రహృదయముతో సర్వలోకములకు క్షేమముచేయ సన్నద్ధురాలైన ఆ తల్లి కటాక్షముచే బ్రహ్మాదులు తమ పదవులలో సుఖించుచు కృతజ్ఞులై ఆ కటాక్షము కొరవడకుండ నిరంతరము అనువర్తించ వలెనని ప్రార్థించెదరు. బ్రహ్మాది దేవతాప్రముఖుల భార్యలను మించిన సౌందర్యముతో దివ్యరూపధారిణియై మందహాసమున వెలయు మహాలక్ష్మిని ఆలింగనను చేయు ఆశతో ఉవ్విళ్లూరెడి సరసరసికాగ్రేసరుడవు గదా నీవు

నిత్యముక్తా దోషదూరా త్వద్గుణాధికసద్గుణా
త్వత్పాదపూజనే నిత్యం బద్ధకంకణభూషితా ॥ ౪
అభీష్టదానే భక్తానాం కల్పవృక్షాయితా రమా
చింతామణిః కామధేనుః కరుణాసాగరాయితా ॥ ౫

తా॥ నిత్యముక్తురాలును దోషదూరయు నీకు తక్కువగాని కల్యాణగుణ సంపత్తిగలదియు నిన్ను సేవించుటయందే కంకణకట్టుకొనినదియు భక్తుల యభీష్టముల నిచ్చుటలో కల్పవృక్షముతో సమానురాలును చింతామణి కామధేనువుల వంటిదియు కరుణాసముద్రమును అయి మహాలక్ష్మి వెలయుచున్నది.

లక్ష్మీః పురస్తాత్పశ్చాచ్చ దక్షిణోత్తరతశ్చ యా
ఊర్ధ్వాధరాదిభాగస్థా జగత్సృజతి పాతి హి ॥ ౬

గుణైస్తతా ప్రసవిత్రువరణీయగుణోర్జితా
ప్రకాశమతిమూర్తిశ్చ ధ్యేయా బుద్ధిప్రచోదికా ॥ ౭

మరన్నాద్దుర్గ్రిహాత్పంచపాతకాదుపపాతకాత్
స్వగాయకత్రాణదక్షా గాయత్రీత్యుదితా రమా ॥ ౮

సవితుర్ద్యోతకత్వాచ్చ భక్తేష్టప్రసవే రతా
చరాచరప్రసవితా సావిత్రీ కమలా స్మృతా ॥ ౯

వాగీశత్వాద్వచోదానాత్ కీర్తితా చ సరస్వతీ
కాన్తిరత్యాదిదానాచ్చ భారతీత్యాదినామికా ॥ ౧౦

తా॥ నీకు సర్వసహాయములను చేయుచు దశదిక్కులయందును వ్యాప్తి జెంది మహాలక్ష్మి సృష్టిస్థితి సంహారముల జేయుచున్నది. ఆమె గుణములచే జగత్తంతయు వ్యాపించి నీకు సహాయమగుటచే భక్తులు త్రికాలములయందు తమ చిత్తము భగవదధీనముగ మరల్చుటకు ఆమెనే ప్రార్థించదగిన గుణవిశేషములు కలిగియున్నది అభక్ష్యభక్షణము అప్రతిగ్రహ ప్రతిగ్రహము మహాపాతకములు ఉపపాతకములు ఇట్టి సకలపాపములను హరించి తనను ధ్యానించెడి వారలను కాపాడుటచే ఆమెయే ఉదయ సంధ్యయందు గాయత్రియని పిలువబడుచున్నది ఆమెయే తనను మధ్యాహ్నకాలమందు జపించు వారలకు సర్వేశ్వరసాన్నిధ్యము కలుగజేయుటచేతను భక్తేష్టములను అనుగ్రహించుటచేతను చరాచరములను సృజించుటచేతను సావిత్రియనబడుచున్నది. సాయంకాల సంధ్యయందు జపించినవారలకు వాగీశత్వముకలిగి వచోధనమునిచ్చుటచేతను ఆమెయే సరస్వతి యనబడుచున్నది. కాన్తి రతి మొదలగు శక్తులనిచ్చుటచే ఆమెయే భారతియనియు ఇట్లు ఒకే శక్తి వివిధములగు పేర్లచే వ్యవహరింపబడుచున్నది.

గుణపూర్ణత్వయోగేన బ్రహ్మ బ్రహ్మవశే స్థితా
బ్రహ్మాండాన్తర్బహిర్వ్యాప్తా స్థూలా సూక్ష్మా చ మధ్యమా॥ ౧౧

కర్మణాం గుణరూపాణాం సర్వేషాం చ నియామికా
యద్దయాపాంగలేశేన త్వైహికీః సర్వసంపదః ॥ ౧౨

స్వర్వైరక్తిశ్చ సత్భక్తిజ్ఞప్తిముక్తిర్వ్రి జన్తి హి
లోకాతీతా లోకపూజ్యా తవాత్యన్తప్రియా మతా ॥ ౧౩

సర్వశక్తా సర్వసుఖా సర్వలక్షణసంయుతా
అనేకగుణసంపూర్ణా పూర్ణకామా చ సర్వదా ॥ ౧౪

అప్రమేయా ప్రమేయాఽపి సమస్తపురుషార్థదా
సుమహైశ్వర్య సౌభాగ్యా తథాఽ పి త్వాఽనువర్తినీ ॥ ౧౫

స్మరతి ధ్యాయతి స్తౌతి నమత్యర్చతి పశ్యతి
తపతి త్వాం జపతి చ సేవతే త్వాం ప్రతీక్షతే ॥ ౧౬

నిత్యానపాయినీ నమ్రా సంప్రార్థయతి సర్వదా
కిముతాన్యేఽల్పజీవాశ్చ మాదృశా వృత్తివర్జితాః ॥ ౧౭

దరిద్రా బంధురహితా అనాథా జీవనార్థినః
తేషాం త్వత్ప్రార్థనాకాంక్షా నాశ్చర్యం భువనత్రయే ॥ ౧౮

తా॥ గుణపరిపూర్ణత్వయోగముచే తానే బ్రహ్మరూపిణియైనను నీయధీన మునసుండగోరి నీతోసమముగ బ్రహ్మాండమునంతట అంతబ౯హిః ప్రదేశము వ్యాపించి స్థూలమధ్యమసూక్ష్మరూపిణియై మహాలక్ష్మి వెలయుచున్నది. గుణ రూపములగు సర్వకర్మలకు ఆయమయే నియామికయైయున్నది, ఆమెయొక్క కటాక్షలేశసంబంధముచే ఐహికములగు సకలసుఖములు అనహ౯పదార్థములందు విరక్తిభగవద్భక్తి ఆత్మజ్ఞానము మోక్షముసిద్ధించును. అట్టి లోకోత్తర గుణసంపద కలిగి లోకపూజ్యయగు మహాలక్ష్మి నీకు అంతరంగమహిషియైనది, ఆమెయే సర్వశక్తికలిగి సర్వసుఖస్వరూపిణియు సర్వలక్షణసంయుతయు సకలగుణసంప

న్నయు అవాప్తసమస్తకాముయు అప్రమేయమైనను ప్రమేయ సౌలభ్యముకలిగి భక్తులకు సకలపురుషార్థముల నీయగా మహైశ్వర్య సౌభాగ్యశాలివగు నిన్ను వెంట నంటి నీతో సహాయభూతయై తిరుగుచున్నది. శ్రీమహాలక్ష్మి యెల్లపుడును నిన్నే స్మరించుచు స్తోత్రముచేయుచు అర్చించుచు తపస్సుచేయుచు జపించుచు సేవించుచు నీ సేవనే యెదురుచూచుచున్నది నిత్యానపాయినియై యుండియు అతివినయ ముతో నీ సంశ్లేషమునే ప్రార్థించుచున్నది. అటువంటి సందర్భమున నిరాధారుల మగు నావంటి అల్పప్రాణులు నిన్ను సేవింపనాశగలియుండుట సహజము మేముదరిద్రులము బంధురహితులము అనాథలము బ్రతుకులేనివాండ్లము నిన్ను చేరి మాకోరకలను తీర్చుకొనుటకుగాను ప్రార్థించుటలో ఆశ్చర్యమేమున్నది ?

శ్రీవేంకటేశ మత్స్వామిన్ జ్ఞానానందదయానిధే
శరణాగతసంత్రాణకారణాభీష్టవర్షణ ॥ ౧౯

శ్రీశ తే రూపకర్మాణి బ్రహ్మరుద్రాహిపాదిభిః
అగణ్యాని హ్యవేద్యాని హ్యచింత్యాన్యద్భుతాని చ ॥ ౨౦

ఏవం పూర్ణే త్వన్మహిమ్ని నాహం శక్తోఽస్మి వర్ణనే
కశ్చాహం కా చ మే శక్తిః కిమితి స్తౌమి మన్దధీః ॥ ౨౧

తా॥ ఓ దేవా ! నీవు మాకుస్వామివి జ్ఞానానందమయుడవు. దయా సముద్రుడవు శరణాగతులను రక్షించుటయే ముఖ్యకార్యమును సంకల్పించి భక్తుల అభీష్టములనిచ్చువాడవు. ఓ లక్ష్మీరమణా ? నీదివ్యావతారములు దివ్యచేష్టితములు అనంతములు బ్రహ్మాదులచే సైతము లెక్కించుటకో తెలిసికొనుటకో ఊహిం చుటకో కూడ అందరానివి అద్భుతములైనవి. ఇట్లు అవాప్తసమస్తకాముడవ గుటచే పరిపూర్ణుడవగు నీ మహిమను ఉన్నదున్నట్లు వర్ణించుటకునే నెంతటి వాడను ? నాశక్తిచాలదు అట్టి సలదర్భమున నిన్ను స్తోత్రముచేయుట యనునది సర్వథా అసాధ్యము.

అలసోఽహమహంకారీ చాజ్ఞోమూర్ఖశ్శఠః ఖలః
జ్ఞాన భక్త్యాదిహీనశ్చ కామక్రోధాదిపూరితః ॥ ౨౨

మనోజయవిహీనశ్చ సదా విషయలంపటః
పాంసూనాం వృష్టిబిందూనాం మద్దోషాణాం మితిర్న హి॥ ౨౩
గుణాస్త్వయి యథా పూర్ణా దోషాః పూర్ణాస్తథా మయి
అలసత్వాదహంకారాదజ్ఞానాల్లోభతో మయా ॥ ౨౪
దంభాత్ప్రమాదాద్దాక్షిణ్యాత్స్వభావాత్సంగతః కృతాన్
అసంఖ్యానపరాధాన్మేఽగణయిత్వా క్షమస్వ మామ్ ॥ ౨౫

తా॥ ఓ దేవా! నేను అలసుడను అహంకారిని అజ్ఞుడను మూర్ఖుడను శఠుడను ఖలుడను జ్ఞానభక్త్యాదిసాధనములు లేనివాడను కామక్రోధపూరితుడను మనోజయములేనివాడను సదావిషయములందే చపలముగల చిత్తముగలవాడను. భూభాగమందలి పాంసుబిందువులేమి మహావర్షమందలి ఉదకబిందువులేమి ఎట్లు లెక్కకు మిక్కిలిగయుండునో నా పాపములకు లెక్కలేదు పైజెప్పిన నా ఆలస్యాది దుష్టగుణములవలననేమి లోభాదుల దంభము ప్రమాదము దాక్షిణ్యము సంగము మొదలగు దోషవిశేషములవలనగాని నాయందుగల అసంఖ్యాతములగు నపరాధములను సరకుచేయక నన్ను క్షమించుము.

పితా మాతా గురుర్భ్రాతా సఖా బంధుస్త్వమేవ మే
విద్యాస్సత్కర్మ వృత్తం చ పురః పృష్ఠే చ పార్శ్వయోః ॥ ౨౬
మూర్ధ్ని హృత్కమలే మేఽన్తర్బహిర్జన్మని జన్మని
కులస్వామీష్టదేవో నో వృతః పితృపితామహైః ॥ ౨౭
సర్వం త్వమేవ లక్ష్మీశ న జానే త్వాం వినాఽపరమ్
దుస్స్మృతిం హర దూరాన్మే విస్మృతిం తే విలోపయ ॥ ౨౮

తా॥ ఓ దేవా! నాకు నీవే తండ్రివి తల్లివి భ్రాతవు సఖుడవు బంధువు. విద్యయుసత్కర్మమును శీలమును నీవే. ముందు వెనుక పార్శ్వములయందు నీవే నిలచియుందువు. తలయందును. హృదయమందును వెలుపలను లోపలను నీవే నన్ను అంతర్యామివై రక్షించెదవు. నా కులదైవతమును నాతాతతండ్రులు పారంపర్యముగ ఆర్జించిన ఇష్టదేవతయు అయియున్నావు.

త్వత్స్మృతిం సంప్రదేహ్యద్ధా త్వత్సమో నాఽస్తిమే ప్రియః
త్వన్మనాస్త్వద్గతప్రాణః త్వత్పదాంబుజసంశ్రితః ॥ ౨౯

తవ భక్తోఽస్మి దాసోఽస్మి శిష్యః పుత్రోఽస్మి కేవలమ్
భృత్యస్త్వమేవ నిశ్వాస్య స్మరామి త్వామహర్నిశమ్ ॥ ౩౦

తా॥ ఓ లక్ష్మీరమణా ! నా సర్వస్వమును నీవే. నీకంటె వేరుదైవమో సాధనమోనేనెరుగను, నాకు దుష్టతలంపును పోగొట్టినీయందు నామనసులగ్నమై యుండునట్లనుగ్రహింపుము, నీధ్యానమందు యేమరుపాటులేకుండ నామనసును సంస్కరించుము, నీధ్యానమునకంటె నాకు ప్రియమగు కార్యాంతరములేదు. అట్లనుగ్రహించినంతటనేను నీయందే మనసుగలిగి నీయందేప్రాణమునిలుపుకొని నీపాదాంబుజములనే ఆశ్రయించి నీకు భక్తుడను దాసుడను శిష్యుడను పుత్రుడను భృత్యుడను అగుదును, ఇట్లు నిత్యసంబంధముగలవాడనై రాత్రింబవళ్ళు నీపైననే ఆధారపడియుండి ప్రొద్దుపుచ్చెదను.

శ్రీహరిర్బ్రహ్మహృత్పద్మకర్ణికాస్థోఽతిసుందరః
పద్మాసనసమాసీన ఇంద్రనీలసమద్యుతిః ॥ ౩౧

కంజకోమలపాదాఢ్యః కుంకుమాధికవర్ణనాన్
వజ్రాంకుశ ధ్వజాబ్జాంక పాదాబ్జనఖరత్నవాన్ ॥ ౩౨

క్వణన్నూపురసన్నద్ధవలయాఢ్యపదాంబుజః
అతసీపుష్పసంకాశతేజఃపుంజోరురుంచితః ॥ ౩౩

నితంబపీతవసనః స్వర్ణకాంచ్యంచితోఽచ్యుతః
విరించాధారసౌవర్ణగంభీరాబ్జాభనాభికః ॥ ౩౪

బ్రహ్మాండగూహకమృదుశ్లక్ష్ణ రేఖాత్రయోదరః
ధర్మస్థానోఽధర్మపృష్ఠః శ్లక్ష్ణ సూక్ష్మతనూరుహః ॥ ౩౫

శ్రీవత్సాంకః కౌస్తుభాఢ్యో వైజయన్తీహృదంబుజః
ఉన్నతాంసో జానులంబబాహ్వాభీతివరప్రదః ॥ ౩౬

కుంకుమాభే కరతలే శంఖచక్రసులక్షణః
కింకిణీ కంకణలసద్వలయాంగద భూషితః ॥ ౩౭

కంబుగ్రీవః సుబింబోష్ఠః కుందకుట్మలదంతవాన్
ఆదర్శవద్దృశ్యసూక్ష్మగండయుగ్మసుమండితః ॥ ౩౮

సునాసోఽనిమిషస్సుభ్రూః కరుణాపూర్ణలోచనః
శరత్పూర్ణేందువదనో నతనీలసుకుంతలః ॥ ౩౯

అతుల్యతిలకోపేతో రత్నకుండల మండితః
స్ఫురద్రత్నకిరీటశ్చ సర్వలక్షణసంయుతః ॥ ౪౦

జగద్విలక్షణః శ్రీమాన్ మద్బింబో నిత్యచిత్సుఖః
సూర్యకోటిప్రతీకాశః చంద్రకోటిసుశీతలః ॥ ౪౧

అనంతవేదైః బ్రహ్మాద్యైః అవేద్యోఽప్రాకృతో హరిః
శ్రీధరాభ్యాం సమాశ్లిష్టో బ్రహ్మారుద్రేంద్రసేవితః ॥ ౪౨

పూర్ణానందజ్ఞానదయామూర్తిః పరమమంగళః
మంగళాంగో మంగళాంశో భక్తమంగళదాయకః ॥ ౪౩

కరుణామృతపూర్ణాభ్యాం మాం నేత్రాభ్యాం సమీక్షతే
కా చింతా మ ఇహాముత్ర సర్వారిష్టం హరత్యసౌ ॥ ౪౪

తత్పదాంబుజవిశ్వాసే సర్వాభీష్టం దదాతి హి
ఇతి స్మరన్నహోరాత్రం తం త్వాహం శరణం గతః ॥ ౪౫

తా॥ భగవానుడు దివ్యమంగళవిగ్రహముతో నాహృదయపద్మముయొక్క కర్ణికామధ్యమున నాసీనుడై యున్నాడు. భగవానుడుపద్మాసననాసీనుడై సేవనిచ్చు ప్రకారము ఆకర్షణకముగనున్నది. ఆతని ఇంద్రనీలసమానమగు శరీరకాంతి పద్మములవలె కోమలమగు పాదాధఃప్రదేశపు చక్కదనము కుంకుమమును మించిన వర్ణముపాదమున వజ్రము అంకుశము ధ్వజము పద్మము అధిగాగల చిహ్నములు

నవరత్నములకాంతి ఆ పాదములయందు సమర్పింపబడిన నూపురముల మంజుల ధ్వని అవిశిపూవులవంటి ప్రకాశమైన ఊరుభాగములు నితంబమున ధరింపబడిన పీతాంబరము దానిపై ధరింపబడిన కాంచీభూషణము త్రిజగన్నిర్మాణధురీణుడగు చతురాస్యుని ఉత్పత్తిస్థానమగు దివ్యనాభికమలము అనేక కోటిబ్రహ్మాండములను మహాప్రలయమున భద్రపరచదగిన త్రివలీసమలంకృతమగు ఉదరముధర్మమును స్రవించెడి స్తనభాగము అధర్మస్థానమగు పృష్ఠభాగము మృదువగు సూక్ష్మత నూరుహములు శ్రీవత్సచిహ్నము కౌస్తుభాభరణము వైజయన్తివనమాలలచే అలంకరింపబడిన హృదయప్రదేశము ఉన్నతములగు అంగములు ఆజాను పర్యంత దీర్ఘములగు బాహువులు అభయవరదముద్రలు రక్తపల్లవ కరతల మందలి శంఖచక్రాయుధములు చిరుగంటలచే యలరారు కంకణములు వలయ ములు అంగదములు శంఖమువంటి కంఠప్రదేశము దొండపండువంటి అధర ప్రదేశము మల్లిమొగ్గలవంటి తెల్లనిపలువరుస అద్దమువలె ఫాలఫల్యము నిచ్చు ప్రకాశమైన శుభ్రగండస్థలము అందమైన నాసాభాగము రెప్పవాల్చనట్టియు ధనుర్గర్వభంజనము నగు భ్రూప్రదేశముగల దివ్యనేత్రయుగము శరచ్చంద్రనిభమగు ముఖమండలము నతములగు నీలకుంతలములు నిరుపమమగు కస్తూరికాతిలక దివ్యోర్ధ్వపుండ్రము రత్నభూషిత మకరకుండలములు మణిరత్నములచే పరి ష్కరింపబడిన మహార్హ దివ్యకిరీటము యేమని వర్ణించగలను? శ్రీనివాసప్రభువు దివ్యభూషణదివ్యాంబర దివ్యాయుధములశోభచే సర్వలక్షణయుతుడును అయి యున్నాడు. భగవానుడు లోకోత్తరదివ్యమంగళవిగ్రహధారి. మహాలక్ష్మికి నివాస భూమి. సచ్చిదానందరూపి. సూర్యకోటి తేజశ్శాలి. చంద్రకోటి శీతలుడు. అనంత ములగు వేదములచేతనేమి ముక్కోటిదేవతాగుణములచేతనేమి తెలియదగనివాడు. అప్రాకృత దివ్యమంగళవిగ్రహధారి. మహాలక్ష్మియు భూదేవియు ఇరుపార్శ్వ ములయందును సేవించుచుండెడి సన్నివేశముగలవాడు. బ్రహ్మరుద్రేంద్రాదులను యెల్లప్పుడును తనసన్నిధియందు నిలిపినవాడు. పూర్ణానందజ్ఞానదయాస్వరూపి మంగళములకు ఆకరము. మంగళాంగుడు. మంగళాంశుడు. భక్తులకు మంగళము లనే అనుగ్రహించువాడు. అట్టి ప్రభువు తన కరుణామృతముచే పూర్ణములగు కటాక్షముచే నన్ను ఆదరించుచున్నాడు. నాకు కావలసినదేమి కలదు? నాకు

సంచితమును ప్రారబ్ధమును భావియునగు సర్వారిష్టములను ఆతడు హరించును. తన పాదాంబుజములందు నిరంతరముగ భక్తిని నాకు కల్పించి నాకు వలయు సకలమును ఆతడే అనుగ్రహించగలడు, అని రాత్రింబవళ్ళు తన్మయుడనై నిన్నే ధ్యానించుచు నీ శరణమును వేడుచున్నాను,

భోస్స్వామిన్! పూర్ణకామ స్త్వం సంపూర్ణైశ్వర్యవానపి
స్వప్రయోజనహీనోఽపి మాయయా బహురూపవాన్ ॥ ౪౬

లోకోపకరణాయైవ త్వితరాసాధ్యకృత్యవాన్
బహ్వాద్రీసుద్ధరన్ సేతుమనాయాసాదకల్పయః ॥ ౪౭

క్షణేనోత్పాదితం చాపి స్థూలబ్రహ్మాండమద్భుతమ్
వహసి త్వముపాయేన బహుసూక్ష్మమ్యుదూదరే ॥ ౪౮

తా॥ ఓ దేవా! నీవు అవాప్తసమస్తకాముడవు, నీయైశ్వర్యము నిరంతరము. పరిపూర్ణము. నీకు కావలసిన ప్రయోజనము కొంచెమైనను లేక పోయినను నీ అనంతశక్తిచే అనేకావతారములనెత్తి దుష్టశిక్షణశిష్టపరిపాలనముచే లోకరక్షణముచేయుటను ఉద్దేశించి చేతనాతరాసాధ్యములగు దివ్యచేష్టితముల నొనరించెదవు, కపిసమూహముచే అనేక పర్వతములను పెకలించి తెప్పించి తాత్కాలికమగు సముద్రతరణమునే గాక శాశ్వతముగ దృష్టమాత్రముచే పాపహరమగునట్టి సేతువును బంధించితివి, స్థూలమగు బ్రహ్మండజాతమును సంకల్పమాత్రమున నొకే క్షణములో సృష్టించితివి, స్థితికాలమున యథావత్తు ప్రత్యక్షముననుంచి పాలించి మహాప్రలయమున సంహరించి నీయుదరమున భద్రపరచెదవు.

ఏవం మహాభారవహస్య విశ్వ-
కుటుంబినః కరుణాపూర్ణసింధోః ।
మమ త్వదీయస్య సుసూక్ష్మ లేశ-
లవాల్ప కష్టోద్ధరణం కియత్తే ॥ ౪౯

తా॥ ఓ ప్రభూ! అనేక కోటిబ్రహ్మాండములను కృపామాత్రమున భరించెడి జగత్కుటుంబివగు నీకు అత్యల్పుడనగు నన్ను ఉద్ధరించుట కష్టమగునా! అతిసులభము.

శ్రీవేంకటేశ మత్స్వామిన్! జ్ఞానానంద దయానిధే!
దుఃఖసాగరమగ్నం మాం త్వయం నోద్ధరసే కుతః? ॥ ౫౦

శ్రీనివాస! కృపాపూర్ణ! భక్తపోషణదీక్షిత!
సంసారారణ్యపతితం దయయా నేక్షసే కుతః? ॥ ౫౧

భక్తబంధో! దయాసింధో! త్వత్పాదాబ్జే నమామ్యహమ్
సూక్తాసూక్తమిదం సర్వమపరాధం క్షమస్వ మే ॥ ౫౨

వరం వరం చ వరయే భక్తిం త్వత్పాదయో స్మృతిమ్
సదా నామార్థవిజ్ఞానం దేహీహాముత్ర సౌఖ్యదమ్ ॥ ౫౩

శ్రీస్వామితీర్థదుగ్ధాబ్ధౌ శ్వేతద్వీపే సుమండపే
శ్రీభూభ్యాం విహరన్ విష్ణో! ముక్తిం భక్తాయ దేహి మే ॥ ౫౪

తా॥ శ్రీ శ్రీనివాసా! స్వామీ! జ్ఞానానందదయామయా! దుఃఖసాగరమున మునిగిన నీ భక్తునేల కాపాడవు. భక్తరక్షణబద్ధదీక్షుడవగు నీవు సంసారమహారణ్యమున త్రోవగానక తిరిగెడినన్నేల తరింపజేయవు. నీ పాదములకు నమస్కరించెదను. నేను చేసిన ఈ మననునందలి దోషమును క్షమింపుము. నేను కోరునది ఒక్కటేవరము. దానిని నాకనుగ్రహింపుము. ఇహపరముల నొసంగెడి నీ నామస్మరణమును నాకు సదా మరపురాకుండునట్లనుగ్రహింపుము. శ్రీస్వామిపుష్కరిణీతీర్థమే క్షీరసాగరముగను శ్రీ వేంకటాద్రియందలి దివ్యాలయమే శ్వేతద్వీపముగాను అవధరించి అర్చారూపియై అర్చావతారమున అనురూప దివ్యమంగళవిగ్రహములతో అవతరించిన శ్రీభూదేవులతోను అనంత గరుడవిష్వక్సేనాది దివ్యపారిషదులచేతను కూడినవాడవై శ్రీ వేంకటాద్రియందు విహరించెడి నీయందు నాకు భక్తియనువర్తించునట్లు అనుగ్రహమే నాకు కావలసిన వరప్రసాదము.

సూతులు చెప్పుచున్నారు :

ఇతి స్తుత్వా వేఙ్కటేశం రమేశం
తూష్ణీంభూతో దేవశర్మా సుభక్తః
భక్తేభ్యోఽభీష్టార్థవర్షప్రబుద్ధం
సాష్టాంగం తం ప్రాణమత్స్వేష్టదేవమ్ ॥ ౩౩

తా॥ ఇట్లని భక్తవత్సలుడగు శ్రీనివాసుని తన శక్తినసుసరించి స్తుతించిన దేవశర్మ పారవశ్యముచే ఒడలుతెలియక ఊరకనిలచెను.

అథ స్తోత్రేణ సంతుష్టః శ్రీనివాసః సతాం గతిః
మేఘగంభీరయా వాచా వరదానమథాబ్రవీత్ ॥ ౩౬

తా॥ దేవశర్మచేసిన స్తోత్రముచే సంతుష్టాంతఃంగుడగు శ్రీనివాసుడు మేఘగంభీరనాదముగల వాక్కుతో ఇట్లని వరదానముచేసెను.

శ్రీనివాసమూర్తి చెప్పుచున్నారు :

ప్రీతోఽహం తే ద్విజశ్రేష్ఠ ! మదుపాసనకర్మణా
యన్మహైశ్వర్యసంసిద్ధికారణం స్తోత్రముత్తమమ్ ॥ ౩౭

కృతవానసి తస్మాత్త్వం భైక్షీర్మాఽత్ర పరత్ర చ
మద్భక్తవాయుశిష్యస్య గురుపాదావలంబినః ॥ ౩౮

విపన్నాశస్సంపదాప్తిః భూయాత్తే మదనుగ్రహాత్
మమ భక్తస్య తే గేహే స్వర్ణవృష్టిర్దినే దినే ॥ ౩౯

అయుతాయుశ్చతే దత్తం పుత్రపౌత్రా స్తథాఽఽయుషః
శతపూరుషపర్యన్తం భుక్త్వా భోగాననేకశః ॥ ౬౦

తతో మత్పదమాప్స్యేషీత్యుక్త్వాఽదృశ్యో బభూవ హ

తా॥ ఓ ద్విజోత్తమా నన్నుపాసించిన పుణ్యావిశేషముచే నీవీ గొప్ప స్తోత్రమును రచియించగల్గితివి, ఈ స్తోత్రము మహైశ్వర్యసిద్ధికి కారణమగు

చున్నది. అట్టి స్తోత్రమే నీకు ఇహపరభయహారకమైమనది. నా యాత్మయగు వాయుదేవునకు నీవు శిష్యుడవగుట నీ యదృష్టము. నీకు ఆపన్నివారణము సంసత్ప్రాప్తికలుగుగాక. నా భక్తుడవగు నీయింట ప్రతిదినము స్వర్ణమే వృష్టిగాకురియుగాక. నీకు పదివేలసంవత్సరముల సుఖజీవనము నీ వంశపరంపరగ నీబిడ్డపాపలు నీవలె పదివేలుసంవత్సరములు జీవించి సమస్తభోగములను అనుభవించెదరుగాక. ఇట్లు నూరుతరములు సుఖముండి తరువాత నా పరమపదమును పొందగలవుగాక. అని వరమిచ్చి భగవానుడంతర్హితుడాయెను.

సూతులు చెప్పుచున్నారు

భో శౌనకాద్యా మునయో నిస్సంగాశ్చ తపస్వినః ॥ ౬౧

భక్తవశ్యో వేంకటేశః ప్రసన్నో భవతి ధ్రువమ్ ॥ ౬౨

యూయం గత్వా వేంకటేశం రమేశం
నత్వా స్తుత్వా వేదవేద్యం సుభక్త్యా ।
భక్తేభ్యోఽభీష్టార్థవర్ష ప్రబుద్ధం
సంప్రీణీధ్వం తేన వోఽభీష్టసిద్ధిః ॥ ౬౩

శ్రీవేంకటేశస్య కథామృతంత్విదం
మాహాత్మ్యసారం సుతపస్విమృగ్యమ్ ।
శ్రీవేంకటేశస్య మహాప్రియప్రియం
లోకోత్తరం దేవఋషిప్రియం చ ॥ ౬౪

సమస్తపాపౌఘవినాశకారణం
సమస్తపుణ్యౌఘః సమృద్ధికారణమ్ ।
శ్రీవేంకటేశస్య పదారవిందం
సద్భక్తివృద్ధావసమానకారణమ్ ॥ ౬౫

తా॥ ఓ శౌనకాదిముని పుంగవులారా! శ్రీవేంకటేశుడు భక్తవత్సలుడు. తప్పక మిమ్ములను కూడ అనుగ్రహించును. మీరుకూడ దేవశర్మవలెనే శ్రీవేంకటాద్రికివెళ్ళి భగవానుని నమస్కరించి యీ స్తోత్రముచేతనే స్తుతించి వానియనుగ్రహమునుపొంది మీ యభీష్టములను సాధించుకొనుడు. ఈరీతిని స్తుతింపబడిన శ్రీవేంకటేశప్రభుని మాహాత్మ్యమును మహర్షులు ఆశతో వినెదరు. ఈ స్తోత్రము ప్రభువునకు ప్రియాతిప్రియము, ఈ స్తోత్రముసమస్త పాపములను హరించి సమస్తపుణ్యముల నీయగలదు. స్తోత్రమునకట్టిమహిమ కలుగుటకు ఆ స్తోత్రము భగవానుని పాదారవిందములను స్తుతించుటచేతనే యగును.

వక్తుః శ్రోతుః పాఠకస్య నారాయణపరస్య చ
పరాత్పరో వేంకటేశః ప్రసన్నో భవతి క్షణాత్ ॥ ౬౬
స్తోత్రేణానేన సంతుష్టో వేంకటేశో రమాపతిః
యాన్ యాన్ కామాన్ కామయన్తే తాంస్తాన్ ముక్తిం దదాతి చ ॥

ఇతి శ్రీమదాదిత్యపురాణే శ్రీ వేంకటాచలమహాత్మ్యే శ్రీ వేంకటేశస్య సకలాభీష్ట ప్రదానవర్ణనం నామపంచమోఽధ్యాయః.

తా॥ నారాయణపరాయణులై శ్రీవేంకటేశుని స్తోత్రము చెప్పెడివారలకును వినెడివారలకును చదివెడివారలకును స్తోత్రప్రీతుడగు శ్రీనివాసుడు సకలాభీష్టముల నిచ్చును.

ఇది శ్రీమద్వైయాకరణ పంచానన విద్వత్కవిసార్వభౌమ ఆగమాచార్యాని బిరుదాంకితులును ఆకులమన్నాడు గ్రామవాస్తవ్యులు నగు రొంపిచర్ల భట్టర్ పార్థసారథి భట్టాచార్యులువారిచే ఆంధ్రీకరింపబడిన శ్రీమదాదిత్యపురాణమునందలి వేంకటాచలమాహాత్మ్య గ్రంథమున శ్రీ వేంకటేశ్వరుడు భక్తులకు సకలాభీష్టముల నిచ్చుటను వర్ణించెడి ఐదవ అధ్యాయము.

శ్రీ ఆదిత్యపురాణము సమాప్తము.

శ్రియైపద్మావత్యై నమః

శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః

శ్రీ బ్రహ్మపురాణాన్తర్గత

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము

(ఆంధ్రతాత్పర్యసహితము)

ఆకులమన్నాడు ఆర్. పార్థసారథి భట్టాచార్యులు.

శ్రియః కాన్తాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్
శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మఙ్గళమ్ ॥

శ్రీవేంకటాచలాధీశం శ్రియాధ్యాసితవక్షసమ్
శ్రితచేతనమన్దారం శ్రీనివాసమహం భజే ॥

జయత్యాత్మేశ్వరోన్నిద్రధ్యానసౌధప్రియాతిథిః
శ్రీమత్పృతపురీవాసః శ్రీరామః సీతయా గృహీ
శ్రీనివాసం నమస్కృత్య గురూనౌఖేయసూత్రిణః
శ్రీనివాసాధ్వరీన్ద్రాదీన్ వేదాన్తార్థప్రకాశకాన్.
దేవభాషామయం కావ్యం వేంకటాచల వైభవమ్
ఆంధ్ర్యా వాణ్యా పార్థసూతో వివృణోతి యథామతి

—: దిలీపుడు దూర్వాసుని ప్రశ్నించుట :—

సూతుడు చెప్పుచున్నాడు :—

రాజా దూర్వాససం పృష్ట్వా దిలీపో గృహమాగతమ్
శ్రుత్వా శ్రీరంగమాహాత్మ్యం శ్రీముష్ణస్య చ వైభవమ్
వేంకటాచలమాహాత్మ్యమథ పప్రచ్ఛ సాదరమ్ ॥ ౧

తా॥ తన యింటికి విజయముచేసిన దూర్వాసునినుండి శ్రీరంగమాహాత్మ్యమును శ్రీముష్ణక్షేత్రమాహాత్మ్యమును వినినట్టి దిలీపచక్రవర్తి స్వయం వ్యక్త క్షేత్రములలో మూడవదగు శ్రీవేంకటాచలముయొక్క మాహాత్మ్యమును వినుట కాశతో ఆ క్షేత్రమాహాత్మ్యమును చెప్పుమని అడుగ నారంభించెను.

దిలీపుడు ప్రశ్నించుట :—

నిర్దిశ్య దేవదేవస్య స్వయంవ్యక్తాష్టవైభవమ్
శ్రీరంగవైభవం తస్య శ్రీముష్ణస్య చ వైభవమ్ ॥ ౨

ఉక్తం త్వయా దయాసింధో! సాంప్రతవద వైభవమ్
శ్రీవేంకటాద్రిసంజ్ఞస్య క్షేత్రస్యానుత్తమస్య చ ॥ ౩

వేంకటేశ్వరదేవోఽసౌ యత్ర సన్నిహితో హరిః
తస్యాఽగతిం వైభవం చ తీర్థసంఖ్యాం తథైవ చ
యేన ప్రథా కృతా లోకే తదాచక్ష్వ కృపా యది ॥ ౪

తా॥ ఓ ఋషిసత్తమా! భారతవర్షమున భగవానుడు స్వయంవ్యక్తముగ సాన్నిధ్యమునొందిన దివ్యక్షేత్రములు యెనిమిది కలవనిచెప్పుచు అందు మొదటి దగు శ్రీరంగముయొక్కయు రెండవదగు శ్రీముష్ణముయొక్కయు మాహాత్మ్య మును చెప్పితివి. తక్కినవి వేంకటాచలము సాలగ్రామము నైమిశము తోతాద్రి పుష్కరము నరనారాయణాశ్రమము(బదరికాశ్రమము)అనునవి ఆరుకలవు. అందు క్రమప్రాప్తమగు మూడవ వేంకటాచలముయొక్క మాహాత్మ్యమును దయతో నాకిప్పుడు చెప్పుడు. అన్ని దివ్యక్షేత్రములందు ఉత్తమమగు నీ క్షేత్రమునకీ పేరుయెట్లు కలిగినదియు శ్రీవేంకటరమణుని స్వరూపమును క్షేత్రముయొక్క ఆవిర్భావమును వైభవమును అందలి పుణ్యతీర్థముల వివరమును దానికి యేయే దివ్యనామములతో లోకమునందు ప్రసిద్ధికలిగినదియు నాకుపదేశింపవేడెదను.

దూర్వాసుడు చెప్పుచున్నాడు :—

శృణు రాజన్! ప్రవక్ష్యామి వేంకటాచలవైభవమ్
తస్యాఽగతిం ప్రవక్ష్యామి దేవస్యాపి మహాత్మనః ॥ ౫

మేరోః పుత్రో మహాశైలో జాంబూనదనదీతటే
యోజనత్రయవిస్తీర్ణః త్రింశద్యోజనమాయతః ॥ ౬

వేంకటేతి కృతం నామ పిత్రా తస్య మహాత్మనః
అమృతస్యేందిరాయాశ్చ యతో విస్తారకారకః ॥ ౭

జీవానాం భారతే వర్షే తతోఽయం గుణనామకః
నిర్దోషవిష్ణోరయనం నారాయణమిమం విదుః ॥ ౭
వృషస్య ధరణాత్పోషాద్వృషభం చాపి తం విదుః
ప్రసవాదంజనాదేవ్యాః విదురంజనసంజ్ఞకమ్
సశేషాగమనశ్చాపి శేషాద్రిం ప్రాహురుత్తమాః ॥ ౯

తా॥ ఓ రాజా! వేంకటాచలమాహాత్మ్యమును చెప్పెదను. సావధానుడవై వినుము వేంకటాచలముపుట్టుక వేంకటేశుని సాన్నిధ్యము వీనిని వివరించెదను. సువర్ణముఖినదియొడ్డున మూడుయోజనముల విస్తీర్ణము ముప్పది యోజనముల పొడవుగల పర్వతమొక్కటి కలదు. అయ్యది మేరుపర్వతముయొక్క భాగము (పుత్రుడు). పర్వతరాజగు మేరువుచే తనపుత్రునకు పుట్టినప్పుడు 'వేంకటు'డు అని నామకరణము చేయబడెను. ఈ పేరు సార్థకముగ నుండునట్లు దాని భవిష్యత్తును ఉద్దేశించి తండ్రి తన కుమారున కా పేరు పెట్టినా డనిపించుచున్నది. వేంకటశబ్దమునకు ఇహపరముల నిచ్చువాడని యర్థము శబ్దశక్తివలన నేర్పడుచున్నది. అందు 'వేం' శబ్దముచే అమృతమును, 'కట' శబ్దముచే ఐశ్వర్యమునుఅర్థమగుచున్నవి. భారతవర్షమందలి సకలచేతనులకును తనయందు భగవత్సాన్నిధ్యము పరిపూర్ణముగ నుండుటచే ఈపర్వతము భారతప్రజలకు ఇహపరముల నీయగలది. తండ్రిచే చేయబడిన ఈ నామకరణము సార్థకమైయొప్పినది. వేంకటాద్రివలెనే ఇతరవ్యవహారనామములు యెన్నియో యీ పర్వతమునకు కలవు. శ్రీమన్నారాయణునకు ఆవాసస్థానమగుటచే ఇయ్యది నారాయణాద్రి యనబడుచున్నది. దీనిని సేవించువారలకు ధర్మబుద్ధిని కలిగించెడిదగుటచేతను ఆ ప్రాంత్యము ధర్మనిలయమగుటచేతను, దీనికి వృషాద్రి, వృషభాద్రి యనియు వ్యవహారము కలదు. వృష వృషభశబ్దములకు ధర్మమని యర్థము ప్రసిద్ధము. అట్లే కేసరిపుత్రియగు అంజనాదేవి యీ పర్వతమునందు రామాయణవీరుడగు శ్రీఆంజనేయుని గనుటచే ఆమెపేరిట నీపర్వతము అంజనాద్రి యనబడుచున్నది. అట్లే ఈ పర్వతము సహస్రశిరస్కుడగు ఆదిశేషునితో చేబడినదగుటచే శేషాద్రి యనియు పిలువబడుచున్నది.

—: వాయుదేవునకును ఆదిశేషునకును కలిగిన కలహావృత్తాంతము :—

దిలీపుడు ప్రశ్నించుచున్నాడు :—

సశేషాగమనం తస్య కుత ఏతన్మహావిభో ।
తదాచక్ష్వ మహాప్రాజ్ఞ! శ్రోతుం కౌతూహలం హి మే ॥ ౧౦

తా॥ ఓ మునిసత్తమా! శేషునితో కూర్చి తేబడుట అననేమి? ఆ విపర మును తెలుప వేడెదను.

దూర్వాసుడు చెప్పుచున్నాడు :—

అనన్తశయనః శ్రీమాన్ కదాచిత్ క్షీరసాగరే
లక్ష్మీవిలాస నిర్విష్టో భగవాన్ మధుసూదనః ॥ ౧౧
బ్రహ్మానన్దవనే రేమే రమయాఽన్తః పురే సహ
సమాదిదేశ చ తదా భగవాన్ రమయా యుతః ॥ ౧౨
శేషమన్తఃపురద్వారే భావికృత్యం చ చిన్తయన్
తదాశయానుగః శేషః సర్వలోకధురంధరః ॥ ౧౩
తస్థావన్తఃపురద్వారే తస్య చానుమతే తదా
ఖ్యాపయామాస చాత్మానం బలిష్ఠం సర్వతోఽధికమ్ ॥ ౧౪

తా॥ ఒకానొకప్పుడు శ్రీమన్నారాయణుడు క్షీరసాగరమధ్యమున బ్రహ్మా నందవనమున నంతఃపురమునందు మహాలక్ష్మితో ఏకాంతమున విహరించుచు ఆసమయమున నాదిశేషునిబిలచి 'అంతఃపురద్వారమున జాగరూకుడవై యుండు' మని యాజ్ఞాపించి పంపెను. సర్వలోకోద్ధరణదక్షుడగు నాదిశేషుడు ఏకాంత రక్షకునిగ తనను భగవానుడు నియమించుటను తలచి గర్వితుడై, భగవదాజ్ఞను పరిపాలించుచు వాకిట నిలచియుండెను.

ఏతస్మిన్నంతరే వాయుః దుగ్ధాబ్ధిశయనం యయౌ
తదా వాయుం సమారౌత్సీత్ ఫణీంద్రో బలదైవతమ్ ॥ ౧౫
'న చ తే సమయశ్చాత్ర ప్రాప్తుమన్తఃపురం గృహాన్
నాత్మజ్ఞో హి భవాన్ వాయో! కదా తే భూద్గతిః పురా ॥ ౧౬

ఇతః పరమతీత్య త్రికక్ష్యా అన్తఃపురే గృహే"
ఇతి తద్వచనం శ్రుత్వా వాయుస్తం ప్రత్యవోచత ॥ ౧౭

తా॥ ఇట్టిసందర్భమున వాయుదేవు డా యంతఃపురద్వారమువకు రాగా నాతని నాదిశేషుడు అడ్డగించి, 'ఓ మిత్రమా! ఈ సమయమున నీవిచ్చటకు రాకూడదు. నీ యర్హతను నీవెరుగవు. ఇంతదనుక నెచ్చటనుంటివి? మూడు ప్రాకారములు దాటి ఇంతదూరమెట్లు రాగలిగితివి: అని యధిక్షేపించగా విని వాయుదేవుడిట్లనెను.

వాయుదేవుడు చెప్పుచున్నాడు :—

'నాత్మజ్ఞోఽసి త్వమే వాత్ర త్రయోక్తమవిచారతః'

తా॥ ఓ శేషా! నీ అర్హతను దెలియనివాడవు నీవే గాని నేను కాదు. ముందువెనుక తెలియక నీవు మాట్లాడుచున్నావు.

ఆదిశేషుడు చెప్పుచున్నాడు :—

'బహిరన్తశ్చ యో నిత్యమహం నాథసమీపగః
త్వం భృత్యో మీఢుషో విష్ణోః నాన్తరంగో న మత్సమః॥ ౧౯
తిష్ఠ! తావద్ధరేః ద్వారీత్యహీశో వాయుమబ్రవీత్
తచ్ఛ్రుత్వా ప్రహసన్వాయుః వాయుభక్షమథాబ్రవీత్ ॥ ౨౦

తా॥ ఓ వాయుదేవా! నేను సర్వకాలసర్వావస్థలందును భగవానుని సన్నిధినే యుందును. నేను అంతరంగభక్తుడను. నీవు కేవల భృత్యుడవు. నీవు నావంటి అంతరంగుడవు కావు. వాకిటనే నిలువుము. అని పలుకగా విని వాయుదేవుడు నవ్వుచు ఆదిశేషునకిట్లని బదులు పలికెను.

వాయుదేవుడు చెప్పుచున్నాడు :—

దాసీదాసజనా యే తు యే చాన్యే పరిచారకాః
తాన్ వదన్తి తు మిత్రాణి నతేఽర్హాంత్యాసనం విభోః॥ ౨౧
బిడాలోఽన్తః స్థితో వాఽపి బహిష్ఠేభ సమో న హి
మాం త్వం జానాసి నాధ్యక్షం ప్రాణినాం ప్రాణమీశ్వరమ్॥ ౨౨

బలే జ్ఞానే విరాగే చ విష్ణుభక్తౌ న మత్సమః
సాక్షాద్విష్ణుప్రసాదస్య పాత్రభూతోఽస్మి సర్వదా ॥ ౨౩
మర్యాదయాఽవస్థాతవ్యం వక్తుం నార్హసి చాధికమ్
ఇత్యుక్తః తేన సంక్రుద్ధః ప్రత్యువాచ బిలేశయః ॥ ౨౪

తా॥ ఓ ఆదిశేషుడా! ప్రభువుయొక్క దాసదాసీజనులు ఇతరపరిచారకులు మొదలగువారు ప్రభువునకు మిత్రులై యుండవచ్చును. కాని వారలందరును ప్రభునికి అంతరంగులు కాజాలరు. వంటయింటిలో తిరిగెడి స్వాతంత్ర్యము కలిగినను పిల్లికి, బైట తిరిగెడి యేనుగకుగల గౌరవము లేదు. నన్ను నీ వెరుగవు. నేను సకల ప్రాణివర్గమును బ్రతికించెడి శక్తిగలవాడను. సాక్షాత్తుగ భగవానుని యనుగ్రహమునకు నేనే సర్వవిధముల పాత్రుడను. మర్యాదగ ప్రవర్తింపుము. అధికప్రసంగము చేయకుము, అని వాయుదేవుడు పలికిన మాటలకు ఆదిశేషుడు మిక్కిలి కోపముతెచ్చికొని వాయుదేవునకు బదులు చెప్పసాగెను.

ఆదిశేషుడు చెప్పుచున్నాడు :—

'కిం జల్పితేన బహునా పరీక్షాఽత్ర విధీయతామ్
ఆవాభ్యాం బలశాలిభ్యాం దృశ్యతేఽత్ర బలాబలమ్,
ఇత్యుక్తస్తేన ఫణినా మాతరిశ్వాఽబ్రవీత్తతః ॥ ౨౫

తా ॥ ఓ ప్రభంజనా! మాటలతో యేమి ప్రయోజనము! మనలో బలశాలి యెవ్వడో పరీక్షించి చూచెదముగాక.' అని పలికెడి ఆదిశేషునకు వాయుదేవుడిట్లని ప్రత్యుత్తరమిచ్చెను.

(వాయుదేవుడు చెప్పుచున్నాడు) :—

ఆవయోః స్యాత్కథం చాత్ర పరీక్షా పౌరుషే గతా
ధ్వదస్వ మహాబాహో యేన తే నిశ్చయో భవేత్ ॥ ౨౬
ఏవం వృత్తే వివాదే తు తత్రాగాద్ధరిరీశ్వరః
కిమేతదితి తౌ పృష్ట్వా శేషేణోక్తోఽతి విస్తరాత్
ప్రాహోద్వృత్తం తదా శేషం భావి కార్యం స చిన్తయన్ ॥ ౨౭

తా॥ ఓ ఆదిశేషుడా! మన ఉభయులబలమును పరీక్షించి యెక్కువ తక్కువలను నిశ్చయించుటకు మార్గమును చెప్పుము. అని యిట్లు వివాదము నడచుచుండగా ఆ ప్రదేశమునకు భగవానుడేతెంచి వివాదకారణమును (పర్వతానయనమును) ఆదిశేషుని వలన తెలిసికొనినవాడై ముందు సంకల్పించిన కార్యమును మనసున నిడికొని భగవానుడిట్లని చెప్పెను.

భగవానుడు చెప్పుచున్నాడు :—

లోకాన్తరాత్మా బలదేవతా యః
ప్రాణో మమాపి హ్యధికో మతోఽయమ్
త్వం లోక భర్తేతి మహోన్మదస్తే
తవాపి వై కూర్మవరో హి వోఢా ॥ ౨౮

తా॥ ఓ ఆదిశేషా! వాయుదేవుడు సకలలోకములకు అంతరాత్మయగుటచే నాకంటెకూడ ఆతడు గొప్పవాడు. నీవు లోకములను భరించెదవని గర్వపడుచున్నావు కాని నిన్నుకూడ ఆదికూర్మము భరించుటను యెరుగకున్నావు. గాలిదేవునితో వివాదపడవద్దు.

తచ్ఛ్రుత్వా ప్రాహ దేవేశం శేషస్తస్యాశయానుగః ॥ ౨౯

తా॥ భగవానుని యభిప్రాయమును యెరిగిన ఆదిశేషుడు పైభగవద్వాక్యమును విని భగవానునుద్దేశించి యీవిధముగ విజ్ఞాపించుచున్నాడు,

ఆదిశేషుడు చెప్పుచున్నాడు :—

'భగవన్మమ వాయోశ్చ పశ్యాద్య బలపౌరుషే
యోఽసౌమత్పావితః శైలో భారేణ మహతా వృతః ॥ ౩౦
మేరుపుత్రో మహాపుణ్యో జాంబూనదనదీతటే
యోజనత్రయవిస్తీర్ణః త్రింశద్యోజనమాయతః ॥ ౩౧
అహం మేరుమవష్టభ్య బద్ధ్వా తం కాయరజ్జునా
స్థాస్యామి తం మహాశైలం వాయురుద్ధరతే యది ॥ ౩౨

తదా మత్తోఽధికో వాయుః ప్రభో సత్యం న సంశయః'
ఏవముక్తో హృషీకేశః శేషేణాత్యన్తగర్విణా ॥ ౩౩
వాయుముద్వీక్షయామాస వాయుః జ్ఞాత్వేంగితం హరేః
తథా కుర్వితి తం శేషం హరిణా ప్రేరితోఽబ్రవీత్ ॥ ౩౪

తా॥ ఓ స్వామీ! మా ఉభయులబలమును పరీక్షించుటకు నేనొకమార్గమును విన్నవింతును. జాంబూనద నదీతటమునందు మూడు యోజనముల విస్తీర్ణము, ముప్పదియోజనముల పొడవుగలట్టి అతి భారమగు 'మేరుపుత్ర' పర్వతము కలదు. దానిని నాశరీరముతో గట్టిగా చుట్టుకొని బిగబట్టెదను. ఆ పర్వతమును వాయువు కదిలించగలిగినచో అతడు నాకంటె బలవంతుడని నేను అంగీకరింతును. ఇది సత్యము. అని గర్వముతో ఆదిశేషుడు ప్రతిజ్ఞచేయగా, భగవానుడు వాయుదేవునివంక చూచెను. భగవానుని ఇంగితమును తెలిసికొనిన వాయుదేవుడును అట్లే కావచ్చునని యంగీకరించెను.

తతః శేషో యయౌ భూమిం తత్రాపశ్యద్గిరిం శుభమ్
తప్తహాటకసంకాశం రత్నసానుం మనోహరమ్ ॥ ౩౫
మేరోర్దక్షిణదేశే తు జాంబూనదనదీతటే
మేరుపుత్రం మహాపుణ్యం వేంకటాచల సంజ్ఞకమ్ ॥ ౩౬
మేరు వేంకటశైలేంద్రావవష్టభ్య మహారుషా
స్వకాయరజ్జునా బద్ధ్వా శేషస్తస్థౌ జ్వలన్ రుషా ॥ ౩౭
సన్నద్ధస్సహసర్వాంగైః పశ్చాద్వాయుమువాచ హ
యద్యస్తి తే బలం ఘోరం గిరిముద్ధర సాంప్రతమ్ ॥ ౩౮

తా॥ అంతట నాదిశేషుడు క్షీరసాగరమునుండి భూమండలమునకువచ్చి జాంబూనదనదీతీరమందు మహాపుణ్యప్రదమగు వేంకటాద్రిని సమీపించి, మేరు పర్వతమును, వేంకటపర్వతమును చేర్చి తన శరీరముతో గట్టిగా కట్టి, అతి కోపముతో వాయుదేవుని బిలచి, 'ఓ వాయుదేవా! నీకు శక్తియున్నచో నాచే బిగబట్టబడిన యీ పర్వతమును ఇప్పుడు పైకి లేవనెత్తి నన్ను గెలువవచ్చును. అని పలికెను.

ఇత్యుక్తో వాయురాయాతః స్పృశన్ పాదేన వేంకటమ్
చిక్షేపాఙ్గుష్ఠతః శైలం దర్పేణానాదరాత్తదా ॥ ౩౯

అవిచాల్యం యదా మేనే శేషసంవేష్టితం గిరిమ్
తతః ప్రయేత్రే బాహుభ్యాం తం తోలయితుమాదరాత్ ॥ ౪౦

న శశాక యదా వాయుః బాహుభ్యామపి పీడయన్
తం చాలయితుమీషద్వా భగ్నదర్పస్తదాఽభవత్ ॥ ౪౧

అకీర్తిశంకీ చ తతో వాయుః బ్రహ్మాణ్డపూరణః
ఆత్మీయామఖిలాం శక్తిం కంపనే శోషణే తథా ॥ ౪౨

వ్యఞ్జయన్ కమ్పయామాస సర్వాన్ స్థావరజంగమాన్
అథ బ్రహ్మాదిభిర్దేవైరనునీతేఽపి మారుతౌ ॥ ౪౩

అకృతోపరమే శేషః సామ్నా విజ్ఞాపితస్తు తైః
లఘుర్భూత్వా క్వచిత్కించిత్ ఫణాన్ సంశ్లథయన్ స్థితః॥ ౪౪

తా॥ శేషునిచే హెచ్చరించబడిన వాయువు అలక్ష్యముతో పర్వతమును తన కాలితో తన్ని కదలింపజూచెను. అది కదలకుండుటనుచూచి దిగులుజెంది దానిని చేతులతో లేవనెత్తుటకు యత్నించెను. చేతులతోకూడ కదలింపజాలనంతట దర్పమునువీడి ఆత్రముతో తనకు పరాజయమువలన అపకీర్తికలుగుటను శంకించి, బ్రహ్మాండమును పూరించి, పర్వతమును కదల్చుటకు తన యావచ్ఛక్తిని వినియోగించిచూచెను. బ్రహ్మాండమంతలి స్థావరజంగమములన్నియు ఒకేమారు కంపించెను. పర్వతము కదలలేదు, వాయుదేవుడు విడువలేదు. అంతట బ్రహ్మాదిదేవతలందరును సకలలోకక్షోభము కావచ్చునని భయపడి· శేషుని సమీపించి, వాయుదేవుడు పర్వతమును చలింపజేయుట కనుకూలముగ కొలదిగా తన పట్టును విడువుమని ప్రార్థించిరి. ఆదిశేషుడు కార్యార్థియై తన పట్టుదలను కొంచెము తగ్గించినవాడాయెను.

తతస్తద్వివరం వాయుర్మహావేగో వివేశ హ
తతః క్షణేనోచ్చలితః తూలలాశిరివాంబరే ॥ ౪౫

ప్రచలన్ వర్త్మ చోల్లంఘ్య దూరం లక్షార్ధయోజనమ్
ఉత్తరే దక్షిణాంభోధేః ద్వాత్రింశద్యోజనాన్తరే ॥ ౪౬

పూర్వాంభోధేః పశ్చిమే తు పుణ్యే స్వర్ణముఖీతటే
పపాత వేగతో వాయోః శైలః శేషసమన్వితః
సహస్రధా శీర్యమాణో బలేన బలశాలినః ॥ ౪౭

తా॥ ఆ అవకాశమును పొందిన వాయుదేవుడు అతివేగముతో సందులందు పూరించుకొని పర్వతమును యెత్తగా, అది అంతరిక్షమార్గమున తూలరాశివలె తేలికయై లేచెను. అంత వాయుదేవుడా పర్వతమును లేవనెత్తి గగనమార్గమున ఒకటిన్నరలక్ష యోజనముల దూరమునకు తెచ్చి దక్షిణసముద్రమునకు ముప్పదియోజనములు ఉత్తరమునను, పూర్వసముద్రమునకు పశ్చిమమునను, సువర్ణముఖరీతీరమున పర్వతమును చుట్టియున్న ఆదిశేషునితోపాటుగ పడవైచెను. ఆవేగమునకు పర్వతము వేయివ్రక్కలై పోవునట్లాయెను.

తతస్తుష్టావ మరుతం మేరుః సుతహితేచ్ఛయా
'త్రాహి త్రాహి జగత్ప్రాణ పుత్రభిక్షాం ప్రయచ్ఛ మే ॥ ౪౮

అపరాధో హి శేషస్య న చ మే పుత్రహేతుకః '
ఇతి తేన స్తుతో వాయుః 'పాలయామీ'తి చాబ్రవీత్ ॥ ౪౯

తం గిరిం సహసాఽఽవిశ్య తేన సార్ధం పపాత హ
వాయోరావేశనాచ్ఛిన్నం ప్రాహురంజనసంజ్ఞకమ్
శేషో విశీర్ణదేహస్తు తేన సార్ధం పపాత హ ॥ ౫౦

ఇతి శ్రీబ్రహ్మపురాణే శ్రీవేంకటాచలమాహాత్మ్యే దిలీపదూర్వాసస్సంవాదే వాయుశేషపరస్పర బలపరీక్షాదికథనం నామ ప్రథమోఽధ్యాయః.

తా॥ ఆ సన్నివేశమునుచూచిన మేరుపర్వతము పుత్రునికి సంభవించిన ఆపదను తలచి దుఃఖించి, పుత్రుని కాపాడుకొనుటకై వాయుదేవునిశరణము జెంది, 'ఓ జగత్ప్రాణమూర్తీ! నాబిడ్డను కాపాడి నాకు పుత్రభిక్షబెట్టుము. నీ శక్తిని నిరోధించుటలో నీకు అపచారముజేసినది ఆదిశేషుడు గాని నాబిడ్డ కాదు.

నాబిడ్డ నిరపరాధి. వానిని శిక్షించవద్దు' అని స్తుతియించెను. పర్వతరాజుని స్తోత్రముచే ప్రీతుడైన వాయుదేవుడు 'అట్లే కానిమ్ము' అని యాతనికి అభయ మిచ్చి తానును ఆపర్వతమునందు అనుప్రవేశముగావించి శేషపరివేష్టితమగు పర్వతముతో సహితముగ ఉద్దిష్టస్థలమునందు దిగిపోయెను. పర్వతమునందు వాయుదేవునిశక్తి యనుప్రవేశించుటచే, వాయుదేవుని పర్యాయవాచకశబ్దమగు 'అంజన' యను వ్యవహారములో ఈ పర్వతము వ్యవహరింపబడుచు వచ్చు చున్నది 'అంజూ-వ్యక్తిమ్లక్షణకాన్తిగతిషు' అని, అంజూధాతువువలన 'అజ్యతే, అధిగమ్యతే - ఆవిశ్యతే ఇత్యంజనః' అను వ్యుత్పత్తిచే వ్యాప్తికర్మవాచియగు అంజనశబ్దము వాయువ్యాప్తిమూలమైనదని శబ్దార్థము సంగతమగుచున్నది. 'ఆవేశనాచ్చ' అనుచోటి చకారముచే అంజనాదేవి ప్రసవనిమిత్తకత్వము కూడ సముచ్చితము కానోపును. అట్లే ఈ క్షోభమునందు పర్వతమును చుట్టుకొని యున్న ఆదిశేషుడును నలిగిపోయినశరీరముతో కూడి పర్వతము. వాయుదేవుడు వీరలతోచేరి సువర్ణముఖరీతీరమంచు పడిపోయెను

ఇతి శ్రీబ్రహ్మపురాణమునందు శ్రీవేంకటాచలమాహాత్మ్యమున దిలీప మార్కండేయసంవాద ప్రకరణమున వాయుశేషుల పరస్పర బలపరీక్షాదికథన మను నది ప్రథమాధ్యాయము.

---

## రెండవ అధ్యాయము

### శ్రీవేంకటాద్రియందు శేషకృత తపఃప్రభావ వర్ణనము

దిలీపుడు అడుగుచున్నాడు —

> కిమర్థం దేవదేవేశో హిత్వా వైకుంఠముత్తమమ్
> సాన్నిధ్యమకరోత్తత్ర వేంకటాఖ్యే నగోత్తమే
> కిం తత్ర కారణం బ్రూహి పరం కౌతూహలం హి మే ॥ ౧

తా॥ ఓ మునిసత్తమా! భగవానుడు పరమపదమగు వైకుంఠమునువిడచి శ్రీవేంకటాద్రియందు యేకారణమువలన తన నివాసమును ఏర్పరచికొనెనో విన వలెనని నాకు కుతూహలమగుచున్నది. దయచేసి ఆ వివరమును చెప్పుడు.

దూర్వాసుడు బదులు చెప్పుచున్నాడు —

శేషో గతమదః పశ్చాత్తస్మిన్నేవ నగోత్తమే
వాయవ్యే స్వామిసరసో నాగతీర్థే మనోరమే ॥ ౨
నానాసానుసమాకీర్ణే నానాపాదపమండితే
ఉత్తరే శిఖరే పుణ్యే సాన్నిధ్యార్థం జగత్పతేః ॥ ౩
తపస్తేపే మహాఘోరం దివ్యం వర్షసహస్రకమ్
తపసా తోషితో దేవః ప్రత్యక్షం సమజాయత
'వరం వరయ భద్రే'తి తేనోక్తః శేష ఆహ తమ్ ॥ ౪

తా॥ తరువాత ఆదిశేషుడు గర్వభంగముచే దిగులుజెంది అదేపర్వతము నందు స్వామిపుష్కరిణికి వాయవ్యభాగమున మనోహరమును, నానాసానుసమాకీర్ణమును, నానాపాదపమండితమును నగు నుత్తరశిఖరమున నాగతీర్థమందు భగవానునిసాన్నిధ్యము కొఱకై వేయి దివ్యసంవత్సరముల దీర్ఘకాలము మహాఘోరముగ తపస్సుచేసెను. అట్టి తపశ్శక్తిచే భగవానుడు ప్రత్యక్షమై 'వరమును కోరు'మని శేషునడుగగా శేషుడు భగవానున కిట్లని విజ్ఞాపించెను.

— శేషునకై భగవాను డావిర్భవించుట : —

ఆదిశేషుడు వరమునడుగుచున్నాడు —

'యది ప్రసన్నో భగవన్ ఇదం నో దేహి భో వరమ్
యథా శేషే మదంగే త్వం వైకుంఠే భువనోత్తమే ॥ ౫
శైలాకారే చ మద్దేహే నిత్యమత్ర వస ప్రభో'
ఇతి శేషేణ చోక్తస్సన్ భగవాన్ ప్రత్యువాచ హ ॥ ౬

తా॥ ఓ దేవా! నీవు అనుగ్రహించి వరమీయదలచినచో నాకోరికె నిట్లు ప్రసాదింపుము. శ్రీవైకుంఠమునందు వేంచేసియున్న నీవు నా శరీరమును శయ్యగా నమర్చికొని శయనింతువో అట్లే శైలరూపముగ నమరిన యీ నా శిలామయ శరీరమునందు ప్రీతితో సర్వకాలము నివసించవలయును' అని శేషునిచే ప్రార్థింబడి భగవానుడు బదులుచెప్పెను.

భగవానుడు వరమిచ్చుచున్నాడు —

“ పురా విచారితం స్థానం భూమౌ క్రీడాస్పదం శుభమ్
ఏతస్మిన్నన్తరే ప్రాయాన్నారదో మునిసత్తమః ॥ ౭
దృష్టే మునౌ మయా చోక్తం ‘ఋషేకస్మాదిహాఽఽగతః’
సోఽపి మాం ప్రాహ విప్రేన్ద్రః ‘దృష్ట్వా భూగోళమాగతః’ ॥౮
ఇత్యుక్తస్తేన చావోచం ‘మమ రంతుం భువఃస్థలే
యోగ్యం కిం స్థాన’ మిత్యుక్తః స చోవాచ మునీశ్వరః ॥ ౯

తా॥ ఓ శేషా! పూర్వమొకప్పుడు నాకు భూలోకమందు నివసింపవలయు నను నాశ కలుగగా ఉచితమగు స్థానమెయ్యది యను నాలోచన కలిగెను అంతలో నారదముని యచ్చటకు వచ్చెను. నేనాతని యోగక్షేమములడుగుటలో తాను భూలోకమును చూచివచ్చితినని చెప్పెను. మంచిసమయమని యెంచి, భూలోకమునందు నేను నివసించుటకు ఉచితమైన ఒకానొకచోటును పరామర్శించి చెప్పుమని యడిగితిని.

నారదుని ప్రబోధము —

‘అస్తి కశ్చిద్గిరివరో వేంకటాఖ్యో మనోహరః
త్రిసంద్యోజనమాయామీ యోజనత్రయవిస్తృతః ॥ ౧౦
అష్టోత్తరసహస్రేణ తీర్థవర్యైశ్చ శోభితః
జాంబూనదనదీతీరే మేరుశైలస్య దక్షిణే ॥ ౧౧
కించిదూనశ్చ వైకుంఠాద్విహారోఽయం మనోహరః
విహరస్వ రమానాథ వాసయోగ్యస్తవైవ సః ॥ ౧౨
తదా తద్వచనం శ్రుత్వా గన్తు మిచ్ఛా బభూవ మే
ఏతస్మిన్నన్తరే వాయో స్తవ సంవాదహేతుకః ॥ ౧౩
గిరిరత్రాగతః పుణ్యః త్వయాఽపి తపసాఽర్థితః
ఇష్టం మే ప్రార్థితం పూర్వం తదాఽస్త్వితి వరం దదౌ ॥ ౧౪
తేన విష్ణుః పమాయాతో హిత్వా వైకుంఠముత్తమమ్
స్వామిపుష్కరిణీతీరే రమయా సహ మోదతే ॥ ౧౫

తా॥ అందుకు నారదుడిట్లని చెప్పెను. 'ఓ ప్రభూ! మేరుపర్వత దక్షిణ భాగమున జాంబూనదనదీతీరమున 'వేంకటాద్రి' యను నొక పుణ్యపర్వతము కలదు. అది మూడుయోజనముల పొడవును ముప్పదియోజనముల విస్తీర్ణమును కలిగి, వేయిన్నియెనిమిది పుణ్యతీర్థములకు నిలయమై యలరారుచున్నది. ఆ ప్రదేశము శ్రీవైకుంఠమునకంటె కొంచెము తక్కువసౌకర్యముగల్గి శ్రీవైకుంఠ మునకు తుల్యమై దేవరవార్లకు శ్రీమహాలక్ష్మితో గూడి విహరించుటకు తగి యుండునని నా మనవి.' ఆ సలహాను నేను వినినంతట నా ప్రదేశమునకు పోయెదమని నాకు ఆశకలిగినది. ఇంతలో వాయుదేవునకును నీకును యేర్పడిన బలపరీక్షాసందర్భమున అదే పర్వతము మీ ఉభయులచేత నీ ప్రదేశమునకు తేబడినది. నీవును ఆపర్వతమునందే తపస్సుచేసి నా యనుగ్రహమున సిద్ధి బొంది ఈపర్వతరూపివేయగుచు పర్వతరూపమగు నీయందు నాసాన్నిధ్యమును పొందుచున్నావు. నేనున్నంతవరకు నారదప్రబోధముచే అదేపర్వతమునం దుండవలయునను కోరికెయు సఫలమగుటకు ఏర్పడినది' అని చెప్పుచు, శేషుడు కోరిన వరమును 'తథాఽస్తు' అని యనుగ్రహించి పరివారయుతుడై శ్రీవైకుంఠ మును విడచి వేంకటాద్రియందు స్వామిపుష్కరిణీతీరమున వెలసెను.

—: స్వామిపుష్కరిణీమహిమ వర్ణనము :—

దిలీపుడు అడుగుచున్నాడు —

> తస్మిన్ నగోత్తమే పుణ్యే నానాపాదపమండితే
> ఆదావన్తే చ మధ్యే చ సన్తి తీర్థాన్యనేకశః ॥ ౧౬
> దేశా మనోహరాః పుణ్యాః సానూని వివిధాని చ
> హిత్వా తత్సకలం స్థానం స్వామిపుష్కరిణీతటమ్
> ఆశ్రితో రమయా తత్ర మమ తత్కారణం వద ॥ ౧౭

తా॥ 'ఓ మునిసత్తమా! వేంకటాద్రియందెన్నియో పుణ్యతీర్థములు కలవు. మనోహరములగు ప్రదేశములును కలవు వానినన్నిటిని విడచి భగవానుడు స్వామిపుష్కరిణీతీరమునందే యేల నిలచెనో ఆతీర్థమహిమను విన కుతూహల మగుచున్నది' అని యడిగెను.

మార్కండేయుడు బదులు చెప్పుచున్నాడు —

> పురా సరస్వతీ దేవీ తీర్థోత్కృష్టత్వకాంక్షయా
> సరస్వతీ నదీ నామ బ్రహ్మావర్తే బభూవ హ ॥ ౧౮
> తస్యాస్తీరే తపస్తప్తుం పులస్త్యో భగవాన్ యయౌ
> పుత్రభావేన తం దేవీ నార్చయస్తిస్థితా మునిమ్ ॥ ౧౯
> తస్యాం తు కుపితః ప్రాహ యా తే కాంక్షా సరస్వతి :
> తవ సా విఫలా భూయాన్నదీరూపేణ సర్వదా ॥ ౨౦
> గుణసామాన్యభావేఽపి విష్ణుపాదప్రభావతః
> తవాధికేన యశసా భవిష్యతి సరిద్వరా ॥ ౨౧
> తీర్థోత్కృష్టా సైవ భూయాద్భువి గంగాఖ్యయా శుభా
> ఇతి శప్తా పునర్దేవీ తం శశాప మహామునిమ్
> రాక్షసస్తే భవేద్వంశ్యః విష్ణోరప్రియకారకః ॥ ౨౨

తా॥ బ్రహ్మావర్తదేశమున సరస్వతి యనునొక పుణ్యనదియుండెను. ఆ నది తాను సర్వనదులలో గొప్పదిగా కావలయునని కోరి తపము చేయుచుండెను. ఒకప్పు డా నదీతీరమున తపమాచరించదలచి పులస్త్యబ్రహ్మర్షి విజయము చేయగా ఆ నది పులస్త్యు నాదరించక తటస్థయైయుండెను. తనను ఆదరించ నందున మహర్షి కుపితుడై నదినిజూచి, 'ఓ నదీ ! నీ వేయాశతో తపస్సు చేయుచుంటివో ఆ యాశ ఫలింపకుండుగాక ! లోగడనే గంగ 'లోకపావని' యని ప్రసిద్ధికల్గినదిగ నున్నది, నీవును తపశ్శక్తిచే అంతటిదానవు కావచ్చును. గంగ 'విష్ణుపాదోద్భవి' యగుట నీవు గంగకు సమానురాలవుగాని, గొప్పదానవు గాని కాజాలవు. నీవు ఉద్దేశించినమేరకు నీతపస్సు ఫలించదు. నీవు నన్ను గౌరవించలేదు కావున నిట్లు శపించెదనని పులస్త్యుడు సరస్వతీనదిని శపించెను. హతాశయైన సరస్వతి కోపించి నిష్కారణముగ తనను శపించిన పులస్త్యునికి ప్రతిశాపమిచ్చుచు, పులస్త్యునిసంతానము రాక్షసవంశముగ మారిపోవుగాక యని పలికెను.

> పునః ప్రసాదితా తేన విశాపమపి సా దదౌ
> అంతిమో వైష్ణవో భూయాత్ కల్పస్థాయీ విభీషణః ॥ ౨౩

తా॥ పులస్త్యుడు నదీశాపమునకు పరితప్తుడై ప్రార్థించగా సరస్వతీనది కరుణించి శాపమోక్షమున కంగీకరించినదై పులస్త్యవంశములో కట్టకడపటి మహానుభావుడగు విభీషణుడొక్కడు మాత్రము విష్ణుభక్తుడుగ జన్మించి చిరజీవి యై పులస్త్యవంశమునంతను తరింపజేయుగాక యని అనుగ్రహించెను.

పునశ్చ తపసా దేవీ తీర్థోత్కృష్టత్వకాంక్షయా
తోషయామాస దేవేశం తస్యై సాన్నిధ్యమావహాత్ ॥ ౨౪

వాంఛా మే విఫలా బ్రహ్మన్ బ్రహ్మదండేన భూయ సా
భూమావేవ యథా తీర్థస్వామిత్వం మే భవేద్ధ్రువమ్ ॥ ౨౫

వరయామి వరం దేవ దేహి మే పురుషోత్తమ !
తయైవం ప్రార్థితో దేవో దేవీం తాం ప్రత్యువాచ హ ॥ ౨౬

తా॥ పట్టుదలను విడువక సరస్వతి మరల తనకోర్కెను తీర్చుకొనుటకై తపమాచరించి భగవానుని అనుగ్రహమునుపొంది భగవంతుడు ప్రత్యక్షముకాగా ఓ దేవా ! ముందు నేజేసినతపస్సు పులస్త్యశాపమునకు గుఱియై నిర్వీర్యమై పోయినది. తిరిగి నీప్రసాదమునకై తపస్సుచేసి కృతార్థురాలను కాగా నీదర్శనము లభించినది. నేను కోరినట్లు భూలోకమున సర్వతీర్థోత్తమత్వము ననుగ్ర హింపుము అని ప్రార్థించెను. భగవానుడును అనుగ్రహించి ఇట్లనెను.

బ్రహ్మదండో నదీరూపే పుష్కరిణ్యాం న వై కృతః
అతః శేషగిరిం గచ్ఛ వాసార్థం యామి తం గిరిమ్ ॥ ౨౭

గిరేర్దక్షిణభాగే తు మూర్ధదేశే సుఖం వస
స్వామిపుష్కరిణీనామ్నా వసేయం తవ దక్షిణే ॥ ౨౮

తా॥ ఓ సరస్వతీ ! భయపడవద్దు. పులస్త్యశాపము నిన్ను బాధించదు. ఆ శాపము నదులలో నీగొప్పతనమున కడ్డుకావచ్చును. పుష్కరిణులలో గొప్ప దనము నీకు కలుగుటకా శాప ముపయోగపడదు. నీవు శేషాద్రికిపోయి స్వామి పుష్కరిణి యనుపేరుతో గిరిదక్షిణోర్ధ్వభాగమున నుండుము.

తిస్రః కోట్యోఽర్ధకోటీచ తీర్థాని భువనత్రయే
స్వస్వపాపవిమోక్షార్థం యాపయిష్యన్తి మాం శుభే ॥ ౨౯
తేషాం పాపవిమోక్షార్థం త్వయి స్నానం దదామ్యహమ్
ధనుర్మాసే సితే పక్షే ద్వాదశ్యామరుణోదయే ॥ ౩౦
స్నానార్థమాగతం తీర్థజాలం ప్రేష్యత్వమాప్నుయాత్
తీర్థాధిరాజ్యే తత్తీర్థజాలం త్వామభిషేక్ష్యతి
ఇతి దత్వా వరం దేవః తత్తీరే న్యవసత్ప్రభుః ॥ ౩౧

తా॥ నేను మహాలక్ష్మితో ఆపర్వతమునకు రాబోవుచున్నాను. వచ్చి నీకు కుడిప్రక్కననే సమీపమున నుండగలను. మూడుకోట్లన్నర పుణ్యతీర్థములు పవిత్రతనార్జించుకొనుటకై నా సన్నిధికి రాగలవు. అట్టి సందర్భమును కనిపెట్టి వాట్లను తమపాపమోక్షార్థమై నీతీర్థమందు స్నానముచేసి తమ తమ పాపములను పోగొట్టుకొని పునీతలగునట్లాదేశించెను. ధనుర్మాస శుక్లపక్షద్వాదశీ శుభదినమందు నీతీర్థములయందు స్నానము చేసిన భూమండలమందలి పుణ్యతీర్థములన్నియు నీకు దాస్యత్వమునంది నిన్ను తీర్థాధిరాజ్యమునం దభిషేకము చేయగలవు — అని భగవానుడు సరస్వతీనదికి వరమిచ్చి, అట్లే స్వామితీర్థమునకు దక్షిణభాగమున విజయముచేసి అచ్చట నివాసమేర్పరచికొనెను.

దేవస్య పాచికా కాచిత్ నామ్నా వకుళమాలికా
ప్రసాద్య దేవం పాకేన శ్రియాసంచోదితాద్విభోః ॥ ౩౨
తీర్థభూమ్యాధిపత్యం చ లేభే వరమనుత్తమమ్
తత్రైవ వాసం దేవస్య యయాచే సా పునర్హరిమ్ ॥ ౩౩
వాణీదేవీ తీర్థరూపా భూమిరూపా చ పాచికా
భోగపత్న్యౌ జలనిధేః కృష్ణవేణ్యా చ యా సమా
ఇతి సర్వం సమాఖ్యాతం దేవసాన్నిధ్యకారణమ్ ॥ ౩౪

ఇతి శ్రీ బ్రహ్మపురాణే శ్రీ వేంకటాచలమాహాత్మ్యే భగవతః స్వామిపుష్కరిణీతీర్థతీరైకవాసనిమిత్తకథనం నామ ద్వితీయోఽధ్యాయః.

తా॥ ఇంకొక విశేషము. శ్రీవేంకటాద్రియందు శ్రీనివాసప్రభువునకు పాకకైంకర్యమునుజేసి పరిచర్యచేయగా శ్రీమహాలక్ష్మియొక్క పురుషకారముచే అనుగ్రహించిన భగవానుడు సంతసించి, వకులమాలికకు పుణ్యతీర్థముల కాకరములగు భూముల కాధిపత్యపరము నిచ్చెను అట్లు వరలాభము నొందిన వకుళమాలికయు భగవత్సాన్నిధ్యముననే ఉండుటనుకూడ కాంక్షించి, అక్కడే అచ్చటనే యుండెను. కాగా త్రిపథగామిని యగు గంగానది, సాగరరాజుని భోగపత్నియగు యమునతో కలసిన గొప్పదనమును అనుభవించినట్లు, తీర్థ భూములలో అధిరాజస్థానమును వహించిన వకుళమాలికకు, సరస్వతీనదితో అంతరంగసంబంధము ననుభవించుట యను నది, సరస్వతీనదియొక్క మహిమ గంగానదీమహిమకు కొరవుపడనిదైనట్లు సంగతమగుచున్నది. ఈ వృత్తాంతముచే స్వామిపుష్కరిణీ తీరమందే భగవానుడు సాన్నిధ్యము చెందుటకు నిమిత్తము వ్యక్తమగుచున్నది.

ఇది శ్రీ బ్రహ్మాండపురాణమున శ్రీవేంకటాచలమాహాత్మ్యము నందు భగవానుడు శ్రీస్వామిపుష్కరిణీతీరముననే నివసించుటకు గల కథను తెలియ బరచునట్టి రెండవ అధ్యాయము

---

## మూడవ అధ్యాయము

—: వాయుదేవునకు భగవద్దత్తమగు విలక్షణశక్తిమత్త్వవరము :—

దిలీపుడు అడుగుచున్నాడు —

దేవర్షినరసంఘేషు శైలస్యాస్య ప్రథా కథమ్
దేవేన కేన దేవేషు మునిష్వపి చ కేన వా
నృణాం కేన నరేణాత్ర బ్రూహి విస్తరతః క్రమాత్ ॥ ౧

తా॥ ఓ మునీశ్వరా ! దేవతలలోను, ఋషులలోను, మనుష్యులలోను యెవ్వరెవ్వరిచే యెప్పుడెప్పుడు ఈపర్వతమునకు ప్రసిద్ధికలిగినదో వినగోరెదను. ఆ వివరమును చెప్పుడు.

దూర్వాసుడు చెప్పుచున్నాడు —

పురా వాయుర్మహాతేజాః విష్ణోరమితతేజసః
ప్రధానాంగత్వమాకాంక్షణ్ తపస్తేపే నగోత్తమే ॥ ౨

దివ్యవర్షసహస్రాన్తే సహస్రభుజకన్ధరః
ఆవిరాసీత్తదా తస్మై నీలామ్బుదసమప్రభః ॥ ౩

వరం ప్రాదాత్ప్రధానాఙ్గం భవేతి పురుషోత్తమః
అహమత్ర నివత్స్యామి వస త్వం చ మయా సహ ॥ ౪

తారకాసురవిధ్వంసజాతదోషాపనుత్తయే
కుమారధారికాతీర్థే స్కన్దోఽప్యత్ర తపస్యతి
ఇతి వాయుం సమాదిశ్య పశ్చాదన్తరధీయత ॥ ౫

తా॥ పూర్వమొకప్పుడు వాయుదేవుడు భగవానునుద్దేశించి శ్రీవేంకటాద్రి యందు తపస్సు చేసెను ఆతని యభిప్రాయము, సర్వప్రాణులకును స్వేతర దేహేంద్రియాది సకలోపకరణ సత్తా నిర్వాహకత్వలక్షణప్రాధాన్య విశిష్టప్రాణాఖ్యాంగ రూపత్వము తనకు కావలయుననుటయే ఇట్లు దివ్యవర్షసహస్రము తపముండిన వాయుదేవునకు భగవానుడు సాక్షాత్కృతుడై, యాతడు కోరిన "ప్రధానాంగత్వప్రాప్తి" యను వరమిచ్చెను మరియు భగవానుడు తానును అచ్చటనే నివసింపబోయెద ననియు. తనను (వాయుదేవునిని) అచ్చటనే ఉండు మనియు చెప్పెను మరియు తారకాసురవధజనిత బ్రహ్మహత్యాదోష నివృత్తికై కుమారస్వామి కుమారధారాతీర్థమునందు తపస్సు చేయగలడనియు చెప్పి భగవానుడంతర్హితుడాయెను.

మృడాద్యా వశగా యస్య సోఽపి బ్రహ్మా చతుర్ముఖః
శ్రీవేఙ్కటాచలే శ్రీశం వాయోరమితతేజసః ॥ ౬

తపః ఫలప్రదానార్థం సమాయాతం విదం స్తుతః
తత్తపోబలసామర్థ్యాత్ సదా సాన్నిధ్యమత్ర వై ॥ ౭

భవిష్యచ్చాపి విజ్ఞాయ తత్ర తేపే స్వయం తపః
తథాఽన్యే బ్రహ్మణాఽఽజ్ఞప్తాః తప స్తేపుఃసుదుష్కరమ్ ॥
స బ్రహ్మేశాః సురాః సర్వే సనకాద్యాశ్చ యోగినః
అగస్త్యాద్యాశ్చ మునయః శంఖాద్యాశ్చ నృపా స్తథా ॥ ౯
తథాఽన్యేపి సహస్రాక్షః ఆవిర్భూతం వృషాచలే
అప్రాకృతవిమానేన సార్ధమేవం శ్రియఃపతిమ్ ॥ ౧౦
ఇత్థం వాయుముఖా ద్దేవాః బ్రహ్మేశానముఖా అపి
భేజిరే చాపరే సిద్ధిం బహవః సిద్ధికాంక్షిణః
యతోఽత్ర తస్మాచ్ఛైలోఽయం ఖ్యాతో దేవేషు వాయునా ॥

తా॥ పరమశివుడాదిగాగల దేవతలకు ప్రభువగు చతుర్ముఖుడు సైతము వాయుదేవుని తపఃప్రభావమును, వాయుతపస్తుష్టుడగు భగవానునిసాన్నిధ్యమును యెదురుచూచి తనకును ఆ సమయము భగవత్సేవకు ఉచితము కాగలదని నమ్మి వేంకటాద్రియందు తపస్సు చేయ నారంభించెను అట్లే చతుర్ముఖునిచే యద్బోధింపబడి అనేకులచ్చట తపస్సు చేసిరి పరలు తలంచినట్లు తపస్సుచేసిన అందరకును "ఆనందనిలయ దివ్యవిమానము"న శ్రీనాథుని సాక్షాత్కారము లభించెను. ఇట్లు వాయుదేవుని తపస్సుమూలమున వేంకటాచలము దేవతలలో ప్రసిద్ధిజెందినది.

దిలీపుడు ప్రశ్నించుచున్నాడు —

భగవన్! అస్యశైలస్య కేనాభూన్మునిషు ప్రథా ॥ ౧౧

తా॥ ఓ మునిసత్తమా! ఆది సరి మహర్షులలో దీని కెట్లు వ్యాప్తి కలిగినది.

దూర్వాసుడు బదులు చెప్పుచున్నాడు —

దేవం ద్రష్టుం తప స్తేపే హ్యగస్త్యో మలయాచలే
తదా గత్వాఽవదద్బ్రహ్మ మునే వేఙ్కటమావ్రజ ॥ ౧౨
తత్ర తే భవితా సిద్ధిరిత్యుక్త్వాన్తర్దధే విభుః
సోఽపి శైలం సమాసాద్య తప స్తేపే సుదశ్చరమ్ ॥ ౧౩

తతో వర్షసహస్రాన్తే తమేవాహ శరీరవాక్
'అష్టోత్తర సహస్రాణి సన్తితీర్థాని చాత్ర వై ॥ ౧౪
స్నాత్వా తీర్థేషు సర్వేషు లోకేఖ్యాపయ తాని చ
నాన్యత్తపో ద్విజాతీనాం ఋతే శాస్త్రోపదేశతః ॥ ౧౫

తా ॥ ఒకప్పుడు అగస్త్యుడు మలయపర్వతమునందు తపస్సు చేయుచుండగా చతుర్ముఖుడచ్చటికివెళ్ళి 'ఓ మునీంద్రా! నీవు వేంకటాద్రికి పొమ్ము. నీ తపస్సు అక్కడనే సిద్ధించును' అని చెప్పి అంతర్హితుడాయెను. అగస్త్యుడట్లే చేయుచుండగా వేయి సంవత్సరములు గతించిన వెనుక ఒకప్పుడు ఆకాశవాణి ఇట్లని ఆయననుద్దేశించి చెప్పెను. 'ఓ మునీంద్రా! ఈపర్వతమందు వేయిన్నియెనిమిది పుణ్యతీర్థములు కలవు. వాట్లలో అన్నిటియందును నీవు స్నానముచేసి ఆతీర్థముల మహత్త్వమును నీవు లోకమునకు తెలియపరచుము. ఇంతకుమించిన ఫలము నీతపస్సువలన సిద్ధించదు.

కిం కాయక్లేశధర్మేణ కాసిద్ధిర్భవితా ద్విజ!
ఉక్తం మాధ్యందినే మన్త్రే మాహాత్మ్యం భూధరస్య చ ॥ ౧౬
వదం స్త్వమన్తే వాసిభ్యో గిరేః కురు ప్రదక్షిణమ్
ఏవం తే భవితా తత్ర కృతే షష్ఠే ప్రదక్షిణే ॥ ౧౭
బ్రహ్మణో దర్శనం మధ్యే రౌద్రే దేవాదిదర్శనమ్
దేవేం ద్రదర్శనం పూర్వే హ్యాగ్నేయే చ హావిర్భుజః ॥ ౧౮
దక్షిణే చర్షిసంఘానాం సరుద్రాణాం భవేద్ధ్రువమ్
యక్షరక్షఃపిశాచానాం నైరృత్యే దర్శనం భవేత్ ॥ ౧౯
విష్వక్సేనఋషేః పశ్చాద్వాయవ్యే గిరిదర్శనమ్
ఉత్తరే భగవద్యోగిగణదర్శనమేవ చ ॥ ౨౦
మాహాత్మ్య జ్ఞానపూర్వం తు స్వామిపుష్కరిణీతటే
ధ్యానయోగం సమాసాద్య తతో జ్ఞాస్యసి తం విభుమ్ ॥ ౨౧

ఏతావదుక్త్వా విరరామవాణీ
మాహాత్మ్యయోగం స తతో విమృణ్వన్ ।
ప్రదక్షిణం తస్య గిరేశ్చ కృత్వా
ధ్యానాద్విభుం వీక్ష్య పరాఙ్గతిం యయౌ ॥ ౨౨

తతోఽగస్త్యేన మునినా శైలోఽయం ప్రథితోఽభవత్ ॥ ౨౩

తా॥ ఓ ద్విజవర్యా ! తపస్సు అని నమ్మి కాయక్లేశమునేల పొందెదవు. మాధ్యందినక్రతువు కంగముగ చోదితమగు మంత్రమున వేంకటాద్రి మహిమ చెప్పబడుటను ఎరుగవా ! చక్కగా శిష్యులకు అధ్యయనమునుచెప్పుచు వారలతో చేరి గిరిప్రదక్షిణమును చేయుము. ఇట్లు ప్రదక్షిణము చేయగా, ఆరవసారి ప్రదక్షిణమున మధ్యభాగమున చతుర్ముఖునియొక్కయు ఈశాన్యదిశను దేవతల యొక్కయు, పూర్వదిశను ఇంద్రునియొక్కయు, ఆగ్నేయదిశను అగ్నియొక్కయు, దక్షిణదిశను రుద్రులతోకూడిన ఋషిసంఘముల యొక్కయు, నైరృతిదిక్కున యక్షరక్షఃపిశాచముల యొక్కయు, పశ్చిమదిశను విష్వక్సేనుని యొక్కయు, వాయవ్యదిశను పర్వతరాజు యొక్కయు, ఉత్తరదిశను భగవద్యోగిగణముల యొక్కయు దర్శనము లభించును. ఆవల స్వామిపుష్కరిణీమాహాత్మ్యమును మనసున ధ్యానించుచు ఆ పుష్కరిణియందు స్నానము జేసితివేని భగవత్స్వరూపము నెరుగగలవు ఈయంశములను ఆకాశవాణివలన తెలిసికొనిన అగస్త్యుడు అట్లు స్వామిపుష్కరిణీ పుణ్యజలములందు తీర్థమాడి భగవానుని సేవజేసికొని ముక్తినందెను. ఆతరువాత అగస్త్యుడు తన యనుభవమును ఋషిలోకమున ప్రచారము జేసెను.

—: శంఖణచక్రవర్తికి శ్రీనివాసుడు ప్రత్యక్షమగుట :—

దిలీపుడు ప్రశ్నించుచున్నాడు —

మానుషేష్వస్య శైలస్య కేన జాతా ప్రథా భువి ॥ ౨౪

తా॥ ఓ మునిచంద్రమా ! మనుష్యులలో యెవ్వరిచేత ఈ పర్వతమాహాత్మ్యము ప్రచారము కావింపబడినది.

దూర్వాసుడు బదులు చెప్పుచున్నాడు —

పురా శంఖో మహాప్రాజ్ఞః సూర్యవంశోద్భవో విభుః
సాక్షాత్కృత్య మహావిష్ణుం యయాచే వరముత్తమమ్ ॥ ౨౫
యావచ్చంద్రశ్చ సూర్యశ్చ యావత్తిష్ఠతి మేదినీ
తావత్తిష్ఠతు మే సేవా కృతా విష్ణోర్మయా విభోః ॥ ౨౬
ఇతి సంచిన్త్య మనసా రాజ్యే పుత్రం నిధాయ వై
గత్వా వసిష్ఠం పప్రచ్ఛ యత్ర విష్ణుః ప్రసీదతి
తత్ క్షేత్రం బ్రూహి విప్రేన్ద్ర యత్ర ద్రక్ష్యామ్యహం విభుమ్ ॥

రా ॥ పూర్వ మొకప్పుడు సూర్యవంశమున బుట్టిన శంఖుడను రాజు భగవానుని సాక్షాత్కరించుకొని వరమును పొందెను. 'సూర్యచంద్రులు పృథివీ భాగము ఉండునంతకాలము, తాను భగవానున కాచరించెడి సేవ యనునది శాశ్వతముగ నిలచియుండవలయును ' అను ఆశ కలిగి, ఆతడు చిరకాలము రాజ్యముచేసిన తరువాత రాజ్యము కుమారునకిచ్చి వసిష్ఠమునికడకేగి తనకోరికె సఫలమగుట కే పుణ్యక్షేత్రమున తనకు భగవత్సాక్షాత్కారము లభించునో చెప్పు మని యడిగెను.

ఇతి పృష్టో మునిః ప్రాహ యత్రాగస్త్యో దిదృక్షయా
తపశ్చరతి ధర్మాత్మా తముద్దిశ్య మహామునిః ॥ ౨౮
భగవాన్ యత్ర సర్వాత్మా సాన్నిధ్యం చ కరిష్యతి
త్వం చ తం గచ్ఛ శేషాద్రిం పుణ్యం స్వర్ణముఖీతటే ॥ ౨౯
తత్ర బ్రహ్మశిలా కాచిత్ సరిన్మధ్యే చ వర్తతే
అగస్త్యతపసా పశ్చాద్దయాసాన్నిధ్య మత్ర వై ॥ ౩౦
పాదా ఈశాన విష్ణ్వాది దేవానాం తత్ర సన్తి హి
సువర్ణముఖరీ తత్ర కల్యయా సంగతా విభో ॥ ౩౧
తయోస్తు సంగమే రాజన్ యే కేచన నరా భువి
సంకల్ప్య విధివత్స్నాత్వా దేవర్షీనభితర్ప్య చ ॥ ౩౨

మధ్యే బ్రహ్మశిలాయస్తు పితౄనుద్దిశ్య భక్తితః
శ్రాద్ధతర్పణపిణ్డాదీన్ శ్రద్ధయా సహ వై విభో ॥ ౩౩
సమాచరన్తి రాజేన్ద్ర తేషాం సప్తకులావధి
గయాయాం పిణ్డదానేన యథా తృప్తా భవన్తి వై ॥ ౩౪
తథా తృప్యన్తి పితరః సత్యమేవ న సంశయః
తస్మిన్ దినేఽన్నం దద్యాచ్చ తామ్బూలం చన్దనాదికమ్ ॥ ౩౫
గోభూతిలహిరణ్యాది వస్త్రధాన్యాని సర్వశః
తత్ర దత్తో యథాశక్తి రేణుర్మేరోస్సమో భవేత్ ॥ ౩౬
త్వం చాపి తత్ర రాజేన్ద్ర మహానద్యోః సమాగమే
స్నానం దానక్రియాదీని శ్రాద్ధపిండాంస్తిలోదకమ్ ॥ ౩౭
కృత్వా సర్వాణి కర్మాణి ధ్యానయోగం సమాస్థితః
వాసుదేవే మనః కృత్వా తపః కురు వృషాచలే ॥ ౩౮

తా॥ ఇట్లని శంఖునిచే యడుగనడిన దుర్వాసుడిట్లని చెప్పెను. 'ఓరాజా! శేషాద్రియందు భగవత్సాన్నిధ్యమును కోరి అగస్త్యుడు తపమాచరించుచున్నాడు. భగవానుడు సాక్షాత్కరించును. నీవును శేషాచలమునకు పొమ్ము. భగవానుడు ఆవిర్భవించును. అచ్చట సువర్ణముఖీమధ్యమున 'బ్రహ్మశిల' యను నొక శిల కలదు. ఆ శిలయందు అగస్త్యుని తపఃప్రభావము వలన గయా సాన్నిధ్యము కలుగును. అందు విష్ణు, ఈశానుడు మొదలగు దేవతల పాదన్యాసచిత్రములు (గయాశీర్షమునందు వలె) చిహ్నితములై యుండును. అచ్చటనే 'కల్యాణీ'నది సువర్ణముఖీనదితో కలియును. ఈనదీసంగమమున సంకల్పముజేసి యథావిధిగ స్నానము దేవర్షిపితృతర్పణము మొదలగు ఆహ్నికక్రియలను బ్రహ్మశిల యందు పితృదేవతలకై శ్రాద్ధతర్పణ పిండదానాదులను ఆచరించెడివారలకు ముందువెనుక యేడుతరముల పితరులు తృప్తిజెందుదురు. ఈ స్థలము గయా తుల్యఫలదము. పితరుల నారాధించి అన్నదానము, చందనము, తాంబూలము గవాది దశ షోడశమహాదానములు చేయదగినవి. ఇచ్చట చేసిన దానము అణు మాత్రమైనను మేరువు వలె వృద్ధియగును. నీవును అచ్చట స్నానదానాదుల జేసికొని భగవదేకాంతచిత్తతతో తపమాచరించికొనుము.

తదా కాలాన్తరేఽగస్త్యః సశిష్యః సంగమిష్యతి
మునినోక్తం చ మహాత్మ్యం శృణ్వన్ కుర్వన్ ప్రదక్షిణమ్ ॥
సాకం తేన సమాధిస్థః సాక్షాత్పశ్యసి తం విభుమ్
త్వయాఽపి సంస్తుతో దేవః తవాభీష్టం ప్రయచ్ఛతి ॥ ౪౧

తా॥ ఇట్లు చేయుచుండగా కొంతకాలమునకు నీకు శిష్యపరివృతుడగు అగస్త్యుని పరిచయము లభించును, పరిచితుడగు ఆ మునివలన వేంకటాద్రి మహాత్మ్యమును వినగలవు క్రమముగా అగస్త్యునితోపాటు నీకును భగవత్సాక్షాత్కారము కలుగును. నీ యభీష్టము నాతడు ప్రసాదించును.

గురుణా చోదితస్త్వేవం స గత్వా తం వృషాచలమ్
తత్క్రమేణ తపస్తప్త్వా మునినా తేన సంగతః ॥ ౪౨
ఆవిర్భూతం హరిం దృష్ట్వా యయాచే వరముత్తమమ్
యావచ్చన్ద్రశ్చ సూర్యశ్చ యావత్తిష్ఠతి మేదినీ ॥ ౪౩
తావన్మయా కృతా సేవా శైలేంద్రే తవ సంభవేత్
ఇత్యుక్తో భగవాన్ ప్రాహ శృణు భూప! వచో మమ ॥ ౪౪

తా॥ ఈ మాటలను శంఖుడు భక్తిశ్రద్ధలతో విని శేషాద్రికేగి ఉక్తప్రకారము తపమాచరించగా సాక్షాత్కరించిన భగవానునిజూచి తాను పూర్వముకోరిన వరమును ప్రార్థింపగా భగవానుడిట్లనెను.

అర్చావిగ్రహరూపోఽహం సచ్చిదానంద విగ్రహః
స్వయంవ్యక్తప్రదేశేషు దృశ్యో బ్రహ్మాదియోగినామ్ ॥ ౪౫
తామేవ ప్రతిమాం కేచి జ్జానన్తి నృపపుంగవ!
తథాత్వే నాపి వా యోగ్యం దర్శనం మే కలౌయుగే ॥ ౪౬
యుగేష్వపి చ సర్వేషు దుర్దర్శం యత్తు పాపినామ్
తద్రూపస్య పిధానాయ సాదృశ్యధ్యానహేతవే ॥ ౪౭
విమానం చ శిలాదారులోహేష్టకచితం కురు
ప్రతిమాం చ శిలారూపాం తాం పశ్యన్తి కుయోగినః ॥ ౪౮

రూపద్వయం ప్రపశ్యన్తి జ్ఞానినో బ్రహ్మవిత్తమాః
భానుమాన్ భానుసంఘైస్తు రసగ్రాహీ యథాభువః ॥ ౪౯
సాక్షాత్పూజాశ్రయో నిత్యమహం బింబాన్తరేణ చ
యథా దృష్టం విమానం తే మద్రూపం పురుషర్షభ ! ॥ ౫౦
తథా కురు మహాభాగ! యేన తే భవితా గతిః
ఇత్యుక్త్వాఽన్తర్దధే దేవః సర్వేషామేవ పశ్యతామ్ ॥ ౫౧

తా॥ 'ఓ రాజా! సచ్చిదానంద విగ్రహుండనగు నేను అర్చా విగ్రహశరీరముతో స్వయంవ్యక్తాది దివ్యక్షేత్రములందు సాన్నిధ్యము జెందుదును. ఆ స్వరూపమును బ్రహ్మజ్ఞులు యోగిపుంగవులు మాత్రమే అనుభవింతురు. ఆ స్వరూపమును కేవల ప్రతిమనుగా కొందరు తలంతురు, అంతమాత్రమునసే కలియుగమున మనుష్యులనుభవించుట మంచిదే. ఏకాలమందుగాని దుర్దర్శమగు నా స్వరూపమును నేను సుదర్శముచేయుట యుక్తమని తలచుచున్నాను. అందుకనుకూలముగ నీవు నా దివ్యమంగళ విగ్రహమును శ్రీ వైకుంఠముననుండు దానివలె పామరులకును ధ్యాన హేతువుగ దృష్టికి విషయమగునట్లు శిలతో నిర్మింపజేసి ఆ విగ్రహము నుపశీతముగనుండుటకు ఆలయమును కట్టించి ప్రతిష్ఠించుము. నా జన్మరహస్యము నెరుగనివారు బింబమును కేవల శిలామాత్రమని ఉదాసీనులు కావచ్చును. జ్ఞానులగువారు నాకుగల రూపద్వయమును ఆరాధింతురు. సూర్యుడు తన కిరణములచే భూమియందలి ఉదకములనుండి సారము గ్రహించును. అట్లే నేను నిష్కలస్వరూపియైనను దివ్యమంగళవిగ్రహరూపమున భక్తుల పూజలను స్వీకరించి ఫలము నిత్తును. ఇప్పుడు నీకు నేను కలుగజేసిన సాక్షాత్కారమును అదే రీతిని విమానమును విగ్రహమును నిర్మించి ప్రతిష్ఠించి ఆరాధింపుము నీవు కోరినఫలము చేకూరును' అని యాదేశించి భగవాను డంతర్ధానముజెందెను.

తేనోక్తమార్గేణ విధాయ పుణ్యం
విమానవర్యం ప్రతిమాం చ పుణ్యామ్ ।
ప్రఖ్యాప్య శంభో నరలోకసంఘే
జగామ విష్ణోః పదమవ్యయం శుభమ్ ॥ ౫౨

ఇతి శ్రీబ్రహ్మపురాణే శ్రీవేంకటాచలమాహాత్మ్యే శంఖనృపాది
తపస్తుష్ట భగవదావిర్భావాదివర్ణనంనామ తృతీయోఽధ్యాయః

తా॥ భగవాను డాదేశించిన తీరుననే శంఖనృపతి శ్రీశ్రీనివాసుని దివ్య మంగళ విగ్రహమును, ఆనందనిలయ దివ్యవిమానమును నిర్మింపజేసి ప్రతిష్ఠ గావించి కలియుగమందు మనుష్యులలో భగవద్విఖ్యాతిని మహిమను ప్రచారము జేసి నీ మహోపకారమాచరించి శాశ్వత శ్రీవైకుంఠలోక సుఖమునసుభవింప బోయెను.

ఇది శ్రీబ్రహ్మపురాణమున శ్రీవేంకటాచల మాహాత్మ్యమునందు శంఖు డాదిగాగల వారల తపస్సుచే ప్రీతుడగు భగవానుని ఆవిర్భావవర్ణన కథనమునది మూడవ అధ్యాయము.

## నాల్గవ అధ్యాయము

—: ముక్తిదములగు 'స్వామి పుష్కరిణి' మొదలగు సప్తతీర్థములు. :—

(దిలీపుడు ప్రశ్నించుచున్నాడు)

అస్మిన్ నగోత్తమే పుణ్యే కతి తీర్థాని సంతి వై
తేషాం సఙ్ఖ్యాం చ మే బ్రూహి కతి ముఖ్యాని తత్ర వై ॥ ౧

తత్రాప్యత్యంతముఖ్యాని వద మే మునిసత్తమ !
సద్ధర్మరతిదాన్యత్ర కతి సఙ్ఖ్యాన్వితాని చ ॥ ౨

కతి చ జ్ఞానదాన్యత్ర భక్తివైరాగ్యదాని చ ।
ముక్తిప్రదాని కాన్యత్ర తాని మే వద సువ్రత ! ॥ ౩

తా॥ ఓ మునిసత్తమా! శేషాచలమందు ఎన్ని పుణ్యతీర్థములు కలవు అందు ప్రధానములైనవి యెవ్వి? అందును అత్యంత ప్రధానములు సద్ధర్మరతి నొసంగునవి యెవ్వి? జ్ఞానప్రదములుగాని భక్తి వైరాగ్యప్రదములుగాని ముక్తి ప్రదములుగాని యే కోటిలోచేరినవి యెన్ని చెప్పుము,

(దూర్వాసుడు బదులు చెప్పుచున్నాడు)

షట్షష్టికోటితీర్థాని పుణ్యా న్యత్ర నగోత్తమే
అష్టోత్తర సహస్రం తు తేషు ముఖ్యాని సువ్రత ! ॥ ४

తీర్థాని సమ్మతానీహ సద్ధర్మరతిదాని వై
అష్టోత్తరసహస్రా చ్చ ముఖ్యతీర్థాని వై తతః ॥ ౫

సద్విజ్ఞానప్రదా న్యత్ర తీర్థాన్యష్టోత్తరం శతమ్
తస్మా చ్చాష్టోత్తరశతా న్ముఖ్యతీర్థాని భూపతే ।
భక్తివైరాగ్యదాన్యత్ర షష్టి మష్టోత్తరాం విదుః ॥ ౬

తా॥ ఓ రాజా ! ఈ పర్వతమందు అరువదిమూడుకోట్ల పుణ్యతీర్థములు కలవు. అందు వేయిన్నియెనిమిది ముఖ్యము లనవచ్చును. ఇయ్యవి సద్ధర్మ రతిప్రదములు, అందును సద్విజ్ఞానప్రదములగునట్టివి నూటయెనిమిదికలవు అందును భక్తివైరాగ్యప్రదములనునవి అరువదియెనిమిదని చెప్పబడినవి

ముక్తిదాన్యత్ర సప్తైవ ముక్తిదాసత్ర తే బ్రువే
స్వామిపుష్కరిణీ చైవ వియద్గఙ్గా తతః పరమ్ ॥ ౭

పశ్చా త్పాపవినాశం చ పాండుతీర్థం తతఃపరమ్
కుమారధారికాతీర్థ తుంబో స్తీర్థం తతఃపరమ్ ॥ ౮

కృష్ణతీర్థ మితి ఖ్యాతం సర్వపాపహరం శుభమ్
తత్ర స్నాంతి చ యే మర్త్యా స్తే యాంతి పరమంపదమ్॥ ౯

వర్షేవర్షే చ తీర్థానాం సప్తానాం పర్వతోత్తమే
తిథినక్షత్రయోగేన సర్వతీర్థసమాగమః
తం చ కాలం ప్రవక్ష్యామి సమాహితమనా భవ ॥ ౧౦

తా॥ అందును కేవల ముక్తిదములగునవి సప్తతీర్థములని చెప్పుదురు అయ్యవి శ్రీస్వామిపుష్కరిణి. ఆకాశగంగ. పాపనాశనము. పాండవతీర్థము. కుమారధార, తుంబురుతీర్థము. కృష్ణతీర్థమనునని. ఈ చెప్పబడిన సప్తతీర్థ

ములందు స్నానమాచరించిన వారలకు మోక్షసిద్ధికలుగును. ఆ యేడుతీర్థము లందును ఆయా తిథినక్షత్రయోగము కలిగిన పుణ్యకాలములందు భూంతావని యంచలి సమస్తపుణ్యతీర్థములు ఆయాతీర్థములలోనికివచ్చి చేరును. ఆ పుణ్య కాలమును చెప్పెదను వినుము.

మకరస్థే రవౌ రాజన్ పౌర్ణమాస్యాం మహాతిథౌ
పుష్యనక్షత్రయుక్తాయాం స్నానకాలో విధీయతే ॥ ౧౧

తద్దినే స్నాతి యో మర్త్యః కృష్ణతీర్థే మహామతిః
సర్వపాపవినిర్ముక్తః స్సర్వకామాన్ లభేత సః ॥ ౧౨

కుమ్భమాసే పౌర్ణమాస్యాం మఘాయోగో యదా భవేత్
కుమారధారికాం యాంతి సర్వతీర్థాని వై తదా ॥ ౧౩

తత్రయః స్నాతి రాజేంద్ర రాజసూయఫలం లభేత్
పుత్రో విజాయతే తస్య తస్మిన్నేవ హి జన్మని ॥ ౧౪

ముక్తిశ్చ భవితా తత్ర నాత్ర కార్యా విచారణా
కుమారధారికాయాం చ సార్ధం దక్షిణయా విభో ! ॥ ౧౫

అన్నదానం చ కర్తవ్యం పితౄ నుద్దిశ్య యత్నతః
యుక్తే చోత్తరఫల్గున్యా శుక్లపక్షీయపర్వణి ॥ ౧౬

తుమ్బాస్తీర్థం మీనసంస్థే రవౌ తీర్థాని సర్వశః
అపరాహ్ణే సమాయాంతి తత్ర స్నాత్వా న జాయతే॥ ౧౭

వివాహమౌఞ్జీబంధౌ చ కారయే ద్ద్రివ్యదానతః
మేషసంక్రమణే భానౌ సంయుతాయాం తు చిత్రయా ॥ ౧౮

పౌర్ణమాస్యాం సమాయంతి వియద్గఙ్గాం తథైవ చ
తత్ర స్నాత్వా నరస్సద్య శ్శతక్రతుఫలం లభేత్ ॥ ౧౯

సువర్ణదానం కర్తవ్యం కన్యాదానం విశేషతః
వృషభస్థే రవౌ రాజన్ ! ద్వాదశ్యాం రవివాసరే ॥ ౨౦

శుక్లే వాప్యథవా కృష్ణే భౌమస్యా పి చ వాసరే
పాండుతీర్థం సమాయాంతి గఙ్గాదీని జగత్త్రయే ॥ ౨౧

తత్ర స్నాత్వా చ గాం దత్వా ముచ్యతే ప్రతిబంధకాత్
కాలస్తు సంగవస్తత్ర ఋషిభిః పరికీర్తితః ॥ ౨౨

ఆశ్వినే శుక్లపక్షే తు భానువారేణ సప్తమీ
యోత్తరాషాఢయా యుక్తా తస్యాం పాపవినాశనే ॥ ౨౩

ప్రాప్తాయా ముత్తరాభాద్రాం ద్వాదశ్యాం వా సమాగమః
తదా పాపవినాశాఖ్యే స్నాతుర్ముక్తి ర్భవిష్యతి ॥ ౨౪

సాలగ్రామశిలాం దత్వా స్నాత్వా చ విధిపూర్వకమ్
ముచ్యతే సర్వపాపైశ్చ జన్మకోటిశతోద్భవైః ॥ ౨౫

తా॥ మకరమాసమున పుష్యనక్షత్రయుక్త పూర్ణిమనాడు కృష్ణతీర్థస్నానము ప్రశస్తము. ఈ స్నానముచే సర్వపాపవిమోచనము ఇష్టసిద్ధికలుగును కుంభమాసమున మఘానక్షత్రయుక్త పూర్ణిమనాడు కుమారధారాతీర్థ పుణ్యకాలము ఈ స్నానముచే రాజసూయయాగఫలము సిద్ధించును. పుత్రప్రాప్తియు ముక్తి లాభము తప్పక కలుగును. పితరుల నుద్దేశించి అన్నదానముచేయుట ముఖ్యము మీనమాసమున ఉత్తరఫల్గునీయుక్త పూర్ణిమనాడు అపరాహ్ణకాలము తుమ్బురుతీర్థ పుణ్యకాలము. ఈ స్నానముచే జన్మబంధము నశించును. పేదలకు వివాహము ఉపనయనము ఆదిగాగల శుభకార్యములను ధర్మముగా చేయించుట పుణ్యప్రదము. మేషమాసమున చిత్రానక్షత్రయుక్త పూర్ణిమనాడు ఆకాశగంగాస్నానమునకు పుణ్యకాలము. ఈ స్నానముచే సద్యః శతక్రతువులాచరించిన ఫలము కలుగును. సువర్ణదానము, కన్యకాదానము ముఖ్యము. వృషభమాసమున శుక్లపక్షమందుగాని, కృష్ణపక్షమందుగాని, ఆదివారముతోగాని, మంగళవారముతోగాని కూడిన ద్వాదశి తిథియందుగాని ఆకాశగంగకు పుణ్యకాలము అప్పుడందు స్నానముచేసి గోదానముచేసినచో సకల ప్రతిబంధ నివృత్తియగును. ఈ స్నానమునకు ఉక్తమైనది సంగవకాలము. ఆశ్వయుజమాస శుక్లపక్షమున ఉత్తరాషాఢాయుత సప్తమీ భానువారముగాని, అదేమాసపక్షమున ఉత్తరాభాద్రా

యుత ద్వాదశినాడుగాని పాపవినాశనతీర్థ పుణ్యకాలము. ఈ స్నానము ముక్తి ప్రదము. సాలగ్రామ శిలాదానము సర్వపాపహరము.

ధనుర్మాసే సితే పక్షే ద్వాదశ్యా మరుణోదయే
ఆయాంతి సర్వతీర్థాని స్వామిపుష్కరిణీజలే ॥ ౨౬

తత్ర స్నాత్వా నరస్సద్యో ముక్తిమేతి న సంశయః
యేన జన్మసహస్రేషు పుణ్య మేవార్జితం పురా ॥ ౨౭

తస్య స్నానం తత్ర భవేన్నాన్యస్యాఽసుకృతాత్మనః
తత్ర స్నానం సకృద్యస్య జన్మకోటిశతేషు సః ॥ ౨౮

గఙ్గాదిసర్వతీర్థేషు స్నాతో భవతి మానవః
విభవానుగుణం దానం కార్యం తత్ర యథావిధి ॥ ౨౯

సాలగ్రామశిలాం చా న్నం గాం చ దద్యాద్విశేషతః
భూమిం దద్యా త్ప్రియత్నేన బ్రహ్మలోకజిగీషయా ॥ ౩౦

పితౄ నుద్దిశ్య దాతవ్యం శ్రాద్ధాద్యం తత్క్షణేన వై ।
అరుణోదయ మారభ్య తత్ర షడ్ఘటికావధి
సంగమ స్సర్వతీర్థానాం తత్ర పుణ్య మనంతకమ్ ॥ ౩౧

ఇతి శ్రీబ్రహ్మపురాణే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే ముక్తిప్రద
స్వామిపుష్కరిణ్యాది సప్తతీర్థమహిమానువర్ణనంనామ చతుర్థోఽధ్యాయః.

తా॥ ధనుర్మాసమున శుక్లపక్షద్వాదశినాడు అరుణోదయకాలము శ్రీస్వామి తీర్థ ముక్కోటి పుణ్యకాలము ఈ స్నానము సద్యోముక్తిప్రదము. ఏ మానవుడు ముందుగతించిన అనేకజన్మములలో (పాపమునుదానినెరుగక) పుణ్యమును మాత్రమే చేసెనో, అట్టి సుకృత సంపన్నునకే భగవదనుగ్రహమువలన ఈ పుణ్యతీర్థస్నానము లభించును. ఈ స్నానమువలన గంగాదులగు మూడుకోట్ల పుణ్యతీర్థస్నానమువలన కలిగెడి ఫలముసిద్ధించును. తనశక్తి వంచనలేక చేతనైనదానములు చేయదగినది. సాలగ్రామదానము, అన్నదానము, గోదానము,

భూదానముచేయుట ముఖ్యము, పితృశ్రాద్ధముచేయవగినది. అరుణోదయమారంభించి ఆరుఘడియల కాలమునందు బ్రహ్మాండమందలి సకల పుణ్యతీర్థములును శ్రీ స్వామిపుష్కరిణియందు తమ తమ పాపవిమోచనమునకై వచ్చి స్నానమాచరించుచున్నవి. ఈ శుభసమయము అనన్తమగు పుణ్యమునిచ్చుచున్నది

ఇది శ్రీబ్రహ్మపురాణమున శ్రీవేంకటాచల మాహాత్మ్యమునందు ముక్తిప్రదములగు శ్రీస్వామిపుష్కరిణీ మొదలగు సప్తపుణ్యతీర్థముల మహిమాను వర్ణనమను నాల్గవఅధ్యాయము.

---

# ఐదవ అధ్యాయము

—: శ్రీవేంకటాద్రియందలి అరువది యెనిమిది తీర్థముల మహిమ కథనము :—

(దిలీపుడు ప్రశ్నించుచున్నాడు)

భక్తివైరాగ్యదానాం చ తీర్థానాం నామవైభవమ్
శ్రోతు మిచ్ఛామి చాత్రేయ! ప్రాప్తానాం చాష్టషష్టితామ్ ॥ ౧

తా॥ ఓ మునిచంద్రమా! శ్రీశేషాచలమందు భక్తివైరాగ్యప్రదములని చెప్పబడిన అరువదియెనిమిది పుణ్యతీర్థముల పేరులను వినగోరెదను.

(దూర్వాసుడు బదులుచెప్పుచున్నాడు)

భక్తివైరాగ్యదం పుణ్యం సద్యః పాపవిమోచనమ్
తీర్థానామష్టషష్టేస్తు తవ వక్ష్యామి వైభవమ్ ॥ ౨
తీర్థానాం చాత్ర పుణ్యానాం నామసంకీర్తనాన్నృణామ్
సద్య ఏవ మహాపాపకోటీనాం చ క్షయో భవేత్ ॥ ౩
కిము స్నానాదిసత్కర్మ నిరతానాం మహాత్మనామ్
తాని క్రమేణ వక్ష్యామి సమాహితమనా భవ ॥ ౪

తా॥ ఓ దిలీపరాజసత్తమా! సద్యఃపాపవిమోచనములును భక్తివైరాగ్యదములనగు అరువదియెనిమిది పుణ్యతీర్థముల మహిమను వినుము. ఈతీర్థముల నామోచ్చారణముచేతనే మహాపాపముల దోషము నశించును. స్నానఫలము ఎంతటిదని చెప్పవచ్చును?

దేవస్య పూర్వదిగ్భాగే తత్రైవాగ్నేయకోణకే ।
[1]చక్రతీర్థమితి ఖ్యాతం చక్రేణాధిష్ఠితం పురా ॥ ౫

తస్యోపరి తథా ఖ్యాతం [2]వజ్రతీర్థం మనోహరమ్ ।
[3]వైష్వక్సేనం తథా తీర్థం శక్రపాపహరం పరమ్ ॥ ౬

తతః [4]పాంచాయుధం తీర్థం తన్మధ్యే చ [5]హలాయుధమ్ ।
తత ఐశాన్యభాగే తు [6]నారసింహం మనోహరమ్ ॥ ౭

తతః [7]కాశ్యపతీర్థం చ [8]మాన్మదం తు తతః పరమ్ ।
[9]బ్రహ్మతీర్థం [10]చా గ్నితీర్థం [11]గౌతమం తు తతః పరమ్ ॥ ౮

[12]దైవతీర్థం [13]దేవలం చ [14]వైశ్వామిత్రమతః పరమ్ ।
[15]భార్గవం తు తథా తీర్థ[16]మాష్టావక్రమతః పరమ్ ॥ ౯

[17]దురారోహణ తీర్థం తదాగ్నేయ్యామ_స్తి వై దిశి ।
ఐశాన్యాం [18]భైరవం తీర్థం పిశాచానాం విమోచనమ్ ॥ ౧౦

[19]మేహతీర్థమితి ఖ్యాతముదరవ్యాధినాశనమ్ ।
క్షేత్రపాలశిలాపార్శ్వే పశ్చిమే [20]పాణ్డవం తథా ॥ ౧౧

[21]వాయుతీర్థం తథా పుణ్యం సేవితం భూరి వాయునా ।
[22]అస్థితీర్థం మహాపుణ్యం మృతాస్థిక్షేపణా దిహ ॥ ౧౨

పూర్వదేహసమాయుక్తాః పునర్జీవంతి జంతవః ।
[23]మార్కణ్డేయం తథా తీర్థం స్నానాదాయుష్యవర్ధనమ్ ॥ ౧౩

తథా[24]జాబాలితీర్థం చ [25]వాలఖిల్యమతఃపరమ్ ।
తతో [26]జ్వరహరం తీర్థం సర్వజ్వరనివారణమ్ ॥ ౧౪

తతో [27]విషహరం తీర్థమా_స్తికేన వినిర్మితమ్ ।
తక్షకేనాపి సంతష్టస్స్నానే నైవేహ నిర్విషః ॥ ౧౫

తా॥ భగవదాలయమునకు తూర్పు భాగమున అగ్ని దిశను సుదర్శన దేవునిచే యధిష్ఠింపబడిన చక్రతీర్థము (1) దానిపై మనోహరమగు వజ్ర

తీర్థము (2) శక్రపాపహరమగు విష్వక్సేనతీర్థము (3) ఆపై పంచాయుధ తీర్థము (4) హలాయుధతీర్థము (5) దానికి ఈశాన్యదిశను నారసింహతీర్థము (6) కాశ్యపతీర్థము (7) మన్మధతీర్థము (8) బ్రహ్మతీర్థము (9) అగ్నితీర్థము (10) గౌతమతీర్థము (11) దైవతీర్థము (12) దేవలతీర్థము (13) విశ్వామిత్రతీర్థము (14) భార్గవతీర్థము (15) ఉష్టావక్రతీర్థము (16) ఆగ్నేయ దిశను దురారోహణతీర్థము ననునవి కలవు ఈశాన్యదిశను పిశాచబాధా మోచనముచేయగల భైరవతీర్థము (18) ఉపరవ్యాధులను హరింపజేయగల మేహతీర్థము (19) క్షేత్రపాల పార్శ్వమున పాండవతీర్థము (20) వాయుదేవునిచే సేవింపబడెడి వాయుతీర్థము (21) అస్థితీర్థము కలవు మృతప్రాణి యొక్క యెముకలనుదెచ్చి ఈ అస్థితీర్థమందుంచిన యెడల ఆప్రాణి మృతి జెందిన పూర్వశరీరముతో మరల బ్రతికివచ్చును స్నాన మాత్రమున నాయుస్సును వృద్ధిజేయగల మార్కండేయతీర్థము (23) జాబాలితీర్థము (24) వాలఖిల్యతీర్థము (25) సర్వజ్వరహరమగు జ్వరహరతీర్థము (26) విషహర తీర్థము (27) కలవు విషహరతీర్థము ఆస్తికునిచే నిర్మింపబడినది మహా విషసర్పమగు తక్షకునిచే కరవబడిన విషముకూడ ఈ తీర్థస్నానమహిమచే తొలగును.

[28]లక్ష్మీతీర్థం తతః పశ్చాత్పూర్వస్యాం దిశి సంస్థితమ్ ।
వాయవ్యాం దిశి తీర్థాని చోత్తరస్యాం తథైవ చ ॥ ౧౬

[29]ఋషితీర్థం మహాపుణ్యం [30]శతానందం సుతీక్ష్ణకమ్ ।
[32]వైఖాణ్డకం మహాపుణ్యం [33]బిల్వతీర్థమతః పరమ్ ॥ ౧౭

అధస్తాద్విష్ణుతీర్థం[34] చ పుణ్యం మారుతినిర్మితమ్ ।
[35]శర్వతీర్థమితి ఖ్యాతం [36]శారభం తు తతః పరమ్ ॥ ౧౮

తతో వాయవ్యదేశే తు [37]బ్రహ్మతీర్థం మనోహరమ్ ।
అశ్వమేధేన యత్రేజే భగవంతం సనాతనమ్ ॥ ౧౯

అధస్తాదింద్రతీర్థం[38] తు [39]భారద్వాజమతః పరమ్ ।
తతస్త్వమ్బరగఙ్గాఖ్యం[40] తతః [41]ప్రాచేతసం తథా ॥ ౨౦

తతః [42]పాపవినాశం చ తీర్థం [43]సారస్వతం తథా ।
యత్ర పాపాని సర్వాణి క్షాళితాని చ సర్వశః ॥ ౨౧
తోయే చ శ్వేతతాం యాంతి జనానాం పాపకారిణామ్ ।
[44]కుమారధారికా నామ వాయవ్యాం దిశి వర్తతే ॥ ౨౨
అధస్తాద్గజతీర్థం[45] తు [46]ఋశ్యశృఙ్గ మతః పరమ్ ।
తతస్తుమ్బురుతీర్థం[47] చ నారదాద్యైశ్చ సేవితమ్ ॥ ౨౩
తన్మధ్యేఽష్టాదశం తీర్థం సర్వపాపవినాశనమ్ ।
[57]దశావతారతీర్థం చ [58]హాలాయుధ మతః పరమ్ ॥ ౨౪
తత స్సప్తర్షితీర్థం[65] చ [66]గజకోణమతః పరమ్ ।
[67]వైష్వక్సేనం తథా తీర్థం పశ్చిమే తు విరాజితమ్ ॥ ౨౫
పశ్చాద్యుద్ధసరస్తీర్థం[68] విష్వక్సేనజయావహమ్ ।
ఇతి ముఖ్యాని తీర్థాని మహాపాతకసంక్షయే ॥ ౨౬

ఇతి శ్రీబ్రహ్మపురాణే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే భక్తివైరాగ్య
ప్రదాష్టషష్టితీర్థనామవైభవకథనం నామ పఞ్చమోఽధ్యాయః.

---

తా॥ లక్ష్మీతీర్థము (28) తూర్పు దిశనున్నది వాయుదిశను, ఉత్తర దిశను ఈ దిగువచెప్పబడిన తీర్థములు కలవు ఋషితీర్థము (29) శతానంద తీర్థము (30) సుతీక్ష్ణతీర్థము (31) వైభాండకతీర్థము (32) బిల్వతీర్థము (33) విష్ణుతీర్థము (34) ఈ విష్ణుతీర్థము ఆంజనేయునిచే నిర్మింపబడినది శర్వతీర్థ ము (35) శరభతీర్థము (36) తరువాత వాయుదిశను బ్రహ్మతీర్థము (37) ఈ తీర్థమున చతుర్ముఖుడు భగవత్ప్రీతికై హయమేధ యాగమునుజేసెను దానికి దిగువ భాగమున ఇంద్రతీర్థము (38) భారద్వాజతీర్థము (39) ఆకాశ గంగ (40) ప్రాచేతసతీర్థము (41) అవతల, పాపవినాశనతీర్థము (42) కలవు పాపనాశస్నానము సర్వపాపహరము, వాయుదిశను కుమారధారాతీర్థము (43) కలదు. దిగువభాగమున గజతీర్థము (44) ఋశ్యశృంగతీర్థము (45) నార దాదులచే సేవింపబడెడి తుంబురుతీర్థము (46) దశావతారతీర్థము (57) హలా యుధతీర్థము (58) సప్తర్షితీర్థము (65) గజకోణతీర్థము (66) పశ్చిమమున

వైష్వక్సేనతీర్థము (67) యుద్ధఖండతీర్థము (68) కలవు. ఈ యుద్ధఖండ తీర్థమున విష్వక్సేనునకు సిద్ధికలిగెను, ఇట్లు మహాపాతకహరములగు అరువది యెనిమిది ముఖ్యపుణ్యతీర్థములు శేషపర్వతమున కలవు

ఇది శ్రీ బ్రహ్మపురాణమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమునందు భక్తి వైరాగ్యప్రదములగు అరువది యెనిమిది తీర్థముల పేర్లను మాహాత్మ్యమును వర్ణించెడిది ఐదవ అధ్యాయము.

---

## ఆరవ అధ్యాయము

—: మనుతీర్థమాదిగాగల నూటయెనిమిది పుణ్యతీర్థములు :—

(దూర్వాసుడు బదులుచెప్పుచున్నాడు)

[1]మన్వం[2]ద్రవ[3]సుసంజ్ఞాని [14]రుద్రా[26]దిత్యాహ్వయాని చ ।
[35]నవప్రజేశసంజ్ఞాని [36]హ్యాశ్వినం [37]శుక్రసంజ్ఞకమ్ ॥ ౧

[38]వారుణం [39]జాహ్నవీతీర్థం [40]కాపేయం [41]కాణ్వమేవ చ ।
[42]ఆగ్నేయం [43]నారదం తీర్థం [44]సోమతీర్థం చ [45]భార్గవమ్ ॥ ౨

[46]ధర్మతీర్థం [47]యజ్ఞతీర్థం [48]పశుతీర్థం [49]గణేశ్వరమ్ ।
[50]భౌమాశ్వం [51]పారిభద్రం చ [52]జగజ్జాడ్యహరం పరమ్ ॥ ౩

[53]విశ్వకల్లోలతీర్థం చ తీర్థం [54]యమవినిర్మితమ్ ।
[55]బార్హస్పత్యం [56]రామహర్షమజామోదం[57] జనేశ్వరమ్[58] ॥ ౪

[59]ఇష్టసిద్ధిః [60]కర్మసిద్ధి [61]ర్వాట మౌదుంబరం[62] తథా ।
[63]కార్తికేయం [64]కుబ్జతీర్థం [74]దశప్రాచేతసం తథా ॥ ౫

[75]గారుడం [76]శేషతీర్థం చ [77]వాసుకిర్విష్ణువర్ధనమ్[78] ।
[79]కర్మకాణ్డం [80]పుణ్యవృద్ధిః [81]ఋణమోచనమేవ చ ॥ ౬

[82]పార్జన్యం [83]మేఘతీర్థం చ యత్ర విత్యప్రవర్షణమ్ ।
[84]సాంకర్షణం [85]వాసుదేవం [86]నారాయణమతః పరమ్ ॥ ౭

తా॥ మనుతీర్థము (1) ఇంద్రతీర్థము (2) వసుతీర్థము (3) పదు నొకండు రుద్రతీర్థములు (14) ద్వాదశాదిత్యతీర్థములు (26) నవప్రజాపతి తీర్థములు (35) అశ్వినతీర్థము (36) శుక్రతీర్థము (37) వారుణతీర్థము (38) జాహ్నవీతీర్థము (39) చాంపేయతీర్థము (40) వాణ్వీతీర్థము (41) ఆగ్నేయ తీర్థము (42) నారదతీర్థము (43) సోమతీర్థము (44) భార్గవతీర్థము (45) ధర్మతీర్థము (46) యజ్ఞతీర్థము (47) పశుతీర్థము (48) గణేశ్వరతీర్థము (49) ధౌమాశ్వతీర్థము (50) పారిభద్రతీర్థము (51) జగజ్జాడ్యహరతీర్థము (52) విశ్వకల్లోలతీర్థము (53) యమతీర్థము (54) వాహజాస్పత్యతీర్థము (55) కామహర్షతీర్థము (56) అజామోదతీర్థము (57) జినేశ్వరతీర్థము (58) ఇష్ట సిద్ధితీర్థము (59) కర్మసిద్ధితీర్థము (60) వటతీర్థము (61) ఔదుంబరతీర్థ ము (62) కార్తికేయతీర్థము (63) కుబ్జతీర్థము (64) దశప్రాచేతసతీర్థ ములు (74) గారుడతీర్థము (75) శేషతీర్థము (76) వాసుకితీర్థము (77) విష్ణువర్ధనతీర్థము (78) కుష్మాండతీర్థము (79) పుణ్యవర్ధనతీర్థము (80) ఋణవిమోచనతీర్థము (81) పార్జన్యతీర్థము (82) మేఘతీర్థము (83). ఈతీర్థ మున్నచోట సంతతము మేఘుడు వర్షించుచుండును సాంకర్షణతీర్థము (84) వాసుదేవతీర్థము (85) నారాయణతీర్థము (86) కలవు.

[87]దేవతీర్థం [88]యక్షతీర్థం [89]కాలతీర్థం చ [90]గోముఖమ్ ।
[91]ప్రాద్యుమ్నమానిరుద్ధం[92] చ [93]పితృతీర్థమతః పరమ్ ॥ ౮

[94]ఆర్షేయం [95]వైశ్వదేవం చ [96]స్వధా [97]స్వాహా వినిర్మితే ।
[98]అస్థితీర్థం [99]చాంజనేయం [100]శుద్ధోదకమతః పరమ్ ॥ ౯

[108]అష్టభైరవతీర్థం చ శతమష్టోత్తరం త్విదమ్ ।
తీర్థజాతమిదం నృణాం జ్ఞానప్రదమనుత్తమమ్ ॥ ౧౦

తీర్థాన్యష్టోత్తరశతం సంతి నైరృతకోణకే ।
దక్షపుత్రసహస్రేణ యత్ర తప్తం మహత్తపః ॥ ౧౧

నారదస్యోపదేశేన యచ్ఛ త్రై రేవ నిర్మితమ్ ।
అస్తి తీర్థసహస్రం తత్సద్యస్సిద్ధిప్రదాయకమ్ ॥ ౧౨

కాశ్యపాశ్రమమారభ్య హ్యర్ధయోజనమధ్యతః ।
కుమారధారికాతీర్థాత్పశ్చిమే సంస్థితం చ తత్ ।
సాష్టభైరవతీర్థం తత్కర్మసిద్ధిప్రదం నృణామ్ ॥ ౧౩

ఇతి శ్రీబ్రహ్మపురాణే శ్రీవేంకటాచలమాహాత్మ్యే మన్వాద్యష్టోత్తర శతతీర్థనామానువర్ణనం నామ షష్ఠోఽధ్యాయః

తా॥ దేవతీర్థము (87) యక్షతీర్థము (88) కాలతీర్థము (89) గోముఖ తీర్థము (90) ప్రాద్యుమ్నతీర్థము (91) అనిరుద్ధతీర్థము (92) పితృతీర్థము (93) ఆశ్లేయతీర్థము (94) వైశ్వదేవతీర్థము (95) స్వధాతీర్థము (96) స్వాహా తీర్థము (97) అస్థితీర్థము (98) ఆంజనేయతీర్థము (99) శుద్ధోదకతీర్థము (100) అష్టభైరవతీర్థములు (108) ఇట్లని అష్టోత్తరశతతీర్థములు జ్ఞానప్రదములుగ చెప్ప బడినవి ఇయ్యవి నైర్‌ఋతి దిశను కలవు. మరియు దక్షప్రజాపతియొక్క వేయిమంది పుత్రులు నారదుని ఉపదేశమూలమున యే ప్రదేశములందు తపస్సు చేసి సిద్ధిబొందిరో వారలచే ఆయా ప్రదేశములందు నిర్మింపబడిన వేయి పుణ్య తీర్థములుకూడ నిచ్చట కలవు. ఈ సహస్రతీర్థములనునవి కాశ్యపాశ్రమ మారం భించి అర్థయోజన దూరమున కుమారధారాతీర్థమునకు పడమటి దిశను కలవు. వేయికి పైననుండినవి అష్టభైరవతీర్థములు కలసి అష్టోత్తర సహస్రతీర్థములగు చున్నవి.

ఇది శ్రీ బ్రహ్మాండపురాణమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యమునందు మన్వాదులగు నష్టోత్తరశతపుణ్యతీర్థముల పేరులను చెప్పునది ఆరవఅధ్యాయము.

---

## ఏడవ అధ్యాయము

—: తొండమాను చక్రవర్తి పుట్టుకప్రకారము :—

(దిలీపుడు ప్రశ్నించుచున్నాడు)

కేన నామ్నా ప్రసిద్ధోఽసౌ భగవాన్ హరిరీశ్వరః ।
కింలక్షణశ్చ తత్రాస్తే తన్మే బ్రూహి తపోధన ! ॥ ౧

తా॥ ఓ మునిసత్తమా ! శ్రీ వేంకటాద్రియందు సాన్నిధ్యముజెందిన భగవానుడు ఏపేరు గలిగి ఏ లక్షణములతో అచ్చట నుండెనో చెప్పుము.

(దూర్వాసుడు బదులు చెప్పుచున్నాడు)

శ్రీనివాసాఖ్యయా దేవశ్శఙ్ఖచక్రధరో విభుః ।
శాంతభావం సమాపన్నో మృగయోద్దామలోచనః ॥ ౨

కటిం స్పృశన్ వామకరాద్వరముద్రాం చ దక్షిణాత్ ।
తిరోహితరమాభూభ్యాం దృశ్యతే మృగయుర్యథా ॥ ౩

నీలజీమూతసంకాశః పీతకౌశేయశోభితః ।
పీనవృత్తబృహద్బాహుస్సునాసశ్చారులోచనః ॥ ౪

దోషగంధవిదూరశ్చ గుణసాంద్రస్సుఖోచితః ।
కోటికందర్పలావణ్యస్స్ఫురన్మకరకుణ్డలః ॥ ౫

బృహద్వక్షస్థ్సలావాసమహాలక్ష్మ్యా చ శోభితః ।
తత్తదిష్టతమం కామం దదద్భక్తానుకంపయా ॥ ౬

దర్శయన్భక్తవాత్సల్యం యో దదౌ హస్తగే శుభే ।
శఙ్ఖచక్రే నృపేంద్రాయ చక్రవర్తీతి యం విదుః ॥ ౭

అత ఏవారిశఙ్ఖాభ్యాం దృశ్యేతే రహితౌ కరౌ ।
అర్చారూపశిలారూపవిగ్రహస్య మహాత్మనః ॥ ౮

తా॥ శ్రీ వేంకటాద్రియందు సాన్నిధ్యముజెందిన భగవానుడు శ్రీనివాసుడను పేరిట ప్రసిద్ధిజెందియున్నాడు అతడు శంఖచక్రములను ధరించును. శాంతస్వభావుడు. వేటకానివలె కానవచ్చును యెడమచేయి కటిపార్శ్వమును స్పృశించుచును కుడిచేయి వరమునిచ్చుచును వుండును శ్రీ భూదేవులు దాగియున్నారు. నల్లని మేఘమువంటి దాయనరూపము పీతాంబరమును ధరించును. పీనములు వృత్తములగు బృహద్బాహువులు చక్కని ముక్కు కండ్లు కలవాడు. దోషరహితుడు కల్యాణగుణయుతుడు ఆతని లావణ్యము కోటి మన్మథులకు మించినది. ప్రకాశించెడి మకరకుండలములు కలవు. లక్ష్మిని ధరించెడి విశాల వక్షఃప్రదేశముచే ప్రకాశింపవాడు. భక్తులు అపేక్షించెడి యే కోరికనైనను ప్రసాదించగల దయగలవాడు అందుకు నిదర్శనముగ నాయన

తన అవినాభూతములై హస్తద్వయమున నుండెడి సుదర్శన పాంచజన్యములను రెండు దివ్యాయుధములను భక్తుడగు తొండమాను చక్రవర్తికి యిచ్చియున్నాడు

(దిలీపుడు ప్రశ్నించుచున్నాడు)

కోఽయం నృపశ్చక్రవర్తీ కిం పూర్వస్సుచిరా దభూత్ ।
ఇదానీం వర్తతే వాఽయం కా వాభూద్విపదస్య వై ॥ ౯

యదర్థం దేవదేవేన శఙ్ఖచక్రే ప్రసాదితే ।
బ్రూహి విస్తరతో బ్రహ్మన్ శ్రోతుం కౌతుహలం హి మే॥ ౧౦

తా॥ ఓ మునిసత్తమా! ఆ తొండమాను చక్రవర్తి యెవ్వరు? చాల కాలము క్రిందనుండెనా. సమీపమున నుండెనా? ఇప్పుడు కలడా? అతని రెందుకై భగవానుని శంఖ చక్రములతో సహాయముపసరమాయెను? ఆ వివర మంతయు నాకు వివరింపుము

(దూర్వాసుడు చెప్పుచున్నాడు)

పురా కశ్చిద్ద్విజవర ఆసీద్వైఖానసో నృప ।
కృష్ణక్షేత్రే చోళదేశే యా హరిద్రానదీ శుభా ॥ ౧౧

తత్తీరేఽవర్తత ప్రీత్యా హరిర్గోపాలవేషవాన్ ।
తప్తే తపసి చోళేన ధృతవర్మాభిధేన చ ॥ ౧౨

గోపాలకృష్ణరూపస్య దర్శనార్థం కలౌ యుగే ।
పంచవింశే తు యో భూమౌ పురా వైవస్వతాంతరే ॥ ౧౩

భావికృష్ణావతారస్య కథాం శ్రుత్వాఽతికౌతుకాత్ ।
తదానీమేవ తద్రూపదర్శనాహ్లాదకామతః ॥ ౧౪

నిత్యత్వాత్స్వీయరూపాణాం తథా ప్రత్యక్షతాం గతః ।
వైఖానసో ద్విజ స్తత్ర తపసా తమతోషయత్ ॥ ౧౫

ముక్త్యర్థం ప్రీతిమాన్విష్ణొ తస్య స్వప్నే హరిస్స్వయమ్ ।
త్వయా ధ్యేయశ్శ్రీనివాసో నాహం ధ్యేయో ద్విజోత్తమః ॥ ౧౬

యో యోగ్యో యస్య జీవస్య తేన ధ్యేయ స్స ఏవ హి ।
యోగ్యోపాసనయా జీవాముక్తిం యాంతి న సంశయః ॥ ౧౭

అభిధా శ్రీనివాసస్య తవ యోగ్యా ద్విజోత్తమ ।
వేఙ్కటాద్రిం తతో గచ్ఛ శ్రీనివాసస్స్వయం హరిః ॥ ౧౮

స్వామిపుష్కరిణీతీరే రమయా సహ మోదతే ।
ఇత్యాహ భగవాన్కృష్ణః పునస్స్వప్నాంతరేఽవదత్ ॥ ౧౯

తా॥ ఓ రాజా ! పూర్వమొకప్పుడు చోళదేశమున హరిద్రానదీతీరమున కృష్ణక్షేత్రమందు ద్విజవరుడగు వైఖానసుడుండెను. హరిద్రానదీతీరమందు శ్రీగోపాలదేవుని దివ్యాలయముండెను. అప్పుడు ధృతవర్మయను చోళరాజు రాజ్యపరిపాలనముచేయుచుండెను. ఇరువదియైదవ వైవస్వతమన్వంతరమందు భగవానుడు శ్రీకృష్ణావతారమును ధరించెనని వినిన చక్రవర్తి ఆ పరమాత్మను అట్లే దర్శించవలయునని కోరి తపస్సుచేసి సిద్ధిబొందెను. భగవానుని యవతారములు నిత్యములుగనుక చక్రవర్తికోరినట్లాయవతారమును భగవానుడు చూపించెను. వైఖానసుడును అట్లే తపస్సుచేసి భగవదనుగ్రహమునకు పాత్రుడాయెను. ప్రీతుడగు భగవానుడు వైఖానసునికి స్వప్నమునందు గోచరుడై ఇట్లు ఆదేశించెను. "ఓ బ్రాహ్మణోత్తమా ! ఏ చేతనునకే దేవతఫలదమగునో ఆతడా దేవతనారాధింపదగును. ఇది శాస్త్రరహస్యము శ్రీనివాసమంత్ర పురశ్చరణము నీకు తగినది. నీవు తక్షణము వేంకటాద్రికిపొమ్ము అచ్చట లక్ష్మీసహాయుడై శ్రీనివాసుడు ఉన్నాడు. అది శ్రీస్వామిపుష్కరిణీతీరము" అని చెప్పి ఇంకను ఇట్లని విస్తరించెను.

పురా కృతయుగే పశ్చాద్భాగే శఙ్ఖేన వైకృతమ్ ।
విమానం కల్పప్రళయే నష్టప్రాయమభూద్ద్విజ ॥ ౨౦

వల్మీకస్యాంతరే విష్ణోః ప్రతిమా వర్తతే శుభా ।
శఙ్ఖేన నిర్మితా పుణ్యా సర్వపాపహరాఽమలా ॥ ౨౧

జానుమాత్రే నిమగ్నా హి తింత్రిణీవృక్షమూలతః ।
ధను ర్ద్వయాంతరే పుణ్యం భూతీర్థం వర్తతే శుభమ్ ॥ ౨౨

ప్రాకారార్థం దేవదేవస్య భూమ్యా వై నిర్మితం పురా ।
తత్రాఽస్తే గౌతమీ ధేనుస్సించంతీ పయసా విభుమ్ ॥ ౨౩

చించావృక్షస్య వాయవ్యే భూతీర్థే వాసమీయుషీ ।
యుగాంతప్రళయే ధేన్వా పూజితో వర్తతే విభుః ॥ ౨౪

దాసనామ్నా చ శూద్రేణ సహ తం పూజయ ప్రభుమ్ ।
త్వదాగమనకాలే తు పాణ్డ్యదేశాత్సుధీశ్శుభః ॥ ౨౫

రఙ్గదాస ఇతి ఖ్యాతశ్శూద్రస్త్వాం సంగమిష్యతి ।
ఉభాభ్యాం పూజితో దేవ ఇష్టసిద్ధిం ప్రయచ్ఛతి ॥ ౨౬

ఏతావదుక్త్వా స్వప్నే తు గోపీనాథేతి నామ చ ।
దదౌ తస్య ప్రియం విష్ణుస్సోఽపి బుద్ధ్వాఽతివిస్మితః ॥ ౨౭

ప్రీత్యా జగామ శైలేంద్రం వేఙ్కటాఖ్యం స్వసిద్ధయే ।

తా॥ ముందుటి కృతయుగమున శ్రీనివాసునకు శంఖచక్రవర్తి నిర్మించిన దివ్యవిమానమునష్ట ప్రాయముగనిలచినది ఆయవస్థకల్పాన్త ప్రళయచేష్టితము. ఐనను అప్పుడు నిర్మించబడిన శ్రీనివాసుని దివ్యమంగళవిగ్రహము వల్మీకగర్భమున సురక్షితముగనున్నది. ఆ వల్మీకము ఒక చింతచెట్టుమొదట జానుమాత్రపులోతున స్థాపితమైనది. ఆ ప్రదేశమునకు రెండుధనువుల దూరమున భూతీర్థము కలదు. ఈ తీర్థము శ్రీవారి హవిఃపరిష్కారమునకై భూపిరాట్టిచే నిర్మింపబడినది. అచ్చటనే గౌతమీధేనువు తన క్షీరములచే భగవాను నభిషేకించుచుండును. చింతచెట్టుకు వాయుదిశను భూతీర్థమందు నివసించుచు యుగాంతప్రలయకాలమువరకు నాధేనువు భగవానుని పరిచర్యజేయుచుండును. నీవు శేషాచలమునకు పోవు సమయమునకు సరిగాపాండ్యదేశమందుండి రంగదాసుడను నొక శూద్రభక్తుడు నీతో కలియగలడు వాని సహాయముతో నీవు శ్రీవారిని ఆరాధింను చుండుము. మీ ఉభయులకు ఇష్టసిద్ధి కలుగును, ఇట్లని చెప్పి ఆవైఖానసునకు 'గోపీనాథు' డని నామకరణముజేసి భగవానుడు మరుగుపడెను. అంతట గోపీనాథుడు నిదురనుండిలేచి విస్మయమంది వెంటనే శేషశైలమునకేగెను.

గిరిప్రవేశకాలే తు రఙ్గదాసస్సమాగమత్ ॥ ౨౮

పుష్పోద్యానకరశ్శూద్రః పూజకశ్చ ద్విజోత్తమః ।
తింత్రిణీవృక్షమూలస్థవల్మీకస్థం హరిం పరమ్ ॥ ౨౯

ఉద్ధృత్య పశ్చిమే భాగే స్థాపయామాసతుశ్చ తౌ ।
అశిల్పికౌశలాభిశ్చ శిలాభిర్భిత్తిమంజసా ॥ ౩౦

కృత్వా తదంతరే రమ్యం తృణైః కృత్వా చ మణ్టపమ్ ।
తన్మధ్యే దేవదేవస్య పరిచర్యాం చ చక్రతుః ॥ ౩౧

భూస్వామిపుష్కరిణ్యోశ్చ మధ్యే క్రీడాస్పదం హరేః ।
పుష్పోద్యానం చకారాఽసౌ శూద్రో భాగవతోత్తమః ॥ ౩౨

ఉపాహృత్య చ పుష్పాణి త్రికాలే పి చ దామకృత్ ।
పూజాకాలే విప్రహస్తే ప్రత్యహం చ సమార్పయత్ ॥ ౩౩

పశ్యంతౌ తావుభౌ పుణ్యౌ ప్రత్యహం చ దివౌకసామ్ ।
పూజాభికాంక్షిణాం సంఘం విస్మయం జగ్మతుః పరమ్ ॥ ౩౪

వన్యైః ఫలైశ్చ పుష్పైశ్చ కందమూలాదిభిశ్చ తౌ ।
సపర్యాం చక్రతుస్సమ్యగ్భక్త్యుద్రిక్తసుఖాన్వితౌ ॥ ౩౫

తా॥ గోపీనాధుడు వెళ్లిన సమయమునకు రంగదాసుడాతనితో కలసెను. ఇట్లు కలసిన ఉభయులు అన్యోన్యము తమ కధను చెప్పుకొని స్వప్నవృత్తరీతిని చింతచెట్టుమొదట వల్మీకమున మరుగియున్న భగవానుని దివ్యమంగళవిగ్రహమును బయటకుతీసి వృక్షపశ్చిమభాగమున నిలిపిరి అచ్చట లభ్యములకు అకృత్రిమశిలలచే ఆవిగ్రహమును చుట్టి గోడనుకట్టి తృణములతో దానిని కప్పి అందున్న భగవానునికుభయులును పరిచర్యచేయసాగిరి భూతీర్థమునకును స్వామితీర్థమునకు మధ్యనున్న ప్రదేశమందు ఉద్యానమును పెంచి రంగదాసుడు పుష్పకైంకర్యముచేసెను. త్రికాలములందు పుష్పములను తెచ్చి ఆతడు గోపీనాధునకీయగా ఆతడు శ్రీవైఖానససూత్రవిధిననుసరించి భగవాను నారాధించుచుండెను. ఈ యుభయుల అదృష్టమునకు దేవతలందరును ఆశ్చర్యమందిరి. అరణ్యమందు

లబ్ధములగు ఫలములు పుష్పములు కందమూలములు వీట్లతో భక్తిపురస్సరముగ వీరలు భగవదారాధనముచేయుచుండిరి.

తతః కాలాంతరే కశ్చిద్గంధర్వో నామ కుండలః ।
దివ్యం విమానమారుహ్య సస్త్రీకో గిరిగహ్వరే ॥ ౩౬

స్వామిపుష్కరిణీతీరే దేవం దృష్ట్వాభిపూజ్య చ ।
తత ఉత్తరదేశే తు మనోరమ్యే వనాంతరే ॥ ౩౭

నానావిలాసభావాభీరేమే రామాభిరంజసా ।
తం దృష్ట్వా రంగదాసోఽపి పంచబాణశరార్దితః ॥ ౩౮

నిరీక్ష్య కుంజే లీనస్సన్ రేతస్సద్యో విముక్తవాన్ ।
పశ్చాద్గతమదో భూత్వా మనసైవాతిశంకితః ॥ ౩౯

తదోపహృతపుష్పాణి విసృజ్యాధిగతత్రపః ।
శుద్ధికామో మమజ్జాఽథ స్వామిపుష్కరిణీజలే ॥ ౪౦

పునరాహృత్య పుష్పాణి తాన్యాదాయాలయం యయౌ ।
గోపీనాథోఽపి తం దృష్ట్వా ప్రాహ స్మాతామ్రలోచనః ॥ ౪౧

పూజాకాలో గతః క్వాద్య గతోఽసి గతసంస్మృతిః ।
కిం తే విలంబహేతుస్తు క్వావాత్సీః కథ్యతామితి ॥ ౪౨

గోపీనాథేనైవముక్తో రంగదాసోఽపి లజ్జయా ।
న ప్రత్యువాచ తం విప్రం తదాఽవనతకంధరః ॥ ౪౩

పునః పునః కృతే ప్రశ్నే తస్మింస్తూష్ణీంఽస్థితే పి చ ।
ఆకాశవాణీ తం ప్రాహ శృణు శూద్రేతి సాదరమ్ ॥ ౪౪

తా॥ ఇట్లు కాలము జరుగుచుండగా ఒకానొక దివసమున కుండలుడను నొక గంధర్వుడు నారీసమేతుడై విమానమునెక్కి శేషాచలమున దిగి శ్రీస్వామి పుష్కరిణీతీరమందు శ్రీనివాసుని సేవించి అచ్చటికి ఉత్తరముననున్న ఒకానొక వనాంతరమున నానావిలాసభావభూషితలగు నారీజనముతో క్రీడించు

చుండెను. ఆ సన్నివేశమును చూచిన రంగదాసుడు మన్మధవికారముచే ముగ్ధుడై స్ఖలితేంద్రియుడాయెను. కొంతసేపుటికి తన ప్రమత్తతనుండి ప్రబుద్ధుడై వగచి అంతవరకు తాను కోసియుంచిన పుష్పములను అపవిత్రములగదోచి పారవైచి పశ్చాత్తాపశుద్ధికై తిరిగి స్నానముచేసి తిరిగి పుష్పములనుకోసికొని మామూలుగ ఆలయమునకువచ్చెను. ఆలస్యముగ పూజాకాలము నతిక్రమించివచ్చిన రంగదాసుని చూచిన గోపీనాధుడు కండ్లుయెఱ్ఱజేసి ఆలస్యకారణమేమని రంగదాసుని గద్దించి అడిగెను గోపీనాధునికి బదులుచెప్పుటకు తన వృత్తాంతమును తలచి భయముచెందిన రంగదాసు తలవంచి బదులుచెప్పకుండెను. ఇట్లు యెన్నిసారులు అడిగినను లజ్జాభయములతో రంగదాసుడు మిన్నకుండినంతట ఓ రంగదాసా! యని పిలచి ఆకాశవాణి ఇట్లని చెప్పసాగెను

కామేన వ్యాకులం చిత్తం నైవ స్వాస్థ్యం గమిష్యతి ।
అస్వస్థచిత్తో న క్వాపి సిద్ధిమేతి న సంశయః ॥ ౪౫

తస్మాద్విసృజ్య కాయం త్వం వ్రజ దేహాంతరం శుభమ్ ।
తస్మిన్నృపోత్తమో భూత్వా జీర్ణమేతం మమాఽఽలయమ్ ॥ ౪౬

గోపురాద్యైశ్చభైః పూర్ణం మణ్డపైరద్భుతైరపి ।
శోభమానం నవం కుర్యాస్తేన తే భవితా గతిః ॥ ౪౭

తదా నారీసహస్రాణి భోక్ష్యసే త్వం న సంశయః ।
భుక్త్వా భోగాననేకాంశ్చ మత్పాదాసక్తచేతసః ॥ ౪౮

తస్మిన్ జన్మని తే శత్రుపీడా చైవ భవిష్యతి ।
తదా తవ జయార్థాయ చక్రశఙ్ఖౌ జయావహౌ ॥ ౪౯

దాస్యామి చాంతే ముక్తిం చ సకులస్య న సంశయః ।
ఇత్యుక్త్వాఽఽకాశవాణీ తు విరరామ తతః పరమ్ ॥ ౫౦

తా॥ కామవంచితమగు మనస్సుకు స్థైర్యములేదు. స్థైర్యములేనివానికి సిద్ధికలుగదు. నీవు కామభోగములకు లోనైతివి ఈ దేహమందు నీకా యను భవము సిద్ధింపదు. ఈ శరీరము విడచిన తరువాత మరుజన్మమున నీవు చక్రవర్తివిగ పుట్టగలవు. నీవు చేయుచువచ్చిన కైంకర్యమునకు ఫలితముగ నీవా

జన్మమునందు ఇందే ఆలయమును మండపవిమానగోపురములను చిరస్మారక ములుగ నిర్మించెదవు, గంధర్వరాజుకంటె యెక్కువ కామభోగములను స్త్రీ సహస్రముతోకూడి అనుభవింతువు సకలమగు నైహికసుఖములననుభవించు చుండియు నాయందు దృఢభక్తితోవర్తించి తరింతువు. నీకెవ్వరును బహిరన్తః శత్రువులుండరు. నీకు జయప్రాప్తికై నా శంఖచక్రములను నీకు సహాయముగనే నిచ్చెదను. ఆ దేహాన్తమున నిన్ను నా సాన్నిధ్యమునకు శాశ్వతముగ చేర్చి కొందును. అని చెప్పి అశరీరవాణి నిగమించెను.

రఙ్గదాసో నిరాహారః క్రమాత్త్యక్తకళేబరః ।
నారాయణపురే జజ్ఞే చక్రవర్తీతి నామతః ॥ ౫౧

తొణ్డమానితి తం ప్రాహుః ద్రావిడా ద్రవిడేశ్వరమ్ ।
జన్మప్రభృతి దాసస్స సదా విష్ణుపరాయణః ॥ ౫౨

మణ్డలాధిపతిర్భూత్వా దివ్యనారీసహస్రభుక్ ।
ప్రత్యహం చ బిలద్వారాద్గత్వా వేఙ్కటపర్వతమ్ ॥ ౫౩

అన్వహం చ కరోతి స్మ పూజాం తస్య మహాత్మనః ।
భక్త్యుద్రిక్తమనా భూత్వా దదౌ గ్రామాననేకశః ॥ ౫౪

తా॥ అంతటినుంచి రంగదాసు ఆహారమునుసైతము విడచి భగవద్ధ్యాన ముచేనుండి కాలక్రమమున కాలధర్మముచెంది శేషపర్వత సమీపమున నారాయణ పురమున ద్రామిడజనాధిపతియింట తొండమానుడను పేరుతో పుట్టిపెరిగి చక్ర వర్తియై యొప్పెను. బాల్యమాదిగవిష్ణుభక్తియుతుడై చక్రవర్తియై వేయిమంది దివ్యస్త్రీలు పరిచర్యచేయుచుండగా ఐహికములగు సమస్తభోగముల ననుభ వించెను. వేంకటాద్రికి తన యూరినుండి ఇతరులకు కంటబడకుండ బిల ద్వారమునపోయి ప్రతిదినము శ్రీనివాసుని సేవించుచు వచ్చుచుండెను. భక్తి పారవశ్యముతో శ్రీవారి కైంకర్యములకు కైంకర్యపరులకు అనేకములగు గ్రామములను దాన మిచ్చెను

ప్రాకారద్వయసంయుక్తం గోపురద్వయసంయుతమ్ ।
గర్భాగారసమాయుక్తమకరోద్దివ్యమాలయమ్ ॥ ౫౫

తథా మహానసాగారం యాగమణ్డపమేవ చ ।
ధాన్యాగారం చ గోశాలాం యద్యదంగం హరేశ్శుభమ్ ॥ ౫౬
కారయామాన తత్సర్వమష్టావింశే కలౌ యుగే ।
తథోత్సవవిధిం తస్య కారయామాస వై ద్విజైః ॥ ౫౭
భూషణాని దదౌ తస్య నానారత్నచితాని చ ।

తా॥ రెండుప్రాకారములు రెండుగోపురములతో అలంకరించిన ఒక గర్భగృహమును శ్రీస్వామివార్లకు నిర్మించెను మరియు పాకశాల యాగశాల ధాన్యశాల గోశాల మొదలగు కట్టడములనుకూడకట్టించెను ఈ కైంకర్యము లన్నియు ఇరువదియెనిమిదవ కలియుగమునాటివి బ్రాహ్మణోత్తములచే మహోత్సవమును చేయించెను, నవరత్నఖచితములగు వెలలేని ఆభరణములను చేయించెను.

స్థితే కదాచిత్క్షితిపే శ్రీనివాసస్య సన్నిధౌ ॥ ౫౮
శత్రవశ్చ బలోద్రిక్తా రురుధుస్తస్య వై పురీమ్ ।
శ్రుత్వా బలార్ణవం ఘోరమాయాంతం నాతిశంకితః ॥ ౫౯
యోద్ధుకామో జగామాఽథ పునస్తైశ్చ పరాజితః ।
తతః ఖిన్నమనా భూత్వా త మేవ శరణం యయౌ ॥ ౬౦
బిలద్వారేణ దేవేశం గత్వా పాదౌ ప్రగృహ్య చ ।
రురోద త్రాహి త్రాహీతి తం ప్రాహాఽర్చాస్వరూపవాన్ ॥ ౬౧

తా॥ ఇట్లు కాలముగడచుచుండగా కొందరు బలవంతులగు శత్రువులు నారాయణపురముపై దాడివెడలి నగరమును ముట్టడించిరి శత్రువుల నెదుర్కొన బోయి యుద్ధముచేసి వారలచే పరాజితుడై దుఃఖించి శరణ్యుడగు శ్రీనివాసునిజేరి పాదములపైబడి రక్షణమును ప్రార్థించగా అర్చామూర్తియగు భగవాను డిట్లనెను.

మాభైషీః పుత్ర భద్రం తే చక్రశంఖౌ దదామి తే ।
తాభ్యాం గచ్ఛ పురీం దివ్యాం తౌ తే శత్రూన్ హనిష్యతః ॥ ౬౨
ఇత్యుక్త్వా తౌ దదౌ తస్మై తాభ్యాం సహ జగామ సః ।
తౌ చ శత్రూన్నిహత్యాఽశు కృత్వా రాజ్యమకణ్టకమ్ ॥ ౬౩
ఆజగ్మతుః క్షితిభృతా సాకం దేవస్య సన్నిధౌ ।
రాజా దేవంవ వందేఽథ స్తుత్వా స్తోత్రైరనేకశః ॥ ౬౪

తా॥ " ఓ పుత్రా ! భయపడకుము నీకు శుభమగుగాక నీకు సహాయముగ నాచేతనున్న శంఖచక్రములను నీకిచ్చెదను అయ్యవి నీ విరోధిరాజులను సస్సైన్యముగ సంహరించగలవు ' అని చెప్పి తన సుదర్శనపాంచజన్యదివ్యాయుధముల నాతనికీయగా ఆతడు శత్రుసైన్యముపైకి పోయెను ఆయుధములు శత్రువులను సంహరించి తొండమానునితోకూడ భగవత్సన్నిధికి మరలివచ్చెను ఆయుపకారమునకు కృతజ్ఞతతో తొండమానుడు భగవానుని పలువిధములుగ స్తుతించెను.

వరం వరయ భద్రేతి దేవో రాజానమబ్రవీత్ ।

రాజా॥ మమాయుధప్రదానస్య ఖ్యాత్యై దేవోత్తమ ప్రభో ॥ ౬౫

అర్చాబిమ్బే శిలాబింబే చక్రశంఖౌ న ధారయ ।

ఇతి సంప్రార్థితో దేవో న దధార పునశ్చ తౌ ॥ ౬౬

అదృశ్యౌ తిష్ఠతశ్చోభౌ పార్శ్వతశ్శార్ఙ్గధన్వనః ।

ఇత్యేతత్కథితం సర్వం యత్పృష్టోఽహం త్వయాఽనఘ

సకారణం చక్రదానం కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి ॥ ౬౭

ఇతి బ్రహ్మపురాణే శ్రీవేంకటాచలమాహాత్మ్యే తొండమాన్ నామకనృపోత్పత్తి భగవద్దత్తశంఖచక్రధారణ ప్రాప్త్యాది కథనం నామ సప్తమోఽధ్యాయః

తా॥ భగవానుడు సంతుష్టుడై "వరమడుగు"మని రాజుకుచెప్పగా తొండమానుడు ఇట్లని వరమును కోరెను. " ఓ దేవా ! నీవు నా సహాయమునకు నీ చేతియందలి దివ్యాయుధములనిచ్చిన జ్ఞాపకమునకై నీ దివ్యమంగళవిగ్రహమునకిక పై శంఖచక్రములను ధరించరాదు" అనిన వరమును అంగీకరించి భగవానుడు శంఖచక్రములను ధరింపకుండెను. సుదర్శనపాంచజన్యములు అనపాయివర్గమగుట ప్రత్యక్షముగ భగవత్కరములందు కనుబడకున్నను తిరోహితములై సాన్నిధ్యము నిచ్చుచున్నవి. నీవు అడిగిన ప్రశ్నలకన్నిటికిని సహేతుకమగు సమాధానము చెప్పితిని. ఇంకేమి వినగోరెదవు.

ఇది బ్రహ్మపురాణము శ్రీవేంకటాచలమాహాత్మ్యమునందు తొండమానుడను చక్రవర్తి జననము ఆతనికి భగవద్దత్త శంఖచక్రాయుధప్రాప్తి మొదలగు విషయములను వివరించుట సప్తమాధ్యాయము.

## యెనిమిదవ అధ్యాయము

—: శ్రీ వరాహదేవుడు స్వామితీర్థవాయుదిశనుండుట :—

(దిలీపుడు ప్రశ్నించుచున్నాడు)

స్థితాని స్వామిసరసి తీర్థాని మునిపుఙ్గవ ।
కతి తాని చ పుణ్యాని నామధేయాని కాని చ ॥ ౧

కా దేవతా కిం ఫలం చ వద విస్తరతోమునే ।

తా॥ ఓ మునివర్యా ' శ్రీ స్వామిపుష్కరిణియందు ఏ యే తీర్థములు కలవు ? ఆ తీర్థాంతరముల కధిపతి యెవ్వరు ? వివరించి చెప్పుడు.

(దూర్వాసుడు బదులు చెప్పుచున్నాడు)

తీర్థానా ముత్తమం తీర్థం స్వామిపుష్కరిణీ శుభా ॥ ౨

స్మర్తవ్యా సర్వతీర్థేషు గఙ్గేవాఽఘాపహారిణీ ।
తస్యా వాయవ్యభాగే తు వారాహం తీర్థ ముత్తమమ్ ॥ ౩

యదాఽఽహృతం కాశ్యపేన భూతలం బ్రహ్మణా తదా ।
సంస్తుతో భగవా న్విష్ణుర్భూమ్యుద్ధరణమిచ్ఛతా ॥ ౪

తన్నాసాపుటసంభూతః కిటిః పోత్రీ మహాబలః ।
గత్వా రసాతలం హత్వా హిరణ్యాక్షం మహాబలమ్ ॥ ౫

ఉజ్జహార క్షితిం దంష్ట్రాకోట్యా చ పురుషోత్తమః ।
తద్రూపం లోకరక్షార్థం స్థాపితం వేఙ్కటాచలే ॥ ౬

స్వామిపుష్కరిణీతీరే బ్రహ్మణా పరమేష్ఠినా ।
జలాధివాసనం తస్య వాయవ్యేఽస్యాం చకార సః ॥ ౭

మమజ్జా థ ప్రతిష్ఠాఽన్తే దేవర్షిపితృభి స్సహ ।

తా॥ తీర్థస్వామినియగు స్వామిపుష్కరిణికి వాయవ్యదిశను వారాహ తీర్థము కలదు. పాతాళమున మునిగిపోయిన భూదేవి నుద్ధరించుటకై ప్రార్థించిన

కశ్యప ప్రజాపతి నాసాపుటమునుండి అవతరించి రసాతలమునకేగి అందున్న హిరణ్యాక్షుని సంహరించి భూమినుద్ధరించిన వరాహమూర్తి చరిత్రము విదితము లోకరక్షణార్థము ఆ వరాహదేవుని దివ్యమంగళవిగ్రహము శిలామయముగ చేయబడి వేంకటాద్రియందు చతురాననుచే శ్రీ స్వామిపుష్కరిణీతీరమందు ప్రతిష్ఠింపబడినవి. శ్రీ స్వామిపుష్కరిణి వాయవ్యభాగమున శ్రీ వరాహదేవునికి ప్రతిష్ఠాంగముగ జలాధివాసము చేయబడెను.

—: శ్రీ వరాహదేవునకు ప్రాథమిక సేవాక్రమము :—

ఉవాచ వచనం చేదం సర్వలోకస్య పశ్యతః ॥ ౯

వరాహతీర్థనామ్నా చ బాగోఽయం ప్రథితో భవేత్ ।
యోఽత్రాఽయాతిహారం సోఽత్ర నాఽస్నాత్వా వాశుచిర్భవేత్॥

వరాహదర్శనాత్పూర్వం శ్రీనివాసం నమేన్న చ ।
దర్శనాత్ప్రాగ్వరాహస్య శ్రీనివాసో న తృప్యతి ॥ ౧౦

ఇతి కృత్వా వ్యవస్థాం స పరమేష్ఠీ పితామహః ।
దృష్ట్వాఽథ శ్రీనివాసం చ స్తుత్వా చ వివిధైస్తవైః ॥ ౧౧

పాదౌ ప్రగృహ్య దేవస్య యయాచే వరముత్తమమ్ ।
మత్స్నాపితవరాహస్య పూర్వం స్యాత్పూజనం హరే ॥ ౧౨

దర్శనం స్నానదానాద్యైరిత్యుక్తోఽథ శ్రియఃపతిః ।
తథాఽస్త్వితి వరం దత్వా కారయామాస తత్తథా ॥ ౧౩

తస్మాత్పుణ్యతమం తీర్థం వాయవ్యాం దిశి సంస్థితమ్ ।
పునర్యుగాంతసమయే నష్టే దేవాలయేఽపి చ ॥ ౧౪

తా॥ మరియు చతురాస్యుడిట్లనెను. శ్రీ స్వామిపుష్కరిణికి వాయుదిశను శ్రీ వరాహమూర్తికి జలాధి వాసముచేసిన భాగము వరాహపుష్కరిణి యని పిలువబడును. శ్రీ వేంకటాచలయాత్ర కావలెననెడివారలు వరాహపుష్కరిణి యందు స్నానముచేయక పవిత్రతనందరు. వరాహదేవుని దర్శనము చేయక శ్రీనివాసుని దర్శించరాదు. అట్లు చేసినను శ్రీనివాసుడును తృప్తిజెందడు అను

కట్టుబాటును చతురాననుడు యేర్పరచెను. అవతల శ్రీనివాసుని దర్శించి స్తుతించి పాదములపైబడి చతుర్ముఖు డిట్లు వరమును కోరెను 'ఓ దేవా! నేను ప్రతిష్ఠించిన వరాహమూర్తికి నీకంటెముందుగా నిత్యారాధనము జరుగవలెను. వరాహమూర్తిని దర్శించిన తరువాతనే నీ దర్శనమును సేవార్థులు చేసికొనవలయును' అని వరమడుగగా శ్రీనివాసుడట్లేయగుగాక యని వరమిచ్చెను. కాగా శ్రీ స్వామిపుష్కరిణికి వాయవ్యభాగమున వరాహతీర్థమను పేరిట ప్రసిద్ధిజెందిన పుణ్యతీర్థమగుచున్నది

— నిషాదునకు వరాహమూర్తి దర్శనమిచ్చుట —

నిషాదోఽ భూద్గిరివరే శ్యామాకాఽఽవాపక శ్శుచిః ।
ఆహారభూతశ్యామాకతణ్డులం ప్రత్యహం నృప ॥ ౧౫

వైఖానసే ద్విజవరే దత్వా పాకం విధాయ చ ।
దాపయిత్వా చ నైవేద్యం స్వయం భుఙ్క్తే త దేవ చ ॥ ౧౬

కదాచిత్తణ్డులం కృత్వా దత్వా పుత్రవశే త్వగాత్ ।
వనాద్వనాంతరం వ్యాధో మధ్వన్వేషణతత్పరః ॥ ౧౭

తస్మిన్నేవాంతరే పుత్రః క్షుధయా పరిపీడితః ।
కృత్వా శ్యామాకపక్వాన్నం మనసా విష్ణవే ఽర్పయన్ ॥ ౧౮

అభుఙ్క్తాథ పితాప్యాగాన్మధుచ్ఛత్రం ప్రగృహ్య చ ।
శ్రీనివాసస్య నైవేద్యతణ్డులం దేహి పుత్రక ॥ ౧౯

పిత్రేత్యుక్తస్సుతః ప్రాహ తాతాః హం క్షుధయాఽర్దితః ।
తాన్పక్త్వా భుక్తవానస్మి విష్ణవే మనసాఽర్పయన్ ॥ ౨౦

ఇత్యుక్తవతి పుత్రే స తచ్ఛ్రుత్వా క్రోధమూర్ఛితః ।
ప్రాయశ్చిత్తం చికీర్షుస్సన్ కరవాలమథాదదే ॥ ౨౧

శిర శ్ఛేత్తుం స్వపుత్రస్య తదా వల్మీకగః కిటిః ।
ప్రగృహ్య తరసా ఖడ్గం తన్నిషాదమువాచ హ ॥ ౨౨

తా॥ కొంతకాలము జరిగినది. ఎన్నడో నిర్మింపబడిన భగవదాలయము శిధిలమాయెను. అట్టి సందర్భములో ఒక శుభసంఘటన మేర్పడినది. అప్పు డొక నిషాదుడుండెను. ఆ నిషాదుడు శ్రీనివాసభక్తుడు. ఆతడు వేంకటగిరియందు వసియించుచు తాను నిత్యము అహారమునకై తెచ్చిన శ్యామాకతండులములను అర్చకుడగు నొక వైఖానసద్విజుని చేతికిచ్చి పక్వముచేయించి భగవన్నివేదనము కావింపజేసి, ఆ ప్రసాదశేషమును దేహధారణమునకై వినియోగపరచు కొనుచుండెను ఇట్లు జరుపుకొనుచు ఒకనాడు తండులములను తయారుచేసి భద్రపరచుమని కుమారునకుచెప్పి నిషాదుడు తేనెతెచ్చుటకై అడవికివెళ్లెను. తండ్రి అడవినుంచి వచ్చునంతలో ఆకలిచెందిన నిషాదబాలుడు తండులములను పక్వముచేసి స్వామికి నివేదించి తాను తినెను. ఇంతలో తండ్రి అడవినుంచి తేనెపట్టుతెచ్చి తండులములను తెమ్మని కొడుకునడిగెను. తాను వాటిని వండి భగవానునకు మానసికముగ అర్పించి భుజించితినని కుమారుడు బదులుచెప్పెను. ఆ మాటలు వినినతండ్రి మామూలుమేరకు భగవానునకు నైవేద్యము జరుగలేదని దుఃఖించి కుమారునిపై కోపించి భగవన్నివేదనము జరుపని పాపమున కాతని వధించుట ప్రాయశ్చిత్తమని నమ్మి కత్తినెత్తి వాని వధింపబోయెను. అంతలో అచ్చట వల్మీకమున డాగియున్న వరాహదేవుడు బాలకుని రక్షించుటకై పుట్ట నుంచి పైకివచ్చి నిషాదుని కత్తికడ్డమువచ్చి కత్తిని పట్టుకొని ఇట్లనెను.

నాపరాధోఽస్తి తే పుత్రే యతోఽన్నం చార్పితం మమ ।
త్వత్తోఽప్యధికభక్తోఽయం భక్త్యా తదహమద్మి వై ॥ ౨౩

ఇత్యుక్తో విహ్వలః పశ్చాద్దదర్శాద్భుతకర్మ తత్ ।
పునర్విమృశ్య తద్రూపం బహుధా న చ దృష్టవాన్ ॥ ౨౪

తమేవ ద్రష్టుకామస్సన్నిషాదోఽన్నవివర్జితః ।
వనే చచార ధర్మాత్మా తదా కోలమ్మహాద్భుతమ్ ॥ ౨౫

శ్యామాకవనమధ్యస్థం శ్యామాకాంకురభక్షిణమ్ ।
కుర్వంతం శ్వేతముద్వీక్ష్య తం హంతుం చాన్వగాద్రుషా ॥ ౨౬

సోఽపి నానావనోద్దేశాంశ్చారయిత్వా పునః క్రమాత్ ।
ప్రవివేశ స్వవల్మీకం స్వామిపుష్కరిణీతటే ॥ ౨౭

అయమేవ విభుర్విష్ణురితి జ్ఞాత్వా యయౌ ద్రుతమ్ ।
వల్మీకం పరయా భక్త్యా జగౌ ప్రాకృతయా గిరా ॥ ౨౮

తదా వల్మీకగః ప్రాహ హరిరేనం మృగాంతకమ్ ।
'నాహం దృశ్యోఽస్మి తే పుత్ర:' సచ్చిదానందవిగ్రహః ॥ ౨౯

కిం తు వక్ష్యామి తే పుత్ర! బ్రహ్మణా స్థాపితం పురా ।
శిలారూపం చ వల్మీకే వర్తతే తత్సముద్ధర ॥ ౩౦

విమానం కారయిత్వా చ తస్య పుష్కరిణీతటే ।
బ్రాహ్మణైశ్చ విధానజ్ఞైః పూజాం కారయ మే విభోః ॥ ౩౧

ఇత్యుక్త మాత్రేణ నిషాదవర్యో వల్మీకగం విష్ణుమధోజ్జహార ।
వాయవ్యభాగే చ విమానవర్యం విధాపయామాస విధానవిత్తమైః॥

తా॥ 'ఓ నిషాదభక్తాగ్రేసరా' త్వరపడకుము. నీ విడ్డ యందెట్టి వ్యతిక్రమము లేదు. నీ కంటెకూడ నాతడు నా కంతరంగుడు. ఆతడు మానసికముగా అర్పించిన ప్రసాదమును నేను భుజించితిని,' అని యా వరాహస్వరూపము పలికిన మాటలను వినిన నిషాదుడు ఆశ్చర్యచకితుడై నలుదిశలను పారజూడగా ఆ వరాహరూపము మరుగుపడెను అంతట నిషాదుడు అన్నాహారములను విడచి తిరిగి ఆ దివ్యరూపమును సందర్శించవలయునను నాశతో దానికై వెతకుటకు మొదలుపెట్టెను. వరహాముకూడ నిషాదుని చేతికిచిక్కక వానిని త్రిప్పిత్రిప్పి తన వల్మీకమున ప్రవేశించుమండెను ఇట్లు వరాహమును పట్టుకొనజాలక విసగిన నిషాదుడు ఆ వరాహము సాక్షాత్తుగ విష్ణురూపమని నమ్మి వల్మీకము కడకువెళ్లి భక్తితో స్తోత్రముచేసెను అంతట భక్తపరాయణుడగు భగవానుడు కరుణించి 'ఓ నిషాదా! నేను సచ్చిదానందస్వరూపుడను. ఈ రూపమును దర్శించుటకు నీకు శక్తిచాలదు. పూర్వము చతుర్ముఖునిచే స్థాపింపబడిన నా శైలవిగ్రహము ఈ వల్మీకమందున్నది. దానిని నీవు పైకితీసి పుష్కరిణీతటమున యథావిధిగ ప్రతిష్ఠించి విమానమును నిర్మించి పూజలను జరిపించుము.

తతో నిషాదం తం ప్రాహ కిటిరూపీ హరిస్స్వయమ్ ।
పూర్వం సేవ్యం విమానం మే తీర్థం చ శ్రీనివాసతః ॥ ౩౩

తతః ప్రభృతి తత్తీర్థం పూర్వసేవ్యం బభూవ హ ।

తా॥ భగవదాజ్ఞను శిరసావహించిన నిషాదుడు వల్మీక గర్భమునుండి వరాహదేవుని విగ్రహమును ఉద్ధరించి యథోక్తముగ ప్రతిష్ఠించెను. ఆపల నిషాదుని జూచి, 'ఓ నిషాదా! ఈ క్షేత్రము నాకుచేరినది కొండకువచ్చెడి భక్తులు నా తీర్థమున ముందు స్నానముచేసి ముందుగా నాదర్శనము చేసుకొని తరువాతనే ఇతరతీర్థములలో స్నానము శ్రీనివాసమూర్తి దర్శనము చేసికొనవలయును' అని నిర్ణయమును చెప్పెను. ఆనాటినుంచి వరాహపుష్కరిణియొక్క మహత్త్వము అనుష్ఠాతలలో ప్రసిద్ధిజెందినది.

ఉత్తరే ధనదం తీర్థం ధనదేన వినిర్మితమ్ ॥ ౩౪

యత్ర స్నాత్వాఽఘనిర్ముక్తో ధనసంపదమాప్నుయాత్ ।
ఐశాన్యాం గాలవం తీర్థం గాలవేన వినిర్మితమ్ ॥ ౩౫

యత్ర స్నాత్వా చ పీత్వా చ భుక్తిమ్ముక్తిం చ విందతి ।
మార్కణ్డేయం పూర్వభాగే మార్కణ్డేయవినిర్మితమ్ ॥ ౩౬

తత్ర స్నాంతి నరా యే తు తేషామాయుః ప్రవర్ధతే ।
అగ్నినా నిర్మితం తీర్థమాగ్నేయ్యాం పాపమోచనమ్ ॥ ౩౭

దక్షిణే యమతీర్థం తు నరకోత్తారకారణమ్ ।
వసిష్ఠనిర్మితం తీర్థం రాక్షసే త్వృణమోచనమ్ ॥ ౩౮

వారుణే వాయుతీర్థం చ సద్యః కైవల్యదాయకమ్ ।
మధ్యే సరస్వతీతీర్థం మహాపాతకనాశనమ్ ॥ ౩౯

య ఏషు నవతీర్థేషు స్నానమేకదినే నరః ।
కృత్వా పశ్యేచ్ఛ్రీనివాసం న పునర్జాయతే తు సః ॥ ४०

తా॥ ఉత్తరదిశను ధనదతీర్థము. ఇది కుబేరునిచే నిర్మింపబడినది. ఇందు స్నానముచేయువారికి సకల పాపములుహరించి ధనలాభము చేకూరును ఈశాన్యమున గాలవునిచే నిర్మించబడిన గాలవతీర్థము కలదు ఈ యుదకములందు స్నానముచేయుట తీర్థమును పానముచేయుట భుక్తి ముక్తుల నిచ్చును. పూర్వభాగమున మార్కండేయునిచే నిర్మింపబడిన మార్కండేయ తీర్థముకలదు. ఇందు స్నానముచే ఆయుర్వృద్ధికలుగును ఆగ్నేయదిశను అగ్నినిర్మితమగు నాగ్నేయతీర్థము పాపవిమోచనకరము దక్షిణమున నరకోత్తరణ కారణమగు యమతీర్థము ఇది వసిష్ఠునిచే నిర్మితము నైఋతిదిశను ఋణవిమోచనతీర్థము కలదు. పశ్చిమదిశను సద్యఃకైవల్యఫలదమగు వారుణతీర్థము కలదు. ఈ దిక్పాల తీర్థములకు మధ్యమున మహాపాతకనాశనమగు సరస్వతీ తీర్థము కలదు. ఈ తొమ్మిది తీర్థములందును ఒకేదినము స్నానముచేసి శ్రీనివాసుని సేవించువాడు జన్మరహితుడుకాగలడు.

స్వామిపుష్కరిణీస్నానం శ్రీనివాసస్య దర్శనమ్ ।
సహస్రనామపఠనం నాల్పస్య తపసః ఫలమ్ ॥ ४१

అస్నాతుర్నవతీర్థేషు వరాహం చాప్యపశ్యతః ।
సర్వం నిష్ఫలతాం యాతి శ్రీనివాసో న తుష్యతి ॥ ४२

ఫలం ధర్మాదికం చైవ న యచ్ఛతి నృణాం విభుః ।
తత్తత్ప్రశంసినీం దివ్యాం కథాం న శృణుయాద్యది ॥ ४३

తీర్థయాత్రా చ విఫలా భస్మన్యేవ హుతం యథా ।
తస్మాత్కురు మహాభాగ కథాయాః శ్రవణం సదా ॥ ४४

ఇతి శ్రీబ్రహ్మపురాణే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే శ్రీ
వరాహావిర్భావ స్వామి పుష్కరిణీగత తీర్థమాహాత్మ్య
వర్ణనం నామాష్టమోఽధ్యాయః.

తా॥ శ్రీస్వామిపుష్కరిణీ పుణ్యజలములందుస్నానము శ్రీనివాసమూర్తి దివ్యమంగళవిగ్రహదర్శనము శ్రీ విష్ణుసహస్రనామపఠనము ఈ మూడును మహో తపస్సంపన్నులకుగాని లభించవు. పై జెప్పిన నవతీర్థములందు స్నానము చేయకగాని శ్రీ వరాహమూర్తిని దర్శనము చేయకగాని శ్రీ నివాసమూర్తిని దర్శించినచో యాత్రాఫలము సిద్ధించదు శ్రీనివాసునికి అనుగ్రహము కలుగదు ధర్మార్థ కామ మోక్షములను భగవానుడు ప్రసాదించడు. ఈ చెప్పబడిన తీర్థ మాహాత్మ్యమునుగాని వరాహమహిమనుగాని విననివారలకు యాత్రాఫలము కలుగదు కావున ఈ కథను యెల్లప్పుడును వినుచుండుము.

ఇది శ్రీ బ్రహ్మపురాణమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమునందు శ్రీ వరాహదేవుని ఆవిర్భావము శ్రీ స్వామిపుష్కరిణీతీర్థగత వరాహతీర్థమాహాత్మ్య వర్ణనము అనునది యెనిమిదవ అధ్యాయము



## తొమ్మిదవ అధ్యాయము.

—: శ్రీ వేంకటాద్రియందలి పుణ్యతీర్థముల స్నాన ప్రశంసనము. :—

(దిలీపుడు ప్రశ్నించుచున్నాడు)

కో విధిస్తీర్థయాత్రాయాం కః కాలః కిం ఫలం భవేత్ ।
ఏతద్విస్తార్య మే బ్రూహి తృప్తిర్నాద్యాపి జాయతే ॥ ౧

తా॥ ఓ మునివర్యా! శ్రీ వేంకటాద్రి యాత్రా వివరమును విస్తరించి వివరించెదరని ప్రార్థించెదను

(సూర్యాసుడు బదులు చెప్పుచున్నాడు)

భువి జన్మ సమాసాద్య సంస్కారైరపి సంస్కృతః ।
అధీతవిద్యో బాల్యే చ స్నాతకవ్రతనిష్ఠితః ॥ ౨

తీర్థయాత్రాం ప్రకుర్వీత శాస్త్రిణాం ప్రత్యయాయ చ ।
నిత్యం నైమిత్తికం కామ్యమితి కర్మత్రిధా మతమ్ ॥ ౩

తత్ర నైమిత్తికం ప్రాహుస్తీర్థయాత్రామ్మహాత్తమాః ।
నా విద్యస్యాధికారోఽత్ర విద్యావిధిరనుత్తమః ॥ ౪

న తీర్థయాత్రాం కుర్వీత మనీషీ మననే రతః
యాత్రాయాం మననాభావాచ్చిత్తవిక్షేపహేతుతః ॥ ౫

నరో విస్మృతవిద్యత్వాద్జ్ఞానహీనో భవేత్స్వయమ్
నష్టసంజ్ఞో విమార్గస్థో నిరయం చాధిగచ్ఛతి ॥ ౬

నిరాగమస్తు తీర్థస్య తథా చాకృతసత్క్రియః
న తత్ఫలమవాప్నోతి శ్రమ ఏవ హి కేవలమ్ ॥ ౭

సత్సంగీ సత్కథాం శృణ్వన్ సదాచారసమన్వితః
తీర్థయాత్రాం ప్రకుర్వాణో బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ ౮

తీర్థయాత్రాపరో యస్తు విధిజ్ఞో విధివిత్తమైః
నిర్ధూతాఖిలపాపస్సన్ స యాతి పరమాం గతిమ్ ॥ ౯

తా॥ భారతదేశము కర్మభూమి. ఇచ్చట జన్మించిన పురుషుడు వర్ణాశ్రమోచితమగు సంస్కారములను పొంది విద్యాభ్యాసముచేసి వివాహమాడి శాస్త్రవిశ్వాసము దృఢపడుటకై, పుణ్య తీర్థములను సేవించవలయును. పురుషుడాచరించదగిన కర్మములు - నిత్యము. నైమిత్తికము, కామ్యము - అని మూడు విధములుగ నున్నవి. అందు తీర్థయాత్రలు నైమిత్తిక కర్మ యనబడును. విద్య లేనివానికి తీర్థయాత్రల వలని ప్రయోజనము తక్కువ. కర్మయోగభేదములలో తీర్థయాత్రకూడ ఒక కర్మగా పెద్దలవలన చెప్పబడినది. జ్ఞానయోగాధికారియగు వానికి తీర్థయాత్ర ఉపయోగించదు. ఆతనికి చిత్త మాత్మానందానుభవముననే నిమగ్నమైయుండుటచే అతనికి తీర్థయాత్రలో ప్రయత్నముగాని, ప్రవేశముగాని కలుగుట కవకాశములేదు. శాస్త్రజ్ఞానము, గురుశుశ్రూషాదులు లేనివాడు జ్ఞానశూన్యుడగును కావున ప్రపంచజ్ఞానము లేనివాడై, అమార్గమునబడి నరకమునకు పోవును. కేవల జ్ఞానయోగనిష్ఠుని గతియు కర్మయోగపరుని దృష్ట్యా అట్టిదే కాగలదు. శాస్త్రజ్ఞానము లేనివాడును, సత్కర్మానుష్ఠానము లేనివాడును చేయు తీర్థయాత్ర ఉక్తఫలము నీయజాలదు ఆతడుచేయు యాత్ర శ్రమదాయకము మాత్రమే కాగలదు. సాధు సహవాసము కలిగి, భగవత్కథలను చెప్పుకొనుచు, పెద్దలవలన వినుచు, సదాచారసంపదతో భక్తిశ్రద్ధలు కలిగి; పుణ్యతీర్థములకు

యాత్రచేయు వారు, భగవన్మందిరములను దర్శించువారు, తమ యాత్రలను సాగించవలయును. అట్టి వారలు బ్రహ్మసాయుజ్యము నందెదరు. 'మచ్చిత్తా మద్గత ప్రాణాః బోధయన్తః పరస్పరమ్ – కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చరమన్తి చ॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్। దదామి బుద్ధి యోగం తం యేన మాముపయాన్తి తే' ॥ అని గీతాచార్యుని ఉపదేశము. 'ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞాః యోగయజ్ఞాస్తథా పరే। స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయశ్శంసితవ్రతాః' అని కర్మయోగ ప్రకారముల పరిసంఖ్యాగణములో తీర్థ యాత్రలు ప్రకారవిశేషముగ చేయబడిన ఏనునది అభియుక్తుల సాంప్రదాయమై యున్నది

కామ్యం న కుర్వీత నరః కామాఽప్త్యా జన్మ చాశ్నుతే
జాతః కర్మాణి కురుతే కర్మణా చ పునర్జనిః ॥ ౧౦

ఐహికాముష్మికం సర్వం నిష్కామో లభతే ఫలమ్
సర్వేషామేవ జంతూనాం విద్యయా మననే విధిః ॥ ౧౧

అభ్యస్తానాం చ విద్యానాం శ్రవణా న్మననా దపి
పరాపరోక్షశాస్త్రార్థప్రత్యయో లేశతో భవేత్ ॥ ౧౨

దృష్టప్రత్యయశాస్త్రార్థే పున శ్శ్రద్ధాఽభి జాయతే
శ్రద్ధయా జాయతే భక్తిర్భక్త్యా తుష్యతి కేశవః ॥ ౧౩

తీర్థయాత్రాం ప్రకుర్వీత శాస్త్రాలాపసమన్వితః
శాస్త్రాలాపాచ్చ జానాతి మనసా విభుమవ్యయమ్ ॥ ౧౪

తథా దేవా శ్చ ఋషయస్సదాలాపసమన్వితాః।
ఉపాసతే సంజానానా భగవంత మధోక్షజమ్ ॥ ౧౫

వసిష్ఠాద్యాశ్చ ఋషయో దేవతా అపి సర్వశః।
తీర్థే కృతాధివాసా శ్చ సమాధిస్థాః పరం యయుః ॥ ౧౬

అనాగమ స్తు యో మర్త్యో య శ్చా జ్ఞాతవిధి స్తథా।
న స్నానఫల మాప్నోతి కాకమణ్డూకవ త్తు సః ॥ ౧౭

అధీతవిద్యస్సుకృతీ కృతస్నానాదిసత్క్రియః ।
శుద్ధాంతరో జ్ఞానవాంశ్చ తేన మోక్షం చ విందతి ॥ ౧౮

తా ॥ పురుషుడు ఏయొక్క కర్మనుగాని ఫలకామనతో చేయరాదు. ఫలకామన జన్మహేతువగును. జన్మించిన వెనుక తిరిగి కర్మ చేయును. ఆ కర్మచే తిరిగి జన్మప్రాప్తి. ఈ చక్రమునకు అవధిలేదు. ఐహికము గాని ఆముష్మికము గాని ఏ కర్మయైనను ఫలకామనారహిత మైనప్పుడే సఫలమగును. సకలప్రాణులకును విద్యయనునది 'మననము' అను పై యవస్థను చెందినప్పుడే పరాపరోక్ష శాస్త్రార్థప్రత్యయము లభించును. దాని తరువాతనే శ్రద్ధ అధికముగ జనించి, భగవద్భక్తి యేర్పడును భక్తియోగము కలిగినవానియందు భగవదనుగ్రహము ప్రసరించును. కాగా తీర్థయాత్రను సంకల్పించిన పురుషుడు భగవద్గుణానుభవమును తెలియపరచు శాస్త్రార్థములను అనుసంధానము చేసికొనవలయును. శాస్త్ర పరిచయాధిక్యముచే భగవన్మహిమ తెలియవచ్చును ఇదేరీతిని దేవతలు, ఋషులు, భగవద్గుణానుభవమును తెలిపెడి కథాలాపములతో తమ కాలమును గడుపుచుందురు. ఓసిష్ఠామలగు పరమఋషులు యిట్టి పుణ్యతీర్థములందే తమ ఆశ్రమములను నిర్మించుకొని యోగమార్గమున భగవంతుని నుపాసనము జేసి కడతేరిరి. శాస్త్రార్థజ్ఞానము లేనివాడును, ఇతి కర్తవ్యతాజ్ఞానము లేని-డును, తీర్థములందు స్నానాదుల నాచరించినను ఆతడు ఉక్తపుణ్యఫలమును సాధింపజాలడు. వాని స్నానము ఉదకములందు సంచరించు కాకులు, మండూకములు, చేసిన స్నానము వలె ఫలశూన్యమే యగును. విద్యాభ్యాసము చేసి స్నానవిధి విధానములను తెలిసికొని వర్ణాశ్రమోచిత సంస్కారసంస్కృతుడై విధిప్రకారము శుద్ధాంతరాత్మతో ఆత్మానాత్మజ్ఞాన వివేకము కలిగి తీర్థయాత్రల జేయువానికి ఉక్త ఫలము సిద్ధించును.

సత్కర్మసంతతి ర్యా తు జ్ఞానవిజ్ఞానసంయుతా ।
అపరోక్షదృశా చాపి భక్తిశ్రద్ధావిరక్తిభిః ॥ ౧౯

పుంసః కైవల్యదా సా హి క్రమేణాసుకృతాత్మనః ।
దృష్టశ్రుతానుభావా యే దేవాశ్చ ఋషయస్తథా ॥ ౨౦

విశుద్ధ్యర్థం ప్రకుర్వంతి సత్క్షేత్రస్యాను వర్తనమ్ ।
భక్తిశ్రద్ధావిహీనానాం మనుష్యాణాం తు కా కథా ॥ ౨౧
లబ్ధవిద్యాధికారశ్చ సత్సంగత్యా చ సంయుతః
యశ్శృణ్వఞ్ శ్రావయంశ్చాపి సతాం సంగేన సంయుతః॥ ౨౨
తీర్థవైభవమాకర్ణ్య సమ్యక్త్వేనైవ నిర్వృతః
తీర్థయాత్రాం ప్రకుర్వీత భక్తిశ్రద్ధాసమన్వితః ॥ ౨౩
తేన నిర్ధూతపాపస్సఞ్ స యాతి పరమాం గతిమ్
యత్ర యత్ర త్వయా కార్యా తీర్థయాత్రా క్షితీశ్వర ॥ ౨౪
తత్రానేనవిధానేన ప్రీణయస్వ జనార్దనమ్
త్వదీయధనధాన్యాదీన్భక్త్యా కురు సమర్పితాన్ ।
వేఙ్కటేశస్య యాత్రాం వై కురు నిత్యమతంద్రితః ॥ ౨౫

ఇతి శ్రీ బ్రహ్మపురాణే శ్రీ వేఙ్కటాచలమాహాత్మ్యే తీర్థయాత్రాప్రకారవర్ణనం నామ నవమోఽధ్యాయః

తా॥ జ్ఞానయోగాధికారి యగు ప్రాజ్ఞునకుగూడ సత్కర్మాచరణ మనునది కైవల్యసాధనము కాగలదు. దృష్టశ్రుతానుభావులగు దేవతలేమి మహర్షులేమి తమ పవిత్రతకు ఉత్తేజకముగ తీర్థయాత్రలను చేయుచున్నారు. భక్తిశ్రద్ధావిహీనులగు ప్రాకృతమానవులకు తీర్థయాత్రలు అతిప్రధానములను విషయమున చెప్ప దగిన దేమున్నది? వేదవిద్యల నభ్యసించి సాధుజనసహవాసముతో చేరి భగవత్కథలను స్వయముగా అనుసంధించుచు, ఇతరులకు బోధించుచు ఆ యాపుణ్యతీర్థముల వైభవములను తెలిసికొనుచు, మహానందముతో భక్తిశ్రద్ధలు కలిగి తీర్థయాత్రల జేయుట పురుషున కొక పురుషార్థసిద్ధి యగును. ఈవిధమగు తీర్థయాత్రావ్యాపృతిచే అట్టి పురుషుడు సకలపాపములు తొలగి పరమపదమును చేరగలడు. ఓ రాజా! నీకు యే యే పుణ్యప్రదేశములందు తీర్థయాత్రలను సేవించవలయునను ఆశ కలుగునో అచ్చటచ్చట ఆ యాత్రను చేయునప్పుడు సహకారులగు నుత్తమ పరిజనములతో భగవత్కథలను చెప్పుకొనుచు భగవత్ప్రీతిగ యాత్ర చేయుము. భగవానుని సేవింపుము. నీకు గల ధనధాన్యాది సంపదను

యధోక్తముగ సాత్త్వికత్యాగపూర్వకముగ భగవానునకును కైంకర్యమునకును కైంకర్యపరులకును అర్పించుము. ముఖ్యముగ శ్రీ వేంకటాచలయాత్రను ఇదే తీరున కొనసాగించిన కృతకృత్యుడవగుదువు.

ఇది శ్రీ బ్రహ్మపురాణమున శ్రీ వేంకటేశ్వరమాహాత్మ్యమునందు తీర్థ యాత్రా ప్రకారవర్ణనమనునది తొమ్మిదవ అధ్యాయము.

---

## పదవ అధ్యాయము.

—: శ్రీవేంకటాద్రియందు చేయదగిన మహాదానములు :—

(దిలీపుడు ప్రశ్నించుచున్నాడు)—

కాని దానాని శస్తాని కర్తవ్యాని మహీధరే
ప్రీతయే శ్రీనివాసస్య తాని మే వద సువ్రత ॥ ౧

తా॥ ఓ మునీంద్రా ! భగవత్ప్రీతికై శ్రీవేంకటాద్రి యాత్రా సమయమున చేయదగిన దానములను చెప్పుము

(దూర్వాసుడు బదులు చెప్పుచున్నాడు)—

శృణు భూప ప్రవక్ష్యామి కర్తవ్యాని మహీధరే
అన్నదానం పితృశ్రాద్ధం ద్వయమేవ ప్రశస్యతే ॥ ౨

సువర్ణం యే ప్రయచ్ఛంతి ప్రీతయే మధుఘాతినః
తే యాంతి మోక్షమమృతం వాసోదా ఆయురేవ చ ॥ ౩

కాఙ్క్షన్తి పితరస్సర్వే శ్రాద్ధం వేఙ్కటభూధరే
కృతే శ్రాద్ధే ప్రహృష్యంతి ప్రయాంతి పరమాం గతిమ్ ॥ ౪

యః కుర్యాత్కపిలాదానం ప్రీతయే శ్రీపతేర్నృప
రోమసఙ్ఖ్యాప్రమాణేన విష్ణులోకే మహీయతే ॥ ౫

యో దద్యాద్దేవభోగాయ గాం భూమిం భక్తిసంయుతః
స సద్యో ముక్తిమాప్నోతి జ్ఞానాజ్ఞానకృతాదఘాత్ ॥ ౬

దేవభోగాయ యోదద్యాద్గ్రామనడ్వాహమేవ చ
స మోక్షభోగమాప్నోతి న పునర్జాయతే భువి ॥ ౭

కర్పూరం చందనం శఙ్ఖం యాని వై భూషణాని చ
యో విష్ణవే ప్రదద్యాత్స గురుతల్పం వ్యపోహతి ॥ ౮

బహుభిర్భూషణైర్యస్తు పూజాం కుర్యాజ్జగత్పతేః
లిఙ్గభఙ్గమవాప్నోతి స్వానుభూతిం చ విందతి ॥ ౯

సమస్తదేవపూజార్థం యో వై గ్రామాన్ప్రియచ్ఛతి
స యాతి పరమాం సిద్ధిం నిర్ధూతాఖిలబంధనః ॥ ౧౦

కన్యాకోటేః ప్రదానాద్యత్స్యాదర్బుదగవాం తథా
ఏకస్మాద్రథనిర్మాణాద్విష్ణోస్తత్ఫలమశ్నుతే ॥ ౧౧

ఛత్రం చ కనకం చైవ వ్యజనం చామరం స్రజమ్
యో దద్యాచ్ఛ్రీపతేర్విష్ణోర్వేఙ్కటాఖ్యే మహీధరే ॥ ౧౨

ఆబ్రహ్మకల్పపర్యంతం మహీపాలో భవేద్ధ్రువమ్
పశ్చాన్మోక్షమవాప్నోతి పితృపైతామహైర్వృతః ॥ ౧౩

యో దద్యాద్గజమశ్వం వా భువనాధిపతేర్విభోః
స లోకపాలతామేతి నాత్ర కార్యా విచారణా ॥ ౧౪

యద్యదిష్టతమం వస్తు దీయతే మధుఘాతినః
తేనాక్షయఫలం ప్రాప్య మోదతే విష్ణుమందిరే ॥ ౧౫

ఫలం పాత్రానుగుణ్యాత్స్యాత్పాత్రమత్ర హరిస్స్వయమ్
అక్షయ్యమితి కిం బ్రూయాద్యత్కించిదపి మోక్షదమ్॥ ౧౬

తా॥ ఓ రాజా! చెప్పెదను వినుము. వేంకటాద్రియాత్రలో పర్వతము పైన అన్నదానము, పితృశ్రాద్ధము ముఖ్యములు. భగవత్ప్రీతిగా సువర్ణదానము చేసినచో మోక్షము సిద్ధించును. వస్త్రదానము ఆయుస్సు నిచ్చును. పితృదేవతలు

తమ సంతతినుండి శ్రీవేంకటాద్రియందు పిండదానమును ఆశింతురు. కపిల గోవును దానముచేసినచో ఆ గోవు రోమములసంఖ్యగల సంవత్సరములకాలము విష్ణులోకము సిద్ధించును. భగవత్కైంకర్యమునకై భూదానము చేయువాడు జ్ఞానాజ్ఞానకృతపాపములనుండి విడివడి సద్యఃమోక్షము చేరును. ధేనువునుగాని వృషభమును గాని దానము చేసిన వానికి పునర్జన్మలేక మోక్షము సిద్ధించును. కర్పూరము, చందనము, శంఖము, భూషణము వీట్లను ఇచ్చువానికి గురుతల్ప దోషము కూడ పోయి పరిశుద్ధుడగును. వివిధములగు దివ్యాభరణములచే భగవానునకు అలంకారము సమర్పించువాడు శరీరమునుండి ముక్తుడై మోక్షమునకు పోవును. భగవత్పూజకై గ్రామాగ్రహారాదుల నిచ్చువాడు సకలపాపబంధ వినిర్ముక్తుడై పరమపదమునకు పోవును. భగవానునకు రథయాత్రకై మహారథమును నిర్మించి యిచ్చు వానిఫలము గొప్పది. కోటి కన్యకాదానములు అర్బుదము గోదానములు చేసిన ఫలము రథనిర్మాతకు లభించును. బంగారుతో ఛత్రము చామరము, వ్యజనము, పుష్పదామము చేసి సమర్పించువాడు ఆబ్రహ్మకల్ప పర్యంత దీర్ఘకాలము చక్రవర్తియై సమస్తభోగముల ననుభవించి తన పితృదేవతలందరితో చేరి పరమపద సామ్రాజ్యమును కూడ చేరగలడు. భగవానునకు యేనుగు, గుఱ్ఱమును ఇచ్చువాడు లోకపాలపదవి ననుభవించును. తనకు యిచ్చవచ్చి యే పదార్థమునుగాని భక్తితో భగవానునకర్పించువాడు పరమపదము నొందును. లోకరీతినిగూడ దానమునిచ్చు పాత్రవైశిష్ట్యము ననుసరించి ఫలము కలుగునను శాస్త్రరీతిని అత్యుత్తమపాత్రమగు భగవానునకిచ్చెడి సమర్పణముకు ఫలము కలుగననుటలో అత్యుక్తిలేదు.

తత్ర పుణ్యతమే కాలే శ్రోత్రియే బ్రాహ్మణోత్తమె
యత్కించిద్దీయతే తత్తు వర్ధతే వటబీజవత్ ॥ ౧౭

ముక్తికామేన దాతవ్యా కన్యా పృథ్వీ సరస్వతీ
న తాసాం సదృశం దానం త్రిషులోకేషు విద్యతే ॥ ౧౮

గీతవాదిత్రనృత్తాద్యం యః కారయతి మానవః
సద్య ఏవ స ముచ్యేత మహాపాతకకోటిభిః ॥ ౧౯

కుర్యాద్ధ్వజపతాకాభిస్సపర్యాం పరమాత్మతః
తేన ధూతాఖిలాఘస్సన్ న యాతి పరమాం గతిమ్ ॥ ౨౦

ఘణ్టాం దదాతి యో మర్త్యో విష్ణవే పరమాత్మనే
దివ్యజ్ఞానమవాప్నోతి ప్రతిష్ఠాం చాధిగచ్ఛతి ॥ ౨౧

యః కుర్యాదుత్సవం విష్ణోస్సధ్వజై ర్గరుడాదిభిః
దేవేంద్రపదమాప్నోతి మోక్షం చైవాధిగచ్ఛతి ॥ ౨౨

పంచ పర్వాణి దేవస్య యః కారయతి మానవః
తస్యాపరాధసాహస్రం క్షమతే నాత్ర సంశయః ॥ ౨౩

ఇహాపి భుక్త్వా భోగాంశ్చ మోక్షం చైవాధిగచ్ఛతి
యః కారయతి నైవేద్యం స్వాదు షడ్రససంయుతమ్ ॥ ౨౪

తా ॥ పుణ్యకాలములందు వేంకటాద్రియందు శ్రోత్రియుడగు బ్రాహ్మణునకు భగవత్ప్రీతిగ జేసెడి స్వల్పదానమైనను వటబీజము వలె వృద్ధికరమగును. మోక్షకామియగువాడు కన్యాదానము, భూదానము, విద్యాదానము చేయనగును. వాటికి మించిన దానపదార్థము మూడు లోకములందును వేఱొకటి లేదు. గీత వాదిత్ర నృత్తోపకరణములను, కైంకర్యములను చేయువాడు సద్య మహాపాతకములనుండి విడివడును. ధ్వజ పతాకాద్యలంకారముల జేయువాడు పరమగతి నొందును. ఘంటాదానము చేయువాడు దివ్యజ్ఞానమును పొంది, లోకమున కీర్తిమంతుడగును. ధ్వజగరుడాదులతో పరివృతునిగజేసి భగవానునకు ఉత్సవములను చేయువాడు దేవేంద్రుడుగపుట్టి స్వర్గసుఖముల ననుభవించి మోక్షమునకుచేరును. భగవానునకు పంచ పర్వోత్సవములు (ప్రతిమాసమునందు శుక్ల కృష్ణపక్షములందు వచ్చెడి ద్వాదశి దినములు, అమావాస్య పూర్ణిమ శ్రవణ నక్షత్రము ఇయ్యవి పంచపర్వదినము లనబడును,) జరిపించువాని యపరాధములను భగవానుడు క్షమంచును. అంతేగాక వాడు ఇహపరసుఖముల ననుభవించి మోక్షమునకుకూడ చేరును. భగవానునకు షడ్రస సహితముగ నైవేద్యములను సమర్పించెడివాడు ఐహికములు ఆముష్మికములునగు సకల సుఖములను పొందును.

ఐహికాముష్మికాన్ లోకే సర్వాన్కామానవాప్నుయాత్
సహస్రనామభిః పూజాం శ్రీపతేః కారయేత యః ॥ ౨౪

తేనైవ సకలా పూజా కృతైవ స్యాన్న సంశయః
శారికాశుకపూర్వాంశ్చ విహంగాన్మర్కటాన్ రురూన్ ॥ ౨౫

సారఙ్గాన్గవయాన్దన్యాన్దత్వా స్వర్గ మవాప్నుయాత్
పుష్పోద్యానాని రమ్యాణి వనాని వివిధాని చ ॥ ౨౬

క్రీడాస్పదాని హర్మ్యాణి యః కరోతి స ముచ్యతే
యః కుర్యాద్దీపదానం తు నిత్యం విష్ణోశ్చ సన్నిధౌ ॥ ౨౭

బ్రహ్మహత్యాసహస్రాణి గురుతల్పార్బుదాని చ
తథాన్యపాపకోటీశ్చ నిర్దహేత్సూర్యవద్ధిమమ్ ॥ ౨౮

భగవానునకు సహస్రనామపూజ చేయించువానికి భగవత్పూజల నన్నిటిని సాకల్యముగ చేసినఫలము చేకూరును. భగవత్ప్రీతిగా శారికలు, శుకములు మొదలగు పక్షులను, మర్కటములు, రురువులు, సారంగములు, గవయములు మొదలగు మృగములను ఇచ్చువానికి స్వర్గఫలము సిద్ధించును. రమ్యములగు పుష్పోద్యానములు, క్రీడాస్పదములగు హర్మ్యములు నిర్మించి యిచ్చెడి వానికి పాతకబంధములు పోవును. భగవత్సన్నిధిని అజస్ర దీపదానము చేయువానికి పంచమహాపాతకములు నశించును.

—: విష్ణువర్ధుడను ద్విజుని కథ : —

అత్రైవోదాహరంతీమమితిహాసం పురాతనమ్
శ్రవణాత్సర్వపాపఘ్నం సర్వమంగళదాయకమ్ ॥ ౩౦

ద్విజబంధుః పురాకశ్చిద్విష్ణువర్ధాభిధో నరః
హత్వా స్వం గురుమత్యుగ్రో దేవస్వామీతి యం విదుః ॥ ౩౧

దాసవృత్త్యా గృహే తిష్ఠన్ తస్య పత్నీసహస్రకమ్
నివృత్తార్యపథో మూర్ఖో బుభుజే కామమోహితః ॥ ౩౨

భూయాన్కాలోఽత్యయాత్తస్య ప్రత్యహం పాపవర్త్మనః
తేన దోషేణ మహతా శ్వేతకుష్ఠోఽభ్యజాయత ॥ ౩౩

అఙ్గాని వ్యగ్రతాం ప్రాప్తా రోగోత్కృత్తాని ఖిద్ధశః
దరిద్రా గురుపత్న్యస్తాః పాతిత్యాత్యంతదుఃఖితాః ॥ ౩౪
మదాద్దైశ్వర్యజాడ్యాక్తా బలాత్తేన తదాఽపి చ
తతో లోకాపవాదాచ్చ గృహస్యాప్యగ్నిదాహనాత్ ॥ ౩౫
అయం చ బంధుభిస్త్యక్తో వనమేవావిశచ్ఛలః
సృగాలభక్ష్యతాం ప్రాప్తో నీతోఽయం యమకిఙ్కరైః ॥ ౩౬
జగామ నరకఙ్ఘోరం చణ్డకోలాహలం పరమ్
యత్ర వై నారకం దుఃఖం సకలం చాపి వర్తతే ॥ ౩౭

తా॥ ఈ సందర్భమున నొక ఇతిహాసము కూడ ప్రసిద్ధముగ కానవచ్చు చున్నది. ఈ కథను వినినవారలకు మంగళమగును. పూర్వకాలమున విష్ణువర్ధు డను నొక బ్రాహ్మణుడుండెను అతడు దుర్వృత్తికలిగి దేవస్వామియను తన ఆచార్యుని చంపి ఆతని యింటనే ఉండి ఆతని భార్యలు వేయిమందితో సహవా సము కలిగించుకొని, స్వధర్మమును విడచి యథేచ్ఛముగ వారలతో కాలము గడిపెను. ఇట్లు వానికి అనేక పాపదినములు గడచిపోయెను. ఈ పాపకృత్యముచే ఆతనికి శ్వేతకుష్ఠరోగము ప్రాప్తించెను. దేహమాద్యంతము క్రుళ్ళి, ఒక్కొక్క శరీరావయవము శిథిలమయ్యెను. ఈ పాపిష్ఠుని అత్యాచారమువలన దూషింప బడిన గురు స్త్రీలును దారిద్ర్యము లోకాపవాదము వార్ధక్యము మొదలగు దోష ములచే గృహమునకు అగ్నిని పెట్టికొని నశించిరి విష్ణువర్ధుడును పాపకృత్య మూలమున స్వజనముచే త్యజింపబడి అడవినిబడి మృతి జెందగా శవము నక్కల కాహారమాయెను, ప్రాణము యమకింకరులచే లాగబడి నరకలోకమున ప్రవేశపెట్టబడెను. మహా ఘోరమగు నరక కూపమున విష్ణువర్ధుడుచేరి చెప్పరాని దుఃఖములో పడిపోయెను.

వేంకటాద్రియందలి దీపారోప ప్రశంస.

తత్పుత్రో వేదనామా చ కదాచిద్వేఙ్కటాచలే
పితుః పాపఞ్చ సంస్మృత్య దేవదేవస్య సన్నిధౌ ॥ ౩౮
అహోరాత్రం దదావేకదినే దీపం నృపోత్తమ
తత్పితా తేన పుణ్యేన విధ్వస్తాఖిలపాతకః ॥ ౩౯

ధిక్కృత్య యమదూతాంశ్చ విష్ణులోకముపాయయౌ
తస్మాద్దీపప్రదో మర్త్యో న పునర్దుఃఖమశ్నుతే ॥ ౪౦
యత్కించిత్కురుతే దానం వేఙ్కటాచలమూర్ధని
తదాకల్పమవిచ్ఛిన్నం వర్ధతే వటబీజవత్ ॥ ౪౧

తా॥ విష్ణువర్ధన కొక కుమారు డుండెను అతడు తన తండ్రియొక్క దుర్వర్తనమునకు చింతించి వాని పాపశాంతినికోరుచు శ్రీ వేంకటాద్రియందు శ్రీనివాసుని దివ్యసన్నిధిలో ఒక అహోరాత్ర పర్యంతకాలము పితృఋణ మోచనమునకై భగవత్ప్రీతినిగోరి దీపదానము చేసెను. కుమారు డొనరించిన భగవత్సన్నిధానమందలి ఒకే దినపు దీపదాన ఫలమాతని తండ్రిని పూర్వపాప సంచయమునుండి నివృత్తునిచేయగా నాతడు యమదూతలను తిరస్కరించి యమలోకమున నరకయాతననుండి తప్పించుకొని వైష్ణవలోకమున కేతెంచెను. కావున భగవత్సన్నిధి యందలి దీపదానము సంసార బంధమును విడిపించును. ఇంతియేగాక శ్రీ వెంకటాద్రియందు చేయబడెడి ఒక్కొక్క కైంకర్యము లక్ష గుణితముగ వృద్ధిచెంది దాతను తరింపజేయును.

తదేతత్సకలం శ్రుత్వా వేఙ్కటేశస్య వైభవమ్
చలతి స్వగృహాద్యస్తు కృతనిశ్చయయా ధియా ॥ ౪౨
పదే పదే సోఽశ్వమేధఫలం ప్రాప్నోత్యసంశయమ్
వేఙ్కటేశస్య మాహాత్మ్యే శ్లోకం చార్ధం చ భక్తితః ॥ ౪౩
పదం చాప్యక్షరం చాపి యః పఠే చ్ఛృణుయాత్స తు
బ్రహ్మహత్యా సహస్రాణి పాతకాన్యపరాణ్యపి ॥ ౪౪
ఉపపాతకముఖ్యాని సద్యో హిత్వాఽర్యవద్ధిమమ్
వేఙ్కటేశస్య మాహాత్మ్యం యస్య గేహే ప్రవర్తతే ॥ ౪౫
ఆయురారోగ్య మైశ్వర్యం సోఽంతే విష్ణుపదం లభేత్

తా॥ ఈ చెప్పబడిన మాహాత్మ్యమును విని మనసు ద్రవించి యెవ్వడు ఆ యుత్తరక్షణముననే వేంకటాచల యాత్రకు బయలుదేరునో అట్టివానికి అతడు ఇంట నడచు ఒక్కొక్క అడుగు లెక్కచేయగా ఒక్కొక్కపదమునకు ఫలము ఒక్కొక్క అశ్వమేధ యాగఫలమునకు తుల్యముగ ప్రాప్తమగును.

అంతియేగాక శ్రీవేంకటాచల మాహాత్మ్య గ్రంథమందలి ఒకే శ్లోకమునుగాని అర్ధ శ్లోకమును అందలి ఒకే పదమును ఒకే అక్షరమునుగాని చదువుట లేక వినుట ఫలప్రదము. వేయి బ్రహ్మహత్యలను ఇతర సకల పాపములను ఉపపాతకము లను అన్నిదోషములను పై మాహాత్మ్య పారాయణ శ్రవణాదులునశింపచేయును సూర్యుని జూచిన హిమమువలె యే పాపముగాని ఈ మహిమముందు నిలువదు శ్రీ వేంకటాచల మాహాత్మ్య శ్రీకోశము (పుస్తకము) తమ యింటనుంచి పూజించెడి వారలకు సకుటుంబ పరివారముగ ఆయురారోగ్యైశ్వర్యములు లభించుటయే గాక దేహాంతమందు శ్రీ వైకుంఠలోకవాసముకూడ లభించును.

(సూతుడు చెప్పుచున్నాడు)

ఇతి శ్రుత్వా దిలీపోఽపి వైభవం పరమాద్భుతమ్ ॥ ౪౬

ఆనందాంబుధి సమ్మగ్నో న వివేద తదా పరమ్

అశ్రుత్వా మహిమానం తు ఫలం న ప్రాప్యతే నరైః

శ్రుత్వా చైవ ఫలం యాంతి విష్ణోస్సాయుజ్యమవ్యథ ॥ ౪౭

ఇతి శ్రీబ్రహ్మపురాణే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే
శ్రీవేఙ్కటాచలకృత మహాదానమాహాత్మ్య
వర్ణనం నామ దశమోఽధ్యాయః.

తా॥ ఈ విధముగ దుర్వాసునిచే అనుగ్రహింపబడిన భగవద్వైభవమును వినిన దిలీపుడు పరమానంద భరితుడై తనను తానెరుగక కొంత తడవు ముగ్ధుడై యుండిపోయెను. ఏ కథకుగాని ఫలశ్రుతిని తెలియనంతవరకు ఉక్తఫలమునందు విశ్వాసముకలుగుట కవకాశము కలుగదు గావున ఫలశ్రుతి నెరిగించుట న్యాయ్యము గనుక మహాభక్తుడగు దిలీపుని నిమిత్తముగా దీసికొని (పామరులగు మనబోటు లందరు తరించుటకై) దుర్వాసునిచే శ్రీ వేంకటనాథుని తీర్థయాత్రా మహిమ ప్రశంసించబడినది. దీనికి ఫలము విష్ణు సాయుజ్య ప్రాప్తికాగలదు

ఇది శ్రీ అకులమన్నాడు గ్రామాభిజనుడును శ్రీవైఖానస కులాలంకారుడును
శ్రీమద్వైయాకరణ పంచానన విద్వత్కవి సార్వభౌమ ఆగమాచార్యా
ద్యనేక బిరుదాలంకృతుడును అగు రొంపిచర్లభట్టర్ పార్థసారథి
భట్టాచార్యునిచే ప్రణీతమగు శ్రీ బ్రహ్మపురాణమున శ్రీ వేంక
టాచల మాహాత్మ్యమునందు, శ్రీ వేంకటాచలమునందు
చేయబడెడి మహాదానముల మాహాత్మ్యమును వర్ణించుట
యనునది పదవ అధ్యాయము.

శ్రీమైపద్మావత్యై నమః
శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః

## శ్రీ బ్రహ్మోత్తరఖండాన్తర్గత

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము

( ఆంధ్రతాత్పర్యసహితము )

శ్రియఃకాన్తాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥
శ్రీవేంకటాచలాధీశం శ్రియాఽఽధ్యాసితవక్షసమ్ ।
శ్రితచేతనమన్దారం శ్రీనివాసమహం భజే ॥

జయత్యాత్మేశ్వరోన్నిద్రధ్యానసౌధప్రియాతిధిః
శ్రీమత్పుత్రపురీవాసః శ్రీరామః సీతయా గృహీ
శ్రీనివాసం నమస్కృత్య గురూనౌఖేయసూత్రిణః
శ్రీనివాసాధ్వరీన్ద్రాఖ్యాన్ వేదాన్తార్థ ప్రవర్తకాన్
దేవభాషామయం కావ్యం వేంకటాచల వైభవమ్
ఆంధ్ర్యా వాణ్యాపార్థసూతో వివృణోతి యథామతి.

—: వసిష్ఠుడు తనకు పౌరోహిత్యదోషనివృత్తికై యత్నించుట :—

ఋషులు ప్రశ్నించుచున్నారు :—

సూత ! వేదార్థతత్త్వజ్ఞ ! వేదవ్యాసకృపానిధే ।
బ్రూహి నస్సర్వతీర్థేషు తీర్థం సర్వాఘనాశనమ్ ॥ ౧
కథయామి కథాం సమ్యక్సర్వపాపాపనోదినీమ్ ।
యస్యాశ్శ్రవణమాత్రేణ దృష్టాదృష్టఫలాగమః ॥ ౨

**తా॥** సూతపౌరాణికా ! మహాశయా ! భూతలమందలి పుణ్యతీర్థములలో సర్వపాపములను పోగొట్టగల పుణ్యతీర్థమును మాకు దెలపీయుడు.

సూతుడు బదులు చెప్పుచున్నాడు —

ప్రాప్నువంతి మహత్పుణ్యమితి సర్వర్షిసమ్మతమ్ ।
కథాయాం కథ్యమానాయాం యే భవంత్యపరాఙ్ముఖాః ॥ ౩

తస్మాదేకాగ్రహృదయైః కార్యాన్తరవినిస్పృహైః ।
భవాదృశైః పుణ్యకథా శ్రోతవ్యాఽఞ్జలికారిభిః ॥ ౪

తా॥ మహామునులారా ! యే కథనువినినంతమాత్రమున సమస్తపాపములు శమియించునో అట్టి కథను మీకుచెప్పెదను. పాపమోచనము మాత్రము కాక ఆ కథాశ్రవణమువలన ఇష్టార్థసిద్ధియు మహాభాగ్యము కలుగును. కథను వినునప్పుడు మాత్రము పరధ్యాసలేక తదేకధ్యానముతో వినవలెను. అందుకు మీరు అర్హులు.

పురా కదాచి ద్విప్రాణాముత్తమోత్తమతాం గతాః ।
వసిష్ఠాద్యా బ్రహ్మసదః కించిత్కార్యేచ్ఛయా గతాః ॥ ౫

తత్ర దేవైస్తథాసిద్ధైః పుణ్యశ్లోకైశ్చ రాజభిః ।
సనందసనకాద్యైశ్చ యోగాచార్యైశ్చ సత్తమైః ॥ ౬

గఙ్గాద్యాభిర్నదీభిశ్చ సర్వతీర్థైస్సవిగ్రహైః ।
సంసేవ్యమానం పదపి బ్రహ్మాణం చతురాననమ్ ॥ ౭

వేదైరనంతైశ్శాస్త్రైశ్చ మూర్తిమద్భిరుపాసితమ్ ।
సురజ్యేష్ఠముపాగమ్య వసిష్ఠో మునిసత్తమః ॥ ౮

తా॥ పూర్వమొకప్పుడు మహానుభావులగు వసిష్ఠాది పరమమునులు యాదృచ్ఛికముగా బ్రహ్మలోకమునకు పోయిరి. అచ్చట చతురాననుడు దేవతాగణము సిద్ధపురుషులు పుణ్యకీర్తనులగు చక్రవర్తులు యోగాచార్యులగు సనకాదులు వీరలందరిచేతను మూర్తిమంతములగు గంగాదిమహానదులు పుణ్యతీర్థములు అనంతములగు వేదములుశాస్త్రములచేతను కొలువుదీరియున్న చతురాననుని వసిష్ఠ ఋషి సమీపించి నమస్కరించి ఇట్లని విన్నవించెను.

ప్రణమ్య సహజానందో వాక్యమేతదువాచ హ ।
బ్రహ్మన్సమస్తలోకానాం నాయకామరశేఖర ॥ ౯
ఇదం వందనమాయాతి దయయా మాం విలోకయ ।
ఇతి ప్రణమ్యోత్థితం తం వసిష్ఠమృషిసత్తమమ్ ॥ ౧౦
దయయా విధిరాలోక్య నిషీదేత్యబ్రవీత్తదా ।

తా॥ "ఓ ప్రభూ: వసిష్ఠుడను నమస్కరించుచున్నాను. నాయందు దయయుంచి ప్రసన్నుడవుకమ్ము" అని పలికెడి వసిష్ఠుని జూచి చతురాననుడు చూచి వసిష్ఠుని కూర్చుండుమనిచెప్పెను.

తత్ర బ్రహ్మసభామధ్యే వర్తమానకథాసు చ ॥ ౧౧
నివృత్తాసు తతః పశ్చాదువాచ చ పితామహః ।
కిమర్థమాగతోఽసీతి వసిష్ఠం వాక్యమబ్రవీత్ ॥ ౧౨

తా॥ తరువాత సభామధ్యమున ఆరంభింపబడిన ప్రసంగములను పూర్తి కావించికొని కమలాసనుడు వసిష్ఠునిజూచి అతడు వచ్చిన కార్యమేమి యని ప్రశ్నించెను.

తతో వసిష్ఠః ప్రణతో వినయావనతో మునిః ।
వాక్యం విజ్ఞాపయామాస బ్రహ్మణేఽనంతతేజసే ॥ ౧౩

తా॥ అంతట వసిష్ఠుడు వినయముతో చతురాస్యునకిట్లని తన యాగమన కారణమును విన్నవించికొనెను.

ప్రసీద భగవన్బ్రహ్మన్ పంకజాసన తే నమః ।
విజ్ఞాప్యం కించిదస్త్యేతద్దయయాఽకర్ణయ ప్రభో ॥ ౧౪
యద్వసిష్ఠ వసిష్ఠేతి మానం కుర్వంతి మే జనాః ।
తత్సర్వం మమ దుఃఖాయ జాయతే నాత్ర సంశయః ॥ ౧౫
జానాతి మాం రాజపురోహితం భవాన్
పురోహితానాం బహుళం హి పాపమ్ ।

తే రాజానో యద్య దఘం చరంతి
పురోహితానాం తదితి ప్రవాదః ॥ ౧౬

ప్రాయశ్చిత్తేనాప్రవార్యం బహుళం పాపమస్తి మే ।
తత్పాపశాంతి మిచ్ఛన్నై సదా వ్యగ్రో భవామ్యహమ్ ॥ ౧౭

తా॥ చతురాననా : నా మనవి ముఖ్యమైన దొక్కటికలదు. దయతో ఆల కింపుము. వసిష్ఠుడనగా యెంతోగొప్పవాడని తలచి ప్రజలందరు నన్నాదరించు చున్నారు. ఆ పొగడ్త నన్ను మిక్కిలి బాధించుచు గౌరవముకంటె నాకు లజ్జను కల్గించుచున్నది. నేను చక్రవర్తులకు శుభాశుభములను నిర్వర్తించెడి పురోహిత మను పాపవృత్తిచేయువాడను పురోహితవృత్తిపాపదాయకమనుటను పెద్దలు చెప్పుదురు. ప్రజలుచేయుపాపము రాజులకును రాజుచేయుపాపము గురువుకును సంక్రమించునని లోకప్రవాదమగుటచే రాజపురోహితుడనగుటచే నాకు పాప ప్రాప్తినిశ్చితము. నాతపశ్శక్తి ఆ పాపమును ప్రతిబంధింపజాలదు. ఆపాప నివృత్తికి మార్గముతెలియక విచారపడుచున్నాను

అన్యచ్చ కించిదస్తీహ తచ్ఛృణుష్వ మహామతే ।
క్వచిద్గ్రామే కశ్చిదస్తి సర్వదా మత్పరాయణః ॥ ౧౮
స నాస్తికో దుష్ప్రకృతిస్సర్వపాపరతస్సదా ।
దరిద్రశ్చ దురాచార స్సర్వాబద్ధ ఇతి ద్విజః ॥ ౧౯
యజ్ఞస్థానేషు సర్వేషు సంతిష్ఠత్సు ద్విజాతిషు ।
యత్కించిద్దక్షిణాపేక్షీ సోఽప్యాగత్య స్థితః క్వచిత్ ॥ ౨౦
తం దృష్ట్వాఽవదదన్యో వై ద్విజో రోషేణ పూరితః ।
సర్వాబద్ధ కిమర్థం త్వమిహాగత్య ద్విజాతిషు ॥ ౨౧
వసిష్ఠవత్తిష్ఠసి త్వం స్నానాచారవివర్జితః ।

తా॥ ఇది గాక మరియొక విన్నపముకూడ కలదు. ఒకానొక గ్రామ మందొక మహాపాపియు దురాచారుడు దరిద్రుడును దుష్టుడును సర్వాబద్ధుడను పేరుగల బ్రాహ్మణుడు కలడు. యజ్ఞశాలలందును బ్రాహ్మణసదస్సులందును సద్బ్రాహ్మణులు సమావేశమగు అన్ని సందర్భములందును దక్షిణకై ప్రత్యక్ష

మగుచుండుటను ఇతరులు సహించకుండిరి. ఒకానొకప్పుడు ఒకడు కోపముతో " ఓ మూఢా ? నీవు స్నానసంధ్యలు కూడా తెలియని నీవు శ్రోత్రియులగోష్ఠిలో వసిష్ఠునివలె సిద్ధమగుచున్నావు. నీకిదిస్థానముకాదు " అని బెదిరించెను.

సర్వాబద్ధ స్తుత చ్ఛ్రుత్వా గతోఽన్యత్రాతిదుఃఖితః ॥ ౨౨

కోపాద్వసిష్ఠవదితి మాం ప్రత్యుక్తం ద్విజన్మనా ।
స వసిష్ఠో రక్షతు మాం పావనం చ కరోతు మామ్ ॥ ౨౩

ఇతి నిత్యం వదత్యేవం ధ్యాయతే హృదయే చ మామ్ !
వాగ్వసిష్ఠ వసిష్ఠేతి సర్వదా తస్య వర్తతే ॥ ౨౪

కాయికం మానసం పాపం వాచికం నాస్తి తద్భువి ।
యన్నానేన కృతం పాపం తాదృక్క్వాపి న మే మతః ॥ ౨౫

తథాపి మామాశ్రయతే తస్మాత్తస్మిన్ కృపా మమ ।
మామాశ్రితస్య మమ చ పాపం రాజపురోధసః ॥ ౨౬

యథా శుద్ధ్యతి తన్మే త్వం వద లోకపితామహ ।

తా॥ ఆయవమానమును సహించలేక సర్వాబద్ధుడు దుఃఖించి తనకుదాహరణముగ నెత్తిచూపిన నన్ను మనసులో ధ్యానించి " శ్రోత్రియుల కుదాహరణమగు మహానుభావుడగు వసిష్ఠుడు నన్నురక్షించుగాక " యని శపథముచేసికొని సర్వకాల సర్వావస్థలయందు నన్నే చింతించుచు " వసిష్ఠో రక్షతుమాం వసిష్ఠో రక్షతుమాం " అని నా నామమునే ఉచ్చరించుచు కలవరించుచు ఉన్నాడు. ఆతడు ఆచరించని పాపకార్యములేదు. ఐనను ఆతడు నన్నాశ్రయించినాడు. కావున ఆశ్రితసంరక్షణమున్యాయ్యమని నామన సాతనియందు లగ్నమైనది. నా పాపము నా యాశ్రితునిపాపముకూడ శమించుటకు మార్గము నీవు నాకుపదేశింపవలయును.

సూతుడు చెప్పుచున్నాడు :—

బ్రహ్మా తదాఽబ్రవీ దేనం వసిష్ఠం మునిసత్తమమ్ ॥ ౨౭

ప్రాయశ్చిత్తాపనోద్యాని పాపానీత్యవధారయ ।
మునిర్బ్రహ్మాణమవదత్స్వామింస్తచ్ఛృణు సాంప్రతమ్ ॥ ౨౮
మమ తస్య చ పాపాని ఘనాని బహులాని చ ।
ప్రాయశ్చిత్తైర్న నశ్యంతి తస్మాత్త్వామాగతోఽస్మ్యహమ్ ॥ ౨౯
నమస్కరోమి ధర్మాత్మం స్త్వామేవ శరణం గతః ।
ఆవయో రల్పయత్నేన నశ్యంతే పాపరాశయః ॥ ౩౦
యేన దృష్టం ఫలం చ స్యాత్తముపాయం వదస్వ మే ।
ఇతి పృష్టస్తతో బ్రహ్మ విచార్య హృదయే హరిమ్ ॥ ౩౧
వేఙ్కటేశం నమస్కృత్య వసిష్ఠ మిద మబ్రవీత్ ।

తా॥ ఓ మునిసత్తమా! పాపశమనమునకు ప్రాయశ్చిత్తములు శాస్త్రములందుపదేశింపబడినవి గదా! యథోక్తములగు ప్రాయశ్చిత్తములను జేసికొని మీ పాపములనేల పోగొట్టు కొనరాదదా? అని బ్రహ్మదేవుడు వసిష్ఠునకు చెప్పగా వసిష్ఠుడిట్లనెను. ఓ దేవా! ఆప్రాయశ్చిత్తశాస్త్రములు నాకు తెలియకనే నిప్పుడు నిన్నాశ్రయించుటలేదు మా ఉభయులుచేసిన పాపములు గొప్పవి. వాటికి ప్రాయశ్చిత్తములే ఉండవు ప్రాయశ్చిత్తములుచేసినా అవిపోవు. కనుక మార్గాంతరమును వెదకుచు సర్వజ్ఞుడవగు నీ శరణమునుచేరితిని. ప్రాయశ్చిత్త శాస్త్రములను తిరగవేయుటకో వాటినాచరించుటకో మార్గాంతరముమ వెదకుటకో మాకుశక్తిచాలదు. కనుక దేవరకు సాక్షాత్తుగ అనుభవమున నెరిగినట్టిగాని శాస్త్రములవలననో లోకానుభవమువలననో వినినట్టిగాని మాకు అవసరమైన పరిహారము తెలిసినచో నాకు ఉపదేశింపుము. అని యడుగగా చతుర్ముఖుడు కొంతతడవు విచారించి శ్రీశ్రీనివాసమహాప్రభుని మనసా స్మరించి యాతని దివ్య మంగళ విగ్రహమును ధ్యానించి నమస్కరించి వసిష్ఠుని జూచి ఇట్లనియెను.

బ్రహ్మ చెప్పుచున్నాడు;—

కాశ్యా దక్షిణదేశే వై కశ్చిదస్తి మహీధరః ॥ ౩౨
వేఙ్కటాద్రిరితి ఖ్యాతో విశ్వలోకైకసమ్మతః ।
శ్రీవేఙ్కటేతి యన్నామ మర్త్యో వాచా వదన్నపి ॥ ౩౩

దేవానాం వందనీయత్వం యాతి తాదృఙ్మహీధరః ।
తత్ర తీర్థాని సర్వాణి సర్వపాపహరాణి చ ॥ ౩౪
షట్షష్టికోటితీర్థాని విద్యంతే వేఙ్కటాచలే ।
స్వామితీర్థమితి ఖ్యాతం సర్వతీర్థోత్తమోత్తమమ్ ॥ ౩౫
తత్తీరే దక్షిణే విష్ణుర్లక్ష్మ్యా సహ వినోదతే ।
అగస్త్యశఙ్ఖణాదీనామభీష్టవరదాయకమ్ ॥ ౩౬

తా॥ వసిష్ఠా! వినుము, కాశీనగరమునకు దక్షిణమున వెంకటాద్రియను నొక పర్వతము కలదు, ఇది సర్వలోకములందును ప్రసిద్ధికెక్కినది, ఎవ్వడు గాని వేంకటాద్రియను పేరును స్మరించినంత మాత్రమున ధన్యుడై యాతడు దేవతాసమూహమునకు కూడ పూజ్యుడగుచున్నాడు, ఆ పర్వతరాజమందు అరువదికోట్ల పుణ్యతీర్థములు కలవు ఆ పుణ్యతీర్థములకన్నిటికి ప్రభుస్థానీయముగ స్వామిపుష్కరిణియను నొక పుణ్యతీర్థముకలదు. ఆ పుష్కరిణి ఒడ్డున అగస్త్యుడాది గాగల పుణ్యాత్ములకు దర్శనమునిచ్చి ఉద్ధరించిన శ్రీనివాసప్రభువు మహాలక్ష్మితో కూడి సాన్నిధ్యమునొందియున్నాడు, అట్టి ప్రభునిదర్శించి ప్రార్థించిన వారలకు ఐహికాముష్మికములగు సకల సౌఖ్యములును చేకూరును.

వేఙ్కటేశం నమస్కృత్య దృష్ట్వా దృష్టం చ విందతి ।
తస్య వేఙ్కటశైలస్య మధ్యే ఘోణమితిస్మృతమ్ ॥ ౩౭
ఏకం తీర్థం పవిత్రం వై తత్ర స్నాతశ్శుచిస్సదా ।
మీనసంస్థే సవితరి పౌర్ణమాస్యాం మహాతిథౌ ॥ ౩౮
ఘోణస్నానేన సర్వాణి నశ్యంతి దురితాని హి ।
త్వదాశ్రితస్త్వం చ తత్ర గత్వా వేఙ్కటభూధరే ॥ ౩౯
మీనమాసే పౌర్ణిమాయాం స్నాతౌ పూతౌ భవిష్యథః ।

తా॥ ఆ వేంకటాద్రిమధ్యమున ఘోణతీర్థమను నొకపుణ్యతీర్థముకలదు. ఆ తీర్థమందుస్నానముచేసిన వారలు సకలపాపవినిర్ముక్తులగుదురు. ఈ తీర్థస్నానమునకు మీనమాసమందలి పూర్ణమదినము ప్రశస్తము. నీవును నిన్నాశ్రయించిన సర్వాబద్ధుడును వేంకటాద్రికివెళ్ళి మీనమాసపౌర్ణిమి శుభదినమున స్నానముచేయుడు, మీరు పాపములునశించి పూతులగుదురు,

ఇత్యుక్తవంతం బ్రహ్మాణం నమస్కృత్యాథ హృష్టధీః ॥ ౪౦

అవరుహ్య బ్రహ్మలోకాదత్యంతం త్వరయాఽన్వితః ।
సర్వాబద్ధముపాగమ్య వసిష్ఠో వాక్యమబ్రవీత్ ॥ ౪౧

తా॥ ఇట్లాదేశించిన చతుర్ముఖుని వాక్యములను వినినవసిష్ఠుడు సంతుష్టుడై బ్రహ్మకు నమస్కరించి బ్రహ్మలోకమునుండి భూమికి మరలివచ్చి సర్వాబద్ధుని చెంతకేగి ఇట్లనెను.

రేరే! బ్రాహ్మణమాం నిత్యమాశ్రితోఽసి సదా వదన్ ।
త్వత్పాపపరిహారాయ కించిద్వక్ష్యామి తచ్ఛృణు ॥ ౪౨

గచ్ఛామి వేఙ్కటగిరి మే హి శీఘ్రం మయా సహ ।
ఇత్యుక్తమాత్రో విప్రో సౌ తేన సార్ధంజగామహ ॥ ౩౩

తా॥ " ఓ సర్వాబద్ధా ! లెమ్ము నీవు నన్నాశ్రయించితివి, నిన్నుద్ధరించుట నాధర్మము. నీ పాపపరిహారమునకై నేను మార్గమును తెలిసికొంటిని. నేను శ్రీవేంకటాద్రికి పోవుచున్నాను నీవును నాతో రమ్ము " అని చెప్పినమాటలు వినిన సర్వాబద్ధుడు ఆక్షణమే వసిష్ఠునితో పయనమై యాతనితో వెంకటాద్రికేగెను.

సబ్రాహ్మణో వసిష్ఠోఽసౌ వేఙ్కటాచలమేయివాన్ ।
శుకస్య వరదం కృష్ణం సువర్ణముఖరీతటే ॥ ౪౪

దృష్ట్వా ప్రణమ్య పశ్చాత్స వేఙ్కటాచలమూలగః ।
కపిలాఖ్యే కృతస్నానస్తీర్థే పాపప్రణాశనే ।
ఆరుహ్య వేఙ్కటం శైలం స్వామిపుష్కరిణీం యయౌ ॥ ౪౫

తా॥ మార్గమధ్యమున సువర్ణముఖినదీతీరమున శుకపురియందు శ్రీకృష్ణుని దర్శించి యావల వేంకటాద్రి మూలమునయున్నట్టియు సర్వపాపనాశనమునగు కపిలతీర్థమునస్నానముచేసి వేంకటాద్రిపై యధిరోహించి స్వామిపుష్కరిణి చెంతకేగిరి.

తత్ర స్నాత్వా భూవరాహం ప్రణమ్య
హ్యేనశ్శాంతిం ప్రార్థయిత్వా స విప్రః ।
లక్ష్మీనాథం దక్షిణే కూలభాగే
నత్వా నాథం స్తోత్రయామాస సమ్యక్ ॥ ४८

తా॥ స్వామిపుష్కరిణియందు స్నానముచేసి భూవరాహమూర్తిని దర్శించి నమస్కరించి తరువాత పుష్కరిణికి దక్షిణతీరమున వేంచేసియున్న శ్రీనివాస మూర్తిని దర్శించి యిట్లని వసిష్ఠుడు స్తోత్రముచేయ నారంభించెను.

జయ ధాతృగిరా నిదర్శితో జయ లోకావనదక్ష రక్ష మామ్
జయ శంఖణపూజితేహ మాం ద్విజమేనం చ పునీహి కేశవ ॥
తవ వేఙ్కటనాయకాచలే మహతి శ్రీధర ఘోణతీర్థకే
అభిషేకవిధిత్సయోఽజతో భగవంస్తత్ర ఫలం ప్రయచ్ఛ మే॥ ४९

తా॥ లోకోద్ధరణమునకై చతుర్ముఖునిచే ప్రార్థింపబడి శ్రీవేంకటాద్రి యందు నిత్యసాన్నిధ్యము చెందిన శ్రీనివాస ప్రభూ! నన్ను రక్షింపుము, శంఖణచక్రవర్తిచే అర్చింపబడిన మహాప్రభూ! నన్ను పునీతునిజేయుము. నీస్థాన మగు నిచ్చటి ఘోణతీర్థమున స్నానముచేయునట్లు బ్రహ్మచే ఆదేశమునొంది నే నిక్కడకు వచ్చియున్నాను. స్నానఫలముగ నాపాపశాంతి ననుగ్రహింపుము

ఇతి స్తుత్వోత్తరే దేశే పాపనాశనతీర్థకే ॥ ४९
సర్వాబద్ధేన సహితస్స్నాత్వా ఘోణం జగామ హ
ఏకాదశ్యాం తత్ర గత్వాపంచరాత్రముమవాస హ ॥ ५०
మీనమాసే పంచదశ్యాం మధ్యాహ్నే స్నాతుమాగతాన్
ఋషీన్ దేవాంశ్చ యక్షాంశ్చ గంధర్వాన్కిన్నరాంస్తథా ५१
ఆశ్చర్యం పరమం గత్వా వసిష్ఠో విప్రసంయుతః
స్నాత్వా సంకల్ప్య విధివద్దేవర్షీనభితర్ప్య చ ॥ ५२
సహ విప్రేణోపవిశ్య జపం చక్రే విధానతః
జపాంతే శ్రీహరిం ధ్యాయన్ సమాధిస్థోఽభవన్మునిః ॥ ५३

స్నాత్వా తిష్ఠత్సు సర్వేషు తత్ర ఘోణే పురో మునేః
ఆవిరాసీం ద్వేఙ్కటేశః శ్రియా సార్థం జగత్పతిః ॥ ౫౪

తా॥ ఇట్లని స్తోత్రముచేసినవాడై సర్వాబద్ధునితోగూడి పాపనాశనతీర్ధమందు స్నానముచేసి అతనికూడి ఘోణతీర్థమునకు వెళ్లెను. మీనమాస ఏకాదశినాడు ఘోణతీర్థమునకు చేరి అచ్చట ఐదు దినములు ధ్యాననిష్ఠతో నుండెను. ఐదవ దినమగు పూర్ణిమనాడు మధ్యాహ్నకాలమున నా తీర్ధమునందు స్నానముచేయుటకై యేతెంచిన ఋషులు దేవతలు యక్షులు గంధర్వులు కిన్నరులు మొదలగు నసంఖ్యాకులగు భక్తులు వసిష్ఠునకు దర్శనపథమున దగిలిరి సకాలమున వారలతోపాటుగ సర్వాబద్ధునితోకూడ తీర్థస్నాన మాచరించి దేవర్షి పితరులకు తర్పణముచేసి యథోక్తముగ శ్రీవేంకటేశ మహామంత్రమును జపించెను. జపమధ్యమున శ్రీనివాసునినే మనసున ధ్యానించుచు సమాధినుండెను. ఇట్లే అందరు భక్తిజనులును తమతమ యనుష్ఠానములను పూర్తిచేసికొనుటను కటాక్షించిన శ్రీనాధుడు జగన్మాతతోసహ వసిష్ఠమహర్షి యెదుట సాక్షాత్కరించెను

గరుడాసనమారూఢః పీతామ్బరధరో హరిః
ప్రసన్నవదనాంమ్భోజస్సర్వప్రాణిదయాపరః ౫౫
కటాక్షయన్కరుణయా సర్వాంస్తీర్థార్థ మాగతాన్
సనందసనకాద్యైశ్చ సేనేశానంతసంయుతః ॥ ౫౬
సేవ్యమానో వేఙ్కటేశో వసిష్ఠం వాక్యమబ్రవీత్
వసిష్ఠాహం ప్రసన్నోఽస్మి తవ వర్ధస్వ వైభవాత్ ॥ ౫౭
మమ తీర్థస్య మాహాత్మ్యం శ్రుత్వా బ్రహ్మముఖాద్భవాన్
భక్త్యా సమాగతో యస్మాత్తతస్తుష్టోఽస్మి తే మునే ॥ ౫౮
వరం వరయ విప్రేంద్ర యత్తే మనసి వర్తతే

తా॥ భగవానుడు దివ్యపీతాంబరములను ధరించి గరుడవాహనారూఢుడై సర్వప్రాణి దయాపరత్వమును ప్రకటించు ప్రసన్న ముఖపంకజముతో నవ్వుచు ఆ పుణ్యతీర్థమునచేరియుండిన జనసమూహమును కటాక్షించుచు వసిష్ఠునిజూచి

ఓ మునిసత్తమా! నేను ప్రసన్నుడనైతిని! నీకు శుభమగుగాక. నా పర్వత మందలి ఘోణతీర్థమహిమను బ్రహ్మవలన తెలిసికొని నీవు నాసన్నిధికివచ్చితివి నేను సుప్రీతుడనైతిని. నీ కేమి వరము కావలయునో కోరుము.

ఇత్యుక్తో వేఙ్కటేశేన మునిః ప్రోవాచ కేశవమ్ ॥ ౨౯

నమోఽస్తు వేఙ్కటాధీశ! విశ్వరక్షామణే హరే!

విజ్ఞాపనాం మదీయాం త్వం సావధానమనాశ్శృణు ॥ ౬౦

అయం విప్రో మమ సఖా కృతవానపి పాతకమ్

మయ్యనుగ్రహబుద్ధ్యా చ తీర్థస్యాస్యప్రభావతః ॥ ౬౧

సర్వం సోఢ్వా పవిత్రం చ కురు పాపవివర్జితమ్

తా॥ వరప్రదుడగు శ్రియఃపతిచే నియమింపబడిన వసిష్ఠుడు బ్రహ్మానందముతో ఇట్లని వరమును యాచించెను. ఓ మహాప్రభూ! నా విజ్ఞాపనమును సావధానముగ నాలకింపుము. ఈ వరప్రదానఫలమును నే నొక్కడనే పొందుట కుద్దేశములేదు. నేనును ఈ నా సహచరుడును మహాపాతకములజేసితిమి. ఈ తీర్థమాహాత్మ్యముచేతనేమి మాయందు కేవలమనుగ్రహబుద్ధిచేతనేమి నీ వాత్సల్యమును మాయందు చూపుము.

ఉక్తో వసిష్ఠేనైవం తు వేఙ్కటాచలనాయకః ॥ ౬౨

తా॥ ఇట్లని వసిష్ఠునిచే ప్రార్థింపబడిన వేంకటాచలాధిపతి వసిష్ఠునితో నిట్లనెను.

భగవానుడు చెప్పుచున్నాడు :—

వసిష్ఠ! జాతస్సంతోషో మమాతీవ మహామునే

మమాఽశ్రితోఽయమిత్యేవ దయా తస్మిం స్త్వయా కృతా॥ ౬౩

య ఆశ్రితేషు వాత్సల్యం కురుతే స ఇహోత్తమః

తస్మిన్మమ మహాప్రీతి స్తన్మదీయగుణో మహాన్ ॥ ౬౪

అయం చ త్వయి విశ్వాసాద్భక్తిం విహితవానహో

మహాత్సుభక్తిం యః కుర్యాత్స ఏవ పురుషోత్తమః ౬౫

తస్య లక్ష్మ్యా సమేతోఽహం వసామి సతతం హృది
అయం తు బహుపాపాని కృతవాన్లోకగర్హితః ౬౬
ఏకో గుణోఽపినాస్త్యస్మిన్సర్వాబద్ధ ఇతీరితః
తథాఽపి త్వత్సహాయేన తీర్థమాగత్య భక్తితః ॥ ౬౭
స్నాతశ్చ పూర్ణిమాయోగే పాపం సర్వం లయం గతమ్
సర్వే చాస్మిన్గుణా జాతా సహవాసేన తే మునే ॥ ౬౮
తస్మాత్ససర్వసిద్ధ్యాఖ్యామద్య ప్రభృతి యాస్యతి
అస్యాహం హృదయే తిష్ఠన్ సత్కర్మాణి ప్రవర్తయన్ ॥ ౬౯
ధనికం ధార్మికం చైవ కరోమి సుఖితం తదా

తా॥ ఓ మహర్షిసత్తమా! చాల సంతోషము, ఆశ్రయించిన వాడని సర్వాబద్ధునియందు నీవు జాలిజెందితివి ఆశ్రితవాత్సల్యముకంటె గొప్పగుణము మానవులలో వేతొకటిలేదు. నేను వాత్సల్యమునే ప్రధానముగ నాదరించువాడ నగుటచే నాత్రోవను నడచెడి నీయందు నాకు ప్రీతికల్గినది, అదిగాక లోకమున మహాత్ముల నాశ్రయించుట ఒక గొప్పతనము. అతడు మహానుభావుడగు నీయందు ఆచార్యబుద్ధిని కల్గియున్నాడు అది అతనియందు ఉత్తమపురుష త్వమును సృజించినది. పురుషోత్తముడనగు నేను నా కంటె ఉత్తమపురుషుని ప్రక్కనే నా యర్ధాంగితో వసియింపగోరెదను. ఈతడు ప్రాయశ్చిత్తములకు కూడ శాంతింపని మహాపాతకముల నెన్నిటినో చేసినాడనుట నిశ్చితము. ఈతని యందు నా యనుగ్రహమును పొందగల ఒకే ఒక మంచిగుణముకూడ కాన వచ్చుటలేదు. కావున నీతని సర్వాబద్ధ వ్యవహారముకూడ అన్వర్థమై యొప్పు చున్నది. అయినను నీ వెంటబడి నా నివాసపర్వతమందలి ఘోణతీర్థమునకు వచ్చి పర్వదినమున స్నానముచేయుటచే ఆతని పాపరాశియంతయు నశించినది. ఈతనియందు భక్తి ముక్తిసాధకములగు పుణ్యగుణము లుదయించినవి. ఈ పరిణామమంతయు సజ్జనుడవగు నీ సహవాసమువలననే ఈతనికి లభించినది. కావున నేటినుంచి ఈతనికి సర్వాబద్ధుడను వెనుకటిపేరు పోయి సర్వసిద్ధియను క్రొత్తవ్యవహారనామము కలిగి ప్రఖ్యాతి కలుగగలదు. ఈతని హృదయమున

నేను నివసించి నా యనుగ్రహముచే నీతని సత్కర్మ ప్రవర్తనునిగజేసి ఐశ్వర్య వంతునిగను ధార్మికునిగను సుఖితునిగను జేసెదను.

వసిష్ఠః శృణుమద్వాక్యమేతేషాం సన్నిధౌ బ్రువే ॥ ౨౦
పౌరాహిత్యేన సంజాతం తవ దోషం హరామ్యహమ్

తా॥ ఓ మునిసత్తమా! అవధానముతో వినుము, ఈ యశేషదేవర్షి పితృగణసమావేశమందు నేను సత్యముజేసి చెప్పుచున్నాను. నీకు పౌరోహిత్యవృత్తి వలన కలిగెడి దోషమునుగూడ నేను హరింపజేయుచున్నాను. నీవు శంకింపవద్దు

పురుషో వాఽథవా నారీ బ్రాహ్మణః క్షత్రియోఽపి వా ॥ ౨౧
పాపాన్ముక్తో వాఞ్ఛితాని ప్రాప్నోతి హి న సంశయః
మాముద్దిశ్య తపస్తప్త్వా తుమ్బురుర్భగవానిహ ॥ ౨౨
తీర్థస్య స్వస్య నామ్నైవ ఖ్యాతిం ప్రార్థితవానభూత్
అజ్ఞానాద్విహితం జ్ఞానాన్మనోవాక్కాయకర్మభిః ॥ ౨౩
యత్పాపం తదశేషం చాప్యత్ర స్నానేన శామ్యతి
నారీవా పురుషో వాఽపి స్నాత్వా తీర్థే శుభే దినే ॥ ౨౪
ఇష్టార్థం స్వ స్వమాప్నోతి నాత్ర కార్యా విచారణా
దత్తా తుమ్బురుతీర్థాఖ్యా తీర్థస్యాస్య మహామునే ॥ ౨౫

తా॥ స్త్రీగాని పురుషుడుగాని బ్రాహ్మణుడుగాని క్షత్రియుడుగాని యెవ్వరుగాని ఈ తుంబురుతీర్థస్నానము జేసినంతట సకల పాపములుపోయి అభీష్టసిద్ధిని పొందెదరు. తుంబురుడు నన్నుగురించి తపసుజేసిన కారణముచే సిద్ధుడై యాతనిపేరిట ఒక తీర్థమును వ్యవహరింపజేయగలిగెను. తెలిసిగాని తెలియకగాని మనోవాక్కాయములచే చేసినపాపము సవాసనముగ ఈ తీర్థస్నానముచేత శమించును. ఇష్టకామ్య ప్రాప్తియుకలుగును, సందేహములేదు. తుంబురున కట్లే సిద్ధికలిగి యాతనిపేరు ఈ తీర్థమునకుకూడ సంక్రమించినది.

వర్షేవర్షే మీనమాసే పూర్ణిమాయాం శుభేదినే
స్నాతి తుమ్బురతీర్థేఽస్మిన్ సధన్యో భువనత్రయే ॥ ౨౬

కన్యాభర్తారమాప్నోతి లోకే సర్వగుణోత్తరమ్
యువతీ దీర్ఘమాంగల్యం కులోత్తారం సుతం తథా ॥ ౭౭

వృద్ధా పాపవినిర్ముక్తా పుత్రపౌత్రాదిసంయుతా
ధనాన్వితా బంధుమతీ జీవభర్తా చిరం వసేత్ ॥ ౭౮

వంధ్యా పుత్రం ప్రసూతేహ స్నానాదత్ర న సంశయః
పురుషో ధనమన్విచ్ఛన్ ధనీ భవతి నిత్యదా ॥ ౭౯

పుత్రార్థీ లభతే పుత్రం పౌత్రం పౌత్రేప్సురాప్నుయాత్
మానార్థీ లోకసమ్మానం విద్యార్థీ బహువిద్యతామ్ ॥ ౮౦

లౌకికో వైదికే కార్యే పటుర్భవతి సర్వదా

తా॥ ప్రతి సంవత్సరము మీనమాసమున పూర్ణిమనాడు ఈ పుణ్యతీర్థ స్నానము చేసినవారలు ధన్యులు. కోరికతో స్నానమాచరించినప్డు కన్యకు చక్కని భర్తయు యువతికి దీర్ఘసౌమంగల్యము సత్సంతానమును జరాపలితలకు పాపమోచనము పుత్రపౌత్రాది సంపద ధనసంపత్తి జీవద్భర్తృకత బంధుమత్త్వమునుకలిగి చిరకాలము సుఖము కల్గును గొడ్రాలికి సంతతికలుగును. ధనార్థియగు పురుషునకు ధనము పుత్రార్థియగువానికి సత్సంతానము సమ్మానము కోరెడివానికి లోకపూజ్యత విద్యార్థికి విద్య లౌకిక వైదిక కార్యములందు సామర్థ్యము కలుగును.

అత్ర స్నాతా ముక్తపాపాస్సమస్తా ధాన్యం ద్రవ్యం పుత్రభాగ్యం చ లబ్ధ్వా సౌఖ్యం లబ్ధ్వా బంధుమధ్యే సమస్తమాయుష్మంతో విష్ణులోకం వ్రజంతి॥

తా॥ తుంబురుతీర్థస్నానము చేసినవారలకు పాపవిమోచనము ధనధాన్య సంతాన ప్రాప్తిచే సుఖము సజాతీయులలో గౌరవము దీర్ఘాయువుకలిగి దేహాంతమునందు పరమపద ప్రాప్తికలుగును.

అత్ర తీర్థేఽత్ర దివసే స్నాత్వా యే భాగ్యశాలినః ॥ ౮౨

దానం కుర్వంతి విప్రేభ్యస్తేష్వత్యంతదయా మమ
సువర్ణం యే ప్రయచ్ఛంతి తేషాం లక్ష్మీస్థిరా భవేత్ ॥ ౮౩

గోదానం రాజతం దానం భూదానం చ ఫలం తిలాన్
విద్యాం వస్త్రం చ విప్రేభ్యో దాతా సోఽతీవ మే ప్రియః ॥ ౨౪

తామ్బూలం చ సుగంధం చ దధి తక్రం గుడోదకమ్
దత్వా బ్రహ్మశివాదీనాం నందనీయా భవంతి తే ॥ ౨౫

యే బ్రాహ్మణాన్భోజయంతి భక్త్యా భాగవతానిహ
తానాలోక్య మహానందో మమ లక్ష్మ్యాశ్చ జాయతే ॥ ౨౬

కలౌ యుగే చ ప్రఖ్యాతం తీర్థ మేతద్భవిష్యతి
స్నానం దానం మనుష్యాణాం సర్వాఘౌఘవినాశనమ్ ॥ ౨౭

అత్ర మార్గే ప్రపాం యే వై కుర్వంతి శ్రమహారిణీమ్
తాన్మదంశాన్నృషిగణా వదంత్య త్రన సంశయః ॥ ౨౮

సర్వం దానం కోటిగుణం భవత్యత్ర న సంశయః
తస్మాత్కుర్వంతు దానాని సర్వే మనుజపుఙ్గవాః ॥ ౨౯

సర్వదాస్మిన్పుణ్యదినే సన్నిధిం విదధామ్యహమ్
స్నాతానామత్ర సర్వేషాం వాఞ్ఛితాని దదామ్యహమ్ ॥ ౩౦

తా॥ ఈతీర్థమందు ఉక్తపుణ్య దినమున స్నానముచేయగల భాగ్యశాలురు సద్బ్రాహ్మణులకు యథాశక్తిగ నెవ్వరు దానముచేయుదురో వారలను నేనెక్కువగా ప్రేమింతును. అందును సువర్ణదానముచేయు వారలయింట శాశ్వతముగ మహాలక్ష్మి నివసించును. గోదానము రజతదానము భూదానము ఫలదానము తిలదానము విద్యాదానము వస్త్రదానముచేయుటయు నాకు ప్రియము. తాంబూల ద్రవ్యము సుగంధద్రవ్యములు దధి తక్రము గుడోదకము నిచ్చుటవలన అట్టివారు నాకు ప్రియులగుటయేగాక వారు బ్రహ్మాదులకును పూజ్యులగుదురు భాగవతులగు బ్రాహ్మణులకు అన్నదానముచేసెడి వారలనుచూచి నాకును లక్ష్మికిని తృప్తి యగును ఈ తీర్థము కలియుగ మున్నంతకాలము ఇట్లు ప్రసిద్ధికలిగినదగును. సామాన్యముగనే స్నానపానములు పాపహరములు, పుణ్యక్షేత్రమున చెప్ప నక్కరలేదు. వేంకటాచల యాత్రామార్గమున యాత్రికులకు శ్రమపరిహారము నొసగగల చలిపందిళ్లను నిర్మించెడివారలు నిస్సందేహముగ నా యంశచే

జన్మించినవారగుదురు ఏ దానమైనను ఈ పుణ్యక్షేత్రమున చేయబడినంతట దాని ఫలము మరియొకచోట వేయబడినదానికి కోటిరెట్లు అధిక ఫలమునిచ్చును. కావున శక్తులగు వారలచ్చట దానముచేయవలయును ఈ మీనమాస పూర్ణిమ పుణ్యదినమున నెల్లవేళలను నేనిచ్చట సాన్నిధ్యముజెందియుండి స్నానముజేసిన వారలకు వాంఛితముల ననుగ్రహించుచుందును.

తీర్థార్థమాగతాన్సర్వానాహూయ ఘననిస్స్వనః
భగవాన్వేఙ్కటాధీశో వాక్యమర్థవదబ్రవీత్ ॥ ౯౧

తా॥ ఆ సమయమున నచ్చట చేరినవారలనందరను ఉద్దేశించి శ్రీవేంకటాచలాధిపతి ఇట్లని చెప్పెను

సర్వేషాం వస్సర్వపాపక్షయోఽభూత్
సర్వేషాం వో వాంఛితం దత్తమేవ ।
సర్వేషాం వస్సంతు కాలాంతరే చ
లోకాశ్శ్రేష్ఠా యోగినామప్యలభ్యాః ॥ ౯౨

తా॥ ఓ మహానుభావులారా! పుణ్యతీర్థ స్నానముచే మీ పాపములు శమించినవి. మీ వాంఛితములు లభించినవి, భావికాలమందుకూడ మీకు ఇతర దుర్లభములగు పుణ్యలోకములు ప్రాప్తించునుగాక.

కలౌ తు భారతే వర్షే మానుషం జన్మదుర్లభమ్
తతో వేఙ్కటయాత్రా తు దుర్లభా సుకృతం వినా ॥ ౯౩
తతోఽప్యస్మిన్దినే పుణ్యే తీర్థే తుమ్బురునామకే
స్నానం దానం చ లబ్ధం చేత్తే కృతార్థా న సంశయః ॥ ౯౪
ఇత్యుక్త్వా వేఙ్కటాధీశో హరిర్గరుడవాహనః
రమయా సహితో రేమే వేఙ్కటాఖ్యే మహీధరే ॥ ౯౫

తా॥ ఓ పుణ్యపురుషులారా! కలియుగమున భారతభూమియందు మానవుడుగా పుట్టుట అరుదు. పుట్టియు వేంకటాచల యాత్రాలాభము కల్గుటయనునది జన్మాంతర సుకృతఫలమువలనగాని చేకూరదు. అట్లు యాత్ర లభించియు ' ఈ తీర్థముకోటియగు మీనమాస పూర్ణిమ శుభదినమున తుంబురుతీర్థస్నానము దానాదులను చేయగలవారలు కృతార్థులనుటలో సందేహములేదు' అని చెప్పె గరుడారూఢుడగు శ్రీనాథుడు మహాలక్ష్మితోకూడి తన వాసస్థానమునకు చేరెను.

ఏవం తుమ్బురుతీర్థే వై స్నాత్వా దేవర్షి మానవాః
హరిం నత్వా తద్వదనసుధాం పీత్వా యథాగతమ్ ॥ ౯౬

ప్రశంసన్తస్తు తత్తీర్థం యయుస్సంతుష్టమానసాః
వసిష్ఠస్సర్వసిద్ధేన తుష్టస్స్వాశ్రమాగమత్ ॥ ౯౭

తా॥ ఇట్లు తీర్థస్నానముచేసి భగవదనుగ్రహమును పొందిన దేవర్షి మానవ సమూహము భగవద్వాక్యామృతమును తనివిదీరఁగ్రోలి సంతుష్టులై తీర్థ మహిమను ప్రశంసించుకొనుచు వచ్చిన త్రోవను తమ ఆవాసముల కేగిరి. వసిష్ఠుడును తన శిష్యుడగు సర్వసిద్ధునితోకూడి తన యాశ్రమమునకుపోయెను.

కిఞ్చిత్కాలానన్తరం తం వసిష్ఠో వాక్యమబ్రవీత్
గచ్ఛ విప్ర స్వకం గ్రామం ధనవత్స్వగృహం వ్రజ ॥ ౯౮

వేఙ్కటేశప్రసాదేన ధనధాన్యాదికం బహు
స్నానదానజపాదీని విప్రకర్మాణి చాచర ॥ ౯౯

మహత్సు పూజాం కుర్వాణో భోజయన్బ్రాహ్మణానపి
వేఙ్కటేశేత్యభివదన్ పుత్రపౌత్రైస్సుఖీభవ ॥ ౧౦౦

తా॥ కొంచెము కాలము తన యాశ్రమమునందున్న తరువాత వసిష్ఠుడు తన శిష్యునిజూచి ఓ విప్రవర్యా! భాగ్యశాలివైతివి. నీ స్వగృహమునకు పొమ్ము శ్రీనివాసుని యనుగ్రహముచే నీకు సకల సౌభాగ్యములులభించినవి. బ్రాహ్మణ కార్యములగు స్నాన దాన జపాదులను విధ్యుక్తముగ జేసికొనుము. పెద్దలను పూజించుచు బ్రాహ్మణులకు సమారాధనము చేయుము. సర్వదా వేంకటేశ్వరుని స్మరింపుము. పుత్రపౌత్ర సంతతితో సర్వసమృద్ధికలిగి సుఖింపుము.

ఇత్యుక్తస్స వసిష్ఠేన నత్వా తత్పాదపఙ్కజమ్
స్వగ్రామమగమచ్ఛుద్ధస్స్వైరభ్యుద్గతోఽభవత్ ॥ ౧౦౧

తా॥ ఇట్లని గురునిచే యాజ్ఞప్తుడై యాతడు గురునికి సాష్టాంగముగ ప్రణామముజేసి స్వగ్రామమునకుపోయి అక్కడి స్వజనముచే స్వాగతము చేయబడి ఆదరింపబడెను.

సర్వసిద్ధ! భవాన్ ధన్యో వేఙ్కటేశకృపానిధిః
వసిష్ఠస్య ప్రసాదేన త్వత్సమః పురుషో న హి
ఏవం సంపూజితస్సర్వైర్బ్రాహ్మణక్షత్రియాదిభిః ॥ ౧౦౨

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! వసిష్ఠుని అనుగ్రహామువలన నీవు ధన్యుడవైతివి నీవు వెనుకటి సర్వాబద్రత్వమును పోగొట్టుకొంటివి. నీకు సముడగు పురుషుడు లేడు. శ్రీ వేంకటరమణుని యనుగ్రహాము నీ యందుకలదు. అని సమస్త జనులును అతనిని గౌరవింపసాగిరి.

ధనధాన్యయుతస్సపుత్రపౌత్రస్స సదాచారయుతస్సదానధర్మః
అవ వేఙ్కటనాయకేతి జల్పన్నవనౌ బ్రాహ్మణపుఙ్గవో బభూవ ॥

తా॥ సర్వసిద్ధుడును అంతటినుంచి ధన ధాన్య పుత్రపౌత్రాది సకల సంపదలు గలిగి దాన ధర్మరతుడై సంతతము శ్రీ వేంకటేశ మంత్రమును జపించుచు స్వీయగోష్ఠిలో ప్రముఖతను వహించెను

ఏవం సత్సంగమహిమా త్వేవం వేఙ్కటవైభవః
ఏవం తుమ్బురుతీర్థస్య మహిమా లోకసమ్మతః
ఇమం ప్రసంగం యో విద్వాన్ వేఙ్కటాచలవైభవమ్ ॥ ౧౦౫
మీనమాసే పూర్ణిమాయాం పఠతే జనసంసది
వక్తుశ్చ భక్త్యా శ్రోతౄణాం వాంఛితాని దదాత్యసౌ ॥ ౧౦౬
యస్తు వేఙ్కటమాహాత్మ్యకథాకథనకోవిదః
విష్ణ్వంశం తం ప్రశంసంతి వ్యాసాద్యా మునయస్తథా ॥ ౧౦౭

తా॥ సాధు సజ్జనుల సమాశ్రయణ మహిమమును శ్రీ వేంకటాద్రి మహిమను తుంబురు తీర్థ మాహాత్మ్యమును యీలాటి యుదాహరణములచే లోక ప్రసిద్ధమైయున్నది. ఈ మాహాత్మ్య గ్రంథమును మీనమాస పూర్ణిమ శుభదినమున భక్తితో పఠించెడివారలకును కథలను వినెడివారలకును శ్రీవేంకట రమణుడు సకలాభీష్టములను ప్రసాదించును. శ్రీ వేంకటాచల మాహాత్మ్యమును పురాణశ్రవణముజెప్పెడి పుణ్యపురుషుడు విష్ణ్వంశచే యవతరించినవాడని వ్యాసాది పురాణ ఋషులు ప్రశంసింతురు.

సూతుడు చెప్పుచున్నాడు —

వేఙ్కటాచలమహాత్మ్యం శ్రుతం వా పావనం ద్విజాః
యస్మిన్ శ్రుతేఽన్యమాహాత్మ్య శ్రవణేచ్ఛా న జాయతే ॥ ౧౦౮

నాస్తి తుమ్బురుతీర్థస్య సమం పాపప్రణాశనమ్
తస్మిన పౌర్ణిమాస్యాం చేత్సర్వపుణ్యోత్తమోత్తమమ్ ॥ ౧౦౯

ఇతి శ్రీబ్రహ్మోత్తరఖణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే
తీర్థమాహాత్మ్యే ఘోణతీర్థమాహాత్మ్యవర్ణనం
నామ పఞ్చాశోఽధ్యాయః

తా॥ ఓ ద్విజోత్తములారా: పవిత్రమైన శ్రీ వేంకటాచల మాహాత్మ్యమును మీరు వినియున్నారు ఈ క్షేత్రమాహాత్మ్యమును వినినవారలకు అన్య మాహాత్మ్యము వినుటకు ఆశజనింపదు. తుంబురుతీర్థమునుపోలిన పాపనాశనమగు మరియొక తీర్థములేదు మీన పూర్ణిమయందు ఈ తీర్థమున స్నానము చేయుట ఉత్తమోత్తమము

ఇది శ్రీ బ్రహ్మోత్తరఖండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమునందు
తీర్థమాహాత్మ్య ప్రకరణమున ఘోణతీర్థ (తుంబురుతీర్థ) మాహాత్మ్య
వర్ణన మనునది ఏబదవ అధ్యాయము.

---

## ఏబదియొకటవ అధ్యాయము.

—: నారద శాపమువలన తుంబురునకు ఘోణతీర్థప్రాప్తి కల్గుట :—

ఋషులు ప్రశ్నించుచున్నారు —

సూత! సర్వార్థవిజ్ఞాన విచక్షణ మహామతే!
కించిద్బ్రూమో వయం సర్వే తన్నో వక్తుం త్వమర్హసి ॥ ౧

తుమ్బురుర్నామ భగవాన్ కస్మాద్వేఙ్కటపర్వతే
తపస్తప్త్వా క్వచిత్తీర్థే లబ్ధవాన్ కిం ఫలం వద ॥ ౨

కస్మాద్వా ఘోణతీర్థస్య స్వాఖ్యాం ప్రార్థితవానభూత్
కిముద్దిశ్య తపస్తప్తమస్మాకం వక్తుమర్హసి ॥ ౩

తా॥ ఓ సూత పౌరాణికమహాశయా! నీవు సర్వజ్ఞుడవు. మేమొక విషయమును యెరుగగోరి అడుగుచున్నాము. మాకు తెలియజెప్పుము. ఒకానొకప్పుడు తుంబురుడు వేంకటాద్రి యందొకానొక పుణ్యతీర్థమున తపమాచరించి యేమి వరమునుపొందెను? ఘోణతీర్థమునకు తనపేరిట తుంబురుతీర్థమను ప్రసిద్ధికలుగుట కాతడేల సంకల్పించెను. ఆతడు ఏ దేవుని వరప్రసాదమునుకోరి తపమాచరించెను. ఈ వివరములను దయతో మాకు తెలియపరుపగోరెదము

సూతుడు సమాధానము చెప్పుచున్నాడు —

వేఙ్కటేశం నమస్కృత్య కథాం కల్మషనాశినీమ్
ప్రవదామి ముదా యుక్తాశ్శృణుత బ్రహ్మవాదినః ॥ ౪
కదాచిద్గగనే యాంతౌ వీణావాదనతత్పరౌ
ధ్యాయంతౌ హరి మేకాగ్రౌ మునీ తుమ్బురునారదౌ ॥ ౫
ఆకాశమార్గే దేవర్షిం తుమ్బురుం వీక్ష్య విస్మితః
సర్వరత్నమయీం వీణాం దధతం వాక్యమబ్రవీత్ ॥ ౬

తా॥ ఓ ద్విజోత్తములారా! శ్రీ వేంకటరమణుని దలచి నమస్కరించి మీరు కోరిన పుణ్యకథను చెప్పెదను, సావధానులరై వినుడు. ఒకప్పుడు వీణావాదన కుశలురగు తుంబురు నారదులను నిరువురు మహర్షులు భగవద్ధ్యానము చేయుచు గగనమార్గమున ప్రయాణముజేయ నారంభించిరి. అప్పుడు నారదుడు తుంబురునియొద్ద క్రొత్తదగు రత్నఖచితమగు వీణనుచూచి ఓ సఖా! నీవీణ నా వీణకంటె చాలబాగున్నది, నీవీణ కిట్టి యపూర్వశోభ, నేడెట్లుకల్గినది? నిజము చెప్పుము' అని యడుగగా తుంబురు డిట్లని బదులు చెప్పెను.

'తుమ్బురో! తవ వీణేయం మద్వీణాతో విరాజతే
కేనైవం శోభతే వీణాపూర్వమేవం న శోభతే ॥ ౭
సత్యం వదే'తి పృష్టోఽసౌ తుమ్బురుర్వాక్యమబ్రవీత్
ప్రాచీనబర్హిషం భూపం గత్వాఽహం స్తుతిముక్తవాన్ ॥ ౮

సంతుష్టస్తేన 'మే వీణామేవం రాజాత్వకారయత్

తా॥ ఓ నారదా! నేను ప్రాచీన బర్హుడను ప్రభువుసభకేగి యాతని కీర్తించితిని. ఆతడు ప్రీతుడై నాకీ వీణను బహూకరించెను, అనిచెప్పెను.

నారద స్తద్వచశ్శ్రుత్వా కోపాఽఽవిష్టో జగాద హ ॥ ౯

తా॥ నారదుడామాటలువిని తుంబురునిపై కోపించి ఇట్లనెను.

నారదుడు చెప్పుచున్నాడు —

'నరస్తుతిః కృతా సాధో! లోకే సత్సు వినిందితా
తస్మాత్ మత్సంగయోగ్యత్వం న పశ్యామ్యధమే త్వయి ॥ ౧౦
సర్వేషామపి లోకానాం నాయకం కేశవం వినా
నరం న స్తోత్రయామ్యేవ తాదృగస్మి హరిప్రియః ॥ ౧౧
మయా సహ న తే సఖ్యముచితం తన్నరస్తుతేః
అవాక్ఛిరాః పత త్వం భు ఖేచరత్వం న తే భవేత్ ' ॥ ౧౨

తా॥ ఓ సఖా! నీవు నరస్తుతిచేసితివి. నరస్తుతి సాధులకు తగనిది. నీవు నాతో నుండుట కనర్హుడవు. నేను సర్వలోకేశ్వరుడగు మహావిష్ణునితప్ప నరమాత్రుని కీర్తింపుటలేదు. నీవు అధోగతితో భూమిపైపడిపొమ్ము. నీ కాకాశయాన యోగ్యత లేకపోవుగాక

ఇత్యుక్తమాత్రే మునినా నారదేన తథైవ సః
అవాక్ఛిరాః పపాతాఽఽశు వేఙ్కటాచలమధ్యతః ॥ ౧౩
ఘోణతీర్థే క్వచిద్భాగే మనుష్యాదివివర్జితే
సింహశార్దూలసహితే భీరూణాం భయదాయిని ॥ ౧౪
పతన్నపి హరిం ధ్యాయన్ ప్రణతప్రీతికారకమ్
న వ్యథామాప్తవాన్ ఘోణమధ్యం కేవలమాప్తవాన్ ॥ ౧౫

తా॥ నారదునిచే నిట్లు శపించబడినంతమాత్రమున నప్పుడే తుంబురుడు వేంకటాచలమధ్యమున ఘోణతీర్థ పరిసరములందు పడిపోయెను. ఆ ప్రదేశము మనుష్యసంచారములేక సింహశార్దూలముల కాకరమై భీరువుల కుభయదాయకమై

యుండెను. అట్లు దైవయోగముచే క్రింపడుచున్నను తుంబురుడు ధైర్యము విడువక ఆశ్రితవత్సలుడగు భగవానుని ధ్యానించుచు యెట్టి క్లేశములేక ఘోణ తీర్థమును చేరెను.

తతో దృష్ట్వా తు తం ఘోణం దిశస్సమవలోక్య చ
హరిభక్త్యా ధీరబుద్ధిరేవం చింతాం చకార హ ॥ ౧౬

వేఙ్కటాద్రేర్మధ్యదేశో నాన్యో భవితుమర్హతి
తస్మాదేతద్వేఙ్కటేశో మాం రక్షతు సదా హరిః ॥ ౧౭

గతిర్వేఙ్కటనాథో మే నాన్యా గతిరితి బ్రువన్
సశఙ్ఖచక్రం లక్ష్మీశం తం ధ్యాతు ముపచక్రమే ॥ ౧౮

తా॥ నాలుగు దిక్కుల తిలకించి ధైర్యముతో ఇట్లు చింతింపసాగెను శాపతప్తుడనగు నాకు ధైర్యము కల్గించుటచే ఈ ప్రదేశము ప్రాకృతస్థలము కారాదు ఇయ్యది వేంకటాచల మధ్యభాగమై యుండవలయును. కావున వేంకటాద్రిపతియగు భగవానుడు నన్ను రక్షించుగాక. అగతికుడనగు నా కతడే దిక్కగుగాక అని యనుకొనుచు శంఖచక్రధారిగను లక్ష్మీసమేతుడుగను ఆ భగవానుని స్తుతింప నారంభించి అట్లు జపించుచుండెను

స్నాత్వా తీర్థే తత్ర భక్త్యా ప్రాఙ్ముఖస్తూపవిశ్య చ
ప్రాణాయామశతం కృత్వా తుమ్బురుర్ధ్యానమాస్థితః ॥ ౧౯

తా॥ ఘోణతీర్థమందు స్నానముచేసి భక్తియుతుఁడై ప్రాఙ్ముఖముగ గూర్చుని ప్రాణాయామ శతముజేసి ధ్యానయోగనిష్ఠుడై తుంబురుడు ధ్యానించు సమాధ్యవస్థ యిట్లున్నది,

పీతామ్బరం పీనభుజాచతుష్కం భుజాంతరాళస్థితలక్ష్మియుక్తమ్
ప్రసన్నవక్త్రం ప్రకటీభవత్కృపాపాథోధినేత్రం పరమం పుమాంసమ్
అనంతపక్షీశ చమూపముఖ్య భక్తైస్సమేతం పరమర్షి సేవ్యమ్
దేవాదిదేవం దితిజాన్తచక్రం సేవాపరాణాం సులభం నిధానమ్ ॥ ౨౦
హృదమ్బుజే హృద్యవపుర్ధరంతం సంచింతయన్వేఙ్కటశైలనాథమ్
సముచ్చరంత్ర్యక్షర మర్థయుక్తం నివాతనిష్కంప ఇవ స్థితోఽభూత్॥

తా॥ పీతాంబరధారియు పీనములగు నాలుగు భుజములు కలిగియు వక్షః స్థలమును మహాలక్ష్మిని ధరించినట్టియు ప్రసన్నముఖము కలిగి కృపాసముద్రము వంటి నేత్రములు కలట్టియు అనంతగరుడ విష్వక్సేనాది నిత్యసూరులతో పరివేష్టింపబడినట్టియు పరమర్షి సేవ్యుడును దేవాదిదేవుడును అసురాన్తకుడును సర్వ సులభుడును హృత్పుండరీకమున దివ్యమంగళ విగ్రహముతో సాక్షాత్కరించిన పరమ పురుషుడగు వేంకటరమణుని స్మరించుచు ఓంకారమును అర్థసహితముగ జపించుచు గాలిలేనిచోట కదలికలేని దీపశిఖవలె ఏకాగ్రముగనుండెను.

ఏవం తు నియమేనైవ సంవత్సరముువాస హ
తతః ఫాల్గునమాసే తు పౌర్ణమాస్యాం మహాతిథౌ ॥ ౨౩

ప్రాదుర్బభూవ భగవాం స్తత్ర వేఙ్కటనాయకః
పీతామ్బరో దివ్యగంధస్స్రగ్భూషాభిరలంకృతః ॥ ౨౪

రాకాచంద్రోపమముఖో రాజీవాయతలోచనః
లక్ష్మ్యా సర్వజగన్మాత్రా రమణీయభుజాంతరః ॥ ౨౫

సమస్తవాద్యనినదసంఘుష్టగిరికందరః

తా॥ ఇట్టి సమాధినిష్ఠలో తుంబురుడొక సంవత్సరముండెను, అట్లుండగా ఆ సంవత్సరము ఫాల్గున (మీన) మాసమున పూర్ణిమ పుణ్యదినమున వేంకట రమణుడు సాక్షాత్కారమాయెను. సాక్షాత్కరించిన భగవానుని దివ్యమంగళ విగ్రహమిట్లుండెను. పీతాంబరము ధరించి దివ్యస్రగ్గంధ భూషణాదులచే ఆ దివ్యమంగళ విగ్రహము విరాజిల్లెను భగవానుడు పూర్ణచంద్ర సదృశమగు ముఖమండలమును కమలములవంటి విశాలనేత్రములను రమణీయమై మహా లక్ష్మిని ధరించిన విశాలవక్షఃస్థలమును కలిగియుండెను. వారి యావిర్భావ సమయమున పర్వతకందరములందు దివ్యవాద్య ఘోషములు వినబడెను.

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు —

తుమ్బురో! తుమ్బురో! వత్స! మాం పశ్య కి ముపేక్షసే ॥ ౨౬

తా॥ 'తుంబురూ! తుంబురూ! నీవేల అనవధానమున నుంటివేల. నేను ప్రత్యక్షమైతిని. ఇటు చూడుము' అనియెను.

ఇతి బ్రువంతం తమృషిర్దదర్శోన్మీల్య చక్షుషీ
సాష్టాంగం సంప్రణమ్యాథ దేవమేవం దదర్శ హ ॥ ౨౮

తస్య పార్శ్వే సేవమానం దదర్శానంతమవ్యయమ్
గరుడం గిరిసంకాశం విష్వక్సేనం మహాప్రభుమ్ ॥ ౨౮

అగస్త్యమృషిముఖ్యం చ దేవపాదావలోకినమ్
అన్యాన్ ద్వైపాయనాదీంశ్చ ఋషీనఞ్జలిబంధనాన్ ॥ ౨౯

సనకాద్యాన్యోగినశ్చ వైఖానసమునీనపి
శుకమానసపుత్రాంశ్చ శుకం చ మునిసత్తమమ్ ॥ ౩౦

దేవగంధర్వసిద్ధాంశ్చ విశ్వావసుముఖానపి
యక్షాన్కింపురుషాంశ్చైవ కిన్నరోరగనాయకాన్ ॥ ౩౧

జయ దేవ జగన్నాథ సావధానమనోజయ
ఇతి మేఘరవోదగ్రాన్వేత్రపాణీంశ్చ కాంశ్చన ॥ ౩౨

ఆబ్రహ్మలోకాదాయాతానప్సరోగణమాగతమ్

తా॥ ఇట్లు హెచ్చరించబడుచున్న భగవానుని నివ్వెరపాటుతోచూచిన తుంబురుడు సాష్టాంగముగ దేవదేవునకు ప్రణామముచేసి పారజూచెను భగవానుని పరివారించి అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరిగణము అగస్త్యుడు ద్వైపాయనాది ఋషులు సనకాది యోగులు వైఖానస మునులు, శుకబ్రహ్మర్షి ఆయన మానసపుత్రులు దేవతలు గంధర్వులు సిద్ధులు విశ్వావసు ప్రభృతులు యక్షకిన్నర కింపురుషులు జయశబ్దముల నుచ్చరించెడి వేత్రహస్తులగు పరిచారకులు దేవలోకమునుండి వచ్చిన అప్సరోగణము భగవానునికి సేవ చేయుచుండుటనుకండ్లారగాంచెను.

ఆహూయాశేషలోకం తమాహ శేషగిరీశ్వరః ॥ ౩౩

భో భో సర్వేపి తీర్థేఽస్మిన్ స్నానం కురుత మా చిరమ్
సమస్తపాపహరణే సర్వశ్రేయోవిధాయిని ॥ ౩౪

తా॥ ఇట్లు తనను సేవించెడి పరివారమును జూచిన భగవానుడు వారల నుద్దేశించి ఓ పుణ్యపురుషులారా ! మీరందరును భక్తితో సమస్తపాపహరమగు యీ ఘోణతీర్థమందు స్నానముచేయుడు ఈ స్నానమువలన పాపమోచనమే గాక సర్వశ్రేయస్సులును కలుగును అని యుపదేశించెను

ఇతి వాక్యం సమాకర్ణ్య భక్త్యా సంకల్ప్య వాగ్యతాః
గోవిందేతి తత స్స్నాత్వా తీరమారురుహుశ్చ తే ॥ ౩౫

శుద్ధహృత్తుంబురుశ్చాపి స్నాత్వా తైస్సహిత స్తథా
భగవత్సన్నిధిం ప్రాప్త స్తోత్రం చక్రుః పృథక్పృథక్ ॥ ౩౬

తా॥ భగవానుని సుహృద్వాక్యమును విని అచ్చట జేరిన అందరును భక్తితో సంకల్పించి మౌనముతో గోవిందనామస్మరణముచేయుచు తీర్థస్నానము జేసి తీరమునకువచ్చిరి. శుద్ధ మనసుతో తుంబురుడును స్నానముచేసి ఇతర భక్త బృందముతోకూడి భగవానుని సన్నిధికిపోయి అందరును భగవానుని స్తుతిజేయ నారంభించిరి.

జయ సర్వగుహావాస లోకరక్షామణే హరే
భక్తార్తపాలనపర ప్రణతార్తిహర ప్రభో ॥ ౩౭

లక్ష్మీనాధ జయానంత రక్షితాశేష భూసుర
పునీహి సకలాన్లోకాన్పాలయ త్వం కృపాలయ ॥ ౩౮

తా॥ ప్రభో ! నీవు సర్వచేతనా చేతనముల యందంతర్యామిగ నున్నావు. లోకరక్షకుడవు ఆర్తులగు భక్తులను పాలించెదవు. ఆశ్రితరక్షకుడవు, కృపా సముద్రుడవు, భూసురపక్షపాతివి ఓ లక్ష్మీకాంతా ! నీకు జయమగుగాక సకలలోకములను పాలింపుము. అని వారలు స్తుతించిరి

తుంబురుడు చెప్పుచున్నాడు —

వందే సదా వేఙ్కటశైలనాథ త్వామేవ మే పాపహరో భవ త్వమ్
తీర్థానుభావం చ తవానుభావం శ్రోతుం మమేచ్ఛా పరివర్ధతే హి ॥

తా ప్రభో ! నీవు నా శాప పాపమును పోగొట్టితివి. నన్ను ధన్యుని జేసితివి. ఈ దివ్యతీర్థముయొక్కయు నీయొక్కయు ప్రభావమును వినవలెనని నాకు ఆశకల్గుచున్నది. దయతో చెప్పుము.

సూతుడు చెప్పుచున్నాడు —

ఇతి స్తుతో వేఙ్కటేశః కుంభసమ్భవమబ్రవీత్
ఏతేషామద్య సర్వేషాం వేఙ్కటాచలవైభవమ్ ॥ ౪౦
మాహాత్మ్యమపి తీర్థస్య వద కించిన్మహామతే
ఇత్యుక్తో దేవదేవేన తత్రాగస్త్యోఽబ్రవీదిదమ్ ॥ ౪౧

తా॥ ఇట్లు తుంబురునిచే ప్రార్థింపబడిన వేంకటరమణుడు అగస్త్యుని బిలచి 'ఓ మహర్షిసత్తమా' తుంబురుడు కోరిన వేంకటాచలవైభవము తీర్థవైభవము నీకు తెలిసినవి వివరించి తుంబురునకును ఈ మహాభక్తజనమునకంతకును చెప్పుము' అని యానతీయగా

అగస్త్యుడిట్లు చెప్పనారంభించెను —

పుణ్యోఽయం వేఙ్కటగిరిస్సర్వపుణ్యస్థలేష్వపి
సమస్తతీర్థాన్యత్రైవ పుణ్యాని నివసంతి హి ॥ ౪౨
భక్తాపరాధాన్ సోఢ్వైవ వేఙ్కటేశో దయాపరః
రక్షత్యేవ తతస్సోఽయం సేవ్యశ్శ్రీవేఙ్కటేశ్వరః ॥ ౪౩
స్నాతానామత్ర తత్తీర్థే సర్వపాపక్షయో భవేత్
సర్వశ్రేయాంసి సిద్ధ్యంతి నాత్ర కార్యా విచారణా ॥ ౪౪
సువర్ణమన్నం తామ్బూలం సుగంధం శీతలం జలమ్
అత్ర దత్వా నరః పూతస్సర్వాన్కామానవాప్నుయాత్ ౪౫

తా॥ పుణ్యక్షేత్రములన్నిటిలో వేంకటాచలము పుణ్యతమము. ఇచ్చట సమస్త పుణ్యతీర్థములు కలవు భక్తులయొక్క అపరాధసహస్రమును స్మరణమాత్రముచే క్షమించి సంరక్షించెడి దయాపరుడగు శ్రీ వేంకటాచలపతి సేవ్యుడు. ఈ ఘోణతీర్థస్నానము చేసినవారలకు సమస్తపాపములు నశించును. సకల సంపదలుకలుగును. సందేహములేదు. బంగారు, అన్నము, తాంబూలము, సుగంధద్రవ్యములు, శీతలజలము, మొదలగు పదార్థములను ఈ తీర్థ తీరమున దానము చేసెడివారలు సర్వపాప వినిర్ముక్తులై ఇష్టకామముల బడయగలరు.

తుంబురుడు అడుగుచున్నాడు —

భగవన్మమ నామ్నైవ తీర్థ మేతత్ప్రసిద్ధ్యతు
తథా స్త్విత్యుక్తవాన్విష్ణుస్తుంబురుం పునరబ్రవీత్ ॥ ౪౬

తా॥ 'ఓ దేవదేవా! అట్టైన నీ తీర్థము నేను తపసుచేసిన జ్ఞాపకముగ నా పేరుతో పిలువబడునట్లు వరదానము నీయుము' అని తుంబురుడు ప్రార్థించగా 'అట్లే యగుగాక' అని భగవాను డనుగ్రహించుచు మరియు నిట్లనియె.

భగవానుడు చెప్పుచున్నాడు —

నారదేన సహైవ త్వం పూతో మత్కీర్తనం కురు
యేఽత్ర ఫాల్గునరాకాయాం స్నానదానాది కుర్వతే ॥ ౪౭
ఇహ లోకే పరత్రాపి తేషా మిష్టం దదామ్యహమ్

తా॥ నీవు శాపవిముక్తి నొందితివి తిరిగి నీ వాతనితోకూడి నన్ను యధా పూర్వముగ మీరు ఇరువురును నా సంకీర్తనములను చేయుచుండుడు. యెవ్వరు ఫాల్గున పూర్ణిమ పుణ్యదినమున నీ తీర్థమందు స్నానదానాదుల నాచరింతురో వారల కైహికాముష్మిక సుఖములను నేననుగ్రహింతును.

ఇత్యుక్త్వాస్తుంబురుముఖాస్తుష్టా యాతా యథాగతమ్ ॥ ౪౮

ఇతి శ్రీ బ్రహ్మోత్తరఖణ్డే తీర్థమాహాత్మ్యే శ్రీ వేఙ్కటాచలమాహాత్మ్యే ఘోణతీర్థస్య తుమ్బుర్వభిధాన కథనన్నామైక పఞ్చాశోఽధ్యాయః.

తా॥ ఇట్లని శ్రీ వేంకటాచలపతి శ్రీ వేంకటాచలము, తుంబురుతీర్థముల మహిమను వినిన తుంబురుప్రభృతులు వచ్చినత్రోవను తమ స్వస్థానముల కేగిరి.

యేబదియొకటవ అధ్యాయము.

బ్రహ్మోత్తరఖండ ప్రకరణము సమాప్తము

శ్రీ శ్రీనివాసార్పణమస్తు.

శ్రియై పద్మావత్యై నమః
శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః

### శ్రీ బ్రహ్మాండపురాణాన్తర్గత

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము

( ఆంధ్రతాత్పర్యసహితము )



శ్రియఃకాన్తాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్
శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

శ్రీ వేంకటాచలాధీశం శ్రియాఽఽధ్యాసితవక్షసమ్
శ్రితచేతనమన్దారం శ్రీనివాసమహం భజే ॥

జయత్యాత్మేశ్వరోన్నిద్రధ్యానసౌధప్రియాతిథిః
శ్రీమత్పుత్రపురీవాసః శ్రీరామః సీతయా గృహీ
శ్రీనివాసం నమస్కృత్య గురూనౌఖేయసూత్రిణః
శ్రీనివాసాధ్వరీన్ద్రాద్యాన్ వేదాన్తార్థ ప్రవర్తకాన్
దేవభాషామయం కావ్యం వేంకటాచల వైభవమ్
ఆంధ్ర్యా వాణ్యా పార్థసూతో వివృణోతి యథామతి.

—: భృగునారద సంవాదాత్మకః సూతోక్త శ్రీ వేంకటాచలమాహాత్మ్యము :—

ఋషులు ప్రశ్నించుచున్నారు —

కథితాని మహాభాగ పుణ్యక్షేత్రాణ్యనేకశః
ప్రశస్తాని చ తీర్థాని తాని తాని మహీతలే ॥ ౧

తేభ్యోఽధికతమం క్షేత్రం తీర్థం పాపవినాశనమ్
యచ్చాస్తి తాదృశం తీర్థం తన్నో బ్రూహి సునిశ్చితమ్ ॥ ౨

యస్మిన్వసతి సర్వాత్మా మాధవో భక్తవత్సలః
విహరన్ముదితో నిత్యం శ్రియా భూమ్యా చ నీళయా ॥ ౩

యస్మింశ్చ వసతిం ప్రాప్తో దుస్తరం భవసాగరమ్
సుఖేన జన్తుస్తరతి ప్రాప్తవిత్తశ్శుచం యథా ॥ ౪
తస్య క్షేత్రస్య మాహాత్మ్యం విస్తరాద్వక్తుమర్హసి
న చ తేఽవిదితం కిఞ్చిత్పశ్యామో భువనత్రయే ॥ ౫

తా॥ ఓ పౌరాణికోత్తమా! భూమండలమున చాలా పుణ్యతీర్థములు కలవని చెప్పుదురు. అట్టి యన్నిటిలో సర్వోత్తమమైన తీర్థము నొక్కదానిని మాకు చెప్పుము. ఆ తీర్థ తీరమున శ్రీనాథుడు మహాలక్ష్మితో నివసించియుండ వలెను. అట్టి భగవన్నివాసముచే పవిత్రమగు క్షేత్రము వాసమాత్రమున చేత నులకు సంసారబంధమునుండి మోక్షప్రాప్తి కలుగవలయును. అట్టి క్షేత్రము యొక్క మాహాత్మ్యమును చెప్పగలవారలలో నీకంటె సమర్థులు లేరు.

శ్రీ సూతపౌరాణికుడు చెప్పుచున్నాడు —

స్మారితోఽస్మి మహాభాగాస్సాత్ప్రతం వచనేన వః
కథయిష్యామి మునయశ్శృణుతైకాగ్రమానసాః ॥ ౬
అముమేవాధికృత్యార్థం పురా నారాయణాత్మకమ్
అపృచ్ఛన్మునిశార్దూలం వ్యాసం సత్యవతీసుతమ్ ॥ ౭
అథ పృష్టో మయా ప్రాహ వ్యాసస్సత్యవతీసుతః

తా॥ మీ ప్రశ్నమువలన నాకు జ్ఞాపకమువచ్చినది. అవధానముతో వినుడు చెప్పెదను. ఒకప్పుడు ఇదే ప్రశ్నమును నేను గురువగు వేదవ్యాసునడిగితిని. ఆయన నాకిట్లు చెప్పిరి.

శ్రీ వేదవ్యాసులు చెప్పుచున్నారు :—

శృణు సూత పురావృత్తమాఖ్యానం కథయామి తే ॥ ౮
కదాచిత్పర్యటన్భూమిం నారదో మునిసత్తమః
ఆజగామాశ్రమం పుణ్యం భృగోర్ముదితమానసః ॥ ౯
శారదాభ్రనిభశ్శ్రీమాన్ వీణాం చ మహతీం దధత్

ఉదతిష్ఠద్భృగుశ్శిష్యై ర్దృష్ట్వా దేవర్షిమాగతమ్ ॥ ౧౦
పూజయిత్వా చ తం హృష్టః పాద్యార్ఘ్యాసనవన్దనైః
పృష్ట్వా చ కుశలం భూయః పప్రచ్ఛ మునిపుఙ్గవమ్ ॥ ౧౧

తా॥ సూతా : వినుము ఒకప్పుడు నారదుడు భూప్రదక్షిణము చేయుచు భృగుమహర్షి యాశ్రమమునకువచ్చెను. ఆయనను శిష్యసహితుడగు భృగువు స్వాగతమిచ్చి పూజించి కుశలమడిగి ఇట్లు ప్రశ్నించెను

భృగువు ప్రశ్నించుచున్నాడు :—

జగత్పర్యటితం సర్వం భగవన్నారద ! త్వయా
తేన జానాసి జగతాం వృత్తాన్తమఖిలం మునే ॥ ౧౨
క్షేత్రాణా మధికం క్షేత్రం తీర్థానాం తీర్థముత్తమమ్
యద్యస్తి భువి విప్రేన్ద్ర తన్మే బ్రూహి తపోనిధే ॥ ౧౩
ఆస్తే విష్ణురచిన్త్యాత్మా విహరన్ రమయా సహ
యత్ర సాక్షాత్కృతో దేవో వరదస్సర్వదేహినామ్ ॥ ౧౪
తపాంసి యత్ర సిద్ధ్యన్తి న చిరేణ తపస్వినామ్
యస్మింశ్చ నివసన్జన్తుర్జ్ఞసా మోక్షమాప్నుయాత్ ॥ ౧౫
ఏతదాచక్ష్వ భగవన్విస్తరేణ తపోనిధే
జ్ఞాతుమర్థ మిమం బ్రహ్మన్ నత్వదన్యోఽస్తి భూతలే ॥ ౧౬

తా॥ మునీంద్రా : త్రిలోకములందు నీవు పర్యటింతువు. అచ్చటి విశేషము లన్నియు నీవెరుగుదువు సర్వేశ్వరుడగు శ్రీమహావిష్ణువు మహాలక్ష్మీసహాయుడై సకలలోకముల నుద్ధరించుటకై సాక్షాత్కరించి సాన్నిధ్యము జెందినట్టియు దాననే సకల పుణ్యతీర్థములలో నుత్తమమగు పుణ్యతీర్థములు కలట్టియు తపస్సిద్ధికి సులభాస్పదమైనట్టియు నివాసమాత్రముచే మోక్షసాధనమైనట్టియు ఒక క్షేత్రమును మాకు యెరిగింపుము.

నారదుడు చెప్పుచున్నాడు :—

శృణుష్వైకమనా బ్రహ్మన్ మత్తః కథయతో మునే

క్షేత్రాణాం క్షేత్రముత్కృష్టం తీర్థానాం తీర్థముత్తమమ్ ॥ ౧౭
శ్రీవేఙ్కటగిరిర్నామ క్షేత్రం పుణ్యం మహీతలే
సర్వపాపప్రశమనం సర్వపుణ్యవివర్ధనమ్ ౧౮
వక్తుం న తస్య మాహాత్మ్యం బ్రహ్మణాఽపి సురైరపి
శక్యతే వా తథా స్మర్తుం మనసాఽపి మహామునే ॥ ౧౯
ఆరాధ్యస్సర్వదేవానాం మాధవో భక్తవత్సలః
విహాయ స్వం పరం ధామ రమతే రమయా సహ ॥ ౨౦

తా॥ మునిసత్తమా! వినుము. క్షేత్రములకెల్లను తీర్థములకెల్లను గొప్పది వేంకటాద్రి. ఆ క్షేత్రము సర్వపాపములను శమింపజేసి పుణ్యములను కలుగజేయును. ఆ క్షేత్రమాహాత్మ్యమును వాచా చెప్పుటకుగాని మనసా స్మరించుటకుగాని బ్రహ్మాదులకును శక్యముకాదు. సర్వలోకేశ్వరుడగు శ్రియఃపతి శ్రీవైకుంఠనివాసమును వదలి మహాలక్ష్మితోకూడి యీ క్షేత్రమున సాన్నిధ్యము చెందియున్నాడు.

అఞ్జనాద్రిర్వృషాద్రిశ్చ శేషాద్రిర్గరుడాచలః
తీర్థాద్రిశ్శ్రీనివాసాద్రిశ్చిన్తామణిగిరిస్తథా
వృషభాద్రిర్వరాహాద్రిర్జ్ఞానాద్రిః కనకాచలః ॥ ౨౧
ఆనన్దాద్రిశ్చ నీలాద్రిస్సుమేరుశిఖరాచలః
వైకుణ్ఠాద్రిః పుష్కరాద్రిరితి నామాని వింశతిః ॥ ౨౨
బ్రాహ్మణః క్షత్రియో వైశ్యశ్శూద్ర శ్చేతరజాతయః
తన్నామాని పఠేయుర్యే ముచ్యన్తే తేఽఘబన్ధనాత్ ॥ ౨౩

తా॥ వేంకటాద్రికే అంజనాద్రి, వృషాద్రి, శేషాద్రి, గరుడాచలము, తీర్థాద్రి, శ్రీనివాసాద్రి, చింతామణిగిరి, వృషభాద్రి, వరాహాద్రి, జ్ఞానాద్రి, కనకాచలము ఆనందాద్రి, నీలాద్రి, సుమేరుశిఖరాచలము, వైకుంఠాద్రి, పుష్కరాద్రియను మొదలగు నిరువది నామాంతరములు కలవు. బ్రాహ్మణాది నాల్గు వర్ణములుగాని ఇతరులుగాని ఈ దివ్యనామములను స్మరించినయెడల సర్వపాపములు తొలగును.

వేఙ్కటాద్రిసమం స్థానం బ్రహ్మాణ్డే నాస్తి కిఞ్చన
వేఙ్కటేశసమో దేవో న భూతో న భవిష్యతి ॥ ౨౪

తా॥ వేంకటాద్రిని పోలిన మరియొక పుణ్యక్షేత్రముగాని వేంకటేశుని బోలిన మరియొక దైవముగాని బ్రహ్మాండమున లేరు.

తస్మిన్బహూని తీర్థాని సురసిద్ధనిషేవితే
రమ్యాణి సన్తి శతశస్సర్వాఘౌఘహరాణ్యపి ॥ ౨౫

సర్వతీర్థాతిశాయీని సర్వైశ్వర్యకరాణి చ
సర్వసిద్ధ్యనుకారీణి సర్వమఙ్గళగాన్యపి ౨౬

స్వామిపుష్కరిణీనామ సరసీ రాజతే శుభా
యస్యాస్తీరేఽరవిన్దాక్షో వసతి ప్రీతమానసః ॥ ౨౭

తా॥ వేంకటాద్రియందు ఇంకను ఎన్నియో పుణ్యతీర్థములుకలవు. అవన్నియు వెనుక చెప్పిన మహాత్త్వము గలవియే అందును తీర్థరాజమగు స్వామిపుష్కరిణియను నొక తీర్థము ప్రశంసింపవగినది ఈ తీర్థతీరమునందే శ్రీనివాసదేవుని దివ్యమందిరము కలదు.

భృగువు ప్రశ్నించుచున్నాడు :—

తస్మిన్గిరౌ శ్రియా సార్ధం హిత్వా వైకుణ్ఠముత్తమమ్
కిమర్థం వసతి బ్రహ్మన్ సాక్షాన్నారాయణస్స్వయమ్ ॥ ౨౮

తా॥ ఓ మహర్షిసత్తమా ! ఏల శ్రీనివాసుడు వైకుంఠమునువిడచి ఈ క్షేత్రమున వసియించుట కిచ్ఛయించెను ? దయచేసి చెప్పుము.

నారదుడు బదులుచెప్పుచున్నాడు :—

కథయిష్యామి తే సర్వం వైకుణ్ఠో యేన హేతునా
తస్మిన్గిరివరే రమ్యే చిరమాస్తేఽశ్రియా సహ ॥ ౨౯

నారాయణమహం ద్రష్టుం కదాచిత్క్షీరసాగరమ్
గతవాంస్తత్ర చాఽద్రాక్షం శ్వేతద్వీపం మహోచ్ఛ్రితమ్ ॥ ౩౦

తత్ర కల్పద్రుమవనే శాతకుమ్భమయం గృహమ్
నానారత్నసమాకీర్ణమనేకస్తమ్భశోభితమ్ ॥ ३१

సహస్రార్కప్రతీకాశం దీప్యమానమివ శ్రియా
దుష్ప్రాపమమరేన్ద్రైశ్చ సుప్రాపం కృతభక్తిభిః ॥ ३२

తా॥ భృగుసత్తమా ! వినుము. చిరకాలమునుండి వేంకటాద్రియందు భగవానుడు సాన్నిధ్యము జెందియున్నాడు. ఒకప్పుడు భగవద్దర్శన లాలసుడనై నేను క్షీరసాగరమునకు పోతిని. అచ్చట శ్వేతద్వీపము అందు కల్పద్రుమవనము వనమున నానా రత్నసమాకీర్ణమును అనేక స్తంభశోభితమును సహస్రార్క ప్రతీకాశమై దీప్యమానమును అమరేంద్రులకుకూడ దుష్ప్రాపమును భక్తులకు మాత్రము సుప్రాపమునగు బంగారు సౌధము కలదు.

తత్రాఽపశ్యం సభాందివ్యాం దేవదేవస్య శార్ఙ్గిణః
అనన్తవిహగాధీశసేనాన్యాద్యైరధిష్ఠితామ్ ॥ ३३

తత్రాఽపశ్యం హృషీకేశం సర్వలోకైకకారణమ్
సర్వాశ్చర్యమయం దేవం శయానం శేషతల్పకే ॥ ३४

ద్విలక్షయోజనోపేతవిగ్రహం కామరూపిణమ్
రజతాచలసంలీన నీలజీమూతసన్నిభమ్ ॥ ३५

పుణ్డరీకవిశాలాక్షం పురాణపురుషం శుభమ్
తథా సర్వావినీతానాం శాసితారం సురోత్తమమ్ ॥ ३६

సంవాహ్యమానచరణం శ్రియా భూమ్యా చ సాదరమ్
శ్రీవత్సాఙ్క ముదారాఙ్గం శతపత్రనిభాననమ్ ॥ ३७

యుగపన్నిర్గతాదిత్యసహస్రసదృశద్యుతిమ్
శఙ్ఖచక్రధరం దేవం జ్వలచ్చఞ్చలకుణ్డలమ్ ॥ ३८

వైజయన్త్యా చ విపులే విభూషిత మురస్థలే
సౌదామినీ శతాధిక్యజ్వలత్పీతామ్బరోజ్జ్వలమ్ ॥ ३९

లావణ్యామృతసన్దోహం భవసన్తాపనాశకమ్
యుగాన్తార్కసహస్రాభమకుటోజ్జ్వలమస్తకమ్ ॥ ౪౦
అచలస్మేరఘనసఙ్కాశమతీవ ప్రియదర్శనమ్
కణ్ఠభూషోజ్జ్వలం దీప్తకణ్ఠికాద్యోతికౌస్తుభమ్ ॥ ౪౧
అర్కాభమణిరత్నాద్యైర్జ్వలచ్చఞ్చలకుణ్డలమ్
అత్యుజ్జ్వలితహారఞ్చ వనమాలావిభూషితమ్ ॥ ౪౨
స్ఫురతా బ్రహ్మసూత్రేణ ప్రోద్భాసితభుజాన్తరమ్
అనేకసూర్యసఙ్కాశకేయూరమణికాన్తికమ్ ॥ ౪౩
మణికాఞ్చనముక్తాఢ్యైః కటకైరుపశోభితమ్
అఙ్గుళ్యాభరణైస్స్వర్ణైర్వరత్నైరలఙ్కృతమ్ ॥ ౪౪
కర్పూరగన్ధితాస్యాబ్జం సురక్తాధరపల్లవమ్
తటిచ్ఛతసహస్రాభపీతనిర్మలవాససమ్ ॥ ౪౫
నూపురైః కటిసూత్రేణ తటిన్మాలాఽయుతోపమమ్
బాలసూర్యసహస్రాభ నాభిపఙ్కజ మద్భుతమ్ ॥ ౪౬
మార్కణ్డేయభరద్వాజపుణ్డరీకశుకాదిభిః
యాజ్ఞవల్క్యామ్బరీషాద్యైరన్యైశ్చ మునిపుఙ్గవైః ॥ ౪౭
చతుర్భుజైస్స్వసారూప్యైశ్శఙ్ఖచక్రగదాధరైః
ప్రహ్లాదప్రముఖైర్భక్తైస్స్తూయమానమనేకశః ॥ ౪౮
సనన్దసనకాద్యైశ్చ యోగిముఖ్యైరభిష్టుతమ్
భుక్తిముక్తిప్రదం నృణాం సర్వాభీష్టప్రదాయినమ్ ॥ ౪౯
సేవితం విధిరుద్రాద్యైర్దిక్పాలైశ్చ భయాన్వితైః

తా॥ ఆ సౌధమున అనన్త గరుడవిష్వక్సేనాదులచే అధిష్ఠితమైయున్న దేవదేవుని కొలువు కూటముకలదు. ఆ సభనలంకరించి సర్వలోకైకకారణుడును సర్వాశ్చర్యమయుడునగు శ్రీ మహావిష్ణువు శేషతల్పమునందు శయనించియుండు

టను సేవించితిని ప్రభుపు రెంతులక్షలయోజన విస్తీర్ణమగు కామరూపమగు దివ్యమంగళ విగ్రహముతో నుండెను. తెల్లని ఆదిశేషుని శరీరముపై నల్లని ప్రభుని తిరుమేని రజతాచలమున నీలజీమూతమువలె కన్పట్టెను. పుండరీకముల వలె విశాలములగు నేత్రములు, శ్రీభూదేవులు పాదసంవాహనము చేయుచుండుట, శ్రీవత్సచిహ్నము, ఉదారదేహము, కమలమునంటి ముఖము, వేయిమంది సూర్యులేకకాలమున నుదయించినప్పుడువలె ప్రకాశము, శంఖచక్రములు, దీప్త కుండలములు, కంఠమున వ్రేలాడు వైజయంతీ దామము, నూరు మెరుపులకంటె ప్రకాశించెడి పీతాంబరము, దివ్యకాంతిచే ప్రకాశించెడి కిరీటము, కర్ణభూషణములు, కంఠపీఠమున వెలిగెడి కౌస్తుభమణిరాజము, ప్రకాశమగు బ్రహ్మసూత్రము, కేయూరములు, మణికాంచనముక్తాశోభితములగు కటకములు, అంగుల్యాభరణ ములు, కర్పూరగంధమును వెదజల్లెడి అధరపల్లవము, దివ్యములగు నూపుర ములు, కటిసూత్రము బాలసూర్యసహస్రాభమగు నాభిపంకజము, ఆప్రభుని లావణ్యామృతసందోహముగను భవసంతాపనాశకునిగను ప్రకటించుచుండెను. మార్కండేయుడు, భారద్వాజుడు, పుండరీకుడు, శుకుడు, యాజ్ఞవల్క్యుడు, అంబరీషుడు అసంఖ్యాకులగు మహాత్ముల చేతను శంఖచక్రాది దివ్యాయుధ ములను ధరించి భగవత్సారూప్యమునందిన ప్రహ్లాదాది భక్తశిఖామణులచేతను యోగి ముఖ్యులగు సనకాదులచేతను విధిరుద్రాదులు దిక్పాలురాదిగాగల ఆధికారిక పురుషులచేతను ఆ ప్రభుపు సేవింపబడుట చూచితిని

నారదం ప్రతి ధరాతలవిజిహీర్షణ భగవదుక్తిః

ప్రణమ్య శిరసా దేవం స్తుత్వా స్తుతిభిరీశ్వరమ్ ॥ ౨౦
భక్త్యాచాఽవనతో భూత్వా కృతాఞ్జలి రహం స్థితః
స్వాగతం చైవ పృష్ట్వా మాం బహు మేనే గదాధరః ॥ ౨౧
దేవదేవోఽథ మాం వీక్ష్య పౌత్రస్నేహాతిశీతలైః
వీక్షణైర్హ్లాదయన్నిత్థం బభాషే మధుసూదనః ॥ ౨౨

తా॥ పురుషోత్తముడగు ఆ ప్రభుని జూచి నమస్కరించి యథాశక్తిగ స్తోత్రముజేసి అంజలి బంధముతో నిలచితిని భగవానుడును పౌత్రస్నేహాతి శీతలములగు కటాక్షములచే నన్ననుగ్రహించి ఇట్లనెను.

శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు :—

నారద! శ్రూయతాం వత్స త్వయా దృష్టం జగత్త్రయమ్
బ్రహ్మాణ్డే కుత్ర వా వాసో మమ దేశే భవేదిహ ॥ ౫౩
విహారయోగ్యశ్చ తథా విశ్రమస్థానముత్తమమ్
కథయ త్వం మహాభాగ యద్యస్తి భువి తాదృశమ్ ॥ ౫౪

తా॥ నారదా! నీవు త్రిలోకములనెరుగుదువు. బ్రహ్మాండమున నేను నివసించుటకు ఉచితమగు స్థానమును నీవు నాకు చెప్పుము.

నారదకృతభగవత్క్రీడాహర్దేశప్రకాశనమ్

శ్రీ నారదుడు చెప్పుచున్నాడు —

న త్వయాఽవిదితం కిఞ్చిత్త్రిషు లోకేషు విద్యతే
తథాఽప్యయం తవ ప్రశ్నో మయి స్నేహవశాత్ప్రభో ॥ ౫౫
త్వద్విహారోచితం స్థానం రమణీయం విలోక్యతే
ఆశ్చర్యప్రభవం స్థానం తత్సమం నాస్తి భూతలే ॥ ౫౬
తవ పాదప్రభూతాయా గఙ్గాయాశ్చైవ దక్షిణే
దిగ్భాగే దణ్డకారణ్యే ద్విశతైర్యోజనైర్మితే ॥ ౫౭
దక్షిణామ్బునిధేశ్చాపి దక్షిణేతరభాగకే
పూర్వాబ్ధేః పశ్చిమేభాగే పఞ్చభిర్యోజనైర్మితే ॥ ౫౮
రమణీయ మిదం స్థానం క్రీడాయోగ్యం విభో తవ
తత్రత్యాశ్చ జనాః సర్వే తపస్స్వాధ్యాయవర్జితాః ॥ ౫౯
ఆదివ్యాధిహతాశ్చైవ పశ్యన్తి శరణం న చ
అనుగ్రహాయ వై తేషాం స్థాతవ్యం భవతా హరే ॥ ౬౦

తా॥ ప్రభో! మూడులోకములందు నీకు తెలియని ప్రదేశము నాకు తెలసినది లేదు. నాయందు వాత్సల్యముతో నీవడిగిన ప్రశ్నకు సమాధానము చెప్పవలసినదగుటచే నేనెరిగిన విషయము మనవిచేసెదను. నాకు తెలిసిన ఒకచోటు కలదు.

అది మీకు విహారోచితము రమణీయమైనది. అట్టి ప్రదేశముపేరు యెచ్చటను లేదు. గంగకు దక్షిణమున రెండునూర్లు యోజనముల దూరములో దండకారణ మునను దక్షిణసముద్రమున కుత్తరముననుు పూర్వసముద్రమునకు ఐదుయోజన ములలో పశ్చిమముననుు నుండు ఈస్థానము దేవరకు వాసయోగ్యమగును అక్కడ మరియొక విశేషముకూడ వైకుంఠముననుండనిది కలదు. ఆ ప్రదేశ ములందు నివసించెడి ప్రజలందరును ప్రాయికముగ, తపస్స్వాధ్యాయములు మరచియు దాననే ఆధివ్యాధి పరాహతులై గత్యంతరము కానక దుఃఖించు చున్నారు, తామక్కడ విజయముచేసి నంతట తమ కల్యాణగుణములకు సద్వినియోగమేర్పడి వారలకు సహాయము కలుగును కావున ప్రయోజనద్వ యము తమ కచ్చటియావాసమువలన సిద్ధించునని తలచెదను.

శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు —

చోళరాజసుతః కశ్చిత్కలౌ ఖలు భవిష్యతి
చక్రవర్తీతి మద్భక్తస్తత్ర మామర్చయిష్యతి ॥ ౬౧
అనుగ్రహాయ తస్యాపి తత్ర స్థాస్యామ్యహం మునే ॥ ౬౧½

ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే తీర్థఖండే శ్రీ వేంకటాచలమాహాత్మ్యే భగవ న్నారద సంవాదే శ్రీ వేంకటాచలమహిమానువర్ణనం నామ ప్రథమోఽధ్యాయః.

తా॥ నిజమే. కలియుగమందు తొండమాఞ్చక్రవర్తియను ప్రభువు చోళ రాజుగర్భమున నుదయించగలడు. అతడు నా భక్తుడై నన్నర్చింపనున్నాడు. ఆతని అభీష్టసిద్ధిగూడ నేనక్కడ అవతరించి నివాసమేర్పరచికొనుట మూలమున సిద్ధించును కావున నీవు చెప్పినరీతిని నేను వేంకటాద్రియందుండగలను.

ఇది శ్రీ బ్రహ్మాండపురాణమున తీర్థఖండమున శ్రీ వేంకటాచలమహాత్మ్య గ్రంథమునందు భగవన్నారద సంవాదమున శ్రీ వేంకటాచలమహిమాను వర్ణనము ప్రథమాధ్యాయము.

---

# రెండవ అధ్యాయము



—: ఆదిశేషుడు భగవత్క్రీడాద్రియై యవతరించుట :—

అథాఽఽహ భగవాఞ్ఛేష మాహూయ పురతస్థ్సితమ్
మేఘగమ్భీరయా వాచా హర్షోత్ఫుల్లవిలోచనః ॥ ౧

తా॥ తరువాత భగవానుడు శేషునిజూచి సంతోషముతో ఇట్లని యాజ్ఞా పించెను

శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు —

అనన్త! మత్ప్రియో లోకే న త్వదన్యోఽస్తి కశ్చన
తస్మాన్మమ ప్రియం కిఞ్చిత్కర్తవ్యం భవతాఽనఘ ॥ ౨

శ్రుతం హి భవతా సర్వం నారదోదీరితం వచః
క్రీడాసముచితే దేశే వస్తవ్య మితి మే మతిః ॥ ౩

తత్ర భూత్వా గిరివరో భవాన్వసతు భూతలే
త్వత్ఫణామణ్డలభువి స్థాతవ్యం రమయా సహ ॥ ౪

తా॥ ఓ అనన్తా' నీవు నా కత్యంతప్రియుడవు. నీవలన నాకొక ఘన కార్యము కావలెను నారదుడుచెప్పిన సంగతులు నీవు వినియుంటివి నేను భూమి యందొక చక్కని ప్రదేశమున నుండదలచితిని నారదుడు చెప్పిన ప్రదేశమున నీవొక పర్వతముగ కమ్ము. నీ పుణామండల ప్రదేశమున నేను మహాలక్ష్మితో వసియింతును.

శేషుడు చెప్పుచున్నాడు :—

అనన్తోఽహం మహాదేవ! స్థాస్యామి గిరిరూపధృత్
భవాంస్తు రమయా సార్ధం మమ సానుషు రంస్యతామ్ ॥ ౫

గఙ్గాద్యాః సరితః పుణ్యాస్తీర్థాని చ సరాంసి చ
వసన్తు సర్వదా తత్ర మమోపరి తవాజ్ఞయా ॥ ౬

మమోపరి ప్రభూతానాం జఙ్గమస్థావరాత్మనామ్

యద్యదిష్టం హి తత్సర్వం తవానుగ్రహహేతునా ॥ ౭
అస్త్వితి ప్రార్థయామాస శేషస్సర్వహితాయ వై

తా॥ ప్రభో! తమయాజ్ఞ మహాప్రసాదము. నేను పర్వతరూపమున నారదుడు చెప్పినచోట అవతరింతును తాము యథేష్టముగ విహరింపవచ్చును గంగాది మహానదులు సకల పుణ్యతీర్థములు నాయందుండవచ్చును. నా శరీరము పైన వసియించెడి సకల ప్రాణులకును నీయనుగ్రహము కలిసి వారల సకలాభీష్టములు సిద్ధించునట్లు చేయుము ' అని సర్వభూతహితైషియగు శేషుడు విన్నవించెను.

శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు :—

సిద్ధ్యత్వేవం ఫణీన్ద్రాఽద్య భవతా యో వరోవృతః ॥ ౮
తపాంసి తత్ర సిద్ధ్యన్తు నిర్విఘ్నాని తపస్వినామ్
అహం హి సర్వజన్తూనాం దృష్టిగోచరతాం గతః ॥ ౯
వసిష్యామి శ్రియాసార్ధం దదదిష్టాని దేహినామ్

తా॥ అనన్తా! నీవు కోరినట్లు అగుగాక! అచ్చట తపసుచేయువారలకు నిర్విఘ్నముగ తపస్సుసిద్ధించును నేను అచ్చట సర్వప్రాణులకు దృష్టిగోచరమగు నట్లు దివ్యమంగళవిగ్రహముతోనుండెదను. ప్రార్థించినవారి అభీష్టముల నిచ్చెదను.

భగవతోలక్ష్మ్యాదిమహిషీపరిజనైస్సహ క్రీడాచలగమనమ్

ఇత్యుక్త్వాఽథ శ్రియం ప్రాహ భగవాన్ పార్శ్వవర్తినీమ్ ॥ ౧౦
భూమిం నీళాం తథా దేవీం ప్రసన్నవదనామ్బుజామ్

తా॥ ఇట్లని అనన్తునికి వరమిచ్చి, ప్రక్కనున్న శ్రీ భూ నీలాదేవుల నుద్దేశించి ఇట్లనియె.

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు ,—

సఖీభిః సహితా యూయం సమాగచ్ఛత తత్ర వై ॥ ౧౧
విహారయోగ్యో దేశోఽయం నిర్దిష్టో మునినాఽమునా

తా॥ ఓ లక్ష్మి ! ఓ భూదేవీ ! ఓ నీలా ! నారదుడు మనకు భూలోకమున విడిది ప్రదేశమును చెప్పినాడు. మీరును మీచెలికత్తెలతోకూడి నాతోరావలయును.

ఇత్యుక్త్వా భగవాన్ ప్రాహ సేనాపతి మరిన్దమమ్ ॥ ౧౨
త్వదీయానుచరైః సార్ధం సర్వైః పారిషదైర్యుతః
బ్రహ్మాద్యైస్త్రిదశైః సార్ధం యక్షరక్షోగణాన్వితైః ॥ ౧౩
సిద్ధవిద్యాధరైశ్చాపి కిన్నరైశ్చ మహోరగైః
ఋషిసఙ్ఘైర్యుతః శీఘ్రం యాహి శేషాచలం ప్రతి ॥ ౧౪
వస్తవ్యం తత్ర హి మయా రమయా సహితేన వై
అనుగ్రహాయ సాధూనాం నిత్యం చ ప్రయతాత్మనామ్ ॥ ౧౫

తా॥ ఇట్లని ప్రియురాండ్రకుచెప్పి. విష్వక్సేనుని జూచి భగవానుడిట్లనెను. ఓ సేనాధిపతీ ! నీవును నీ పరివారముతో నాతో నుండవలయును. బ్రహ్మాది దేవతలు యక్షరాక్షససిద్ధవిద్యాధరకిన్నరోరగులు ఋషిసంఘములు కూడ నీతో రావలయును. నేనును నా రాణులును భక్తరక్షణోద్యోగమున శ్రీ శేషాచలమునకు పోవుచున్నాము

ఇత్యుక్త్వా భగవాన్దేవః శ్రియా భూమ్యా చ నీళయా
వినతాసుతమారూఢో యయావహిమహీధరమ్ ॥ ౧౬

తా॥ ఇట్లని సేనానాయకున కాజ్ఞాపించి శ్రీభూనీలలతో భగవానుడు గరుడు నధిష్ఠించి శేషాద్రిని చేరుకొనెను.

భృగువు ప్రశ్నించుచున్నాడు :—

అద్రిరూపధార్యనన్తస్య శిరఃపుచ్ఛపక్షప్రదేశవర్ణనమ్

శేషః కథఙ్గిరివరో బభూవ స మహావపుః
కుత్ర పుచ్ఛప్రదేశోఽస్య శిరః పక్షభువౌ తథా ॥ ౧౭

తా॥ ప్రభో ! ఇది మహదాశ్చర్యకరము. చిన్నశరీరమునుగల శేషుడు అంతపెద్దపర్వతముగ నెట్లు పరిణమించెను ? పర్వతమై యవతరించి నప్పుడాతని శిరముపుచ్ఛము యెంతదూరము వ్యాపించినవి ?

నారదుడు సమాధానము చెప్పుచున్నాడు —

తస్య దక్షిణకైలాసనామకం స్థానముత్తమమ్
కాళహస్తీతి విఖ్యాతం శిరోదేశః ప్రకీర్తితః ॥ ౧౮

శివస్య శివదః పుణ్యశ్శిరోదేశో విలోక్యతే
పుచ్ఛస్తూత్తరతః ప్రోక్తో మహతోఽస్య మహీభృతః ॥ ౧౯

ప్రసిద్ధః పుచ్ఛదేశోఽయం శ్రీశైల ఇతి విశ్రుతః
శ్రీశైలస్య ప్రదేశేఽస్మిన్నీలకణ్ఠాశ్రమే శుభే ॥ ౨౦

తా॥ శేషుని శిరఃప్రదేశము దక్షిణకైలాసమని ప్రసిద్ధిచెందిన శ్రీకాళహస్తి దివ్యక్షేత్రమైయున్నది. ఇచ్చట పరమశివుడు కలడు అట్లే పుచ్ఛప్రదేశము సుప్రసిద్ధమగు శ్రీశైలక్షేత్రమాయెను ఈ శివక్షేత్రమగు శ్రీశైలమున నీలకంఠాశ్రమము కలదు. ఈ యాశ్రమమున వ్యాఘ్రపాదుడను నొక తపస్వి ఉమాపతిని గురించి ఘోరమగు తపస్సుచేయగా బహుకాలమునకు ఉమాసహాయుడై కైలాసగౌరమగు వృషభవాహనము నధిరోహించి ప్రమథగణములు సిద్ధగంధర్వాదులు పరివారింపగా నీలకంఠుడు భక్తానుకంపతో వ్యాఘ్రపాదునియెదుట సాక్షాత్కరించెను.

వ్యాఘ్రపాదాభిధః కశ్చిత్తపస్వీ నియతేన్ద్రియః
చిరకాలం తపస్తప్త్వా నీలకణ్ఠముమాపతిమ్ ॥ ౨౧

తోషయామాస నియమైస్సమగ్రస్తం తపోనిధిః
అథ కేనాపి కాలేన నీలకణ్ఠో మహాద్యుతిః ॥ ౨౨

పరితుష్టః ప్రాదురభూద్దాస్యన్వరమభీప్సితమ్
ఆలిఙ్గితో గిరిజయా గాఢమాశ్రితపార్శ్వయా ॥ ౨౩

కైలాసగౌరమారుహ్య వృషం గగనచారిణమ్
ప్రమథాద్యైః పరివృతో గణైస్సమ్ప్రీతమానసైః ॥ ౨౪

కపర్దవిలసత్సిద్ధసిన్ధువీచిభిరాకులైః
సిద్ధగన్ధర్వయక్షాద్యైః పన్నగైః పరివారితః ॥ ౨౫

భక్తానుకమ్పాం పరమాంభృశమావేదయన్నివ
వ్యాఘ్రపాదః ప్రణమ్యైనం భక్త్యా పరమయాఽన్వితః ॥ ౨౬
స్తుతిభిః పరితుష్టావ పుష్కలాభిః పునః పునః

తా॥ తపఃఫలముగ సాక్షాత్కరించిన ఉమాపతికి వ్యాఘ్రపాదుడు నమస్కరించి అనేక స్తోత్రములతో ప్రస్తుతించెను

వ్యాఘ్రపాదుడు చెప్పుచున్నాడు —

భగవన్కరుణాసార సర్వలోకైకకారణ
ప్రసీద త్వం ప్రసన్నాక్ష విశ్వాకార వృషధ్వజ ॥ ౨౭

తా॥ ఓ కైలాసనాథా! సర్వకారణకారణా! ప్రసన్నాకారా! వృషభధ్వజా! ప్రసన్నుడవు కమ్ము.

రథ్యా వేదాస్త్రిపురదహనే వేదవక్త్రా చ వేధాః
సూతో యస్య స్వయముపగతౌ పుష్పవన్తౌ రథాఙ్గే ।
చాపో మేరుస్త్రిదశవసతిర్వాసుకిశ్చాపమౌర్వీ
బాణో విష్ణుస్త్రిదశవపుషే కుర్మహే తే నమస్యామ్ ॥ ౨౮

తా॥ త్రిపురసంహార కాలమందు నీరథమునకు చతుర్వేదములు గుఱ్ఱములుగను చతుర్ముఖుడు సారథిగను సూర్యచంద్రులు రథచక్రములుగను మేరుపర్వతము ధనుస్సుగను వాసుకిమౌర్విగను బాణము మహావిష్ణువుగను అమరి నీకనుచరులుగజేసికొనినట్టి మహాశూరుడవు. నీకు నమస్కరించుచున్నాను.

స్తుత్వైవం పరయా భక్త్యా వ్యాఘ్రపాదస్తపోనిధిః
తూష్ణీం బభూవ పురతో మస్తకే విహితాఞ్జలిః
వ్యాఘ్రపాదం తపోనిష్ఠం శాన్తం ధర్మపరాయణమ్ ॥ ౨౯
నీలకణ్ఠస్సమాహూయ ప్రహసన్నిదమబ్రవీత్

తా॥ ఇట్లని స్తోత్రముచేసి నిలచి వ్యాఘ్రపాదుని సచ్ఛిష్యునిగను ధర్మపరాయణునిగను అనుగ్రహించి మందస్మితవదనారవిందుడై నీలకంఠుడిట్లనిపలికెను.

నీలకంఠుడు అడుగుచున్నాడు —

తపసా పరితుష్టోఽస్మి కృతేనానేన సువ్రత ॥ ౩౦
వరం వరయ భద్రన్తే వరదోఽహమిహాగతః

తా॥ ఓ వ్యాఘ్రపాదా! నీతపస్సుకు మెచ్చితిని వరమిచ్చెదను నీ కోరికను తెలుపుము అని యడిగెను

వ్యాఘ్రపాదుడు చెప్పుచున్నాడు —

ఆశ్రమేఽస్మిన్మహాదేవ వస్తవ్యం భవతా సదా ॥ ౩౧
భవన్నామ్నా సరశ్చేదం ప్రసిద్ధిమధిగచ్ఛతు
అత్ర స్నాస్యతి యో మర్త్య స్తీర్థేఽస్మిన్సకృ దాప్లుతః ॥ ౩౨
స సిద్ధిం యాతు శుద్ధాత్మా పుమర్థానామభీప్సయా

తా॥ మహాప్రభూ! నీవీ యాశ్రమమున నిశ్చల శాశ్వతముగ నిటవిభవరూపమున నుండవలయును ఈ సరస్సు నీ పేరుతో ప్రఖ్యాతిజెందవలయును ఈ క్షేత్రమును దర్శించి ఈ నీలకంఠ సరోవరమున స్నానము చేయువారలకు సకల పురుషార్థములు సిద్ధింపవలయును. నాకీ వరము కావలయును

తథైవా స్త్వితి తం ప్రోక్త్వా తత్రాఽస్తే చన్ద్రశేఖరః ॥ ౩౩
చిరఙ్గిరిజయా సార్ధం వరదస్సర్వదేహినామ్
అథ పక్షప్రదేశోఽస్యా హ్యహోబిల మితిస్మృతః ॥ ౩౪
పరం స్థానం నృసింహస్య సర్వసిద్ధిప్రదాయకమ్
హిరణ్యకశిపుం హన్తుం బ్రహ్మరుద్రపురస్కృతః ॥ ౩౫
ప్రహ్లాదానుగ్రహార్థాయ హ్యవతీర్ణోఽత్ర వర్తతే
న తత్సమం భువి స్థానమస్తి లోకత్రయేఽపి వా ॥ ౩౬
అమృతత్వమవాప్నోతి తస్యదర్శన మాత్రతః
తస్మిన్నేకదినం వాపి యోవా సమధిగచ్ఛతి ॥ ౩౭
సర్వపాపవినిర్ముక్తో విష్ణులోకే మహీయతే

అట్లే యగుగాక యని వ్యాఘ్రపాదునకు వరమిచ్చి ఉమాదేవితోకూడి నీలకంఠాశ్రమమున విజయముచేసెను. ఇట్లే ఈ పర్వతము పక్షప్రదేశము అహోబిలక్షేత్రము. సర్వసిద్ధిప్రదుడగు నరసింహమూర్తి కిది వాసస్థానము. బ్రహ్మ రుద్రాదులచే ప్రార్థింపబడిన మహావిష్ణువు హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదు ననుగ్రహించుటకై అవతరించి ఇచ్చట నిలచియున్నాడు ముల్లోకములలో ఇది ఉత్తమమైనది క్షేత్రదర్శన మాత్రమున చేతనులకు మోక్షము కూడ సిద్ధించగలదు ఒక్కదినమీ క్షేత్రమున వసియించెడి వారలకు పాపములు నశించి విష్ణులోకప్రాప్తి చేకూరును

ఫణామణిప్రదేశోఽయం వేఙ్కటాద్రిరితి స్మృతః ॥ ౩౮

శేషాద్రిర్వృషభాద్రిశ్చ నారాయణగిరిస్తథా
న చాస్యమహిమా శక్యో వక్తుం వర్షశతైరపి ॥ ౩౯

బ్రహ్మరుద్రపురోగైశ్చ సనకాద్యైశ్చ యోగిభిః
అగస్త్యాద్యా మునివరాస్తపసస్సిద్ధ్యపేక్షయా ॥ ౪౦

తపాంసి సుచిరన్తేపుస్తన్నిర్ఝరసమాప్లుతాః
విష్ణోరపరదేహత్వాదాక్రామ న్నపదైర్గిరిమ్ ॥ ౪౧

నారాయణాంశసమ్భూతశ్శేషోఽహిర్గిరిరూపధృత్
తస్యోపరి ప్రభూతా యే తృణగుల్మలతాదయః ॥ ౪౨

తే హి స్థావరరూపేణ వసన్తో యోగిపూరుషాః
బ్రహ్మరుద్రాదిదేవేభ్యో యోగినోఽమితతేజసః ॥ ౪౩

సర్వదా యక్షగన్ధర్వసిద్ధకిన్నరచారణైః
విద్యాధరగణైశ్చాపి మహోరగగణైస్తథా ॥ ౪౪

ఋషిభిర్దేవబృన్దైశ్చ సేవాఽవసరకాఙ్క్షిభిః
సేవ్యతేఽహర్నిశం ప్రీత్యా మహాగిరివరోహ్యయమ్ ॥ ౪౫

ఇతి శ్రీబ్రహ్మాణ్డపురాణే తీర్థఖణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే భృగునారద సంవాదే శ్రీవేఙ్కటాచలవిస్తారవర్ణనం నామ ద్వితీయోఽధ్యాయః.

తా॥ ఈ పర్వతభాగిమున శేషుని ఫణామణి ప్రదేశము వేంకటాద్రి యనబడినది దీనినే శేషాద్రి వృషభాద్రి, నారాయణగిరి అనియు పిలుతురు ఈ పర్వతము మహిమ చాలగొప్పది బ్రహ్మాదులు సనకసనందనాదులుకూడ ఆ మహిమను చెప్పజాలరు అగస్త్యాది మహర్షులు చాలమంది తమ తపస్సిద్ధికై ఈ పర్వతమునందుండి యిచ్చటి పుణ్యతీర్థములందు స్నానానుష్ఠానములజేసి కొనుచు వేలకొలది సంవత్సరములు తపస్సుచేసి సిద్ధి పొందిరి తమ పాదములచే పర్వతమును స్పృశించుటకుకూడ వారు భయపడుదురు పర్వతము భగవానుని యపరదేహమని పరిభాషము. భగవదంశావతారమైన శేషుడేగదా పర్వతమై పరిణమించెనని పరి యభిప్రాయము అట్టి దేహరూపమగు పర్వతమందు మొలచిన తృణగుల్మ లతాదులు స్థావరరూపము ధరించిన యోగిపురుషులుగాని ఇవి సాధారణతృణాదులుకాదు వీరు బ్రహ్మరుద్రాది అధికారిక పురుషులకంటె అధికులు కావుననే దేవయోని విశేషులగు యక్షాదులు దేవతా బృందముతోచేరి మహర్షిగణము యీ దివ్యక్షేత్రమును ప్రీతితో సేవించవలయునను కుతూహలముతో ఇచ్చట నుండెదరు. కావున నీ వేంకటాద్రియొక్క మహిమ అనిర్వాచ్యము

ఇది శ్రీబ్రహ్మాండ పురాణ తీర్థఖండమున శ్రీవేంకటాచల మాహాత్మ్యమున
భృగునారద సంవాదరూపమగు శ్రీవేంకటాచల మాహాత్మ్యవర్ణనము
రెండవ అధ్యాయము

---

## మూడవ అధ్యాయము

—: భగవానుని క్రీడాచలవర్ణనము :—

భృగువు ప్రశ్నించుచున్నాడు —

శ్రీవేఙ్కటగిరిం ప్రాప్య భగవాన్పురుషోత్తమః
ఆవాసమకరోత్తత్ర తతః కిమకరోత్స్వయమ్ ॥ ౧

ఉదన్తమిమమాచక్ష్వ విస్తరేణైవ నారద
న త్వదన్యోఽస్తి విప్రేన్ద్ర రహస్యానాం హి వేదితా ॥ ౨

తా॥ ఓ నారదమునీంద్రా! శ్రీ వేంకటగిరికి విజయముచేసిన తరువాత భగవానుడేమేమి చేసెనో దయచేసి మాకు సెలవిమ్ము.

నారదుడు చెప్పుచున్నాడు —

ఇదం రహస్యం వక్ష్యేఽద్య విస్తరేణైవ తే భృగో
న త్వదన్యోఽస్తి విప్రేన్ద్ర కథాయాం శ్రవణే యతః ॥ ౩

యథైవ రమయాసార్ధ మనాదిః పురుషోత్తమః
అవతీర్ణో గిరివరం నానాధాతువిభూషితమ్ ॥ ౪

గిరినిర్ఝరసంయుక్తనదీప్రస్రవణైర్యుతమ్
వివిధై ర్వృక్షషణ్డైశ్చ పుష్పితై రుపశోభితమ్ ॥ ౫

మాలతీకున్దకుటజై స్సిన్ధువారైః కురణ్టకైః
కదమ్బార్జునవంశైశ్చ చన్దనైః పనసై స్తథా ॥ ౬

అశోకవకులై ర్గుఞ్జై స్తమాలై స్సమలఙ్కృతమ్
నానావిహగసఙ్ఘుష్టం మయూరారావనాదితమ్ ॥ ౭

తుష్టపుష్టమృగాకీర్ణం సింహశార్దూలశోభితమ్
విగళన్మదధారైశ్చ గజసఙ్ఘైస్సుశోభితమ్ ॥ ౮

గోలాఙ్గూలగణైశ్చాపి వానరై ర్మదగర్వితై
క్రీడావిలాసనిరతై ర్మృగపక్షిభిరావృతమ్ ॥ ౯

నానారత్నసమాకీర్ణం సానుభిర్భూషితఙ్గిరిమ్!
బ్రహ్మణా చ సమాదిష్టో నారాయణదిదృక్షయా ॥ ౧౦

నారాయణాఖ్యో విప్రేన్ద్రో గిరావస్మిఞ్ఛుభోత్తరే
స్వామిపుష్కరిణీతీరే సురసిద్ధనిషేవితే ॥ ౧౧

ఇన్ద్రియాణి నియమ్యాన్తరాస్థితో యోగభావనామ్
నారాయణం త్రిజగతామధీశం భక్తవత్సలమ్ ॥ ౧౨

శ్రీభూమినీళాసహితం ధ్యాయన్హృది శుభాస్పదమ్
నాసాగ్రన్యస్తనయనో విశుద్ధాత్మా చిరన్ద్విజః ॥ ౧౩
తపశ్చచార ధర్మాత్మా దుశ్చరం దుష్టమానసైః

తా॥ భగవద్భక్తి అతిశయించిన నీవు భగవత్కథను వినుటకు అర్హుడవు చెప్పెదను వినుము. భగవాను డవతరించిన పర్వతము ఆతని అంతస్తుకు తగినదై యమరెను అందు వివిధములగు ధాతువులు, గిరి నిర్ఝరములు, నదులు, ఊటలు, వివిధములగు మహావృక్షములు పుష్పవృక్షములు ఓషధులు ఫలవృక్షములు కలిగి వనమృగములు మయూరాది గ్రామ్యమృగములు, యేనుగులు, వానరములు, పక్షులు సంచరించుచు ఆనందమయమైయుండెను. అట్టి దివ్యపరిసరములందు సర్వేశ్వరుడు పరమానందముతో విహరించుచుండెను. ఒకానొకప్పుడు చతుర్ముఖునిచే పంపబడిన నారాయణుడను ద్విజోత్తముడు ఈ పర్వతమునకు కరుదెంచి స్వామిపుష్కరిణీ తీరమందు స్నానానుష్ఠానాదుల జేసికొని ఇంద్రియనిగ్రహముజేసికొని యోగము నవుష్ఠించి భగవానుని ధ్యానించుచు తపస్సుచేసెను.

విశుద్ధాత్మని విప్రేన్ద్రే తపస్యతి చిరన్తదా ॥ ౧౪
ఫలన్తి వివిధా వృక్షాస్తత్రత్యాస్సమయం వినా
సత్త్వేషు బలవత్సత్త్వం బబాధే నైవ దుర్బలమ్ ॥ ౧౫
తపస్యతి ద్విజేశాన్తే శాన్తం సర్వమభూద్వనమ్

తా॥ పరిశుద్ధాత్మయగు నారాయణుని తపశ్శక్తిచే వృక్షములు సర్వఋతువులందు ఫలించుట క్షుద్రజంతువులకు పెద్ద జంతువులచే భయములేకుండుట మొదలగు సల్లక్షణములతో వనమంతయు మిక్కిలి ప్రశాంతముగ నుండెను

అథాఽస్మిన్నన్తరే తస్య తపసా పరితోషితః ॥ ౧౬
వాసుదేవః ప్రాదురభూద్వరదస్సర్వదేహినామ్
వినతాసుతమారూఢస్సుమేరుశిఖరోపమమ్ ॥ ౧౭
దయితామఙ్కమారోప్య జ్వలత్కాఞ్చనమాలినీమ్
యుగపత్స్ఫురితానేకతటిత్సదృశవర్చసమ్ ॥ ౧౮

సహధర్మచరీం విష్ణో రవతారానుకారిణీమ్
భక్తానుకమ్పాభరితై రపాఙ్గైశ్శీతశైస్సదా ॥ ౧౯
ఆప్లావయన్తీమఖిలం కృత్స్నజగత్స్థావరజఙ్గమమ్
పద్మప్రియాం పద్మహస్తాం పద్మాలయనివాసినీమ్ ॥ ౨౦
ఉన్నిద్రపద్మనయనాం పద్మనాభమనఃప్రియామ్
నీలజీమూతసఙ్కాశస్స్ఫురత్పీతామ్బరోజ్జ్వలః ॥ ౨౧
తులసీదామహృద్యేన స్ఫురచ్ఛ్రీవత్సలక్ష్మణా
కౌస్తుభద్యుతిదీప్తేన వపుషా సువిరాజితః ॥ ౨౨
నిబద్ధోదరబన్ధేన తనుమధ్యేన శోభితః
విధాతృగృహనాళీకముకుళోద్భవహేతునా ॥ ౨౩
నాభిహ్రదేన నిమ్నేన గమ్భీరావర్తశోభినా
రమ్భాభహస్తశోభాభ్యామూరుభ్యాముపశోభితః ॥ ౨౪
జఙ్ఘాభ్యాం చారుతూణీరసదృశీభ్యాం విరాజితః
ప్రసన్నవదనామ్భోజః పద్మపత్రనిభేక్షణః ॥ ౨౫
జ్యోతిర్మయేన వపుషా దీప్యమానోఽగ్రతస్థితః

తా॥ ఇట్టి సమయములో నారాయణుని తపస్సుకు సంతోషపడిన భగవానుడు మేరు శిఖరోపమగు గరుడుని నధిరోహించి మహాలక్ష్మి సమేతుడై యాతనికి సాక్షాత్కరించెను ప్రకాశించెడి బంగారు హారములను ధరించి అనేక కోటి విద్యుత్తులవలె ప్రకాశించుచు భక్తుల ననుగ్రహించెడి కటాక్షములను వెదజల్లుచు పద్మహస్తయు, పద్మప్రియయు, పద్మాలయయు భగవత్సహధర్మ చారిణి యగు మహాలక్ష్మి గోచరించెను. నల్లని మేఘమువంటి దేహకాంతిని కలిగి ప్రకాశమగు పీతాంబరమును కలిగి తులసీదామము శ్రీవత్స లక్షణమును కౌస్తుభమణిని వక్షఃస్థలమున ధరించి ఉదరబంధము బ్రహ్మనుసృజియించిన గంభీరావర్తమగు నాభికమలము కదలీస్తంభములవంటి ఊరువులు, తూణీరములవంటి జంఘాప్రదేశముతో ప్రసన్నవదన కమలము పద్మపత్రనిభేక్షణములతోను జ్యోతిర్మయమగు దివ్యమంగళవిగ్రహ సంస్థానముతో వేంకటరమణుడు ప్రకాశించెను.

అథ నారాయణం విప్రో హర్షపర్యాకులేక్షణః ॥ ౨౬

సర్వదాఽనన్దసన్దోహనయనాశ్రుసమాప్లుతః
ఆనన్దామృతసారాబ్ధౌమగ్నః కిఞ్చిన్న బుధ్యతే ॥ ౨౭

ప్రదక్షిణం తదా కృత్వా భగవన్తం దయానిధిమ్
భక్త్యా పరమయాఽవిష్టో వివేదానన్తరం న సః ॥ ౨౮

కిం కర్తవ్యమజానానో ముహూర్తం స్మావతిష్ఠతే
అథైనం పరితుష్టావ వాగ్భిరగ్ర్యాభిరాకులః ॥ ౨౯

తా॥ అంతట నారాయణుడు భగవత్సాక్షాత్కారమునుగాంచి హర్షపర్యాకులుడై ఆనందసందోహనయనాశ్రు సమాప్లుతుడై ఆనందసాగరమున మునిగి తదేకమనస్సుతో ప్రదక్షిణ నమస్కారములజేసి నిలచెను ఏమిచేయవలయునను నాలోచన తోచక ముహూర్తకాలము మౌనముగ నుండిపోయెను. తరువాత ఇట్లు భగవానుని స్తుతింప నారంభించెను.

నారాయణుని స్తుతిప్రకారము

'దేవ దేవ జగన్నాథ ప్రసీద పురుషోత్తమ!
పరిపాలయ మాం భక్తం శరణాగతవత్సల! ॥ ౩౦

కాలాభకరుణాసారకరీన్ద్రి వరదప్రభో !
అవలోకయ మాం నాథ! శీతలైర్నయనాఞ్చలైః ॥ ౩౧

త్వమేవ ధాతా సర్వస్య జగతోఽస్య జగన్మయ !
రక్షితా చ త్వమేవాస్య సంహర్తా చ సురేశ్వర! ॥ ౩౨

ప్రకృతిః పురుషశ్చైవ సర్గకాలే సుసజ్జితౌ
తవేక్షణవశేనైవ సృజతో జగదవ్యయ! ॥ ౩౩

నత్వత్సమోఽస్తి లోకేస్మిన్నాథ! లోకత్రయేఽపి వా
కుతస్త్వదధికస్తస్మాన్నిస్సమాభ్యధికో భవాన్ ॥ ౩౪

వేత్తా త్వమసి వేద్యఞ్చ వేదనోపాయ ఏవ చ
వేదనఞ్చ ఫలం తస్య త్వదృతే నాస్తికిఞ్చన ॥ ౩౫

పితా త్వమసి లోకస్య సర్వస్య జగతః పతే
మాతా స్వయం విశాలాక్షీ లక్ష్మీస్త్వదనపాయినీ ॥ ౩౬
విధాతృప్రముఖా దేవాస్సనకాద్యాశ్చ యోగినః
మహతా తపసా వాపి న త్వాం జానన్తి తత్త్వతః ॥ ౩౭
న వేదాధ్యయనేన త్వాం న యజ్ఞైర్నియమైరపి
నదానైశ్చ తపోయోగైర్వినా భక్త్యా న దృశ్యసే ॥ ౩౮
మద్భాగ్యోపచయేన త్వం దృగ్గోచర ముపాగతః
నిజరూపఞ్చ దేవేశ! ప్రదర్శయ దయానిధే! ॥ ౩౯
ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి దర్శనేన తవ ప్రభో
చక్షుషోస్సఫలం జన్మజాతమద్య సురేశ్వర! ॥ ౪౦
న త్వాం పశ్యతి యో మర్త్యో వ్యర్థజన్మా స మే మతః
దర్శనేనైవ మచ్చిత్తమాప్నోత్యున్మత్తతుల్యతామ్ ॥ ౪౧

తా॥ జగన్నాథా! దేవదేవా! పురుషోత్తమా! నీ శరణము జొచ్చితిని నన్నుఁ రక్షించుము. నీవు గజేంద్రాహ్వానును కాపాడితివి. నన్ను నీ కటాక్షములకు గురిచేయుము. నీవే సర్వలోకములకు స్రష్టవు జగన్మయుడవు. నీవే పాలకుడవు సంహారకుడవు. క్షరాక్షర ప్రకృతిద్వయము నీసంకల్పమువలన జగత్తుగా సృష్టియగుచున్నవి. నీవు సమాభ్యధికరహితుడవు. వేత్తయు వేద్యమును వేదనోపాయమును నీవే వేదన ఫలముకూడ నీవే. నీకు వేరైన వస్తువులేదు. నీవు సమస్తలోకములకు తండ్రివి. నీ యనపాయినియగు లక్ష్మి అల్లే సకలలోకములకు తల్లి. బ్రహ్మాది దేవతలు సనకాదియోగులు యెంత శ్రమచేసియు నిన్ను మెరుగజాలరైరి. వేదాధ్యయనము యజ్ఞములు, దానము, తపస్సు, యోగము, యేవియు నిన్నెరుగుటకు సాక్షాత్సాధనములు కావు. భక్తులకు నీవు సులభుడవు. భక్తికి వేదాధ్యయనాదు లంగములు స్వతంత్రసాధనములు కాజాలవు. నీ యాత్మస్వరూపమును చూపుము. నీదర్శనమున నేను కృతార్థుడనైతిని. నా నేత్రముల ఫలము ఫలించినది. నిన్ను చూడని పురుషునిజన్మ వ్యర్థము. నిన్ను దర్శించినంతట నామనసు యేమియు తెలియక ఉన్మత్తావస్థను జెందినది.

ఏవం స్తువతి విప్రేన్ద్రే భగవాన్ప్రీతమానసః
తమువాచ ప్రసన్నాక్షో మేఘగమ్భీరయా గిరా ॥ ४२

తా॥ ఇట్లు నారాయణుడు స్తుతించగా భగవానుడు సంతుష్టుడై యాతని కిట్లనియె.

శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు.—

'తపశ్చరసి విప్రేన్ద్ర క స్త్వమత్ర జితేన్ద్రియః
కిమర్థఞ్చ వదాద్యత్వం దాస్యామ్యహమభీప్సితమ్' ॥ ४३

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! నీవేల యిచ్చట తపస్సు చేయుచుంటివి? నీ తపస్సు సిద్ధించినది. వరము నడుగుము ఇచ్చెదను అని చెప్పెను.

నారాయణుడు చెప్పుచున్నాడు.—

వరదో యది దేవేశ! శ్రీనిధే! కరుణానిధే!
వృణోమి వరమిష్టం మే శృణుష్వ ప్రీతమానసః ॥ ४४

అహం నారాయణో నామ భవద్దర్శనకాఙ్క్షయా
భువం సర్వాం పరిక్రమ్య నాపశ్యం త్వామహం ప్రభో ॥ ४५

బ్రహ్మాణం తపసాఽఽరాధ్య తన్నిర్దిష్టోఽహ మాగతః
స్వామిపుష్కరిణీతీరే తపసాఽఽరాధితో భవాన్ ॥ ४६

తపశ్చరన్వసామ్యద్య చిరేణ నియతేన్ద్రియః
ఏవం కిల తపశ్చర్తుమశక్యం భువి మానవైః ॥ ४७

తేషామనుగ్రహార్థాయ సర్వప్రత్యక్షగోచరః
సర్వాభీష్టం దదన్నిత్యం స్వామిపుష్కరిణీతటే ॥ ४८

అనన్తవిహగేశానసేనాపతిముఖైస్సదా
సేవ్యమానశ్శ్రియా సార్ధం విహరన్వస మాధవ ॥ ४९

గిరిశ్చాయం హి మన్నామ్నా ప్రసిద్ధిమధిగచ్ఛతు

తా॥ దేవదేవా ! నీ యనుగ్రహమువలన కృతార్థతజెందితిని. నా పేరు నారాయణుడందురు. నేను దేవరవార్ల దర్శనమును చూడగోరి భూమండల మంతయును వెదకితిని ఆవల చతుర్ముఖునిగురించి తపస్సుచేసి ఆయన యను గ్రహముచే స్వామిపుష్కరిణీతీరమందు తపస్సుచేయుట మీ దర్శనమునకు మార్గ మని తెలిసికొని ఇచ్చట చాలకాలమునుండి తపస్సుచేయుచున్నాను దేవరవార్ల దర్శనము కోరెడి సాధారణప్రజలు నావలె ఇంతటి ఘోరతపస్సుచేసి నిన్ను చూడజాలరు. అట్టి ప్రాకృతప్రజల నుద్ధరించుటకై నీ విచ్చటనే స్వామిపుష్క రిణీతీరమందు శ్రీ మహాలక్ష్మితోను అనన్తగరుడ విష్వక్సేనాది దివ్యసూరుల తోను ఇదే దివ్యమంగళవిగ్రహముతో (అంతర్ధానము జెందక) నిరంతరముగ నివసింపవలయును. ఇదిగాక నాతపస్సిద్ధికి జ్ఞాపకముగ ఈపర్వతము నా పేరుతో 'నారాయణగిరి' యని వ్యవహరింప బడునట్లు చేయవలయును

శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు :—

'తథా భవతు విప్రేన్ద్ర! వచనం తవ సువ్రత ! ॥ ౫౦

బ్రాహ్మణో యది వా వైశ్యః క్షత్రియశ్శూద్రజోపి వా
సపాపో యది వాఽపాపస్స్వామిపుష్కరిణీజలే ॥ ౫౧

స్నాత్వా చాత్రవసన్తం మాం యే నమస్యన్తి మానవాః
దదామ్యాకల్పమేవాహం తేషాం వాసం త్రివిష్టపే ॥ ౫౨

యః కరోత్యాప్లవం స్వామిసరసీజలమధ్యతః
సోఽతీత్య నిరయం సర్వం బ్రహ్మభూయాయ కల్పతే ॥ ౫౩

భుక్తిముక్తిప్రదం నృణాం సర్వసిద్ధిప్రదాయకమ్
ఇదం స్థానం సరశ్చేదం నాత్రకార్యా విచారణా ॥ ౫౪

అద్య ప్రభృతి చైవాయం గిరిస్త్వన్నామతస్సదా
నారాయణాచల ఇతి ప్రసిద్ధో భవతు ద్విజ' ॥ ౫౫

తా॥ ఓ విప్రవర్యా ! అట్లేయగుగాక. బ్రాహ్మణుడుగాని క్షత్రియుడు గాని వైశ్యుడుగాని శూద్రుడుగాని పాపిగాని పుణ్యపురుషుడుగాని స్వామిపుష్కరిణి యందు స్నానముచేసి నన్ను సేవించునెడల అట్టి యాతడు స్వర్గలోకమున వసి

యింమనట్లు అనుగ్రహించితిని స్వామిశ్రీస్వస్నానమువలన నిరయవాసదుఃఖము తొలగిపోయి ముక్తికలుగును అట్లు స్నాతులగు మానవులకు ఐహికాముష్మిక ములు సిద్ధించును. సకల పుణ్యతీర్థములతోనలరారు ఈపుణ్యపర్వతము నేటి నుంచి నీ పేరుతో 'నారాయణాచలము' అని కూడ వ్యవహరింపబడగలదు.

ఇతి తస్మై వరన్దత్వా స్వసాయుజ్యన్దదౌ హరిః
స్వామిపుష్కరిణీతీరే స్వసంకల్పాగతే తతః ॥ ౨౬

దివ్యే విమానే సర్వేషాం విలోచనపథఙ్గతః
శ్రీభూమినీళాసహితశ్శఙ్ఖచక్రగదాధరః ॥ ౨౭

కోటికన్దర్పలావణ్యో నీలజీమూతసన్నిభః
దయాపరవశో నిత్యం వసతి ప్రీతమానసః ॥ ౨౮

ఇతి శ్రీబ్రహ్మాణ్డపురాణే తీర్థఖణ్డే భృగునారదసంవాదే శ్రీవేఙ్కటాచల మాహాత్మ్యే భగవదావిర్భావో నామ తృతీయోఽధ్యాయః,

తా॥ ఇట్లని నారాయణద్విజునికి ఆతడు కోరిన వరమునిచ్చి తన సాయుజ్య మును అనుగ్రహించి తన సత్యసంకల్పముచే ఆనందనిలయ దివ్యవిమానమున అచ్చటి ప్రజలందరును జూచుచుండగా శ్రీ భూమి నీలాసమేతుడును శంఖచక్ర గధాధరుడును కందర్పకోటిలావణ్య దివ్యమంగళశోభితుడును నీలజీమూత సంకాశ దేహుడునగు భగవానుడు భక్తవశంవదుడగుటచే పరమకృపతో ప్రవేశించి నాటి నుంటి 'సదైకరూపరూపాయ' యను నట్లు 'నిత్య శ్రీర్నిత్యమంగళము' గా సాన్నిధ్యము జెందియున్నాడు.

ఇది శ్రీ బ్రహ్మాండపురాణమున తీర్థఖండమునందు భృగు నారద
సంవాద రూపమైన శ్రీవేంకటాచలమాహాత్మ్యగ్రంధమున
భగవదావిర్భావము మూడవ అధ్యాయము.

---

## నాల్గవ అధ్యాయము

—: భగవానుడు లీలార్థమై వేటకుబోవుట :—

భృగువు అడుగుచున్నాడు :—

> తత్ర వాసముపేత్యాథ దేవః కిమకరోత్తతః ?
> విస్తరేణ సమాఖ్యాహి పృచ్ఛతో మమ సర్వశః ॥ ౧

తా॥ భగవానుడు వేంకటాద్రియందు నిత్యనివాసమేర్పరచికొని యేమేమి చేసెను. దయతో చెప్పుము.

నారదుడు చెప్పుచున్నాడు :—

> తతః కదాచిన్మృగయా విహారాకాఙ్క్షిమానసః
> సేనాపతిమువాచేదం ప్రహసన్నివ మాధవః ॥ ౨

తా॥ భగవానుడొకప్పుడు వేటకు పోదలచి సేనాధిపతిని జూచి నవ్వుచు ఇట్లనియెను.

శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు :—

> సేనేశ విపినోద్దేశే విహర్తుం మతిరస్తి మే
> సింహవ్యాళసమాకీర్ణే మత్తద్వీపనిషేవితే ॥ ౩
> సజ్జీభవన్తు సైన్యాని నిదేశాద్భవతోఽధునా
> చతురఙ్గసమేతాని సమరేష్వజితాని వై ॥ ౪
> ఇత్యుక్త్వా భగవాంస్తూర్ణం నిర్యయౌ మృగయామతిః
> సేనాపతిముఖాశ్చాపి తమేవానుయయుస్తదా ॥ ౫
> అథోత్తరగిరౌ రమ్యే విచచార స దైత్యహా
> సింహవ్యాళగణాన్విద్ధ్యన్శరై రాశీవిషోపమైః ॥ ౬

తా॥ సేనానాథా ! సింహ వ్యాళమృగాకీర్ణమగు ఈ యరణ్యమున విహరింపదలచితిని. చతురంగసమేతమగు మన సైన్యమును సిద్ధపరుపుము అని యాజ్ఞాపించి బయలుదేరగా సేనాధిపతియు చతురంగసేనయు శ్రీవారివెంట

బయలుదేరెను. భగవానుడు పర్వతోత్తర భాగమున సంచరించుచు క్రూరమృగములను వేటాడుచు పోయెను.

తత్రత్యాశ్శబరాధీశాస్సోపహారాస్సమాగతాః
ప్రణమ్య దేవదేవేశమతిష్ఠన్నగ్రమౌళయః ॥ ౭

నిర్దిశ్యమానమార్గస్తు తైస్తైశ్శబరపాలకైః
విచచార బహూన్దేశాన్మృగయాఽఽకృష్టమానసః ॥ ౮

తా॥ భగవానునిరాక నెరిగి ఆయా చోటులందు శబరప్రభువులు భగవానునకుపాయనముల దెచ్చి సమర్పించి నమస్కరించి నిలిచిరి. తరువాత వారలు తెలుపుచువచ్చిన త్రోవను భగవానుడు అరణ్యమంతయు కలియదిరిగి వేటాడెను.

వృషభాసురుని వృత్తాంతము

తస్మిన్కాలే శివే భక్తో వృషభాఖ్యో మహాసురః
శ్రీశైలాద్దక్షిణే దేశే విచచార మహామనాః ॥ ౯

తతో గిరివరన్దృష్ట్వా ప్రాదుర్భూతం సువిస్తృతమ్
విస్మయావిష్టచేతాస్తు చిన్తయామాన కారణమ్ ॥ ౧౦

అహో కోఽప్యస్య మాయావీ స్రష్టాఽద్రే రుపరిధ్రువమ్
తమన్వేష్టుం యతిష్యామి మాయినం గతభీతిరహమ్ ॥ ౧౧

అన్విష్య సహసాఽనేన యోత్స్యామి గతభీరహమ్
ఇతి సఞ్చిన్త్య తత్రాయం మృగయన్నపకారిణమ్ ॥ ౧౨

బలగర్వసమావిష్టస్తత్ర తత్ర చచార హ

తా॥ ఆ కాలమందు వృషభాసురుడను నొక శివభక్తుడగు రాక్షసుడు శ్రీశైలదక్షిణభాగమున సంచరించుచు పర్వతముయొక్క వాసయోగ్యతను చక్కవనమును చూచి ఆశ్చర్యపడి 'ఇట్టి పర్వతమున నీ సౌకర్యములనన్నియు జేసికొని సుఖించెడి మానవుడెవ్వడో ఉండవలయును. వానిని వెదకి వానితో యుద్ధముచేసి జయించవలయును' అని నిశ్చయించుకొని బలగర్వసమావిష్టుడై భగవానుడు వేటకువచ్చిన విషయము తెలిసికొని యాతని వెదుక నారంభించెను.

అథాపశ్యత్స దేవేశం విహరన్తమభీతవత్ ॥ ౧౩
శార్ఙ్గపాణిం హయారూఢం శబరాకృతిధారిణమ్
తద్దృష్ట్వా దైత్యరాట్క్రుద్ధస్సోఽయమేవేతి నిశ్చితః ॥ ౧౪
అభ్యధావత తం తూర్ణం తిష్ఠతిష్ఠేతి చాబ్రవీత్

తా॥ అంతనాతడు యెదుట శార్ఙ్గపాణియై హయమునధిరోహించి శబర వేషముతోనున్న భగవానునిజూచి ఆతడే తన శత్రువుగ తెలిసికొని వెంటపరుగెత్తి 'నిలువు నిలుపు' అని బెదరించెను

తతస్సమభవద్యుద్ధం ఘోరరూపం భయానకమ్ ॥ ౧౫
శబరాధిపతిం దైత్యస్సమాహూయాఽశపత్తదా
తతస్సశబరః క్రుద్ధస్సర్వసన్నాహసంయుతః ॥ ౧౬
శ్వగణైస్స్వగణైశ్చైవ బాణైశ్చ నిశితైస్తథా
ప్రాసైః ఖడ్గైర్గదాభిశ్చ శక్తిశూలపరశ్వధైః ॥ ౧౭
కున్తైర్ముసలసఙ్ఘైశ్చ వృక్షైః పాషాణరాశిభిః
అయుధ్యత తదా తేన ఘోరం యుద్ధమభూద్వనే ॥ ౧౮

తా॥ అంతట శబరవేషధారియగు భగవానునకును దైత్యునకు ఘోర యుద్ధము జరిగెను. ఉభయులకు వాగ్వాదము క్రూరముగ జరిగెను. దైత్యుడు అనేక క్రూరజంతువులు బాణములు దైత్యపరివారముతోను పర్వతములతోను ఘోరముగ యుద్ధముచేసెను.

తతస్తాన్శబరాన్సర్వాన్వినిర్జిత్యాగ్రతః పరమ్
ఆయాన్తమసురన్దృష్ట్వా విష్వక్సేనం దిదేశ సః ॥ ౧౯
సోఽపి గనర్వసఙ్ఘైశ్చ సహితః ప్రత్యయుధ్యత
తతస్తుములం యుద్ధం బభూవ భయదాయకమ్ ॥ ౨౦
అస్త్రైశ్శస్త్రైర్జఘానాఽశు విష్వక్సేనః ప్రతాపవాన్
దైత్యస్తం దుర్జయం జ్ఞాత్వా మాయావీ చ మదోద్ధతః ॥ ౨౧

తతః స్వమాయామాస్థాయ దైత్యః పరపురఞ్జయః
అసృజద్రాక్షసాన్ఘోరాన్ శతశోఽథ సహస్రశః ॥ ౨౨
అస్త్రాణ్యపి చ దివ్యాని శస్త్రాణి వివిధాని చ
ప్రాయుఙ్క్త దైత్యరాట్క్రుద్ధో నారాయణజిఘాంసయా ॥ ౨౩
యదనేన ప్రయుక్తం వై శస్త్రమస్త్రమథాపి వా
భస్మీకృతఞ్చ తత్సర్వం హరిణా నిజమాయయా ॥ ౨౪
తతస్తమసురో మత్వా దుర్జయం హరిమాహవే
మాయాం ప్రయుజ్య మాయావీ స్వయమన్తర్దధే తతః ॥ ౨౫

తా॥ అంతట భగవానుడు వృషభాసురుని సైన్యమును జయించి యెదుట నుండు దైత్యునుజూచి దైత్యునితో యుద్ధము చేయుమని విష్వక్సేనునకాజ్ఞాపించెను. విష్వక్సేనుడును దేవసేనలో కలసి యుద్ధము చేసెను. ప్రబలమగు విష్వక్సేన బలమును జూచిన రాక్షసుడు ప్రతిపక్షబలము దుర్జయమని తెలిసికొని, మదోద్ధతుడై మాయను సంకల్పించి తన విచిత్రశక్తిచే అసంఖ్యాకులగు రాక్షసులను మారణాస్త్రములను శస్త్రములను సృష్టించి ఆ మాయాబలమును భగవత్సైన్యసంహారమునకై వినియోగించెను. కాని మాయావియగు రాక్షసుని బలమంతయు భగవానునిచే నాశముచేయబడెను. యేమియుతోచక ఆతడు మాయచే అంతర్ధానము నందెను.

తాం మాయామాయతీన్దృష్ట్వా తతః సర్వేశ్వరో హరిః
ప్రేషయామాస నాశాయ తతశ్చక్రం జనార్దనః ॥ ౨౬
నాశకం సర్వదుష్టానాం సర్వదేవనమస్కృతమ్
చక్రరాజాత్తతో జ్వాలాః ప్రాదుర్భూతాః సహస్రశః ॥ ౨౭
తాభిస్తత్సైన్యమత్యుగ్రం జ్వలితం కాననం యథా
జ్వలత్కఞ్చుకినో వీరా దగ్ధశ్మశ్రుశిరోరుహాః ॥ ౨౮
ఆయుధాని విచిత్రాణి దగ్ధాన్యాసన్ హావిర్భుజా
తేన చక్రప్రభావేణ హ్యాసురం బలమద్భుతమ్ ॥ ౨౯
న కిఞ్చిద్దృశ్యతే తత్ర పర్వతే పరమాద్భుతే
తతః సమీక్ష్య దైత్యో వై మాయాం స్వీయాం వినాశితామ్॥ ౩౦

భగవన్తం ప్రతి సంహారాభ్యుపగన్తృవృషభాసురప్రార్థనా

చిన్తయామాస చ మునే విస్మయాకులమానసః
నిహనిష్యతి మాం చాపి చక్రం నూనం తదీరితమ్ ॥ ౩౧
సమయో మరణస్యాపి సంవృత్తో నైవ సంశయః
అమానుషమిమం మన్యే పరబ్రహ్మస్వరూపిణమ్ ॥ ౩౨
స్రష్టారం సర్వలోకానాం సర్వదేవనమస్కృతమ్
అనేన నిహతో నూనం విముక్తః సర్వకిల్బిషాత్ ॥ ౩౩
సంసారార్ణవ ముత్తీర్య గమిష్యే ముక్తిసమ్పదమ్
ఇతి సఞ్చిన్తయన్దేవం వధాత్సంహృష్టమానసః ॥ ౩౪
ప్రార్థయామాస చాభీష్టం కిఞ్చిద్ధృదయసంశ్రితమ్

తా ॥ రాక్షసుని యొక్క మాయను అతి తీవ్రదశనందుటను కనిపెట్టిన భగవానుడు అప్రతిహతమగు తన చక్రాయుధమును రాక్షసునిపై ప్రయోగించగా చక్రాయుధమునుండి బయలు వెడలిన అగ్నిజ్వాలలు రాక్షససేనను నిశ్శేషముగ భస్మము చేసెను. తన బలమంతయు నాశముచెందుటను చూచి, రాక్షసుడు ఆశ్చర్యచకితుడై కలవరపడి, 'ఈ మహాపురుషు డెవ్వడో తెలియదు ఆతని ఈ యాయుధమిక నన్నుగూడ సంహరించును. ఈ మహాపురుషుడు మనుష్యమాత్రుడు కాడు నన్ను యెదుర్కొని జయించెడివాడు సాక్షాత్తుగ పరబ్రహ్మస్వరూపుడు కావలయును. ఇదియు మంచిదే. పరమపురుషునిచేత చంపబడిన యెడల యీ దురంత సంసారమునుండి వెలువడి, పరమపదము లభించగలదు' — అని నిశ్చయించుకొని, భగవానునిచే సంహారమును కాంక్షించి నిశ్చయించి, తన మనసున నింకొకకోరికెనుగూడ అడుగదలచి, భగవానుని యిట్లు ప్రార్థించెను.

దేవ దేవ జగన్నాథ సర్వలోకైకకారణ ॥ ౩౫
శరణం త్వామనుప్రాప్తః ప్రణతార్తిహర ప్రభో !
త్వయా తతమిదం సర్వం జగత్స్థావరజఙ్గమమ్ ॥ ౩౬
త్వయా విహీనం నో కిఞ్చి త్త్రిషు లోకేషు విద్యతే
బ్రహ్మాద్యాస్సకలా దేవాస్త్వన్నిదేశకరా మతాః ॥ ౩౭

నిదేశాద్వాతి తే వాతః సూర్యశ్చోదేతి చాన్వహమ్
వహ్నిర్జ్వలతి తే భీతః శక్రశ్శాసతి శాసనాత్ ॥ ౩౮

యమో ధావతి భీత స్త ఇతి వేదానుశాసనమ్
త్రాహి త్రాహి మహాదేవ! న జానే శరణం పరమ్ ॥ ౩౯

యోగినో యం విచిన్వన్తి నియతా స్త్వాం విముక్తయే
సత్వమద్య మహాబాహో దృగ్గోచరగతోఽసి మే ॥ ౪౦

క్షమస్వ మత్కృతం సర్వమపకారం సుదుస్సహమ్
కృతాగసాం త్వాదృశేషు ప్రణామః ఖలు నిష్కృతిః ॥ ౪౧

జీవితం తు న యాచేఽహం క్షుద్రం పాపస్య కారణమ్
అతో యాస్యామి నిహతశ్చక్రేణ పరమాం గతిమ్ ॥ ౪౨

తస్మాత్క్షమస్వ భగవన్ శ్రీనిధే కరుణానిధే
త్రాతారం నైవ పశ్యామి త్వాం వినా మధుసూదన ॥ ౪౩

అద్య ప్రభృతి చాయం వై గిరిరుచ్ఛ్రితశేఖరః
మదాఖ్యయా ప్రథాం యాతు వృషభాచల ఇత్యపి ॥ ౪౪

తా ॥ ప్రభో! నీ శరణము జేరితిని. స్థావరజంగమాత్మకమగు ఈ ప్రపంచము నీచే వ్యాప్తమైనది. నీవులేని పదార్థ మెద్దియు లేదు. బ్రహ్మాదిసమస్త దేవతలు నీ యాజ్ఞకు లోబడియున్నారు నీ యాజ్ఞచే భయముతో వాయుదేవుడు వీచుచున్నాడు అట్లే నియతి తప్పక సూర్యభగవాను డుదయించుచున్నాడు. అగ్నిదేవుఁడు జ్వలించుచున్నాడు మహేంద్రుఁడు పరిపాలించు చున్నాడు యముడు భీతుడై నీయాశ్రితులనుండి పరువిడుచున్నాడు. (సకాలమున ప్రాణుల నపహరించుచున్నాడు) ఇట్లు వేదములు చెప్పుచున్నవి. నీకంటె రక్షకులితరులు లేరు. రక్షింపుము. సనకాదిమహాయోగులు నీ దర్శనమునకై పడరాని కష్టములు పడుచున్నారు నిష్కారణముగ అట్టి నీవు నాకగుపడితివి ఇది నాయదృష్టము నీ యనుగ్రహఫలితము నేనింతదనుక బాల్యాత్ప్రభృతి చేసిన తప్పులను, నీతో నింతదనుక చేసిన యుద్ధకృతదోషమును మన్నింపుము నా పాపములకు

దయామయుడగు నిన్ను ప్రణమింపుటయే ప్రాయశ్చిత్తము నాకు యీ పాప జీవితమందును, దేహమందును ఆశ లేదు. ఇది పాపహేతువుగ యింతకాలము పెరిగినది. నన్ను క్షమించి నీచక్రాయుధముచే సంహరించి, యీపాపశరీరమును పోగొట్టుము. నా మరణకాలమున ఒక చిన్న కోరికె మాత్రము కలదు. దానిని నీ వనుగ్రహించ వేడెదను. ఈనాటినుండి నా జ్ఞాపకార్థముగ నీ నివాసమగు ఈ పర్వతము నాపేరట 'వృషభాచల' మని లోకములో ప్రసిద్ధిజెందునటుల నీ వనుగ్రహింపవలయును.

ఇత్యేవం శోకసన్తప్తమశ్రుపూర్ణాకులేక్షణమ్
వృషభం తమువాచేదం ప్రహసన్గరుడధ్వజః ॥ ४३

తా॥ ఇట్లని సంతప్తహృదయుడై ప్రార్థించెడి వృషభుని జూచి భగవాను డిట్లనెను.

శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు —

వృషభాసుర మద్భక్త్యా విముక్తిం యాస్యసి ధ్రువమ్
గిరిశ్చాయం భవన్నామ్నా ప్రసిద్ధిమధిగచ్ఛతు॥ ४८

తా॥ ఓ దానవేశ్వరా! నాయందు నీకిప్పుడు భక్తికల్గుటచే నీవు ధన్యుడ వైతివి. నీకు ముక్తినిచ్చుచున్నాను. నీవుకోరినట్లు నీపేరుతోకూడ ఈపర్వతము ప్రసిద్ధిజెందగలదు.

ఇత్యుక్తవతి గోవిన్దే! దైత్యేన్ద్రః ప్రీతమానసః
చిన్తయామాస నిధనమనుగ్రహమథో మునే ॥ ४౭

వృషభాసురవధప్రకారః

తతః సుదర్శనశ్చాపి జ్వాలాజటిలవిగ్రహః
జహార సురశత్రోర్హి కణ్ఠనాళాచ్ఛిరోఽమ్బుజమ్ ॥ ४౮

తతో నిపాతితే భూమావసురే యుద్ధదుర్మదే
వవృషుః పుష్పవర్షాణి దేవాస్సమ్ప్రీతమానసాః ॥ ४౯

దేవదున్దుభయో నేదుర్ననృతుశ్చాప్సరోగణాః
దిశః ప్రసేదుర్విమలా వాతాశ్చైవ సుఖం వవుః ॥ ౫౦

గోవిన్దోపి దయాసారో వరం దత్వాఽసురాయ వై
పునరభ్యేత్య శేషాద్రౌ యథాస్థానం స్థితో మునే ॥ ౫౧

తా॥ భగవానుడుచెప్పిన వరప్రదానమును తనకు మహాప్రసాదముగ తలచిన వృషభుని చక్రాయుధము సంహరించెను వృషభసంహారమునకు సంతసించిన దేవతలు దివమునుండి పుష్పవర్షమును కురిపించిరి దేవదుందుభులు మ్రోగగా అప్సరసలు నృత్యముచేయ నారంభించిరి దిక్కులు ప్రసన్నములై మందమారుతము వీవసాగెను వృషభుని అంతిమ కోర్కెను అనుగ్రహించి భగవానుడు తన స్వస్థానమున కేగెను

అఞ్జనాదేవ్యుత్పత్తిక్రమము

భూయః కథయ దేవస్య చరితాని మహాత్మనః
శృణ్వతో నాస్తి మే తృప్తిరద్భుతాని మహామునే ॥ ౫౨

తా॥ మునిచంద్రమా! భగవత్కథలను విని విని, ఇంకను వినవలెననే యాశయే వృద్ధియగుచున్నది ఇంకను భగవత్కథలను విస్తరించి చెప్పుము. నారదుడు చెప్పుచున్నాడు:—

శృణుష్వైకమనా బ్రహ్మన్మత్తః కథయతో మునే
మాహాత్మ్యం దేవదేవస్య చిత్రం హి మునికీర్తితమ్ ॥ ౫౩
త్రేతాయుగేఽసురః కశ్చిత్కేసరీత్యేవ విశ్రుతః
పుత్రార్థీ దేవముద్దిశ్య తపస్తేపే మహామనాః ॥ ౫౪
నియతాత్మా శుచిర్నిత్యం నిరాహారో జితేన్ద్రియః
పఞ్చాక్షరేణ జప్యేన తోషయామాస శఙ్కరమ్ ॥ ౫౫
ప్రీతః ప్రాదురభూదగ్రే శఙ్కరో లోకశఙ్కరః
భక్త్యాతమానతం భూమావువాచ చ హసన్నివ ॥ ౫౬

తా॥ ఋషివర్యా! వినుము నీవు చెప్పినట్లు భగవత్కథారస మట్టిదే త్రేతాయుగమున 'కేసరి' యను రాక్షసుడొకడుండెను. ఆతడు పుత్రసంతతికై తపసుచేసెను. శివపంచాక్షరిని నియతుడై జపించగా శంకరుడాతనికి ప్రత్యక్షమై ఇట్లు అడిగెను.

శంకరుడు అడుగుచున్నాడు —

పరితుష్టోఽస్మి భద్రన్తే తపసాఽనేన సువ్రత
పరం వృణీష్వ దాస్యామి మనసా యదిహేచ్ఛసి ॥ ౫౭

తా ॥ ఓ భక్తవర్యా ! నీ తపసుచే తృప్తి జెందితిని నీవు కోరిన వర మడుగుము

కేసరి వరమడుగుచున్నాడు —

దేవదేవ మహాప్రాజ్ఞ పరితుష్టోఽసి చేన్మమ
వరదోభవ మేఽభీష్టం వరయామి సునిశ్చితమ్ ॥ ౫౮

పుత్రమిచ్ఛామి బలినం సమరేష్వనివర్తినమ్
మహాధైర్యం మహాప్రాజ్ఞం త్వత్తస్సన్తుష్టమానసాత్ ॥ ౫౯

తా॥ ప్రభో ! కృతార్థుడనైతిని తపఃఫలముగ నీ సేవ యైనది మహా ధైర్యము, బలము, ప్రాజ్ఞత కలిగిన ఒక పుత్రుడు నాకు జన్మించవలయునని నేను ఆశపడుచున్నాను

శంకరుడు చెప్పుచున్నాడు —

న పుత్రం దాతుమిచ్ఛామి పరితుష్టోఽప్యహం తవ
యస్మాచ్చ విధినా పూర్వం విహితా పుత్రహీనతా॥ ౬౦

తథాపి దాస్యే కన్యాం వై రూపయౌవనశాలినీమ్
తస్యాముత్పత్స్యతే పుత్ర స్త్వదభీష్టోఽచిరాద్ధ్రువమ్ ॥ ౬౧

తా॥ భక్తవర్యా : నీవు అడిగినది సరియే. నీకు పుత్రలాభప్రాప్తిలేదు. కావున నా యోగ్యత ననుసరించి విధివిహితమును నేను మార్చజాలను. నీకొక రూపయౌవనశాలినియగు పుత్రిక కలుగునట్లు వరమిచ్చుచున్నాను. ఆమెయందు జన్మించెడి పుత్రుడు నీవు కోరినలక్షణములు కలవాడగును

ఇతి సన్దిశ్య భర్గోఽపి తత్రైవాన్తరధీయత
అసురేన్ద్రోఽపి లబ్ధ్వాఽయం వరమిష్టం ముదం యయౌ ॥ ౬౨

తతస్తస్యాభవత్కన్యా లోకవిస్మయకారిణీ
చకార నామ తస్యా వై హ్యఞ్జనేతి స దైత్యరాట్ ॥ ౬౩
క్రమేణ వవృధే సేయమఞ్జనా మఞ్జుభాషిణీ
కలేవ శశినః పక్షే సితే నయననన్దినీ
పితుస్తస్యాం చ వవృధే ప్రమోదస్తు దినే దినే ॥ ౬౪
పుత్రప్రీతిరభూత్తస్య తస్యామితి చ నిశ్చితమ్ ॥ ౬౫
ప్రక్రాన్తకన్దుకక్రీడామాళిభిః సహ కన్యకామ్
వీక్ష్య వీక్ష్య యయౌ తృప్తిం ప్రహర్షోత్ఫుల్లలోచనః ॥ ౬౬

తా॥ ఇట్లని చెప్పి వరమిచ్చి శంకరు డంతర్హితుడాయెను. కొంతకాలమునకు కేసరికి సర్వలక్షణసంపన్న యగు కుమార్తె కలిగెను. ఆమెకు తండ్రి 'అంజన' యని నామకరణము చేసెను. ఆ కన్య తండ్రియింట దినదినప్రవర్ధమానయై బాల్యదశనుండి యుక్తవయసుకు పెరిగెను. కేసరియు పుత్రిని పుత్రి ప్రేమతో లాలించి బ్రహ్మానందముతో పెంచుచు కాలము గడుపుచుండెను

తతః కపివరః కశ్చిత్ కేసరీతి భువి శ్రుతః
అభిగమ్య యయాచే తాం కన్యాం యౌవనశాలినీమ్ ॥ ౬౭

తస్మైతామఞ్జనాం ప్రాదాద్దైత్యస్సమ్ప్రీతమానసః
స చిక్రీడ కపిశ్రేష్ఠః కన్యయా కామరూపయా ॥ ౬౮

ఇతి శ్రీ బ్రహ్మాణ్డపురాణే తీర్థఖణ్డే భృగునారదసంవాదే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే వృషభాచలహేతుకథనం నామ చతుర్థోఽధ్యాయః.

తా॥ యుక్తవయసు వచ్చిన అంజనను చూచి ముగ్ధుడగు కేసరి యను కపివరుడొక్కడు ఆమెతండ్రియొద్దకేగి, కన్యను తనకిచ్చి వివాహముచేయుమని యడిగెను. కపివరుని, తన కూతురికి తుల్యవరునిగా సంతసించిన తండ్రి, అతనికిచ్చి మహావైభవముగ వారలకు వివాహమహోత్సవము జేసెను.

ఇది శ్రీ బ్రహ్మాండపురాణమున తీర్థఖండమునందు భృగునారద సంవాద రూపమైన శ్రీ వేంకటాచలమాహాత్మ్య గ్రంథమున వృషభాచలవ్యవహారహేతు కథనము నాల్గవ అధ్యాయము.

## ఐదవ అధ్యాయము

### ఆంజనేయుని జననము

నారదుడు చెప్పుచున్నాడు —

విహరన్తీ చిరం తేన కపినా సాధు కన్యకా
న లేభే సదృశం పుత్రం చిన్తాశోకపరాయణా ॥ ౧

అహో మమ పితా మాం వై పుత్రస్నేహసమాకులః
పోషయామాస తస్యాహ మానృణ్యం కేన వాஉప్నుయామ్॥ ౨

తస్యా మే మన్దభాగ్యాయాః సన్తతిశ్చ వినా కృతా
నారీణాం పుత్రహీనానాం న సుఖం పారలౌకికమ్ ॥ ౩

పుత్రేణ మే విహీనాయాః కిన్న విశ్రమ్యతే కులమ్
ధన్యాః ఖలు స్త్రియస్తా వై యాః పశ్యన్తి శుచిస్మితమ్ ॥ ౪

ముఖమఙ్కశయానానాం పుత్రాణాం పుత్రవత్సలాః
ఇతి సఞ్చిన్త్య బహుధా పుత్రార్థం సా సులోచనా ॥ ౫

ద్విజానభ్యర్చ్య విధివదాశిషో వాచయన్త్యథో
దదావభీప్సితం తేభ్యః సర్వదైవ యశస్వినీ ॥ ౬

నిమిత్తజ్ఞాంశ్చ పృచ్ఛన్తీ తానువాచ తదాஉఙ్గనా
వ్రతేషు చాప్యనేకేషు నియతా చావసత్స్వయమ్ ॥ ౭

ఆస్తీర్య ముసలాంశ్చాపి గోష్ఠేషు నియతేన్ద్రియా
ఉపవాసపరా భూత్వా తుష్టావ జగదీశ్వరమ్ ॥ ౮

తా ॥ అంజనాదేవి గృహస్థాశ్రమము నుండి భర్తతో సకల సౌఖ్యముల ననుభవించుచుండియు చాలకాలము వరకు సంతానము కలుగక కొరతపడెను. 'నాతండ్రి పుత్రసంతతిని కోరి విఫలుడై, తపస్సుచేత కన్యకయైన తనను కని, 'నాయందు పుత్రసంతతిని చూడగోరి నన్ను పెంచెను నాకును ఆ భాగ్యము కలుగలేదు. సంతతిలేని నాకు గతిలేదు. కులవృద్ధి లేదు. బిడ్డలను ముద్దాడి

కాలముపుచ్చెడి స్త్రీలు గదా ధన్యజీవులు' అని నిరంతరము సంతానహీనతకై దుఃఖించి బ్రాహ్మణసమారాధనము చేసి వారలు కోరిన కోరికెలను సమకూర్చుచు ఆశీర్వాదము లనుగ్రహించుమనును, జ్యోతిష్కులను తన యదృష్టభవిష్యత్తును గురించి పృచ్ఛించుచును, పెద్దలుపదేశించెడి యెన్నియో వ్రతములను నియమముతో ఆచరించుచును, గోష్ఠములందు ముసలముల నాస్తరించి నియతేంద్రియయై ఉపవాసముల జేయుచును కాలక్షేపము జేయుచుండెను.

ఏవం విధాన్యనేకాని కృత్వా నియతమానసా
చరన్తీసా నైవ లేభేఽ పుత్రజన్మకృతం సుఖమ్ ॥ ౯

తా॥ ఈవిధముగ ననేకములగు పుణ్యకార్యముల జేసియు సంతానము కలుగలేదు.

కస్యచిత్త్వథ కాలస్య దయయా ధర్మదేవతా
బిభ్రతీ పుల్కసీరూపం ధృత్వా వేత్రం చ పుత్రికామ్ ॥ ౧౦

పృచ్ఛధ్వం చేత్యనుపదం భాషమాణా గతశ్రమా
పశ్యన్తీ బాలికాన్పాణౌ వదన్తీ లక్షణాన్యథ ॥ ౧౧

అఞ్జనాయాస్సమీపం వై ప్రయాతా ధర్మదేవతా
అఞ్జనా తాం సమాహూయ వినివేశ్య వరాసనే ॥ ౧౨

శూర్పే స్వర్ణమయే ముక్తాత్తణ్డులాన్ప్రణిధాయ వై
తర్పయిత్వా నిమిత్తజ్ఞాం పర్యపృచ్ఛదనాకులా ॥ ౧౩

తా॥ ఇట్లు చాలకాలము గడువగా ఆమె వ్యసనమునకు జాలిజెందిన ధర్మదేవత ఒక యెరుకలసానిరూపమును ధరించి, ఆకారమునకు తగిన బుట్టను తలపై బెట్టుకొని బిడ్డనెత్తికొని గ్రామవీధులలో అరచుచు కొందరికి సోదెచెప్పుచు క్రమముగా అంజనను సమీపించెను. అంజనాదేవియు ఆమెనుపిలచి ఆదరముతో ఆసనమున గూర్చుండబెట్టి స్వర్ణమయమగు చేటయందు ముత్యములను బోసి, ఆమె తృప్తిజెందుటను తెలిసికొని తన గ్రహస్థితిని జెప్పుమని ప్రార్థించెను.

అంజన అడుగుచున్నది :—

నిమిత్తజ్ఞే కథం బ్రూహి మమ పుత్రోఽస్తి వా న వా
సత్యేన వద ధర్మజ్ఞే పృచ్ఛన్త్యాః మమ సర్వశః ॥ ౧౪

యద్యహం ప్రాప్నుయాం పుత్రమిష్టం బలినమఞ్జసా
దాస్యామి తవ తత్సర్వం యద్యదిచ్ఛసి చేతసా ౧౫

తా॥ అమ్మా : నేను తల్లిభావముతో నిన్ను కోరుచున్నాను. సత్యముగా చెప్పుము. నాకు పుత్రసంతతి కలదా లేదా యనునది నాకు కావలసిన ప్రశ్న. నాకు పుత్రుడు కలిగినయెడల నీవు కోరినది యిచ్చెదను.

యెరుకలసాని చెప్పుచున్నది :—

అభీష్టస్తవ పుత్రో వై భవిష్యతి న సంశయః
మా శోకం కురు కల్యాణి ధర్మేణ మమ తే శపే ॥ ౧౬

శ్రీ వేఙ్కటగిరౌ సప్తసాహస్రం వత్సరాన్పునః
తపః కురు తతః పుత్రమవాప్స్యసి సుశోభనమ్ ॥ ౧౭

తా॥ అంజనా ! వ్యసనపడవద్దు. శపథముచేసి చెప్పుచున్నాను నీకు లోకోత్తర ప్రజ్ఞావంతుడగు పుత్రుడు కలుగును. ఐతే నీవు శ్రీవేంకటాద్రియందు భగవానునిగూర్చి వేయిసంవత్సరములు తపసుచేయవలయును.

ఇత్యుక్త్వా సా నిమిత్తజ్ఞా యథాఽగతమథో యయౌ

తా॥ ఇట్లని చెప్పి యెరుకలసాని వెడలిపోయెను.

అఞ్జనా చిన్తయన్తీ తద్వాక్యం తస్యా మనోహరమ్ ౧౮
ప్రచక్రమే తపశ్చర్తుం శ్రీవేఙ్కటగిరేస్తటే
ఆకాశగఙ్గానికటే సిద్ధసఙ్ఘనిషేవితే ॥ ౧౯

వాయ్వాహారా చ వాయుం వై సముద్దిశ్య సుదారుణమ్
తపశ్చచార దాన్తేయం ప్రీణయన్తి వ్రతైరిమమ్ ॥ ౨౦

తతః ప్రీతమనా వాయుః ఫలమేకం దినే దినే
భక్షణార్థం దదౌ తస్యై దృగ్గోచరముపాగతః ॥ ౨౧

అతీతే సప్తసాహస్రే వత్సరాణామనన్తరమ్
పార్వతీసహితశ్శమ్భుస్తదాశ్రమముపాగమత్ ॥ ౨౨

తా॥ అదే జ్ఞాపకముతో అంజనాదేవి శ్రీ వేంకటాద్రికేగి సిద్ధసంఘ సేవితమగు ఆకాశగంగాతటముననుండి ఆనిలాహారయై వాయుదేవుని మనమున నిలిపి తపసుచేయ మొదలిడెను. అంతట కొంతకాలమునకు వాయుదేవుడు ప్రసన్నుడై ఆమె ఆకలిపోగొట్టుటకు ప్రతిదినము ఒకఫలమును తినుటకై తెచ్చి యిచ్చుచువచ్చెను. ఇట్లు యేడువేలసంవత్సరములు గడువగా ఒకనాఁడు పార్వతీ పరమేశ్వరులామె తపసుండు యాశ్రమమునకు వచ్చిరి.

విజహార చ తత్రాయం తత్ర తత్ర వనాన్తరే
తస్మిన్నవసరే తత్ర విలాసార్థముపాగతమ్ ॥ ౨౩

చిక్రీడ వానరద్వన్ద్వం తదద్భుతమివాభవత్
పార్వత్యై దర్శయామాస పశ్య పశ్యేతిధూర్జటిః ॥ ౨౪

సా చ దృష్ట్వా కపిద్వన్ద్వం క్రీడితం వ్రీడితా శనైః
అథ తస్యా మనశ్చాసీదావాం కపితనూధరౌ ॥ ౨౫

విహరిష్యావ ఇతి హి లోకస్య రుచిరీదృశీ
తతః కపియుగం భూత్వా పార్వతీపరమేశ్వరౌ ॥ ౨౬

చిక్రీడతుర్వనాన్తేఽస్మిన్నుభౌ ముదితమానసౌ

తా॥ పరమేశ్వరుడు పార్వతితో విహరించుచుండగా ఒకప్పుడు ఒకవానర మిథునము రతిక్రీడనుండుటను పరమేశ్వరుడు పార్వతికి చూపెను. పార్వతి సిగ్గుతో తలవంచుకొని తమదంపతులును వానరరూపముతో రతిక్రీడ గావించెద మని కోరగా పరమేశ్వరుడును వల్లెయని అట్లే క్రీడించిరి.

తయో ర్వీర్యం తదావాయురథ పత్రపుటాన్తరే ॥ ౨౭

ఆహృత్య ప్రదదౌ తస్యా అఞ్జనాయాః కరాన్తరే
మన్వానా భక్ష్యమి త్యేవ తద్భక్షితవతీ హ్యసౌ ॥ ౨౮

తా॥ ఆదంపతుల రతాన్తమున స్ఖలించిన వీర్యమును వాయుదేవుడొక పత్రపుటమున భద్రపరచి నిత్యమువలె అంజనకు తెచ్చియివ్వగా అదియొక ఫలమని యెంచి ఆమెయు దానిని భక్షించెను.

దధౌ దౌహృదచిహ్నాని క్రమేణ నియతేన్ద్రియా
అఞ్జనా కఞ్జనయనా ప్రఫుల్లనళినాఽననా ॥ ౨౯

చిన్తయన్తీ కిమేతన్మే నిర్దోషాయాస్సమాగతమ్
అథవా విధివైరూప్యమహో మే మన్దభాగ్యతా ॥ ౩౦

కేన దోషేణ చాహం వా ఈదృశం రూపమాగతా
చిన్తయన్తీ చిరం సా వై వ్రీళితా దుఃఖితా స్థితా ॥ ౩౧

తా॥ వెంటనే అంజనాదేవి గర్భవతియైనట్లు గర్భలక్షణములను జూచి వెఱిసికొని ఇదేమి వైపరీత్యము. తపస్సుచేయు నాకు భర్తృసంయోగములేక ఈ యవస్థయెట్లు కలిగినది. నా తపస్సున కిదియొక వంచనమా. ఇదియేమి దురదృష్టము ' అని సిగ్గుతో దుఃఖపడుచుండెను.

ఆశ్వాసయన్తీ తాం ప్రాహ దివి వాగశరీరిణీ
మా విషాదం గమః పుత్రి భవితవ్యమిదం తవ ॥ ౩౨

దుష్టాత్మా రావణో నామ రాక్షసో లోకకణ్టకః
స తు దేవస్త్రియస్సర్వా బన్దీగ్రాహం గ్రహిష్యతి ॥ ౩౩

త్రిలోకీ మపి యస్మాద్వై రావయిష్యతి కర్మణా
తస్మాద్రావణ ఇత్యేవ ప్రసిద్ధిమధియాస్యతి ॥ ౩౪

తతస్తన్నిగ్రహార్థాయ హరిః ప్రత్యర్థితస్సురైః
ఆగమిష్యతి భూలోకే రఘూణామన్వయే శుభే ॥ ౩౫

తత స్తస్య సహాయార్థమసహ్యబలవిక్రమః
శౌర్యధైర్యగుణోపేతో బలీయాన్విజితేన్ద్రియః ॥ ౩౬
అప్రమేయగుణోపేతః పుత్ర స్తవ భవిష్యతి

తా॥ ఇట్లు విచారపడెడి అంజనను జూచి ఆశ్వాసపరచుచు ఆకాశవాణి ఇట్లని చెప్పెను. 'బిడ్డా! నీవు శంకింపకుము. ఈ గర్భము నీకు భగవదనుగ్రహదత్తము. లోకకంటకుడగు రావణుడు దేవతలను జయించి దేవస్త్రీలను చెరబెట్టుచున్నాడు. త్రిలోకములందును సాధుసజ్జనులను హింసించుచున్నాడు. అతనిని సంహరించుటకై శ్రీ మహావిష్ణువు రఘువంశమున నవతరించనున్నాడు అట్లవతరించబోయెడి రఘురామునికి సహాయముచేయుటకై నీ గర్భమున నప్రమేయ బలసంపన్నుడగు పుత్రుడు కలుగునట్లు ఇంతకుపూర్వమే భగవత్సంకల్పము నియతమైయున్నది.

ఇమామాకాశగాం వాచం శ్రుత్వా సమ్ప్రీతమానసా ॥ ౩౭
పిత్రే న్యవేదయత్సర్వం చరితం చ నభస్వతః
తచ్ఛ్రుత్వా చ పితా తస్యాః ప్రయయౌ పరమాం ముదమ్ ॥ ౩౮
సుతోత్పత్తిమథాకాఙ్క్షం స్తస్యా నిభృతమున్మనాః

తా॥ ఇట్టి శుభవాక్యమును వినిన అంజనా దేవి సంతసించి జరిగిన వృత్తాంతమును తండ్రికి చెప్పగా కేసరి పౌత్రోదయమును విశ్వసించి సంతుష్ట హృదయుడై అంజనను అత్యంతము గౌరవించెను.

ఆపాణ్డురీకృతా తస్యా రరాజ తనువల్లరీ ॥ ౩౯
కళఙ్కహీనా చన్ద్రస్య లేఖేవాసితపక్షకే
వినీలచూచుకం రేజే కుచమణ్డలమున్నతమ్ ॥ ౪౦
పద్మకోశస్య సంలీనభ్రమరస్య శ్రియం దధత్
న శశాక భువం గన్తుం గర్భస్యాతిభరా త్తతః ॥ ౪౧
ఇత్థం ప్రవవృధే తస్యా గర్భః ప్రీతివివర్ధనః

తా॥ నానాటికి గర్భలక్షణములు ప్రకటములై నవమాసములు నిండి కూర్చున్నచోటునుండి లేచుటకుకూడ శక్తిలేనిదై అంజనాదేవి తలిదండ్రులకును చెలికత్తెలకును ప్రీతిని కల్గించుచుండెను.

తతో వై దశమే మాసి సమ్ప్రాప్తే నళినేక్షణా ॥ ४२

అసూత పుత్రం బలినముదయత్యహిమత్విషి

శ్రావణే మాసి నక్షత్రే శ్రవణే హరివాసరే ॥ ४३

కుణ్డలోద్భాసిగణ్డాన్తముపవీతినముజ్జ్వలమ్

కౌపీనోద్భాసితం చైవ దీప్యమాన మివ శ్రియా ॥ ४४

బిభ్రాణం వానరాణాం వై రూపమత్యద్భుతం మహత్

రక్తాస్యపుచ్ఛమూలం తు సువర్ణసదృశద్యుతిమ్ ॥ ४५

తా॥ పదవమాసమున శ్రావణమాస ఏకాదశి శ్రవణనక్షత్ర శుభదినమందు సూర్యోదయకాలమున అంజనాదేవి లోకోత్తరబలశాలియగు కుమారరత్నమును కనెను. గండభాగమును జ్వలింపజేసెడి కుండలములు ఉజ్జ్వలమగు నుపవీతము కౌపీనము రక్తాస్యపుచ్ఛమూలములు సువర్ణసదృశద్యుతి వానరరూపము ఆ బిడ్డ యందు ప్రకాశించెను.

అతోఽయం జాతమాత్రోఽపి నితరాన్తు బుభుక్షితః

ఉదయాచలసంరూఢం దదర్శ రవిమణ్డలమ్ ॥ ४६

నితాన్తరక్తవర్ణేన ఫలబుద్ధిరభూత్తదా

ఫలమిత్యేవ మన్వానో రవిం భక్షితుముద్యతః ॥ ४७

గ్రహిష్యామీతి నిశ్చిత్య శ్రీ వేఙ్కటగిరేస్తటాత్

ఉదతిష్ఠన్మహావేగా దుదయాచలశేఖరమ్ ॥ ४८

గ్రహీతుముద్యతే తస్మిన్ బిమ్బం సూర్యస్య తద్బలాత్

హాహాకృతమభూత్సర్వం జగత్స్థావరజఙ్గమమ్ ॥ ४९

తా॥ పుట్టినవెంటనే ఆకలిచెందిన ఆబాలుడు ఉదయగిరియందుదయించు చున్న సూర్యుడు రక్తవర్ణమున నుండుటచూచి అదియొక ఫలమని యాశపడి దానిని తినగోరి వేంకటాద్రి శృంగమునుండి ఉదయాద్రిపైకురికెను పదునాల్గు భువనములు ఆ సందర్భమును జూచి కలవరపడెను.

తతశ్చతుర్ముఖో బ్రహ్మా స్వయమాగత్య వేగతః
బ్రాహ్మమస్త్రం యుయోజాస్మై కుపితస్తజ్జిఘాంసయా ॥ ౫౦

తదస్త్ర మాగతం దృష్ట్వా బాలః క్రీడన్నివ క్షణాత్
నిరస్య పుచ్ఛప్రాన్తేన బభూవ విగతజ్వరః ॥ ౫౧

తా॥ ఆ యలజడిచూచిన బ్రహ్మదేవుడు త్వరగా బయలుదేరి సూర్యునికి కలుగనున్న ఆపత్తును నివారించుటకై ఆ బాలునిపై బ్రహ్మాస్త్రప్రయోగము జేసెను. తనపైకి వచ్చిన బ్రహ్మాస్త్రమును తన తోకచివరతో త్రోసిపుచ్చి ఆ బాలుడు నిరపాయముగ తప్పించుకొనెను.

ప్రత్యాఖ్యాతం తతో దృష్ట్వా తదస్త్రం బ్రహ్మణేరితమ్
విసిస్మ్రియే సురాణాం వై గణః కిమిదమిత్యపి ॥ ౫౨

కథమాకాశయానం వై కథం సూర్యాభిధావనమ్
ప్రత్యాఖ్యానం కథంచాసీదిత్యూచుర్విస్మితాస్తదా ॥ ౫౩

ససురాసురగన్ధర్వం సయక్షోరగరాక్షసమ్
భువనం విస్మయం ప్రాప కర్మ దృష్ట్వాఽద్భుతం కపేః ॥ ౫౪

హనూమానపి తం దృష్ట్వా సూర్యం నిర్విణ్ణమానసః
భూమౌ పపాత తేజస్వీ బ్రహ్మణాఽస్త్రేణ తాడితః ॥ ౫౫

తా॥ బ్రహ్మాస్త్రము ఓడిపోగా చూచుచున్న దేవతాగణము ఆశ్చర్యముతో ఆంజనేయుని బలమును శంకించుకొనిరి. 'ఆహా! ఇదేమి ఆశ్చర్యము. అప్పుడు పుట్టిన పసికందు ఆకాశమున కెగురుట సూర్యునిపైబడుట బ్రహ్మచే బ్రహ్మాస్త్ర ప్రయోగము, అస్త్రము నిర్వీర్యమగుట' అని యందరును చెప్పుకొన నారంభించిరి. ప్రపంచమందంతయు ఇదియే ప్రస్తావమైపోయెను. ఆంజనేయుడు

తాను ఫలాశతో తలచి మ్రింగుటకై యెగిరివచ్చిన పదార్థము ఫలముగాకసూర్యుని బింబమని తెలిసికొని బ్రహ్మాస్త్రముచేత కొట్టబడి నిరాశతో భూమిపైబడెను

అథాఞ్జనా సమాగత్య శోకపర్యాకులా స్వయమ్
అశ్రుపూర్ణాక్షిపక్ష్మాగ్రా బభాషే సురసత్తమాన్ ॥ ౫౬

తా॥ అంత బిడ్డకు కల్గిన కష్టమును చూచి విచారపడిన అంజన దుఃఖించుచు దేవతలను పారజూచి వారలతో నిట్లనెను.

అంజనాదేవి చెప్పుచున్నది :—

భవన్తో నిర్ఘృణా దేవా జాతమాత్రే శిశౌ కథమ్
బ్రాహ్మమస్త్రం ప్రయుజ్యాఽశు కృతార్థా ఇవ సమ్స్థితి ॥ ౫౭
ఈదృశా భవతాం పుత్రా న సన్తి కిము దేవతాః
ప్రారబ్ధమీదృశం కర్మ కథం ఘోరతరం మహత్ ॥ ౫౮

తా॥ అయ్యా ! మీకిది న్యాయమా ! మీకు నా బిడ్డవంటి బిడ్డలులేరా ? పసిపాపపై బ్రహ్మాస్త్రమునుకూడ ప్రయోగించి యేమి కట్టుకుపోదలచితిరి. ఇట్టి ఘోరకృత్యములను చేయుటకు మీకు బిడ్డచేసిన విరోధము యేమి ?

వదన్తీం పరుషం వాక్యమఞ్జనామిత్థమఞ్జసా
సాన్త్వయన్తస్సురా స్సర్వే వీర్యజాతముమాపతేః ॥ ౫౯
దేవకార్యం చ సంవీక్ష్య వాచమూచురిమాం తదా

తా॥ పుత్రపరిభవ దుఃఖముచే కుపితురాలై పరుషములాడెడి అంజనను ఆశ్వాసపరచుచు దేవకార్యమగు రావణసంహారమును చింతించుచు ఇట్లనిరి.

దేవతలు చెప్పుచున్నారు —

అఞ్జనే మావిషీదస్త్వం తవ పుత్రస్య ధీమతః ౬౦
దాస్యామో దుర్లభానస్య వరాన్వయమమానుషాన్
ససురాసురగన్ధర్వైర్యక్షరక్షోగణైస్తథా ॥ ౬౧
పిశాచైర్గుహ్యకైస్సోఽయమవధ్యో భవతు ధ్రువమ్
తథాచ శస్త్రసంఘైశ్చ బాణైశ్చ వివిధైరపి ॥ ౬౨

అవధ్యత్వ మవాప్నోతి శాసనా న్న స్తవా త్మజః
బలేన ప్రజ్ఞయా చా పి యాతు సర్వాతిశాయితామ్ ॥ ౬౩
శత్రూణా మపి దుర్ధర్షః పుత్ర స్తవ భవిష్యతి

తా॥ ఓ దేవీ! విచారపడకుము. నీ కుమారునకు ఇతర దుర్లభములగు వరముల నిచ్చెదము సురాసుర గంధర్వాదులచే అవధ్యత్వమును మేము అనుగ్రహించుచున్నాము. శస్త్రాస్త్రములచే ఆతనికి భయము కలుగదు. బలముచేతను ప్రజ్ఞచేతను ఆతడు లోకోత్తరుడగును శత్రువుల కాతడు వశముకాడు.

ఇతి దత్త్వా వరం దేవగణేషు విరతే ష్వథ ॥ ౬౪
చతుర్ముఖ స్సమాహూయ చా ఞ్జనా మిద మబ్రవీత్

తా॥ ఇట్లు వరములిచ్చి దేవతలు విరమించగా చతురానను డంజనను పిలచి ఇట్లనెను

బ్రహ్మ చెప్పుచున్నాడు —

అఞ్జనే త్వం హి శేషాద్రౌ తప స్తప్త్వా సుదారుణమ్ ॥ ౬౫
పుత్రం సూతవతీ యస్మా ల్లోకత్రయహితాయ వై
ప్రసిద్ధిం యాతు శైలోఽయ మఞ్జనే నామత స్తవ ॥ ౬౬
అఞ్జనాచల ఇత్యేవ నాత్ర కార్యా విచారణా
ఇతి తస్యై వరం దత్త్వా దేవా బ్రహ్మపురోగమాః ॥ ౬౭
స్వం స్వం స్థానం సముద్దిశ్య యథాఽగత మథో యయుః
అఞ్జనా పుత్ర మాదాయ శ్రీవేఙ్కటగిరే స్తటమ్
పున రాగమ్య సామోద మలఙ్చకే నిజాశ్రమమ్ ॥ ౬౮

ఇది శ్రీ బ్రహ్మాండపురాణమున తీర్థఖండమునందు భృగునారద సంవాద రూపమగు వేంకటాచలమాహాత్మ్య గ్రంథమునందు అంజనాచలాభిధానహేతు కథనము ఐదవ అధ్యాయము.

తా॥ ఓ అంజనాదేవీ! నీవు శేషాచలమందు తపస్సుచేసి లోకోపకారకుడగు పుత్రుని గంటివి. కావున ఈ పర్వతము నీ పేరిట 'అంజనాచల'మని నీ జ్ఞాపకముగ ప్రసిద్ధిజెందుగాక — అని వరమిచ్చి బ్రహ్మాదిదేవతలు స్వస్థానమునకు వెడలి పోయిరి అంజనయు తనయుని తోడ్కొని తన యాశ్రమమునకుపోయి సుఖముగ నుండెను.

~~~~~~~~o~~~~~~~~

## ఆరవ అధ్యాయము

### వేంకటాచలాభిధాన హేతూపోద్ఘాతము

భృగువు ప్రశ్నించుచున్నాడు —

అయం శిలోచ్చయః కేన వేఙ్కటాచల ఇత్యపి
మనీన్ద్ర భువి విఖ్యాత స్తద్వదస్వ సహేతుకమ్ ॥ ౧

తా॥ ఓ మునిచంద్రమా! ఈపర్వతము యేకారణముచేత 'వేంకటాచల' మని పిలువబడినదో చెప్పుము.

నారదుడు చెప్పుచున్నాడు —

అత్రాపి కారణం వక్ష్యే శైలో యం యేన హేతునా
వేఙ్కటాద్రిరితి ఖ్యాత శ్శృణుష్వైకమనా మునే ॥ ౨

శ్రీగిరేః పశ్చిమే భాగే పురం నన్దనసంజ్ఞికమ్
హస్త్యశ్వరథసమ్బాధం బభూవ భువి విశ్రుతమ్ ॥ ౩

పురన్దరాభిధః కశ్చి త్సోమయాజీ ద్విజోత్తమః
ఉవాస తస్మి న్నగరే యాజకో వేదపారగః ॥ ౪

తస్యజజ్ఞేఽతిమతిమా న్పుత్రో మాధవసంజ్ఞికః
కాలక్రమేణ వవృధే వేదాధ్యయనతత్పరః ॥ ౫

యో గుణైః పితరం సర్వై రత్యక్రామ దివాఞ్జసా
క్రమేణ మాంసళౌ బాహూ బభార ద్విజపుత్రకః ॥ ౬
~~~~~~~~

తా॥ నీవు మంచి ప్రశ్న నడిగితివి. చెప్పెదను వినుము. శ్రీపర్వతమునకు పశ్చిమభాగమున 'నందన' మను నగరము కలదు. అందు పుండరసోమయాజి యను బ్రాహ్మణుడుండెను ఆతనికి మాధవుడను పుత్రుడు కలిగెను ఆతడు బాల్యమునుంచి వేదాధ్యయనము చేయుచు, సత్కర్మల నాచరించి తండ్రివలె సర్వగుణశాలియై వృద్ధిజెందుచు వచ్చెను.

యౌవనే సమనుప్రాప్తే వక్ష స్యతివిశాలతామ్
తస్యా సీ చ్చన్ద్రలేఖాఖ్యా పత్నీ కమలలోచనా॥ ౭
సర్వలక్షణసమ్పన్నా దివ్యనారీ వ భామినీ
స తస్యా మనురక్తోఽభూ ద్భృశం ద్విజకుమారకః॥ ౮
తన్వ్యా హ్యతో యౌవనేన రూపేణా ప్రతిమేన చ
విహారన్ముదితో నిత్య మా స్తే స్మ సహ భార్యయా॥ ౯
విహారయోగ్యే దేశే చ వనోద్దేశే మనోహరే

తా॥ యుక్తవయసు వచ్చిన మాధవునకు సర్వలక్షణ సంపన్నయై దేవకన్యకవంటి కన్యను తెచ్చి తండ్రి వివాహము కావించెను. మాధవుడును తుల్యశీలవయోవృత్తియు సాధ్వియు నగు నవోఢభార్యతో సకల కామ భోగముల ననుభవించుచు వచ్చెను

అథాఽస్మి న్నన్తరే కాలో వసన్తః ప్రాదురా సహ॥ ౧౦
ఉపదేష్టు మివ క్రీడా విశేషాం స్తు ద్విజన్మనః
పుంస్కోకిలా శ్చుకూజు ర్వై చూతవృక్ష సమాశ్రితాః॥ ౧౧
వియోగిమానసేష్వన్త ర్జనయన్తః పరాం రుజమ్
అశోకకుసుమం లోకా న్మదనస్య దిధక్షతః॥ ౧౨
ప్రతప్త మివ నారాచం వ్యరోచత మనోహరమ్
ప్రసూనాపచయం కర్తుం నిర్గత శ్చన్ద్రలేఖయా॥ ౧౩
విలాసవిపినోద్దేశే సర్వపుష్పమనోరమే

ఆరామే విహారం స్తస్మిం స్తత్ర తత్ర సభార్యయా ॥ ౧౪
సరసీం సత్త్వసమ్పన్నాం దదర్శ విమలోదకామ్
పద్మషండైశ్చ సమ్పూర్ణా మిన్దీవరవనాకులామ్ ॥ ౧౫
సుగన్ధిభిః ప్రసూనైశ్చ పూరితాం తటభూరుహామ్

తా॥ ఇట్లు కాలము గడుచుచుండగా కాలక్రమమున వసంతకాల మొక ప్పుడు వచ్చెను పుంస్కోకిలలరుతములు కాముకులమనములను కలవరపెట్టు చుండెను. అశోకకుసుమములు మన్మథుని నారాచముల వలె పూయదొడగెను పుష్పాపచయమును చేయుటకు వినోదమునకై మాధవుడు, తన ప్రియురాలగు చంద్రలేఖతోగూడి వనవిహారమున కరిగెను నారి విహారములో మార్గమున పద్మములు, కలువలు గలిగి జలజంతువులతో రమణీయమగు నొక సరోవర మును చూచెను. సరస్తీరమున ననేక సుగంధములగు పుష్పవృక్షము లుండెను

తన్వ్యైచ సఞ్చరం స్తీరే స్నిగ్ధచ్ఛాయాసమావృతే ॥ ౧౬
చణ్డాలకన్యకాం తన్వీం దదర్శ సుమనోహరామ్
ఇన్దీవరదళశ్యామాం ప్రఫుల్లకమలేక్షణామ్ ॥ ౧౭
పీనోన్నతకుచాం తన్వీం పూర్ణచన్ద్రనిభాననామ్
మూర్తా మివాజ్ఞాం మారస్య సుస్నిగ్ధకుటిలాలకామ్ ॥ ౧౮
తనుమధ్యాం వరారోహాం మాలినీం నామ నామతః

తా॥ భార్యతో విహరించెడి మాధవుడు సరస్తీరమున సర్వాంగసుంద రియు నవయౌవనశాలినియునగు మాలినియను చండాలకన్యకను చూచెను.

తాం దృష్ట్వా విస్మయావిష్ట శ్చిన్తయామాస వై ద్విజః ॥ ౧౯
జాతే రననురూపాం తాం మత్వా ద్విజకుమారకః
అత్యద్భుత మిదం రూపం విధినా కేన నిర్మితమ్ ॥ ౨౦
మన్యే ద్రష్టు మశక్యం వై విధే ర్వా రూప మీదృశమ్
అన్ధః ఖలు జగత్స్రష్టావిధాతా రూప మీదృశమ్ ॥ ౨౧

యత శ్చకార వై వ్యర్థ మభోగ్య మపి మాదృశామ్
అథవా కిము రత్నస్య వ్యర్థయా జాతిచిన్తయా ॥ ౨౨
కేనే ద మద్భుతం రూపం లభ్యతే సుకృతం వినా
అథై నా ముపసర్పామి సోఽహం స్పృశ్యే తరా మపి ॥ ౨౩
చణ్డాలవాటికాదృష్టం కిం రత్నందూష్యతేఽదవా

తా॥ ఆమెను మాచి మాధవు డాశ్చర్యముచెంది ముగ్ధుడాయెను. 'ఈమె చండాల కులమున బుట్టి నాకు లభ్యము కాకపోయినది ఆహా! ఏమి ఈ రూప సంపద ఈ సృష్టిని జేసిన సృష్టికర్త వ్యర్థుడు నావంటి బ్రాహ్మణునకు ఉప భోగ్యముకాని చండాలకులములో ఈమెను సృష్టించుట తెలివిహీనము కాక మరి యేమి? ఐనను బ్రహ్మను నిందించరాదు ఏకులమైననేమి రత్నమునకు జాతి చింత లేదు. ఇట్టి రూపవతియైన కన్యను పొందుటయే భాగ్యము. అభాగ్యున కీ సౌఖ్యము కలుగదు జాతిహీనయైనను నేనిమెను కలసెదను. చండాలవాటిక యందొక రత్నము దొరకినప్పుడు దానిని గ్రహించక విడువవలయునా?

ఇతి సఞ్చిత్య వై తస్యా స్సమీప ముపజగ్మివాన్ ॥ ౨౪
అనురాగవతీ చా స్మి న్విప్రే చణ్డాలకన్యకా
తయో ర్వృద్ధ మభూ చ్ఛేత శ్చితై ర్మదనసాయకైః ॥ ౨౫
ప్రాపయిత్వా గృహం భార్యాం చన్ద్రరేఖాం ద్విజోత్తమః
శనై శ్శనై స్సమీపం వై తస్యా స్స్వయ ముపాగమత్ ॥ ౨౬
అథై నాం వరయామాస హృష్టో ద్విజకుమారకః
అవిచార్య మహా త్పాపం తత్సఙ్గమ సముద్భవమ్ ॥ ౨౭

తా॥ ఇట్లని చింతించి ఆతడామెను సమీపించి తన యభీష్టమును చెప్పగా ఆమెయు అనుకూలించెను. ఉభయుల మనములు మన్మథావిష్టములై భావి దాంపత్యమునకు అనుకూలములయ్యెను. ఆతడు భార్యయైన చంద్రలేఖను యింటికి తీసికొనివచ్చి దిగబెట్టి పాపభీతిలేక చండాలవాటికకు చేరెను.

మాభైషీ స్త్వం వరారోహే ద్విజో౽యమితి భామిని
స్త్రీరత్నం దుష్కులా చ్చాపి గ్రాహ్యమిత్యనుశాసనమ్ ॥ ౨౮
అతో౽హం భవతీం యాచే వాచా మధురపూరయా
మమచానుమతిం దాతుం త్వయా రస్తు మిహార్హసి ॥ ౨౯

తా॥ ఓమాలినీ ! బ్రాహ్మణుడనని భయపడకుము. దుష్కులమునందుండి నైనను ఉత్తమ వధువును గ్రహింపవగునని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. కావున నిన్ను నే నపేక్షించుచున్నాను. నీవు అంగీకరించక తప్పదు

ఇత్యు క్త్వా పాణి మస్యా వై స్విన్నం జగ్రాహ పాణినా
సఙ్గతస్సో౽థ మాలిన్యా తథా ద్విజకుమారకః ॥ ౩౦
తదీయ మేవ మాంసాది మాహారం రోచయ న్సదా
సురామపి పిబ న్నిత్యం చిక్రీడ చిర మున్మనాః ॥ ౩౧

తా॥ ఇట్లని యామెను ఆశ్వాసముజేసి పాణిగ్రహణముచేసి, ఆమెతో సంసారము సాగించి, ఆమె భుజించెడి మాంసాది ఆహారములను తినుచు, సురాపానముచేయుచు క్రీడించుచుండెను.

చిరకాలే వ్యతీతే తు దరిద్ర శ్చాభవ ద్ద్విజః
విధాయ చౌర్యహత్యాది పాపాని ధనమార్జయన్ ॥ ౩౨
తచ్చ తస్యై దద ద్విత్తం కఞ్చిత్కాలం నినాయ సః
తత స్తత్రా ప్యశక్తో౽యం తదీయైశ్చ నిరాకృతః ॥ ౩౩

తా॥ ఇట్లు చాలకాలము గడచిన వెనుక మాధవుడు ధనములేక చౌర్యము ప్రాణిహింసలజేసి ధనమును తెచ్చి మాలినికిచ్చి ఆమెతో కాలక్షేపము చేసెను ఆవృత్తిని సాగించుటకు కూడ శక్తిలేని అశక్తదశ సంప్రాప్తించగా, ఆమెయు ఆమె స్వజనులును మాధవుని యింటినుండి తరిమివేసిరి.

చచార భువనే భ్రాన్తో న వాసం ప్రాప్య కుత్ర చిత్
ఆజగామ చర న్సో యం సమీపం శేషభూభృతః ॥ ౩౪

ఆరురోహ గిరిం చాపి కథం చి ద్దీనచేతసా
తస్మి న్నేవ క్షణే తస్య శరీర మఖిత స్తదా ॥ ౩౫

ఆపాదచూడం జజ్వాల త దద్భుత మివా భవత్
త త్తస్య పాపజాత ఞ్చ భస్మీభూయ క్షణా న్తరాత్ ॥ ౩౬

కృత్వా చటచటారావం పతితం ధరణీతరే
జాజ్వల్యమానో విప్రోఽపి బ్రహ్మతేజోభిరఞ్జసా ॥ ౩౭
రరాజ విగతై నస్కః శ్శరదీ వ దివాకరః

తా॥ ఇట్లు తరిమివేయబడి ఆతడు నిలమటకు నీడలేక దేశముతిరుగుచు ఒకప్పుడు దైవయోగముగా శేషపర్వత సమీపమునకు వచ్చెను. దుఃఖితుడై పర్వతారోహణము చేసెను ఆ క్షణముననే ఆతని శరీరము పాపములనుంచి తలవరకు ఒక విధముగ జ్వాలతో మండెను ఆ యగ్నిజ్వాలచే ఆతడు ఇంత కాలము సేకరించిన పాపజాలమంతయు దగ్ధమైపోయినది. చటచటా యను శబ్దముతో ఆ పాపములన్నియు దగ్ధములై భూమిమీద వ్రాలెను. బ్రాహ్మణుడును బ్రహ్మతేజస్సుచే శరత్కాల సూర్యుని వలె ప్రకాశించెను.

త ద్దృష్ట్వా విస్మితా స్సర్వే మునయ స్తత్ర సఙ్గతాః ॥ ౩౮
పప్రచ్ఛు స్తం మహాభాగా ద్విజపుత్రం మహర్షయః
కిమిదం వద విప్రేన్ద్ర నః పరో విస్మయో మహాన్ ॥ ౩౯
ఆచక్ష్వా స్మాక మా మూలా ద్వృత్తా న్త మిహ సర్వతః
ఇతి తేషాం వచ శ్శ్రుత్వా మాధవో విస్మితో ద్విజః ॥ ౪౦
ఆదితః ప్రభృతి ప్రాహ వృత్తా న్తం నిజ మఞ్జసా
త చ్ఛ్రుత్వా మునయ స్సర్వే విస్మయం పరమం గతాః ॥ ౪౧
ఊచు ర్వచనమక్లిష్టం వృషశై లాశ్రితం మహత్

తా॥ ఈ చిత్రసంఘటననుజూచి అచ్చటి మహర్షులు విస్మితులై మాధవుని జూచి ఈయాశ్చర్యమేమి? నీ వృత్తాంతమును ఆమూలాగ్రముగజెప్పుమని కోరిరి

మాధవుడు తన వృత్తాంతమును దాచక జరిగినది జరిగినట్లు చెప్పగా వినిన మహర్షులు మరింత ఆశ్చర్యముతో ఈ విచిత్రము, పర్వతమహిమగాక వేరుకా దని నిశ్చయించుకొనిరి.

ఋషులు చెప్పుచున్నారు —

అనేన పాపజాలం వై యస్మా ద్దగ్ధం ద్విజన్మనః ॥ ౪౨
వేఙ్కటాచల ఇత్యస్య ప్రసిద్ధి ర్భువి వర్తతామ్
సర్వపాపాని వేం ప్రాహుః కట స్తద్దాహ ఉచ్యతే ॥ ౪౩
సర్వపాపదహో యస్మా ద్వేఙ్కటాచల ఇత్యభూత్
ఇత్యుక్త్వా మునయ స్సర్వే యథాఽఽగత మథో యయుః ॥ ౪౪
ద్విజో పి శాన్తచిత్తోస్మి న్నచలే సంయతేన్ద్రియః
దుశ్చరం వై తపః కృత్వా తేన కైవల్య మాప్తవాన్ ॥ ౪౫

ఇతి శ్రీ బ్రహ్మాణ్డపురాణే తీర్థఖణ్డే భృగునారదసంవాదే శ్రీవేఙ్కటాచల మాహాత్మ్యే శ్రీ వేఙ్కటాచల నామధేయ హేతుకథనం నామ షష్ఠోఽధ్యాయః

తా॥ బ్రాహ్మణునిపాపము పర్వతమహిమచే దగ్ధమగుటచే ఈపర్వతము పాపదాహకమను నర్థమునిచ్చు వేంకటశబ్దముచే వ్యవహరింపబడుగాక-ఏలననగా 'వేం' శబ్దమునకు పాపమనియు, 'కట' శబ్దమునకు కాల్చుట అనియు శబ్దశక్తి వలన అర్థము చేకూరుటచే అట్లు పిలుచుట యుక్తమగును — అని వేంకటాచల నిర్వచనమును నిర్వచించి స్వస్థలములకుపోయిరి బ్రాహ్మణుడు శాంతచిత్తముతో జితేంద్రియుడై తపసుచేసి భగవత్ప్రాప్తిని జెందెను

ఇది శ్రీ బ్రహ్మాండ పురాణమున శ్రీ వేంకటాచల నామధేయ హేతుకథనము ఆరవ అధ్యాయము.

## ఏడవ అధ్యాయము

—: చోళరాజ సుతోత్పత్తిక్రమము :—

భృగువు ప్రశ్నించుచున్నాడు —

చోళరాజసుతః కశ్చిత్కలౌ ఖలు భవిష్యతి
చక్రవర్తీతి శేషాద్రౌ వైకుణ్ఠం హ్యర్చయిష్యతి ॥ ౧
ఇత్యేవం కథితం పూర్వం త్వయా మే మునిసత్తమ
తన్మమాచక్ష్వ విప్రేన్ద్ర విస్తరేణైవ నారద ॥ ౨
చోళరాజసుతః కోఽయం కుత్ర దేశే వసిష్యతి
కథం వా శేషశైలేన్ద్రమర్చయిష్యతి భక్తితః ॥ ౩
తస్య వా కీదృశీ భక్తిర్భవిష్యతి రమాపతౌ
నత్వదన్యోఽస్తి భూలోకే వేదితా భావినాం క్వచిత్ ॥ ౪
మయ్యనుగ్రహబుద్ధ్యా త్వం కథయస్వ కథా మిమామ్

తా॥ చోళరాజునకు చక్రవర్తియను కుమారుడు కలుగ గలడనియు అతడు శేషాద్రియందు భగవానునికి కైంకర్యము చేయగలడనియు చెప్పియుంటివి. ఆ కథను విస్తరించి అనగా ఆ చోళరాజసుతుడెవ్వరు ఎచ్చటయుండును ఆతనికి భగవానునియందుగల భక్తియెట్టిది ఆతడు చేయు కైంకర్యప్రకారమును దయచేసి చెప్పగోరెదను.

నారదుడు చెప్పుచున్నాడు :—

కలౌ చోళనృపః కశ్చిద్బభూవ భువి విశ్రుతః ॥ ౫
ధార్మికో నీతిశాస్త్రజ్ఞశ్శశాస పృథివీమిమామ్
స కదాచిద్వనేరన్తుమాఖేటేన మహీపతిః ॥ ౬
కిఙ్కరాన్వనపాలాంశ్చ వ్యాదిదేశ మహామనాః
స్వయం వినిర్యయౌ తూర్ణం హయమారుహ్య రంహసా ॥ ౭

శేషాచలవనోద్దేశే విచచార మృగాన్తకః
అశ్వానాం చ గజానాం చ శ్రుత్వా ఘోరం మహారవమ్ ॥ ౮

గుహాభ్యః ప్రతినిర్యాతాస్సింహవ్యాఘ్రముఖా మృగాః
ఇతస్సింహా ఇతో వ్యాఘ్రా ఇతశ్చ వనవారణాః ॥ ౯

ఇతి నిర్దిశ్యమానాన్వై వ్యజఘాన మృగయూథపాన్
సఙ్ఘశశ్చ వరాహాణాం యూథాని నిశితైశ్శరైః ॥ ౧౦

ఖడ్గాన్ఖడ్గేన నృపతిర్వివ్యాధ విపినాన్తరే
మృగయాకృష్టచిత్తోఽయం విచరన్కాననే ముహుః ॥ ౧౧

న లేభే విశ్రమం రాజా యథేన్ద్రియవశఙ్గతః

తా॥ కలియుగమున చోళదేశమున ధార్మికుడును నీతిశాస్త్రజ్ఞుడునగు నొక ప్రభువు రాజ్యమేలుచుండెను. ఆతడు వేటకై బయలుదేరుచు సైన్యమున కాజ్ఞాపించి వారలతో తానును అరణ్యమునకు వెడలి శేషాచల వనప్రాంత్యము లందు మృగములను వేటాడుచు అదేకార్యములో నిమగ్నుడై అరణ్యము నంతను తెరపిలేకుండ సంచరించుచుండెను.

తతస్తేన నరేన్ద్రేణ కన్యా కాఞ్చనరూపిణీ ॥ ౧౨

నళినోత్ఫుల్లనయనా చన్ద్రబిమ్బనిభాననా
విశ్వవిస్మయలావణ్యా శ్యామా పీనపయోధరా ॥ ౧౩

రాజహంసీ చరన్తీవ దృష్టా యౌవనశాలినీ
తతః ప్రసూనాపచయం కుర్వన్తీ సుమనోరమమ్ ॥ ౧౪

జహార చేతస్తస్యేయం నదీవ పుళినం జలైః

తా॥ అప్పుడాయనకు బంగారువలె ప్రకాశించుచు విశాల నేత్రములును చంద్రబింబము వంటి ముఖమును పీనపయోధరములును కలిగి విశ్వవిస్మయ లావణ్యముగల ఒక యువతి పుష్పాపచయము చేయుచు కనుబడెను,

ప్రసూనాన్యపచిన్వన్త్యాస్సన్నమధ్యావళిత్రయమ్ ॥ ౧౫
ఉన్నమత్కుచమాలోక్య వపుస్తస్యా భృశోత్సుకః
న శశాక వనోద్దేశాత్పదాత్పదమపి స్వయమ్ ॥ ౧౬
చలితుం నృపతిస్తత్ర వ్యాధవిద్ధో మృగో యథా
నిర్జితః స్మరబాణేన సోఽయం మర్మసు భేదినా ॥ ౧౭
విసృజ్య సర్వసైన్యాని తత్సమీపం యయౌ నృపః

తా॥ పుష్పాపచయముచేసెడి ఆ వనితయొక్క ఉన్నమత్కుచమును సన్నమధ్య వళిత్రయమునగు దేహమాతని స్మరపరవశుని జేయగా తాను నిలచిన చోటునుండి చలింపలేక వ్యాధవిద్ధ మృగమువోలె కొంతతడవు స్తబ్ధుడై నిలచి పోయిన తెలివిని తెచ్చుకుని సైన్యములను విడచి ఆ యువ దెంతకు వెళ్లగా పోయెను.

తతస్సా చ వరారోహా విలోక్య నృపతిం తదా ॥ ౧౮
మనోజ్ఞవేషం సమ్ప్రాప్తం న్యస్తచాపమివ స్మరమ్
విద్ధా మన్మథబాణేన బభూవాయతలోచనా ॥ ౧౯
అపచేతుం న పుష్పాణి శక్తా తద్గతమానసా
ముహుర్విలోకయన్త్యేనం రాజానం సా మనస్వినీ ॥ ౨౦
కరేణ పుష్పాపచయం దృగ్భ్యాం రాజావలోకనమ్
కుర్వన్తీ తన్మనాస్తన్వీ తథా చ స్మరవిభ్రమాన్ ॥ ౨౧
దర్శయన్తీ తథా తన్వీ నాతిక్రాన్తా చ దృక్పథమ్

తా॥ మనోహర రూపముగల రాజునవలోకించిన ఆవనిత మన్మథబాణములచే విద్ధయై తానుచేయు పుష్పాపచయమును మరచి రాజునే చూచుచు చేంతో పుష్పములను కోయుటను అభినయించుచు నేత్రములతో రాజును చూచుచు రాజు కండ్లకు వ్యక్తముగ నగుపడులాగున చరించనారంభించెను.

తతో రాజా సమాగమ్య పృష్టవాన్మఞ్జుభాషిణీమ్ ॥ ౨౨
కులం వృత్తం చ శీలం చ తస్యాస్స్వయమనిన్దితమ్

తా॥ అంతట రాజు ఆమె చెంతకుచేరి ఆమెయొక్క కులగోత్ర వివరము మెల్లగా పృచ్ఛించెను

రాజు అడుగుచున్నాడు —

కా త్వం చరసి కల్యాణి వనే విగతభీః కథమ్ ॥ ౨౩
పితా కో జననీ కా వా కుత్ర వా వసతిస్తవ
పరిగ్రహోఽసి కస్య త్వం న వా పాణిగ్రహస్తవ ॥ ౨౪
పాణిగ్రహణకాలోఽయం వర్తతే తవ శోభనే
న చేత్పరిగ్రహోఽన్యస్య వరాఙ్గి వరయే తదా ॥ ౨౫
స్వాయత్తీకర్తుమాత్మానం జీవితం చ త్వమర్హసి

తా॥ ఓ కల్యాణీ! ఈ యరణ్యమున ఏకాంతముగ సంచరించెడి నీ వెవ్వరవు? నీ తలిదండ్రు లెవరు? నీ వాసస్థానమెక్కడ? నీ భర్త యెవ్వరు? కన్యకవేనా? నీవు యుక్త వయసు వచ్చినదానవగుటచే నీకు వివాహము అయిన యెడల సరియే. కానియెడల నిన్ను నేను వివాహమాడ గోరెదను నీవు అనుమతించ గోరెదను

కన్యక చెప్పుచున్నది .—

ధనఞ్జయాభిధానస్య సర్పరాజస్య ధీమతః ॥ ౨౬
పుత్రీ వసామి పాతాళే లాలితా పితురన్తికే
భోగానమానుషాంశ్చాపి భుఞ్జానా తత్ప్రసాదతః ॥ ౨౭
క్రీడన్తీ చ వయస్యాభిః పాతాళే న్యవసం చిరమ్
పాణిగ్రహణకాలే మే సమ్ప్రాప్తేఽపి పితా మమ ॥ ౨౮
చిన్తయామాస కో వాఽస్యా భవితా సదృశో వరః
పిత్రా నానుమతా చాహమభిలాషం తవ ప్రభో ॥ ౨౯
బన్ధుభిశ్చ తతోఽభీష్టైరనుమన్తుమిహోత్సహే
పితరం మమ పృచ్ఛస్వ గత్వా పాతాళమఞ్జసా ॥ ౩౦

దాస్యత్యనుమతిం నూనం గుణతశ్శీలత_స్తవ
వినయం రక్ష కల్యాణ! కదంచిదిపి చానఘ ॥ ౩౧

చన్ద్రోదయవివృద్ధోఽబ్ధిః కిం వేలామతిలఙ్ఘతే

తా॥ రాజోత్తమా! సర్పరాజగు ధనంజయుడు మా తండ్రి. నా వాసము పాతాళము. అచ్చటనే తలిదండ్రులతో అమానుషములగు భోగముల ననుభవించుచు చెలికత్తెలతో సుఖముగా నుందును. నాకు వివాహ కాలము వచ్చినప్పటి నుంచి వరాన్వేషణమునకై నాతండ్రి వెతకుచున్నాడు. నా తండ్రి యనుమతిలేక నేను నీ యభిలాషను తీర్పజాలను. నా తలిదండ్రులతోడను బంధువులతోడను నీవు సంప్రదించుము. పాతాళమునకు వెళ్లి నా తండ్రిని నీవు కలసి నీ కోరికెను చెప్పినయెడల యుక్తమగు సంబంధమగుటచే ఆయన తప్పక వివాహమున కనుమతించగలడు. లోకమర్యాదను మన్నించి త్వరపడకుము. చంద్రోదయమునకు పొంగినను సముద్రము చెలియలి కట్టను దాటదు గదా

రాజు చెప్పుచున్నాడు —

నాయం వ్యతిక్రమస్సుభ్రు! నాధర్మశ్చాత్ర విద్యతే ॥ ౩౨

గాన్ధర్వోఽయం వివాహో హి మునిభిః పరికీర్తితః

పరస్పరానురాగేణ సఙ్గతా రాజకన్యకాః ॥ ౩౩

శ్రూయన్తే బహవశ్చాపి న విహాతుమిహార్హసి

అయం వివాహో ధర్మ్యశ్చ స్వర్గ్యశ్చ నళినేక్షణే ॥ ౩౪

అస్మిన్నర్థే విశాలాక్షి! ప్రత్యవాయో న విద్యతే

అత స్త్వయ్యనురక్తం మాం కృతార్థయితుమర్హసి ॥ ౩౫

జీవితం వా సుఖం వాపి త్వాం విహాయ న రోచతే

తా॥ ఓ వధూరత్నమా! నీవు రాజకన్యవు. రాజకన్యకలకు వధూవరులలో పరస్పరానురాగము కలిగినప్పుడు (వారలకు) గాంధర్వవివాహము శాస్త్రము లందంగీకరింపబడినది. శాస్త్రమేగాక అనేకమంది రాజకన్యల పూర్వ చరిత్రమును కలదు. ఇట్టి వివాహము ధర్మ్యము స్వర్గ్యముకూడ నగుచున్నది.

ఇందుతప్పులేదు నీయందు అనురక్తుడగు నన్నిప్పుడు కృతార్థుని జేయుము. జీవితముగాని సుఖముగాని నీ యందే నా కిప్పుడు నెలకొనియున్నది

ఇతి బ్రువతి భూపాలే కన్యా కామవశంవదా ॥ ౩౬

లజ్జానతముఖీ భూమిం లిఖన్తీ నఖరేణ సా
వక్తుకామేవ సంరబ్ధా సంవృతా లజ్జయా ముహుః ॥ ౩౭

అఙ్గీచకార చోద్వాహం రాజ్ఞా నాగస్య కన్యకా
జోషమాస్థాయ విపులం ముహూర్తం స్మావతిష్ఠతే ॥ ౩౮

అథానయా సమాగత్య లతామణ్డపసంశ్రితః
అన్వభూత్సురతం తస్యా భూయో రాగవివర్ధనమ్ ॥ ౩౯

యామావశేషేఽథ దినే గన్తుకామా కృతత్వరా
ఆమన్త్రయామాస నృపం కథఞ్చిద్విరహాకులా ॥ ౪౦

నృపశ్చదుఃఖితోఽత్యర్థమాశ్లిష్యాశ్లిష్య భామినీమ్
కథంచిదనుమన్తుం వై శశాక గమనం తదా ॥ ౪౧

నృపేణానుమతా సాఽథ సఙ్గమశ్రమవిహ్వలా
నిమీలితార్ధనయనా నిర్గతా వరవర్ణినీ ॥ ౪౨

తా॥ ఈ విధముగ దైన్యముతో అనునయము చేయుచున్న రాజును జూచి కామవశంవద యగుటచే ఆయమ లజ్జచే తలవంచి కాలిగోళ్లతో భూమిని లిఖించుచు యేదియో చెప్పదలచియు మాటలాడలేక ఒక ముహూర్తకాలము నిరుత్తరయై నిలచెను. అంతట రాజు ఆమెను వశము జేసికొని అచ్చటి లతామండపమున జేర్చి భూయోరాగవివర్ధనమగు రతిసుఖము ననుభవింపజేసెను. తెల్లవారుటకు ముందు ఆమె స్వస్థలమునకు పోవుటకై త్వరపడి ప్రియుని అనుజ్ఞకోరి ఆతనికి నివేదించెను. నృపుడును ప్రియావిశ్లేషమును సహించక పలుమారు నాగకన్యకను ఆలింగనముజేసి విడువలేక కడపట అనుమతించెను. ఆమెయును ప్రియుని యనుమతి బడసి సంగమశ్రమ విహ్వలయగుటచే నిమీలితార్ధ నయనములతో స్వస్థానమునకుపోయెను.

తతః పాతాళమావిశ్య గత్వా చ పితురన్తికమ్
చోళరాజస్య చరితం కథయామాస సర్వతః ॥ ౪౩

నాగరాజోఽపి తాం శ్రుత్వా కథితాం కన్యయా కథామ్
ప్రహర్షమతులం లేభే సదృశోఽయమితి బ్రువన్ ॥ ౪౪

తా॥ ప్రియుని విడచిన నాగకన్యక పాతాళమునకుపోయి తండ్రితో చోళ రాజు వృత్తాంతమును చెప్పగా నాగరాజు తన కుమార్తెకు సదృశవరలాభము శ్రమరహితముగ చేకూరినందుకు సంతసించెను

నిర్గత్య నృపతిశ్చాపి లతామణ్డపసంశ్రయాత్
భావయన్విభ్రమాంస్తస్యా జగామ మృగయంశ్చమూమ్ ॥ ౪౫

పశ్చిమాచలశృఙ్గాగ్రే లమ్బమానే దివాకరే
వ్యలోకత మహారాజస్సేనామనుగతాం తదా ॥ ౪౬

అపరాం దిశమాసాద్య హ్యన్వరజ్యత భాస్కరః
బిభ్రతీ కుఙ్కుమారక్తం పయోధరభరం తదా ॥ ౪౭

బభౌ సన్ధ్యారుణం వ్యోమ స్ఫురత్తారకమణ్డలమ్
ప్రవాళరక్తో ముక్తాఽభిరఞ్చితో వారిధిర్యథా ॥ ౪౮

జగాహే జగదణ్డాన్తస్తిమిరంచ శనైః శనైః
హృదయం విషయాసక్తమవిద్యాతిమిరం యథా ॥ ౪౯

తా॥ చోళరాజును లతామండపమునుండి వెడలి సేనను వెదకుచు పోగా సూర్యాస్తమయ సమయమున సేనను తనను వెదకివచ్చుటనుచూచెను. సూర్యుడు అస్తమించెను. కుంకుమారక్తమగు పయోధర భరముతో సంధ్యయు స్ఫురత్తారకమగు వ్యోమమును ప్రవాళరక్తముసు ముక్తాభిరుచితమునగు వారిధివలె ప్రకాశించెను. విషయాసక్తచిత్తుని హృదయమును అవిద్య యావరించినట్లు బ్రహ్మాండము క్రమముగ చీకటిచే యావరింపబడెను

స చ సైన్యాన్వితస్తావత్త్వయయౌ నిజమాస్పదమ్
స్మారంస్మారం విశాలాక్షీం సురతశ్రమవిహ్వలామ్ ॥ ౨౦

తా॥ రాజును సురత శ్రమ విహ్వలయగు తన ప్రియను తదేకధ్యానముతో స్మరించుచు సైన్యముతోకూడి స్వస్థానమునకుచేరెను

ఆపన్నసత్త్వా దదృశే నాగరాజస్య కన్యకా
సర్వలక్షణసమ్పన్నా పితుర్విదధతీ ముదమ్ ॥ ౨౧

తామథాలోక్య దైవజ్ఞా ఇదమూచుర్వచస్తదా
అస్యాముత్పత్స్యతే పుత్రశ్చక్రవర్తీ మహాద్యుతిః ॥ ౨౨

పృథివీం సాగరోపేతాం సశైలవనకాననామ్
పాలయిష్యతి ధర్మేణ మహేన్ద్రసదృశః ప్రభుః ॥ ౨౩

అథ సా దశమే మాసి పుత్రం ప్రాసూత సున్దరమ్
సర్వలక్షణసమ్పన్నం సార్వభౌమపదోచితమ్ ॥ ౨౪

ఇతి శ్రీ బ్రహ్మాణ్డపురాణే తీర్థఖణ్డే భృగునారదసంవాదే శ్రీ వేఙ్కటాచల మాహాత్మ్యే శ్రీవేఙ్కటాచల నామధేయ హేతుకథనం నామ సప్తమోఽధ్యాయః.

తా॥ నాగకన్యక సద్యో గర్భవతియై తలిదండ్రులకు సంతోషము చేకూర్చి వృద్ధిజెందుచుండెను. దైవజ్ఞులామెనుజూచి ఈమె గర్భమందు మహా ప్రకాశ వంతుడగు చక్రవర్తి పుట్ట బోవుచున్నాడు. సశైల వనకాననమగు భూమండలము నాయన పరిపాలించును, ధర్మాత్ముడై మహేంద్రునివలె వృద్ధిచెందును' అని చెప్పుచువచ్చిరి. ఆమె అదే విధముగా పదవ మాసమందు సర్వలక్షణ సంపన్నుడును సార్వభౌమ పదోచితుడు నగు కుమారుని గనెను.

ఇది శ్రీ బ్రహ్మాండ పురాణమున శ్రీ వేంకటాచల నామధేయ హేతు కథనము ఏడవ అధ్యాయము.

## యెనిమిదవ అధ్యాయము



—: చోళరాజసుతుడు పాతాళమునుంచి తండ్రికడకు వచ్చుట :—

నారదుడు చెప్పుచున్నాడు :—

పుత్రస్య ముఖలావణ్యే పుత్రికాయా ధనఞ్జయః
తృప్తిం న విన్దతి స్మాయం ప్రీత్యుత్ఫుల్లేన చక్షుషా ॥ ౧
వవృధే నాగరాజస్య పరితోషేణ వై శిశుః
చన్ద్రిమా ఇవ కృష్ణాన్యపక్షే సతి దినే దినే ॥ ౨

తా॥ తన పౌత్రుని చక్కదనమును చూచిన నాగరాజు పరమానందము నందెను. శిశువును తాతలాలనక్రింద సంతోషముగ పెరుగుచు శుక్లపక్ష చంద్రునివలె దినదినము వృద్ధిజెందుచుండెను.

కస్యచిత్త్వథ కాలస్య పోషితో మాతురన్తికే
పప్రచ్ఛ మాతరం బాలః పితరం దర్శయేతి హ ॥ ౩

తా॥ కొంతకాలము గడచిన తరువాత కుమారునకు బుద్ధితెలసి "తన తండ్రి యెచ్చట నున్నా" దని ఆతడు తల్లినడిగెను.

తచ్ఛ్రుత్వా పూర్వవృత్తాన్తం సా మాతాఽస్మై న్యవేదయత్
తదాకర్ణ్య చ బాలోఽయం పునః పప్రచ్ఛ మాతరమ్ ॥ ౪
పితరం వీక్షితుం శీఘ్రం క్షోణీతలనివాసినమ్
వర్తతే హ్యభిలాషో మే మహాన్మనసి సమ్ప్రతి ॥ ౫
భూలోకగమనే యోగ్యం మార్గమావేదయస్వ మే
యేనాహం పితురుత్సఙ్గం గమిష్యామి ముదాఽన్వితః ॥ ౬

తా॥ బిడ్డమాటలు వినిన తల్లి పూర్వము జరిగిన వృత్తాంతము నతనికి చెప్పగా త్రిప్పిత్రిప్పి యాతడు తనతండ్రిని దర్శించుటకై భూలోకమునకు పోవలయునని తన యభిలాషను తల్లికి చెప్పుకొనెను.

ఇతి తస్య వచశ్ర్శుత్వా ప్రహృష్టా నాగకన్యకా
భూలోకగమనే యోగ్యం బిలం చాదర్శయత్తదా ॥ ౭
సోఽపి తేనైవ మార్గేణ ప్రాప్యాఽశు ధరణీతలమ్
చోళరాజముపాగమ్య వవన్దే పాదయోస్తదా ॥ ౮

తా॥ కుమారుని వాక్యములకు సంతోషించినతల్లి ఆతనికి భూలోకమునకు పాతాళమునుండి పోవుటకు వీలైన ఒక బిలమును చూపగా ఆతడు ఆ బిల ద్వారమున భూలోకమునకు వచ్చి చోళరాజును సమీపించి ఆతని పాదములకు ప్రణామము చేసెను.

పప్రచ్ఛ ప్రణతం భూమౌ కస్త్వమిత్యవనీపతిః
పృష్టః ప్రాహ స బాలోఽయం వృత్తాన్తమఖిలం మునే ॥ ౯
వృత్తాన్తమఖిలం రాజా శ్రుత్వా తు తదుదీరితమ్
గ్రహణే బాలకస్యాస్య సంశయం పరమం యయౌ ॥ ౧౦
సంశయావిష్టచిత్తోఽయం జోషమాస్థాయ భూపతిః
ముహూర్తమివ భూయోఽపి తమేవాలోకయన్స్థితః ॥ ౧౧

తా॥ ప్రణతుడగు బాలకుని జూచి 'నీ వెవ్వరవు' అని ప్రశ్నించగా కుమారుడు తన తల్లిచెప్పిన వృత్తాంతమును విన్నవించెను ఆకథనువినిన రాజు కొంచెము విచారించుచు బాలునిస్వీకరించుటలో సంశయముగలిగి బదులు చెప్పక ఊరకుండి బాలకునివంక తేరిపారజూడ మొదలిడెను.

—: ఆకాశవాణి ప్రబోధముచే ఆకాశరాజు కుమారుని నభిషేకించుట :—

తతశ్చాకాశగా వాణీ నృపం సంశయితం ముహుః
ఆశ్వాసయన్తీ వచనైరుచ్చచార న వీక్షితా ॥ ౧౨
మా విచారయ రాజేన్ద్ర పుత్రోఽయం తే న సంశయః
చక్రవర్తీ మహారాజో భవిష్యత్యసమో భువి ॥ ౧౩
అతీవ విష్ణుభక్తశ్చ భవిష్యతి మహామతిః
శేషాద్రౌ చ స్వయం వ్యక్తం విష్ణుమభ్యర్చయిష్యతి ॥ ౧౪

ప్రీతశ్చాపి మహాదేవో హ్యర్చాభావమతిక్రమన్
సల్లాపం తేన సుచిరం కరిష్యతి దినే దినే ॥ ౧౫
అభిషేచయ రాజేన్ద్ర పుత్రం రాజ్యేఽవిచారతః

తా॥ సంశయావిష్టుడగురాజు నాశ్వాసపరచుచు ఆకాశవాణి ఇట్లని పలికెను. 'రాజేంద్రా! ఈచిన్నవాడు నీ కుమారుడే. సంశయింపకుము. ఈతడు భూమండలము నేలగల చక్రవర్తి కాగలడు మహామతియు విష్ణుభక్తుడునై వేంకటాద్రియందు శ్రీనివాసుని దర్శించగలడు. శ్రీనివాసుడీతని భక్తికిమెచ్చి తన అర్చాభావమును మీరి మనుష్యభావముతో ఈతనితో సంభాషించును ఈతనిని వెంటనే పరిగ్రహించి రాజ్యమునందు పట్టాభిషేకము చేయుము.

ఇతి రాజా సమాకర్ణ్య నానృతం సురభాషితమ్ ॥ ౧౬
శ్రద్దధే పుత్రమిత్యేనం జయన్తం వాసవో యథా
తతో రాజా సమాగమ్య సంవృత్తో యత్ర సఙ్గమః ॥ ౧౭
ఆత్మనస్తస్య మాతుశ్చ తం దేశం సుమనోరమమ్
తత్ర నిర్మాయ విపులం పురం పుత్రస్య నామతః ॥ ౧౮
తత్రాభ్యషేచయచ్చైనమాధిరాజ్యే సమాగతః

తా॥ ఆకాశవాణి యాజ్ఞను శిరసావహించి సురభాషితము అనృతము కాజాలదని నమ్మి బాలుని తన పుత్రునిగా ఆదరించి పూర్వము మృగయాసందర్భమున నాగకన్య కనుబడి ఆమెతో తనకు గాంధర్వ సమాగమము కలిగిన ప్రదేశమునకు పుత్రునిదెచ్చి అచ్చట మనోహరమును విశాలమునగు నొక మహానగరమును నిర్మించి కుమారుని పేరుపెట్టి అచ్చటనే కుమారునికి పట్టాభిషేకము జేసెను.

తతస్స చక్రవర్తీతి ప్రథితో భువి పార్థివః ॥ ౧౯
శశాస పృథివీం కృత్స్నాం సముద్రవసనాన్వితామ్

తా॥ అంతనుంచి ఆతడు చక్రవర్తియను పేరుననే ప్రసిద్ధుడై ధర్మసహితముగ భూమండలమును పాలించుచుండెను.

తతః కదాచిద్గోపాలా స్తదాజ్ఞాపరిపాలకాః ॥ ౨౦

సమాగమ్య మహీపాలమిదం వచనమబ్రువన్

తా॥ ఇట్లుండగా ఒకనాడు ఆతని పాలనలోనున్న కొంతమంది గొల్లవారు ఆయనదగ్గరకువచ్చి ఇట్లు మొరబెట్టసాగిరి,

శేషాచలే వయం రాజన్విహరామో గవాం వ్రజాత్ ॥ ౨౧

క్షీరం నిదేశాద్దేవస్య భాణ్డేషు నిహితం సదా

తదానయనకాలే వై దృశ్యతే మహదద్భుతమ్ ॥ ౨౨

వివృద్ధం తత్ర వల్మీకమేకం వసతి భూధరే

ఆగచ్ఛామో హి మార్గేణ వయం తేన మహీపతే ॥ ౨౩

ఆదాయ భాణ్డం క్షీరాణాం సర్వం తత్ర హి భజ్యతే

సావధానా అపి వయం న పశ్యామోఽత్రకారణమ్ ॥ ౨౪

తా॥ రాజోత్తమా! మేము శేషపర్వతమంతయు గోవుల గాచుకొనుచుందుము. తమకై క్షీరములను తెచ్చుటకై భాండములలోపాలుపోసి తెచ్చుచుండగా ఒక విచిత్రము జరుగుచున్నది. మార్గమున నొక వల్మీకము పెద్దది కలదు. ఆ పుట్టవద్దకు మేము చేరుసమయమునకు భాండములు బ్రద్దలై పాలు క్రిందపోవుచున్నవి. ఎంత అవధానముగ కనిపెట్టినను భాండములు బ్రద్దలగుటకు కారణము మాకు తెలియలేదు. దీనికేమికారణమో దేవరవారు పరిశీలింతురని విన్నవించుచున్నాము,

విచారయ మహీపాల కిమేతదితి సమ్ప్రతి

రాజా దైవికమేవేతి సునిశ్చిత్య సువిస్మితః ॥ ౨౫

సాయం ధ్యాయన్హృషీకేశం తద్గతేనాన్తరాత్మనా

శుచిర్భూతశ్చ సుష్వాప యతవాక్కాయమానసః ॥ ౨౬

దదర్శ స్వప్నమేకం చ నృపస్తస్మిన్నిశాన్తరే

ప్రాతరుత్థాయ విధివత్సన్ధ్యామన్వాస్య భూపతిః ॥ ౨౭

ఆహూయ మన్త్రిప్రవరానిదం వచనమబ్రవీత్

తా॥ ఇది దైవచిత్తమని తలచిన రాజు భగవంతుని స్మరించుచు సాయం కాల కృత్యములను తీర్చుకొని యతవాక్కాయ మానసుడై శయనించెను. రాత్రి అతనికొక స్వప్నమువచ్చెను. ఉదయమున నిద్రలేచి కాలకృత్యములను దీర్చి కొని రాజు మంత్రులను రావించి వారలతో ఇట్లు పల్కెను.

రాజు చెప్పుచున్నాడు :—

మన్త్రిణశ్శృణుతాస్యాం వై నిశాయాం స్వప్నమద్భుతమ్ ॥ ౨౮
అదృష్టపూర్వం చాన్యేన గుహ్యాద్గుహ్యాతరం మహత్
కాలమేఘనిభః కశ్చిదతిసున్దరమూర్తిమాన్ ॥ ౨౯
అద్భుతః పురుషో దృష్టః పుణ్డరీకాయతేక్షణః
అపృచ్ఛం పురుషం చాహం కుత్రత్యః కో భవానితి ॥ ౩౦
కిమర్థం చాగతోఽస్యద్య తవ కిం కరవాణ్యహమ్
ఇతి పృష్టో మయా ప్రాహ దేవేన గిరివాసినా ॥ ౩౧
ప్రేషితోఽహం నరవ్యాఘ్ర శ్రీనివాసేన ధీమతా
అహం వసామి శేషాద్రేస్సదా తస్యాన్తికే ముదా ॥ ౩౨
శ్రీ వేఙ్కటగిరేరస్య ప్రభావం తు మహాద్భుతమ్
నివేదయేతి దేవేన ప్రేషితోఽస్మ్మత వాన్తికమ్ ॥ ౩౩
శిలోచ్చయేఽత్ర వై శఙ్ఖచక్రావనతహస్తకః
శ్రీ భూమిసహితో నిత్యం విహరన్రాజతే తరామ్ ॥ ౩౪
అద్రేర్దక్షిణత స్తస్య రాజధానీ విరాజతే
గజవాజిరథోపేతా సర్వాద్భుతమయీ సదా ॥ ౩౫
తస్మిన్గిరౌ త్రయస్త్రింశత్కోటిసఙ్ఖ్యాశ్చ దేవతాః
సర్వే మహర్షయశ్చాపి సిద్ధా యోగివరాస్తథా ॥ ౩౬
వసన్తి సర్వతీర్థాని తస్మిన్నగివరే శుభే
అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా ॥ ౩౭

ప్రాప్తిః ప్రాకామ్యమీశత్వం వశిత్వం చాష్టభూతయః
తస్యాద్రేః పూర్వభాగే వై చరన్తి విపులం తపః ॥ ౩౮

తా॥ మంత్రులారా: రాత్రి ఒక అద్భుతము కనుబడినది. ఇతరులకీ దర్శనము దుర్లభము, అతి రహస్యము. నీలమేఘశ్యామలుడును అతి సుంద రుడును పుండరీకాయతేక్షణుడును నగు నొక యద్భుత పురుషుడు స్వప్నమున నాకు దర్శనమిచ్చెను 'నీవెవర' వనియాతని నడుగగా గిరివాసియగు శ్రీనివా సునిచే పంపబడితిననియు శేషాద్రిపరిసరములందు ఉండెదననియు శ్రీవేంకటగిరి మాహాత్మ్యమును నీకెరింగించుటకే ప్రభునిచే పంపబడితిననియు చెప్పెను మరియు శేషాద్రియందు శంఖచక్రములను ధరించి శ్రీభూమినహితుడై శ్రీనివాసు డుండుననియు పర్వతమునకు దక్షిణమున నారాయణ రాజధాని గలదనియు ఆపురి యందు గజవాజిరథబలము కలదనియు అందు ముప్పదిమూడుకోట్ల దేవతలును అదేమాదిరి అష్టసిద్ధులును తమ అభ్యుదయమునకై తపమాచరించు చుందుననియు చెప్పెను

పూర్వస్యాం దిశి తస్యాద్రేః కాళహస్తీతి విశ్రుతమ్
పురే తస్మిన్మహాదేవో వసతి స్వయమాచిరాత్ ॥ ౩౯
కాళహస్త్యుత్తరే భాగే సువర్ణముఖరీ నదీ
సర్వపాపప్రశమనీ దృశ్యతే మునిసేవితా ॥ ౪౦
శుకాదయో మునివరాస్తస్యాస్తీరే యతేన్ద్రియాః
శేషశైలేశముద్దిశ్య తపస్తప్యన్తి దారుణమ్ ॥ ౪౧
తస్యాద్రేః పరితస్సప్తయోజనాన్తఃస్థితా జనాః
సర్వపాపవినిర్ముక్తా విష్ణులోకం ప్రయాన్తి వై ॥ ౪౨
అష్టార్ణమనురాజం తం జప్త్వా తు కిముత ప్రభో
తం ద్రష్టుం దేవదేవేశం ద్రష్టుం సద్మ చ శోభనమ్ ॥ ౪౩
ఏహి శేషాచలం శీఘ్రమిత్థ మాహూతవాన్స మామ్

తా॥ ఆ పర్వతపు తూర్పు దిశను కాళహస్తి కలదు. అందు పరమ శివుడు సాన్నిధ్యము జెందియున్నాడు. ఆ పట్టనమునకుత్తర భాగమున సర్వ

పాపములను పోగొట్టగల్గి మునిసంఘ సేవితమైన సువర్ణముఖరీ నదియు కలవు. ఈ నదియొడ్డున శుకాది బ్రహ్మర్షులు శ్రీశేషాద్రీశ్వరుని యనుగ్రహమునకై తపస్సు చేయుచుందురు. ఈ పర్వతమును చుట్టి యేడుయోజనముల దూరములోపల వసియించెడి ప్రజలు జాతి మత స్త్రీ పురుషాది విచక్షణములేక విష్ణులోకమునకు పోయెదరు. అష్టాక్షర మహామంత్రమును జపించువారల యదృష్టము నింకనెట్లు వర్ణింప దగును? ఆ శేషగిరీశుని ఆలని దివ్యాలయమును సేవింపుటకై శేషాచలమునకు నిన్ను పిలచి రమ్మనిచెప్పి నన్నాతడు శేషాచలమునకు రమ్మని పిలచెను.

అథ తేనైవ పుంసాఽహం శేషాచలముపాగమమ్ ॥ ౪౪

వ్యోమాన్తర్వితతోదారశృఙ్గాగ్రస్తమ్భితద్రుమమ్

తత్ర గత్వా స పురుషో జ్వలత్కాఞ్చనశోభితమ్ ॥ ౪౫

దివ్యం ప్రదర్శయామాస విమానం రత్నశోభితమ్

స్వయమన్తర్దధే సోఽయం పశ్యతో మమ పూరుషః ॥ ౪౬

అన్తర్దధే విమానం చ తస్మిన్నేవ క్షణాన్తరే

ఇతి స్వప్నో మయా దృష్టో హ్యద్భుతో రోమహర్షణః ॥ ౪౭

అదృష్టపూర్వశ్చాన్యేన కిమేతదితి చిన్త్యతామ్

తా॥ ఆ పురుషునితో నేను ఆతడు చూపిన మార్గమున శేషాచలమునకు పోతిని. శేషగిరియందు ఆకాశమునంటిన మహావృక్షములు కలవు. అచ్చటకేగి ఆ పురుషుడు కాంచన శోభితమగు నొక దివ్య విమానమును నాతడు నాకు చూపి తాను అంతర్ధానము జెందెను. కొంచెము కాలములో విమానముకూడ అంతర్హితమాయెను. ఇట్లు అద్భుతమును రోమహర్షణమునగునొక స్వప్నము నాకు కల్గినది. ఇట్టి స్వప్నము నాకుగాని ఇతరులకుగాను అదృష్టపూర్వము. దీని భావమును పరిశీలించుడు.

మంత్రులు చెప్పుచున్నారు :—

దేవేన త్వయి కారుణ్యాద్దర్శితం రాజసత్తమ ॥ ౪౮

వల్మీకస్థానతశ్చైవ దేవస్తిష్ఠత్యసంశయమ్

క్షీరభాణ్డం చ గోపాలా భగ్నమావేదయంస్తవ ॥ ౪౯

గోపాలైర్యత్సమాదిష్టం వల్మీకస్థానముత్తమమ్ ॥
తత్ర క్షీరాభిషేకేణ దేవో వ్యక్తిం గమిష్యతి ॥ ౫౦

ఇతి సఞ్చిన్త్యమానే వై శబరః కశ్చిదాయయౌ
కాళమేఘనిభో ధన్వీ ఖడ్గతూణీరభూషితః ॥ ౫౧

బర్హిపిఞ్ఛాన్వితశిరో లతాపల్లవభూషితః
తూర్ణమాగత్య రాజానం ప్రణమ్య శిరసా తతః ॥ ౫౨

వ్యజిజ్ఞపచ్చ రాజానం ప్రణతః ప్రాఞ్జలిస్థితః

తా॥ దేవా! ఇది భగవదనుగ్రహము. పరమకృపచే నీకీయనుభవమును భగవానుడు కల్పించినాడు. గోపాలకులు చెప్పిన వల్మీకమందు నిశ్చయముగా దేవుడు దాగియున్నాడు. గోపాలకులు యే వల్మీక సవిధమున తమ క్షీరభాండముల భంగమును తెలిపిరో ఆ వల్మీకమువద్ద క్షీరాభిషేకము చేసినయెడల భగవానుడావిర్భవించును, అనిచెప్పిన మంత్రుల మాటలు పరామర్శింపబడుచుండగా ఒకానొక శబరుడు రాజసన్నిధికి వచ్చి నమస్కరించి ప్రాంజలియైనిలచి ఇట్లని విన్నవించెను.

స్వామిన్వసామి శేషాద్రౌ ప్రియఙ్గుకృషిమాచరన్ ॥ ౫౩

తేన జీవామి సతతం సపుత్రస్సహబాన్ధవః
కశ్చిచ్ఛ్వేతో వరాహో వై తత్రాగత్య దినే దినే ॥ ౫౪

ప్రియఙ్గుం భక్షయత్యేవ నిశ్శేషం మిషతాంచ నః
తదర్థం రక్షణే తస్య నియుజ్య మమ పుత్రకమ్ ॥ ౫౫

ప్రియం ప్రియఙ్గుం దేవాయ నివేదయితుముద్యతః
మధ్వర్థమగమం సోఽహం సుదూరం తత్ర పర్వతే ॥ ౫౬

తస్మిన్నవసరే పుత్రః ప్రియఙ్గుం లోలుపః కరే
సంమర్ద్య భక్షయిత్వాఽస్తే తదపశ్యం సమాగతః ॥ ౫౭

దేవాఽనివేదితే ప్రీతిర్మమ నాసీత్కదాచన
తతః క్రుద్ధో రుదన్తం వై పుత్రం హన్తుం సముద్యతః ॥ ౫౮

తదా హ్యాకాశగా వాణీ మామవోచత్సుదారుణమ్
మావధీః పుత్రమేవం వై ప్రియఙ్గుమనివేదితమ్ ॥ ౨౯

దేవస్స్వీకృతవానేవ త్వద్వృత్తేనైవ తోషితః
చక్రవర్తిసమీపం చ గత్వా స్వప్నం చ దర్శితమ్ ॥ ౬౦

అభిజ్ఞానతయా చోక్త్వా తమాగచ్ఛేతి వై వద

తా॥ రాజా! నేను శేషాద్రియందుండువాడను. కృషిచే నాకు జీవనము భార్యాపుత్రులతో సుఖజీవనము చేయుచుంటిని. ప్రతిదినము ఒక శ్వేతవరాహము నా చేనుకువచ్చి పైరును తినివేయుచున్నది. దానిని రాకుండ తోలివేయుటకు నా పుత్రునక్కడ కాపుబెట్టి నా నిత్యకృత్యమైన భగవన్నివేదనమును చేయుటకు ప్రియమగు ప్రసాదము కలుపుటకై తేనెను తెచ్చుటకు నేనడవికి పోతిని. నేను వచ్చు వేళకు నా కుమారుడు ప్రియంబగు ప్రసాదమును చేతిలో పట్టుకొని తిని కూర్చుని యుండుటను చూచి భగవన్నివేదనము కాకుండుటను చింతించి బిడ్డపై కోపముతో వానిని కొట్టపోతిని. అంతలో ఆకాశమునుండి 'పుత్రుని కొట్టకుము. ఆతనియందు దయతో దేవుడు తానుగా నీ ప్రసాదమును ఆరగించెను. భగవానునిచే చక్రవర్తికి స్వప్నమందొక రహస్యముతెలుపబడినది. స్వప్నము నాతనికి జ్ఞాపకపరచి ఆతని నిచ్చటకు తోడితెమ్ము' అని యొక వాణి వినబడినది.

ఇతి తేన సమాఖ్యాతం వాచా వ్యోమగయా తదా ॥ ౬౧

వచశ్శ్రుత్వా విచార్యాథ కిమేతదితి మన్త్రిభిః
రాజాఽథ గోపవాక్యం చ స్వప్నం శబరభాషితమ్ ॥ ౬౨

ఏకీకృత్య సహానేన నిర్యయౌ శబరేణ సః
ఆదిశ్య మన్త్రిణశ్చైవ గోసహస్రభవం భువి ॥ ౬౩
క్షీరమానయతేత్యేతచ్ఛేషాచలతటం యయౌ

ఇతి శ్రీబ్రహ్మాణ్డపురాణే తీర్థఖణ్డే భృగునారద సంవాదే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే చోళరాజస్వప్నవృత్తాన్తకథనం నామ అష్టమోఽధ్యాయః.

తా॥ ఇట్లని శబరునిచే చెప్పబడిన ఆకాశవాణి యాదేశమును విని మంత్రులతో ఈ వివరమునుఁగూడ తెలియగోరి గోపవాక్యము స్వప్నము శబరభాషితము ఈమూడు సమస్యలను ఏకీకరణము చేసికొని మంత్రులకు వేయి గోవుల క్షీరమును తెమ్మనట్లు ఆజ్ఞాపించి శబరునితో కూడి చక్రవర్తి శేషాచల తటమునకు పోయెను

ఇది శ్రీబ్రహ్మాండ పురాణము తీర్థ ఖణ్డము భృగునారద సంవాదము శ్రీవేంకటాచల మాహాత్మ్యములో చోళరాజ స్వప్నవృత్తాంతకథనము ఎనిమిదవ అధ్యాయము.

---

## తొమ్మిదవ అధ్యాయము

### శబరునితో చక్రవర్తి శేషాచలమునకు వెళ్లుట.

శ్రీనారదుడు చెప్పుచున్నాడు :—

నిర్గత్య రాజా శబరేణ సార్ధం ప్రియం ప్రియఙ్గుం ప్రతిభక్షయన్తమ్
శ్వేతం వరాహం శబరోపదిష్టం దివ్యం విమానం చ దిదృక్షురత్ర ॥ ౧

విలోకయఞ్ఛ్వేతవరాహమేకం ప్రియఙ్గుసస్యం కిల భక్షయన్తమ్
గర్జన్తమాయాన్తమితస్తతోపి ఘోణారవం భీమపరాక్రమం చ ॥ ౨

దివ్యం విమానం చ దదర్శ తత్ర నృపస్తదా రత్నవిభూషితం తత్
అనేకసాహస్రరవిప్రకాశం స్వప్నే ఉద్భూతం దృష్టమదృష్టపూర్వమ్ ॥

తతో వరాహస్సహసా ప్రియఙ్గుం వ్యాధస్య హృష్టస్తమధోపభుజ్య
దృగ్గోచరం తస్య నమీపజాతం వల్మీకమేవ ప్రవివేశ భూయః ॥ ४

న తద్విమానం చ దదర్శభూయస్తస్మిన్ క్షణే విస్మితచిత్త ఏషః

తా॥ రాజు శబరునితో బయలుదేరి అతడు చెప్పిన శ్వేతవరాహమును స్వప్నమునందగుపడిన విమానమును సందర్శించవలయునను కోరికతో వెతకుచుండగా భగవదనుగ్రహముచే ఘోరారవముచే గర్జించుచు యెదురుగా పరుగెత్తెడి భీమపరాక్రమముగల శ్వేతవరాహమును రత్న విభూషితమగు దివ్య

విమానమును చూచెను సహస్రాదిత్య సంకాశమగు నదృష్టపూర్వమైన దివ్య విమానమును కిరాతుని పైరుసు తిని సమీపమందున్న బిలమును ప్రవేశించిన వరాహమును చూచి రాజు విస్మయచకితుడై పోయెను

సప్రచ్ఛ తం శాబరమేవ తస్య హేతుం వదస్వేతి స రాజపుత్రః ॥ ౫

సశాబర స్తస్య చ తేన హేతుం తత్త్వేన పృష్టస్స జగాద తస్మై
అయం వరాహో న వరాహమాత్రం దేవస్స్వయం యోధరణీం బభార॥

ఇదం విమానం చ తదీయమేవ
దివ్యంత్వయా దృష్టమదృష్టపూర్వమ్ ।
వాసోఽస్య వల్మీకమిదం మహాత్మ
మహత్తరం నూనమితస్తు హేతోః ॥

వల్మీకతోఽస్మాచ్చవినిర్గతోసౌ భూయోపి తత్రైవ విలీన ఆస్తే
అతోఽత్ర రాజన్నిశితైః ఖనిత్రైర్వల్మీకమేతత్ప్రవిదార్య సద్యః

విలోక్యతాం నూనమిహైవ దేవో వసిష్యతీతి ప్రతిభాతి మేఽద్య ॥ ౮

తా॥ అంతట రాజు శబరునిజూచి ఈ విచిత్ర మేమియని యడుగగా ఆతడు ఇట్లనిచెప్పసాగెను ఈవరాహము ప్రాకృత జంతువుకాదు, భూమ్యుద్ధరణము జేసిన వరాహమూర్తిమే కావలయును ఈ విమాన మాతనిదే. ఆ కారణముచే దేవదేవుడిందు ప్రచ్ఛన్నముగ వసించి గతాగతములతో మనలను కలవర పెట్టుచున్నాడు. కనుక ఇందా దివ్యసూకరమును చూడవలయునేని పారలతో ఈ వల్మీకమును త్రవ్వినచో దర్శనము బడయగలమని నాకు తోచుచున్నది.

శ్రుత్వా చ తచ్ఛాబరవాక్యమేష వల్మీకమేతన్న బిభేద భీతః
అథాభ్యషిఞ్చత్స తమేవ భక్త్యా గోపాహృతైః క్షీరఘటైరనేకైః॥ ౯

స తత్ర వాచాం మనసామభూమిం
దదర్శ రత్నోజ్జ్వలమద్భుతం చ ।
దివ్యం విమానోత్తమమాశు దృష్ట్వా
హృష్టశ్చ మూర్ధ్నా ప్రణనామ భూయః ॥ ౧౦

తా॥ ఆ వాక్యమును వినిన రాజు శబరుని వాక్యమురీతిని వల్మీకమును ఖిన్నముచేయుట దోషమని తలచి గోపకులచే తేబడిన అనేక క్షీరఘటముల పాలచే వల్మీకమున కభిషేకము చేయించెను. వెంటనే ఆ వల్మీకమునుండి రత్నోజ్జ్వలమును అద్భుతమును వాఙ్మనసాగోచరమునగు నొక దివ్యవిమానము సాక్షాత్కరించగా రాజు ప్రణామములచేసెను.

తన్మధ్యేఽసౌ నీలజీమూతకల్పం
పద్మావాసం సంశ్రితత్రాణహేతుమ్ ॥ ౧౧

శ్రీవత్సాఙ్కం పుణ్డరీకాయతాక్షం
శఙ్ఖం చక్రం ధారయన్తం కరాభ్యామ్ ।
దాతారం తం పాణినా వై వరాణా
మన్యేనాఙ్కం బిభ్రతం భ్రాజమానమ్ ॥ ౧౨

పీతం వస్త్రం బిభ్రతం రాజమానం
కోటీరాన్తప్రోతరత్నోపశోభమ్ ।
శాన్తాకారం శాశ్వతం శ్రీనివాసం
సేవ్యం దేవైర్వాసుదేవం దదర్శ ॥ ౧౩

తా॥ విమానమధ్యమున నీల జీమూతవలెనుండి శ్రీవత్సవక్షుడును పుండరీకాక్షుడును శంఖ చక్ర వరదాభయహస్తుండును పీతాంబరుడును కోటీరాన్తప్రోత్ర రత్నోపశోభుడును సంశ్రితత్రాణ హేతువునగు శ్రీనివాసుని దర్శించెను.

స రాజపుత్రో దృష్ట్వాఽథ దేవేశం భక్తవత్సలమ్
ప్రాదుర్భూతం ప్రణమ్యైనం తుష్టావ స్తుతిభిస్స్వయమ్ ॥ ౧౪

తా॥ రాజపుత్రుడు వల్మీకమందుండి యవతరించిన భగవంతునిజూచి నమస్కరించి స్తోత్రముచేయ నారంభించెను.

రాజపుత్రుడు స్తోత్రముచేయు ప్రకారము.

రాజపుత్రుడు చెప్పుచున్నాడు :—

బ్రహ్మా రుద్రో వసవో యే చ సాధ్యావిశ్వేదేవామరుతస్సప్తపూర్వే
ఏతే చాన్యే దేవముఖ్యా నియోగం పశ్యన్తస్తే విష్టపాన్వర్తయన్తే ॥

నాకారం వారూపమత్యద్భుతం తే పశ్యన్త్యేతేయోగిముఖ్యాఃపురాణాః
ఇత్థం భూతే మాదృశానుగ్రహార్థం ప్రత్యక్షం తే రూపమేతద్బభూవ ॥

హోతవ్యం త్వం పావకాస్తు హౌత్రం
హోతా చ త్వం పావకోపి త్వమేవ ।
ఉద్దేశ్యస్త్వం సిద్ధిరస్యత్వ మేవ త్వత్తః
కిఞ్చిన్నాన్య దత్రాస్తి దేవ ॥ ౧౬

సద్వైవైక స్త్వం పరం బ్రహ్మ పూర్వం
యస్మాన్నాన్యం ప్రాహురేతత్ప్రపఞ్చమ్
యత్సఙ్కల్పాత్ప్రాకృతస్సర్గ ఆదౌ
యచ్చాన్తస్థః శాస్తి సర్వాత్మనేమమ్ ॥ ౧౭

న బ్రహ్మాసీత్పూర్వమీశో న చాసీ
న్నేమేవ్యాప్తే రోదసీ వాప్యభూతామ్ ।
ఏక స్త్వం వై జాగరూకస్తు శేషే
శేషే తల్పే చారుసృష్ట్వా తదాఽపః ॥ ౧౮

నో లోకస్త్వాం వేదవేత్త త్వమేవం
నాదిర్మధ్యం విద్యతే తేఽథవాఽన్తః ।
సత్యం రూపం తే శ్రుతిః కీర్తయన్తి
జ్ఞానాకారం యత్తదేతన్నమామి ॥ ౨౦

కాలోఽసిత్వం లోకసంహారహేతుః
సృష్టా చాదౌ రక్షకశ్చ త్వమేవ ।
సంహార్యస్త్వం సృజ్యవస్తు త్వమేవ
ప్రాయో రక్ష్యం త్వం హి కర్తా చ కర్మ ॥ ౨౧

తా॥ బ్రహ్మ రుద్రుడు అష్టవసువులు సాధ్యులు విశ్వేదేవులు మరుత్తులు వీరలేమి, యితర దేవతాగణములేమి నీ యాజ్ఞను యెదురుచూచుచు వారల అధికారములను నిర్వహించుచున్నారు, ఐనను అద్భుతమగు నీ దివ్యాత్మ స్వరూపమును వార లెరుగలేకయుండగా నావంటి యల్పునకు దయామయుడవై

నీవు ప్రత్యక్షమైతివి. నీవు హోతవ్యమగు పరమార్థమవు హౌత్రము హోత యుపావకుడు ఉద్దేశ్యము సిద్ధి అన్నియు నీవే. నీకంటే యితర పదార్థమెద్దియు వేరొండులేదు. నీవే ఏకరూపమగు పరబ్రహ్మవు నీకంటే ప్రపంచము వేరైనది కాదు. నీ సంకల్పమాత్రముచే సృష్టికాబడినది. సృష్టియైన పదార్థములలో నీవు అంతర్యామివై వాటిని శాసించెదవు, నీకంటె పూర్వకాలమునందు బ్రహ్మరుద్రుడు భూమ్యాకాశములు ఏవియులేవు. ఈ చెప్పిన అన్నిటిని సృజించి నీవు వాటి సంరక్షణమందు జాగరూకుడవై ఏకాంతిముగ శేషతల్పమందు శయనించెదవు. ఎవ్వరును నీ మహిమను యెరుగజాలరు నీవు ఆదిమధ్యాంత రహితుడవు. నీ స్వరూపము సత్యజ్ఞానానంద రూపమని వేదములు ఘోషించుచున్నవి. నీవే లోక సంహారకారణమగు కాలరూపివి. సృష్టికర్తవు. పాలనకర్తవుకూడనీవే. సంహార్యుడు సృజ్యవస్తువు-రక్ష్యవస్తువుకూడ నీవే. నీవే కర్తవు కర్మవుఅయి యున్నావు. ఇదియే నీయందలి మహత్త్వము

త్వం యజ్ఞో దీక్షితస్త్వం చ స్వాహాఽసౌ త్వం హుతాశః
త్వయా వ్యాప్తమిమం లోకమనువ్యాప్తారమా తవ ॥ ౨౨

సోఽహం త్వాం శరణం ప్రాప్తః పద్మాసఖవజం విభుమ్
శేషిణం సర్వజగతాం ప్రణతార్తిహరం శుభమ్ ॥ ౨౩

తా॥ నీవే యజ్ఞము దీక్షితుడు స్వాహాదేవి, స్వధాదేవి, అగ్నిస్వరూపమగుచున్నావు. ఓ రమాపతీ నీచే జగత్తంతయు వ్యాప్తమైనది. లక్ష్మీసహాయుడు, సర్వశేషియు ప్రణతార్తి హరుడును శుభదాయియునగు నిన్ను శరణము జెందుచున్నాను

భగవానుడు చక్రవర్తి ప్రార్థనను ఆదరించుట.

స్తుత్వేతి భూపః ప్రణతః పృథివ్యాం
తుష్టావ భూయః ప్రణనామ భూయః ।
అథాస్య భక్తిం స విలోక్య దేవో
నృపాత్మజం ప్రీతమనా జగాద ॥ ౨౪

గుహానుబద్ధైః ప్రతిశబ్దజాతై
ర్మహాంస్తిరస్కృత్య పయోధిఘోషమ్ ।

తా॥ ఇట్లు స్తుతించి పలుమారులు నమస్కరించిన చక్రవర్తియొక్క భక్తి కాష్ఠనుచూచి ప్రీతుడగు భగవానుడు సముద్రఘననిస్స్వన శబ్దముతో ఇట్లుచెప్పెను

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు :—

ప్రీతోఽస్మి రాజేన్ద్ర పరం తవాహం భక్త్యాఽనయా చాన్యసుదుర్లభం చ ॥
వరం వృణీష్వాద్య యదిచ్ఛసి త్వం దాస్యామి సర్వం తవ మావిషాదః

తా॥ ఓ రాజేంద్రా ! నీవు గొప్ప భక్తుడవు నీవు శంకింపకుము నీకు కావలసిన వరమునడుగుము నేనిచ్చెదను

రాజపుత్రుడు చెప్పుచున్నాడు —

యత్త్వద్రూపం దుర్లభం యోగివర్యైః
రమ్యం భూయాదీదృశం సర్వదృశ్యమ్ ॥ ౨౬

అత్రైవ త్వం సర్వదా వాసమీయాః
సర్వేషాం వై మానవానాం హితాయ ।

తా॥ ప్రభూ ! నీవు నాకు దర్శనమొసగిన యీ దివ్యరూపము ఇట్లే సకల చేతనులకు శాశ్వతముగా దర్శనమిచ్చుచుండునట్లు ఇచ్చట నీవు సాన్నిధ్యముజెంది యుండ గోరెదను ఇది నాకు కావలసిన వరము

ఓమిత్యుక్త్వాఽథాపరం ప్రాహ వాక్యం
మద్భక్తస్త్వం నాస్తి తుల్యస్త్వయాఽన్యః ॥ ౨౭

సన్తుష్టోఽహం మత్సఖిత్వం ప్రదాస్యే
వేత్థ త్వం మాం సుహృదం భక్తవశ్యమ్ ।

ఇత్యూచివాన్మాధవో రాజపుత్రం
భూయః ప్రాహాస్మై స్మేరవక్త్రారవిన్దః ॥ ౨౮

సేవాం రాజన్నన్వహం మే త్రిసన్ధ్యం
కర్తుం భూయశ్శాసనాన్మేఽర్హసిత్వమ్ ।

ఏతచ్ఛ్రుత్వా రాజపుత్రస్సధీమాన్
సేవాం నిత్యం నో జహౌ ప్రీతచిత్తః ॥ ౨౯

సేవాం కుర్వన్వేఙ్కటేశస్య రాజా
తస్మిన్వాసం పత్తనే స్మ ప్రయాతి ।

తా॥ అట్లే యగుగాక యని వరమిచ్చి భగవానుడు మరియు, ఇట్లనెను. ' ఓ రాజా ! నీతో తుల్యుడగువాడు నాకింకొకడులేడు. నీవు భక్తుడవు. నేను భక్తవశ్యుడను. నీవు నా చెలికానివిగ నుండగలవు. నీవు ప్రతిదినము త్రికాలము లందు నన్ను సేవించుట కవకాశము కలిగియుందువు. ' ఈ మాటలువినిన రాజు సంతుష్టుడై భగవత్సేవచేయుచు తన నగరమున పోవుచు వచ్చుచునుండెను.

సేవాకాలేషు తస్యాయం రాజ్ఞో వై భక్తవత్సలః ॥ ३०
ఆర్చాభావమతిక్రమ్య హితార్థానవ్యుపాదిశత్

తా॥ భక్తవత్సలుడగు భగవానుడు రాజు సేవించుటకు వచ్చినప్పుడు తన అర్చాసమాధిని వదలి మానుషభావముతో సల్లాపముచేసి హితార్థములనుపదేశించుచుండెను.

స కదాచిద్ధ్వజారోహమహోత్సవమతన్ద్రితః ॥ ३१
అకారయచ్చ ధర్మేణ కన్యాం యాతి దివాకరే
ధ్వజం నిర్మాయ విధివద్గరుడాధిష్ఠితం శుభమ్ ॥ ३२
ఆరోపయత్సమభ్యర్చ్య ధ్వజస్తమ్భమనుత్తమమ్

తా॥ చతుర్ముఖు డొకప్పుడు భగవానునకు కాలోత్సవమును సంకల్పించి ధ్వజదండమును నిర్మించి గరుడపటమును ప్రతిష్ఠించి కన్యామాసమున ధ్వజారోహణముచేసెను.

బ్రహ్మాణమీశం సగణం శతక్రతుం
యే చైవాన్యే సన్తి దిక్పాలముఖ్యాః ॥ ३३
తానఞ్జసామన్త్రవరైర్ద్విజాశ్చ
సేవార్థం వై స్వైరమాహూతవన్తః ।

తా॥ ధ్వజారోహణముచేసి వైఖానసులు శాస్త్రరీతిని బ్రహ్మాదిదేవతలను ఉత్సవసేవార్థమై ఆహ్వానించిరి.

తతో హంసం సమారుహ్య ప్రాఞ్జలిః కమలాసనః ॥ ౩౪
ఆగతో మునిభిస్సార్ధం కాఙ్క్షన్సేవాం రమాపతేః
శఙ్కరోఽపి వృషారూఢస్సేవాయై గిరిజాన్వితః ॥ ౩౫
ప్రమథాద్యైః పారిషదైరన్వితః ప్రయయౌ ముదా
ఇన్ద్రోఽపి సాన్ద్రసిన్దూర ప్రస్ఫురత్కుమ్భమణ్డలమ్ ॥ ౩౬
ఆరుహ్యైరావతం నాగం ద్రష్టుం యాత్రోత్సవం యయౌ
అన్యే చాపి దిశాపాలాస్స్వం స్వం వాహనమాస్థితాః
శేషాచలతటీదేశమగమన్నాదృతోత్సవాః ॥ ౩౭

తా॥ అప్పుడు హంసవాహనారూఢుడై ముని సంఘములతో చతుర్ముఖుడును వృషభవాహనారూఢుడై ఉమాదేవితోను ప్రమథగణములతో శంకరుడును ఐరావతారూఢుడై దేవేంద్రుడును ఇట్లే ఇతర దిక్పాలురును తమతమ పత్నులు పరివారములు వాహనములపై బయలుదేరి భగవాను మహోత్సవమును సేవించుటకై వచ్చియుండిరి.

నారదోపి హరినామసహస్రం
కలయన్విమృశన్ మహతీం చ ముహుః ।
ఆయయౌ హృది చ భాస్వరభూతం
కలయన్వివృణన్నిగమాదిమపి ॥ ౩౮

అథాయయుర్ద్రష్టుకామా మహోత్సవం
క్షోణీపాలాః ప్రాణినస్సర్వ ఏవ ।
పుత్రం నేత్రం ప్రార్థయానాశ్చ భూయో
నానాదిగ్భ్యో నమ్రశీర్షాస్తదానీమ్ ॥ ౩౯

తా॥ నారదుడును భగవత్సహస్ర నామమును పాటతో మేలవించి ఓంకారమును రసవత్తరముగ గానముచేయుచు వచ్చెను. సకల ప్రదేశములనుండి మహారాజులాదిగ ప్రాకృత ప్రజల పర్యంతము ఆబాలగోపాలము వివిధములగు ప్రార్థనలను ప్రార్థించుచు మహోత్సవమును సేవింపవచ్చిరి.

తస్య చోత్సవయాత్రాయాం శేషాచలపతేస్తదా
వేఙ్కటేశం ప్రార్థయన్తో నానాదిగ్భ్యస్సమాగతాః
కిఙ్కరాశ్చైవ గాయన్తి కీర్తిం తస్య మహాత్మనః ॥ ౪౧

ఇత్థం ప్రవవృధే తస్య దివ్యశ్శౌరేర్మహోత్సవః
అదృష్టపూర్వస్సర్వేషాం విస్మయం వ్యతనోద్భృశమ్ ॥ ౪౨

తా॥ ఈ యుత్సవ సేవకై వచ్చిన సేవార్థులందరును భగవానుని మాహాత్మ్యము కీర్తించుచుండిరి. ఇదివరలో ఎన్నడును యెక్కడను చూడనట్టి యీ మహోత్సవము ప్రవర్ధమానమగుచు అందరను ఆశ్చర్యచకితులజేసెను.

పఙ్గవో జవనా ఆసన్కాణా వై దూరదర్శనాః
బభూవుర్వాగ్మినో మూకా జనాస్తస్మిన్మహోత్సవే ॥ ౪౩

తదా ప్రభృతి యస్మిన్వై వర్షేవర్షే మహోత్సవే
నమస్యతి హరిం ఽత్ర సమృద్ధిం యాస్యతి ధ్రువమ్ ॥ ౪౪

తా॥ ఈ యుత్సవమును సేవించినవారలలో కుంటివారలు పరుగెత్త గలిగిరి. గ్రుడ్డివారలు దూరదృష్టిగలవారలైరి. మూగవారు వాచాలురైరి. అప్పటినుండి ప్రతి సంవత్సరము ఉత్సవమును సేవించెడివారలు సర్వసమృద్ధితో తులదూగుచుండిరి.

తస్య చోత్సవ యాత్రాయాం శేషాచలపతేస్తదా
పయోదా విరజీచక్రుః ప్రతోళీర్వాసవాజ్ఞయా ॥ ౪౫

తా॥ ఈ యుత్సవదినములలో ఇంద్రుని యాజ్ఞచే మేఘములు శ్రీవారు వేంచేయు రాజమార్గములును తమ శుద్ధ జలములచే శోధించుచుండెను.

సౌవర్ణం కల్పయామాస రథం రత్నపరిష్కృతమ్
తస్మిన్రథవరే రమ్యే దీవ్యతి స్మాష్టమేదినే ॥ ౪౬

తా॥ చతుర్ముఖుడు ఉత్సవాష్ట దివసమున భగవానుని వీధి భ్రమణమునకు బంగారు రథమును చేయించెను. అష్టమ దినమున భగవానుడు రథమున వేంచేయును.

అథాష్టసు వ్యతీతేషు దివసేషు మహోత్సవే
శ్రవణే విష్ణునక్షత్రే ముహూర్తే తు శుభే తదా ॥ ౪౩

చక్రంభగవతాఽజ్ఞప్తంస్వామిపుష్కరిణీజలే
చకారావభృథస్నానం మఖేఽస్మింశ్చ సమాపితే ॥ ౪౮

అథాస్యాం విధివద్రాత్రౌ ధ్వజస్యాప్యవరోహణమ్
చక్రుర్విప్రవరాస్తత్ర మహానైవేద్యమేవ చ ॥ ౪౯

తా॥ రథయాత్ర మరుదినమున శ్రవణనక్షత్ర శుభముహూర్తమున శ్రీ స్వామి పుష్కరిణీ పుణ్యతీర్థములందు ఉత్సవాంత రూపమగు అవభృథమున చక్రస్నానమును జరిపి ఆరాత్రి ధ్వజారోహణము విశేషనైవేద్యములను అర్చకులు జరుపుదురు.

అథాన్యస్మిన్దినే దేవమానర్చ విధివత్తదా
ప్రసూనైర్వివిధైశ్చాపి సుగన్ధైస్సుమనోహరైః ॥ ౫౦

హరిర్విసర్జయామాస దేవాన్ త్సేవార్థమాగతాన్
బ్రహ్మరుద్రపురోగాంశ్చ ప్రణమ్రశిరసస్తదా ॥ ౫౧

తా॥ మరుసటి దినము చతుర్ముఖుడు ఉత్సవాంగముగ శ్రీశాస్త్రోక్తవిధి ననుసరించి పుష్పయాగమును చేసెను. తరువాత ఉత్సవ సేవార్థమైవచ్చి ఉత్సవాంతమున స్వస్థానములకు పోవుటకు యెదురుచూచుచున్న బ్రహ్మరుద్రాదులను భగవానుడు అనుమతించి పంపెను

ఇత్థం స రాజా వృషశైలభర్తు
ర్మహోత్సవం దివ్యమిమం సమాప్య ।
హృష్టః కృతార్థం బహుమన్యమానో
హ్యాత్మానమావాసమియాయ భూయః ॥ ౫౨

**ఇతి బ్రహ్మాణ్డపురాణే తీర్థఖణ్డే భృగునారదసంవాదే శ్రీవేఙ్కటాచల మాహాత్మ్యే శ్రీశ్రీనివాసావిర్భావాది కథనం నామ నవమోఽధ్యాయః**

తా॥ ఇట్లు శ్రీ శేషాచలాధీశుని మహోత్సవమును పూర్తిచేయుటచే కృతార్థుడనైతినని సంతోషముతో బ్రహ్మ తనలోకమున కేగెను.

ఇది శ్రీబ్రహ్మాండ పురాణము తీర్థఖణ్డము భృగునారద సంవాదమున శ్రీవేంకటాచల మాహాత్మ్యములో శ్రీ శ్రీనివాసావిర్భావ కథనము తొమ్మిదవ అధ్యాయము.



## పదవ అధ్యాయము.



### కృష్ణశర్మ వృత్తాంతము, అస్థిసరోవరమహిమ

నారదుడు చెప్పుచున్నాడు :

ఉత్సవాన్తే ద్విజః కశ్చిదాజగామ తదన్తికమ్
భార్యయా సహితశ్చైవ తదైవాచిరసూతయా ॥ ౧

ద్విజం తమాగతం రాజా పాద్యార్ఘ్యాసనవన్దనైః
అభిపూజ్య యథాన్యాయం దృష్ట్వా కుశలమబ్రవీత్ ॥ ౨

తా॥ మహోత్సవము జరిగిన కొలది దినములకు పచ్చిబాలింతయగు భార్యతోకూడ ఒక బ్రాహ్మణుడు చక్రవర్తియొద్దకు రాగా రాజు అతనిని స్వాగతాదులచే పూజించి కుశల ప్రశ్నమడిగెను.

రాజు అడుగుచున్నాడు —

కస్తే దేశో ద్విజశ్రేష్ఠ కిమర్థమిత ఆగతః
వదస్వ కిమహం వా తే కరవాణి నిదేశకృత్ ॥ ౩

తా॥ ఓ ద్విజోత్తమా ! తమ నివాసమెద్ది? ఇక్కడకువచ్చిన కార్యమేమి ? సెలవిచ్చినచో మీ యాజ్ఞను నెరవేర్చెదను.

విప్రుడు చెప్పుచున్నాడు —

దక్షిణామ్బునిధేస్తీరే శ్రుతా చన్ద్రపురీ శుభా
తస్యాం వసతి ధర్మజ్ఞః కూర్మో నామ ద్విజోత్తమః ॥ ౪

తస్యాహం వై సుతో రాజన్ కృష్ణశర్మేతి విశ్రుతః
భార్యా సుధర్మిణీ నామ్నా మమేయం పుత్రిణీ శుభా ॥ ౫
కాశీక్షేత్రమహం ద్రష్టుం ప్రయాస్యే ముక్తిసాధనమ్
అస్యాశ్శిశుస్త్రిమాసోఽయం దుర్బలా చైవ భామినీ ॥ ౬
ప్రవాసాయోగ్యతామస్యాదుర్బలాయాశ్చ మన్త్రియన్
త్వత్సకాశమహం రాజన్ సమ్ప్రాప్తస్త్వం హి రక్షితా ॥ ౭
విలోక్య కాశీమాయాస్యే సేయం తావన్మనస్వినీ
సమీపే తవ రాజేన్ద్ర వాసం యాత్వితి మే మతిః ॥ ౮

తా॥ రాజోత్తమా! మాది దక్షిణదేశము. మాఊరు చంద్రపురియందురు. ఆ యగ్రహారమున కూర్మడను నొక ద్విజవర్యుని కుమారుడను. నాపేరు కృష్ణ శర్మయందురు. ఈ యమ నాభార్య. నేను కాశీయాత్రకై పోవుచున్నాను. ఈమె మూడు మాసములకు పూర్వమే ప్రసవమై పసిబిడ్డనుపెట్టుకొనిన బాలింత యై బలహీనముగనున్నది. దూరదేశమగు కాశికి నాతో యీయమ వచ్చుట అసాధ్యమనుకొని యీమెను ప్రభువగు తమ రక్షణములోనుంచి నేను కాశికిపోయి మరలివచ్చునప్పుడు మార్గములో పిలుచుకొని ఊరుకుపోవచ్చుననితలచితిని.

ఓ మిత్యుక్తోధ భూపేన త్యక్త్వా భార్యాం సుతాన్వితామ్
ఆమన్త్ర్య చ మహీపాలం యయౌ కాశీం ప్రతిద్విజః ॥ ౯
రాజా చ తస్యా వాసార్థం గృహమేకం ప్రకల్ప్య సః
ధాన్యం షణ్మాసపర్యాప్తం దాపయామాస చ స్వయమ్ ॥ ౧౦
న నిర్గచ్ఛ గృహాచ్చేతి శశాస స ద్విజభామినీమ్
స్వవ్యాపారే స్థితో రాజా నైవ సస్మార తాం తతః ॥ ౧౧

తా॥ 'అట్లే కానిండు' అని రాజు అంగీకరించగా భార్యను రాజపర్య వేక్షణమున భద్రపరచి కృష్ణశర్మ రాజానుమతిపై కాశికిపోయెను. రాజును ఆమె నివసించుటకొరక ప్రత్యేక బసను కల్పించి ఆరుమాసములు మనోవర్తికి తగిన ఆహారసామగ్రినికూడ అందుంచి ఆమెను ఆచోటువిడచి బైటకుపోరాదని

చెప్పి తగు రక్షణమును కల్పించెను. తరువాత తన ఇతరకార్య సందడిలో నుండి ఆరుమాసములు గడచినను రాజు ద్విజభార్య విషయము గమనించలేదు.

కృష్ణశర్మా తతో విప్రో గత్వా ప్రస్థానముత్తమమ్
పునరాగత్య భూపాలమిదంవచనమబ్రవీత్ ॥ ౧౨

తా॥ కృష్ణశర్మ కాశినుండి మరలివచ్చి రాజునుజూచి ఇట్లనెను కృష్ణశర్మ పృచ్ఛించుచున్నాడు —

ఆగతః కృష్ణశర్మాహం గఙ్గాం దృష్ట్వా సుశోభనామ్
న్యస్తా తవాన్తికే భార్యా దీయతాం విరహాతురా ॥ ౧౩

ఇత్యుక్తో భూపతిస్తేన చిన్తయామాస దుఃఖితః

'రాజా! నేను కృష్ణశర్మను. గంగాస్నానముచేసి వచ్చితిని. నా భార్య యెక్కడ' అని యడుగగా రాజు జ్ఞాపకముతెచ్చుకొని (ఆమెను మరచియుండుటచే ఆహారములేక చనిపోయియుండునని) దుఃఖించెను.

అహో మయా ప్రమత్తేన విషయాసక్తచేతసా ॥ ౧౪
న చిన్తితా మహాభాగా భామినీ తు ద్విజన్మనః
ధాన్యం షణ్మాసపర్యాప్తం దత్తమస్యై పురామయా ॥ ౧౫
స కాలస్తు వ్యతీతోఽద్య కిం కరోతు ద్విజన్మజా
గృహాన్నిర్గమనం చాస్యాః ప్రతిషిద్ధం మయా తదా ॥ ౧౬
ఇత్థం సఞ్చిన్త్య రాజాఽసౌ ప్రేషయామాస పూరుషమ్
ద్రష్టుం స్వనిర్మితే గేహే సపుత్రాం ద్విజభామినీమ్ ॥ ౧౭
సవిలోక్యాగతస్తూర్ణం రాజానం తం వ్యజిజ్ఞపత్
శిశునా సహభార్యాఽస్య కాలధర్మముపాగతా ॥ ౧౮
శరీరే చానయోశ్శుష్కే వర్తేతే చిరకాలతః

తా॥ 'అయ్యో! అన్యకార్యసక్తుడనై ద్విజభార్య విషయమును నేను చింతించలేదు. ఆమెకు బస కల్పించి అందు ఆరుమాసముల ఆహార సామగ్రి

నందు ఉంచితిని. ఆరుమాసములు గడచినది. ఆమె యేమితిని జీవించును? ఇల్లు వడచి బైటకుపోగూడదనికూడ నే నామెకు ఆజ్ఞాపించితిని' అని రాజు చింతించి ఆ యింటియందామె యేరీతి నున్నదో చూచిరమ్మని సేవకునిదంపెను. సేవకుడు చూచివచ్చి 'ద్విజభార్య శిశువు యిరువురును చనిపోయిరి. రక్తమాంస ములుపోయి కళేబరములు శుష్కించినవి,' అని చెప్పగా రాజు దుఃఖించి బ్రాహ్మణుని పిలచి ఇట్లని చెప్పెను .

రాజు చెప్పుచున్నాడు —

ఇతి తస్య వచశ్శ్రుత్వా స రాజా భృశదుఃఖితః ॥ ౧౯
ద్విజ మాహూయ సమ్భ్రాన్తమిదం వచన మబ్రవీత్
తవ భార్యా ద్విజశ్రేష్ఠ మామనుజ్ఞాప్య భామినీ ॥ ౨౦
దేవదేవస్య సేవార్థమిదానీమేవ నిర్గతా
శ్వ ఆనేష్యామి భద్రం తే గతాం సేవార్థమఞ్జసా ౨౧
దినమేకం చ విశ్రమ్య తతో యాస్యసి భార్యయా

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా ! నా అనుమతి పొందినదై నీ భార్య శ్రీని వాసుని సేవించి వచ్చుటకై శేషాద్రికి వెళ్లియున్నది. రేపు పిలిపించెదను. తాము ఒక దినముండి వెళ్లవచ్చును.

ఇత్యుక్త్వాఽథ ద్విజశ్రేష్ఠం నృపశ్శఙ్కితమానసః ॥ ౨౨
గృహాన్నిర్గత్య శేషాద్రిమారురోహ క్షణాన్తరాత్
దేవస్యావసరం వీక్ష్య ప్రాఞ్జలిః ప్రయతస్థ్సితః ॥ ౨౩
స ముహూర్తం వినిశ్శ్వస్య సఖేదం చ వ్యజిజ్ఞపత్
స్వామిన్విజ్ఞాపనామద్య శృణుష్వైకమనా మమ ॥ ౨౪
సోఽహం హి భవతా రక్ష్యశ్శరణఙ్గత ఇత్యపి
అప్రబుద్ధేన మత్తేన మయా వై దుష్కృతం కృతమ్ ॥ ౨౫
న్యాసీకృతామ్మహాభాగాం ద్విజవర్యేణ ధీమతా
న వ్యచారయమాసక్తో విషయేషు యశస్వినీమ్ ॥ ౨౬

ఇదానీమాగతే విప్రే పూర్వవృత్తమనుస్మరన్
కిమేతదితి భీతోహం తదుదన్తం విచారయన్ ॥ ౨౭

శ్రుత్వా మృతాం నిరాహారాం సపుత్రాం శుష్కదేహినీమ్
పరం నిర్విణ్ణచిత్తోహమవదం ద్విజమగ్రతః ॥ ౨౮

గతాఽసౌ దేవసేవార్థం శ్వ ఆనేష్యామి తాం ప్రియామ్
సపుత్రాం తవ భార్యాం వై మాభైషీర్ద్విజసత్తమ ॥ ౨౯

భవిష్యతి కథం చేతి భృశం చిన్తాముపాగతః
త్వామేవ శరణం దేవ ప్రణతార్తిహరం గతః ॥ ౩౦

యథాపాపం న విన్దేయం చరితార్థో యథా ద్విజః
దేవ దేవ తథా కర్తుం శక్తో నాన్యస్త్వయా వినా ॥ ౩౧

త్రాహి మాం శరణం ప్రాప్తమితస్త్వం దుఃఖసాగరాత్
గతిస్త్వమేవ చాస్మాకం నాన్యోస్తి జగతీపతే ॥ ౩౨

ఇతి ప్రణమ్య దేవేశం స్థితస్తూష్ణీం నృపోత్తమః
సాన్త్వయన్మధురైర్వాక్యైరువాచ మధుసూదనః ॥ ౩౩

తా॥ ఇట్లని రాజు కృష్ణశర్మతోజెప్పి శేషాద్రికివెళ్లి అవసరమునుకనిపెట్టి భగవానుని దర్శించి కృతాంజలియై ముహూర్తకాలము నిశ్శ్వాసము విడచి దుఃఖముతో ఇట్లని విజ్ఞాపించెను. ప్రభో! నా విజ్ఞాపనమును అవధానముతో ఆలకింపుడు. నేను నీ శరణమును చేరితిని. నీవు కాపాడవలయును. అజాగ్రతతో తప్పుచేసితిని. ఒక బ్రాహ్మణుడు తన భార్యను నా రక్షణమందుంచిపోగా నే నామె యోగక్షేమములను విచారించుటకు మరచితిని. అతడు తిరిగివచ్చి తన భార్యను చూపుమని యడుగగా ఆమె నా అజాగ్రతవలన ఆహారము లేక మరణించినట్లు తెలియవచ్చినది. ఏమి చెప్పుటకును తోచక దుఃఖించి ఆ బ్రాహ్మణు నాశ్వాసించుచు అతని భార్య దేవసేవార్థమై కొండకు పోయినదనియు పిలిపించెద ననియు ఆతనికి చెప్పితిని. జరిగినదిది. అది యెట్లు సంభవమని చింతించిచూచి నీవే ఆకార్యమును నిర్వహించగలవని నీ శరణముజొచ్చి

నీ సన్నిధికివచ్చితిని. నాకు పాపమురాకూడదు ద్విజుడు భార్యాశిశువులు మరణించిన కొరతను పొందక తన శిశుదారలను వారలనే పొందవలయును. అట్లు చేయుటకు నీవు శక్తుడవు. నీ కంటె ఇతరులు కార్యమును చేయజాలరు. ఈ మహా దుఃఖమునుండి నన్నుద్ధరించెడి గతి నీవే. శరణాగతుని రక్షింపుము. అనిచెప్పి నోటమాటరాక యెదుట నిలచిన రాజును ఆశ్వాసపరచుచు భగవానుడిట్లనియె.

భగవానుడు చెప్పుచున్నాడు :—

మా తే వ్యథా భూద్రాజన్మా మాభైషీ స్త్వం కదాచన
తవోపాయమహం వక్ష్యే ద్విజభార్యాప్రజీవనే ॥ ౩౪

విప్రః కాశీం ప్రయాస్యన్మాం దృష్ట్వాఽనుజ్ఞాప్య వై గతః
సుధర్మిణీ చ మద్భక్తా సాధ్వీ మద్గతమానసా ॥ ౩౫

తత స్తదీయాః ప్రాణా వై యమాయ కిల నార్పితాః
శరీరే మమ రాజేన్ద్ర స్థాపితాస్తు ప్రియాసవః ॥ ౩౬

ఇత్యుక్త్వాఽశ్వాస్య భూపాలం విష్వక్సేనమభాషత
ప్రాఞ్జలిం వినయానమ్రం వేత్రపాణిం పురస్థితమ్ ॥ ౩౭

తా॥ 'ఓ రాజా ! భయపడకుము నేనొక ఉపాయమును చెప్పుచున్నాను. ఆ విప్రుడు కాశీయాత్రకు వెళ్లుటకుముందు నా దర్శనముచేసియే వెళ్లినాడు. అతని భార్యయు నా భక్తురాలు. కనుక వారిప్రాణములు యమలోకమునకు పోలేదు. నాయొద్దనే ఉన్నవి' అని భగవానుడు రాజుకు ధైర్యముచెప్పి విష్వక్సేనుని బిలచి ఇట్లని యాజ్ఞాపించెను.

విష్వక్సేన మహాభాగ మదీయాజ్ఞామిమాం శృణు
ఇత ఈశానదిగ్భాగే త్వస్థికూటాభిధం శుభమ్ ॥ ౩౮

తీర్థమస్తి తతస్తోయం సమాహృత్య సుపావనమ్
సుధర్మిణ్యాస్సుతస్యాపి శరీరమభిషేచయ ॥ ౩౯

సపుత్రాఽసౌప్రసుప్తేవ తత ఉత్థాస్యతి ధ్రువమ్
విష్వక్సేనస్తథేత్యుక్త్వా తోయమాహృత్య తీర్థతః ॥ ౪౦

32

సుధర్మిణ్యాశ్శరీరం తదభ్యషిఞ్చత్సుతస్య చ
ఉత్థితా ససుతా సాధ్వీ ద్విజభార్యా సుధర్మిణీ ॥ ४੧

తా॥ సేనానీ! వినుము. ఇచ్చటకు ఈశానదిక్కున అస్థికూట తీర్థ మున్నది. అందుండి తీర్థమునుతెచ్చి చనిపోయిన ద్విజభార్య సుధర్మిణి అస్థి పంజరముపైనను ఆమె శిశువు అస్థిపంజరముపైనను చల్లుము. వారలిరువురు చైతన్యముకల్గి జీవింతురు.

అథ రాజానమాహూయ ప్రోవాచ మధుసూదనః
దృష్టో గిరివరస్యాయం మహిమా భవతాఽనఘ ॥ ४౨
ప్రభావమచలస్యాస్య సనకాద్యాశ్చ యోగినః
బ్రహ్మాద్యాస్సకలా దేవా న జానన్తి యథా మమ ॥ ४౩
యద్యదిచ్ఛతి వైజన్తుర్మనసాఽభీప్సితం నృప
తథా సిద్ధ్యతి తత్సర్వం గిరేరస్య ప్రభావతః ॥ ४४

తా॥ భగవానుడు రాజును పిలచి ఓ రాజా! వేంకటాద్రిమహత్త్వమును చూచితివి గదా! ఈ పర్వతప్రభావము బ్రహ్మాదులకు సైతము అగోచరము. యేనరుడు యేకోరికెను మనసునతలచునో ఆకోరికెను ఈ పర్వతము తీర్చగలదు. అని చెప్పెను.

అథ విప్రం సమాహూయ భార్యాం చాస్య సుధర్మిణీమ్
ద్విజభార్యామథాపృచ్ఛద్వద తే కిమభీప్సితమ్ ॥ ४౫
సా తథోక్తా తు దేవేన వరయామాస మాధవమ్
త్వద్భక్తిస్తు దృఢా చాస్తు మమ దేవేశ నిత్యశః ॥ ४౬
ఏవం సంప్రార్థితో దేవో దదౌ తస్యా అభీప్సితమ్
తతో విధిశివాద్యాశ్చ సనకాద్యాశ్చ యోగినః ॥ ४౭
వృషాద్రిమగమన్ సర్వే ద్రష్టుకామాస్తదద్భుతమ్
కృష్ణశర్మా చ సన్తుష్టో విస్మితశ్చ మహామునే ॥ ४౮
ప్రణమ్య స్తోత్రయామాస దేవదేవం రమాపతిమ్

తా॥ తరువాత బ్రాహ్మణుని బ్రాహ్మణభార్యను పిలచి 'మీకేమి కావలయును' అని భగవానుడు పృచ్ఛింపగా ద్విజభార్య తనకు భగవానునియందు దృఢభక్తి కలుగునట్లు వరమడిగెను. భగవానుడట్లే యగుగాక యని అనుగ్రహించెను. ఈ మృతసంజీవనాద్భుతమును సందర్శించుటకై బ్రహ్మాది దేవతాగణము సనకాదిసిద్ధులు వేంకటాద్రికి వెళ్లిరి కృష్ణశర్మయు ఆనందముతో యీ యద్భుతమునుచూచి విస్మితుడై భగవానుని స్తుతించెను.

దేవదేవో నృపం ప్రాహ న చాస్య సదృశో భువి ॥ ౪౯

విప్రస్య మయి భక్తస్య తథైవ నియతాత్మనః

అసౌ జన్మాంతరే రాజంస్త్రయ్యన్తార్థప్రవర్తకః ॥ ౫౦

భవిష్యతి తదన్తే చ మత్సాయుజ్యమవాప్స్యతి

తా॥ భగవానుడు రాజును పిలచి 'ఓ రాజా! ఈ బ్రాహ్మణుడు చాల గొప్పవాడు. ఈతడు నాకంతరంగభక్తుడు. ఇతను ఉత్తరజన్మములో వేదాంతార్థములను ప్రపంచమున ప్రచారముచేయుటకై అవతరించగలడు. ఆ వెనుక నా సాయుజ్యమును చేరగలడు అనిచెప్పెను.

రాజా చ విప్రమాహూయ సభార్యం పురుషర్షభమ్

స్వావాసం ప్రేషయామాస ప్రహృష్టేనాన్తరాత్మనా ॥ ౫౧

తా॥ రాజు ద్విజుని ద్విజభార్యను గౌరవించి సంతోషముతో స్వగ్రామమునకు పంపెను.

తదనుచ నృపతిర్వృషాచలం తం స్వయమధిగమ్యదినేదినేమహాత్మా

విరచితదృఢభక్తిరస్య కుర్వన్వివిధమనోరథకిఙ్కరత్వమాసీత్ ॥ ౫౨

తా॥ అప్పటినుంచి రాజు ఎక్కువ భక్తిశ్రద్ధలతో ప్రతిదినము శ్రీవేంకటాద్రికివెళ్లి వివిధకైంకర్యములను చేయుచువచ్చెను.

కథితం భావివృత్తాన్తం దేవదేవస్య శార్ఙ్గిణః

అర్చితశ్చ కలౌ భక్తైరద్భుతాని ప్రదర్శయన్ ॥ ౫౩

విహరన్రమయా చైవ సాకం తత్ర మహీధరే

వసిష్యతి చ హృష్టాత్మా సురసిద్ధనిషేవితః ॥ ౫౪

ఇత్యేవం భృగవే తస్మై కథయామాస నారదః
వేఙ్కటాచలమాహాత్మ్యం పరం వ్యాసేన కీర్తితమ్ ॥ ౫౫

ఇతి శ్రీ బ్రహ్మాణ్డపురాణే భృగునారదసంవాదే శ్రీవేఙ్కటాచల మాహాత్మ్యే అస్థికూటతీర్థమాహాత్మ్య కథనం నామ దశమోఽధ్యాయః

తా॥ భగవానుడు అవతరించి భక్తులచే ప్రార్థింపబడి తన మహిషితో కూడి అద్భుతములను ప్రదర్శించుచు ఎట్లు శేషాద్రియందు సాన్నిధ్యముజెంది శాశ్వతముగ లోకములనుద్ధరించగలడను పై విస్తరమును నారదుడు భృగు మహర్షి కుపదేశించిన శ్రీ వేంకటాచలమహత్త్వము భగవద్వ్యాస గురునిచే నాకు పై విధముగ చెప్పబడినది.

ఇది శ్రీ బ్రహ్మాండపురాణమున అస్థికూటతీర్థ మహాత్మ్యము పదవ అధ్యాయము.



# పదునొకండవ అధ్యాయము



సింహోదుడను అసురుని కథ.

భృగువు ప్రశ్నించుచున్నాడు :—

నమో నమస్తే దేవర్షే సర్వజ్ఞ కరుణానిధే
వేఙ్కటాచలమాహాత్మ్యం భూతం భావి చ మే శ్రుతమ్ ॥ ౧

కేనాకారేణ భగవానాకల్పం నివసిష్యతి
కిం కరిష్యతి వా దేవశ్శ్రీమాన్వేఙ్కటనాయకః ॥ ౨

ఏతత్సర్వం సఙ్గ్రహేణ బ్రూహి మే మునిసత్తమ
యస్య శ్రవణమాత్రేణ శ్రోతవ్యం నావశిష్యతే ॥ ౩

తా॥ మునివర్యా ! నమస్కారము. నీవు కరుణామయుడవగుటచే నేనడిగిన వివరములన్నిటిని విసుగులేక చెప్పుచున్నావు. శ్రీవేంకటాచలమాహాత్మ్య కథనమున దివ్యక్షేత్రముయొక్క భూతభవిష్యస్వరూపము నీ వలనవింటిని. భగవానుడు ఏయాకారము నవధరించి కల్పాన్తమువరకు ఈ క్షేత్రమున సన్నిహితుడై యుండును ? ఏమిచేయును అనువివరమును దయచేసిచెప్పగోరెదను.

నారదుడు చెప్పుచున్నాడు :—

శ్రూయతామిదమాఖ్యాస్యే చరితం వేఙ్కటేశితుః
సమ్భాషితమగస్త్యేన భావివృత్తే ప్రసజ్గతః ॥ ४

చక్రవర్తీ చ భూపాలశ్శాసిష్యతి వసున్ధరామ్
భవిష్యతి తదా దైత్యస్సింహాదో నామ వీర్యవాన్ ॥ ౫

స దురాత్మా తప స్తేపే నిధ్యాయన్పరమేష్ఠినమ్
ఉత్తరే పాపనాశస్య సార్ధయోజనదూరతః ॥ ౬

సరస్యఘవినాశాఖ్యే కుర్వంస్త్రిషవణాప్లవమ్
ప్రజాపతే త్వదన్యో న విశ్వోపరి బభూవ హ ॥ ౭

వయం శ్రేయస్వినస్స్యామ సోస్తుయోనో మనోరథః
ఇతి మన్త్రం జపన్నిత్యమారరాధ చతుర్ముఖమ్ ॥ ౮

వర్షే పూర్ణే స భగవాన్ హంసారూఢస్సరోజభూః
ఆవిర్బభూవ పురతస్సింహాదస్య తపస్వినః ॥ ౯

తా॥ మహర్షీ ! వినుము. ఒకప్పుడు మా ప్రస్తావములో అగస్త్యుడిట్లు చెప్పెను. ముందు కాలములో చక్రవర్తియను నొక ప్రభువు భూమండలమును పాలించగలడు. ఆకాలమున సింహాదుడను నొక యసురుడు బలదర్పితుడై దుష్టచిత్తముకలిగి బ్రహ్మనుగూర్చి తపస్సుచేయును. ఆతడు తపస్సుచేసెడిచోటు పాపనాశతీర్థమునకు ఉత్తరదిక్కున ఒకటిన్నర యోజనముల దూరమందున్నది. ఆతడు పాపనాశతీర్థమందు మూడువేళలందు స్నానము చేయుచు 'ఓ చతురాననా ! నీవు సాటిలేనివాడవు మాకు శ్రేయస్సును అనుగ్రహించుము' అను నర్థమునిచ్చు మంత్రమును జపించుచు చతుర్ముఖుని నారాధించుచుండెను. ఒక సంవత్సరకాలము తపస్సు పూర్తికాగా హంసారూఢుడై చతురాస్యుడు ఆతనియెదుట సాక్షాత్కరించును.

బ్రహ్మచెప్పుచున్నాడు —

ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రం తే సింహాద కుశలీభవ
తపసా తవ తుష్టోస్మి వరం వరయ సువ్రత ॥ ౧౦

తా॥ ఓ సింహాదా! లెమ్ములెమ్ము నీతపస్సుకు మెచ్చితిని వరమడుగుము.

సింహాదుడు అడుగుచున్నాడు —

నమో నమ_స్తే విశ్వేశ సర్వకారణకారణ
యది ప్రీతోసి భగవన్దేహి మే వర ము_త్తమమ్ ॥ ౧౧

దేవదానవగన్ధర్వయక్షరాక్షసపన్నగాః
వశే తు మమవ_ర్తన్తాం తేభ్యో న చ భయం మమ ॥ ౧౨

తా॥ వరదా! నమస్కారము. నా తపస్సు సిద్ధించినచో నాకీవరము నిమ్ము. దేవదానవ గంధర్వయక్షరాక్షసపన్నగులు నావశముననుండవలయును, వారల వలన నాకు భయము ఉండరాదు.

సింహాదవచనం శ్రుత్వా తథా_స్త్వితివిరిఞ్చనః
ఆభాష్యా_న్తర్దధే సాకం యోగీ_శ్రై రస్య పశ్యతః ॥ ౧౩

తా॥ అట్లే యగుగాక యని సింహాదునకు వరమిచ్చి కమలాసనుడు పరివారముతో అంతర్హితుడాయెను

తదా ప్రభృతి దుష్టాత్మా బబాధే దేవతాగణాన్
క్షత్రియై స్సహదేవాంశ్చై ర్మునీనన్యాం శ్చ మానవాన్ ॥ ౧౪

ఏవ_న్తేనార్దితా దేవా మునయశ్చ తపోధనాః
శరణ్యం శరణం జగ్ము ర్వేఙ్కటేశం యథా నిధిమ్ ॥ ౧౫

తా॥ అప్పటినుండి ఆదుర్మార్గుడు వరదాన దర్పముచే స్వతంత్రుడై దేవతలను క్షత్రియులను మునులను ఒకరేమి అందరుప్రజలను బాధింపమొదలిడెను. ఇట్లా తనిచే బాధింపబడిన అందరును సర్వరక్షకుడగు శ్రీవేంకటాచలపతిని శరణముపొంది ఇట్లని ప్రార్థించిరి.

దేవతల ప్రార్థనప్రకారము —

దై_త్యారే దేవదేవేశ శరణాగతవత్సల
త్రాహి నః పుణ్డరీకాక్ష సింహాదాదసురాధమాత్ ॥ ౧౬

త్రిలోకీం బాధతే నిత్యమనుభుఙ్క్తే చ రూపిణీః
సింహాదః క్రూరచారిత్రః పాపః ప్రాప్తవరో విధేః ॥ ౧౭

తా॥ ఓ దేవదేవా! సింహాదుని భయమునుండి మమ్ములను రక్షింపుము. ఈతడు ముల్లోకములను హింసించుచున్నాడు. స్త్రీలనుచెరచుచున్నాడు. ఈతడు దుష్ప్రాపములగు వరములబడసి నిర్భయముగా సంచరించుచున్నాడు

ఇతి తేషాం వచశ్శ్రుత్వా భగవాన్భూతభావనః
మేఘధ్వనిగభీరేణ వచసాఽన్వగ్రహీత్సురాన్ ॥ ౧౮

తా॥ ఇట్లు దేవతల దీనవాక్యములను విని భూతభావనుడగు భగవానుడు మేఘగంభీరస్వరముతో అనుగ్రహించి ఇట్లనెను

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు —

అభయం బ్రహ్మణా దత్తం దేవేభ్యస్సురసత్తమాః
న దానవాశ్చైతం ఘ్నన్తి నాసురా న చ పన్నగాః ॥ ౧౯

నైవశక్తిర్మనుష్యాణాం సంహారేఽస్య దురాత్మనః
సహాయాస్తస్య బహవస్సన్తి దైత్యాంశసమ్భవాః ॥ ౨౦

ఖరః కడారః పిఙ్గాక్షః కనకః కద్రుకః కపిః
ఏతే హి రణ్డాకులజాష్షడ్బాణస్యాత్ర సన్తి హి ॥ ౨౧

ప్రహ్లాదాయ వరో దత్తః పురా ప్రీతిజుషా మయా
తద్వంశ్యా నైవ హన్తవ్యాస్సత్యపి త్రిజగత్షయే ॥ ౨౨

తత్రోపాయం ప్రవక్ష్యామి సింహాదక్షపణాయ వః
చక్రవర్తీ వసత్యత్ర కాళహస్తిసమీపతః ॥ ౨౩

సువర్ణముఖరీతీరే పశ్చిమే పుణ్యధామని
సమాప్యాయయతస్త్వాంశైర్మద్భక్తం చక్రవర్తినమ్ ॥ ౨౪

సింహాదం సుమహాబాహుం మహాబలపరాక్రమమ్
స సంహరిష్యతి బలీ రాక్షసానివ రాఘవః ॥ ౨౫

స్వస్థా భవత దేవేశాస్సర్వం భద్రం భవిష్యతి

తా॥ ఓ దేవతలారా! సింహాదునకు బ్రహ్మవరమిచ్చియున్నాడు. అతనిని దానవులు అసురులు పన్నగులు మనుష్యులు వధించలేరు. అతడు దుష్టుడు. అతనికి దైత్యాంశసంభవులగు ఖరుడు కడారుడు పింగాక్షుడు కనకుడు కద్రుకుడు కపి అను ఆర్గురు సంకరజాతివారలు సహాయముకలరు. ప్రహ్లాదునకు పూర్వము నేనొక వరమిచ్చియుంటిని ఆవరము ననుసరించి ఆతని వంశీకులు యెంత ఘోరపాపము (త్రిలోకములను దహించుట) చేసినను వారలను నేను చంప కూడదు. కావున సాక్షాత్తుగ నేను సంహరించుటకు వీలులేదు, ఐతే వాడు వధ్యుడు కావున వాని సంహారమునకై నేనొక ఉపాయమును మీకు చెప్పెదను సువర్ణముఖరీనదియొడ్డున శ్రీకాళహస్తి క్షేత్రసమీపమున చక్రవర్తియను నొక రాజు నా భక్తుడు కలడు. ఆతని చెంతకుపొండు. ఆతడు సింహాదుని సంహరింప గలడు. మీరు దేశములు సుఖింతురు.

ఇత్యుక్త్వా భగవాన్విష్ణుస్సర్వభూతాత్మభావనః ॥ ౨౬
విసర్జయామాస సురాన్ విమానం చావిశత్ప్రభుః
తతో దేవాస్సగన్ధర్వాస్సిద్ధాశ్చ పరమర్షయః ॥ ౨౭
అనుగ్రహీతుకామాస్తమాజగ్ముశ్చక్రవర్తినమ్
బ్రాహ్మణాకారమాలమ్బ్య దేవగన్ధర్వతాపసాః ॥ ౨౮
శుభాశిషం ప్రయుఞ్జానా రాజానముపతస్థిరే
అగతాంస్తాన్ మహాభాగః పూజయిత్వా యథావిధి ॥ ౨౯
పప్రచ్ఛ కుశలం సర్వానభివాదనపూర్వకమ్
పూజితాస్తేన భూపేన దేవా బ్రాహ్మణవిగ్రహాః ॥ ౩౦
అబ్రువన్నేకకణ్ఠాస్తే రాజానం ప్రశ్రయానతమ్

తా॥ ఇట్లని దేవతలకుచెప్పి భగవానుడు తన విమానమును ప్రవేశించెను. అంతట దేవతలు సిద్ధులు మహర్షులు గంధర్వులు భగవానుడాదేశించిన రీతిని చక్రవర్తిని చూచుటకై సంకల్పించి బ్రాహ్మణ వేషమును ధరించి ఆయనవద్దకు వచ్చి ఆశీర్వచనాదులుచేసి నిలచిరి. రాజును వారలజూచి ఆదరించి కుశలప్రశ్నల నడిగిన వెనుక అవకాశమునుచూచి బ్రాహ్మణులు రాజుతో ఇట్లు చెప్పసాగిరి.

బ్రాహ్మణులు చెప్పుచున్నారు —

రాజన్కుశలమస్మాకం త్వయి శాసతి మేదినీమ్ ॥ ౩౧
న హి సూర్యే ప్రతపతి లోకే సమ్భావ్యతే తమః
సింహాదో నామ దైత్యేన్ద్రో బాధతే బ్రాహ్మణానిహ ॥ ౩౨
న యజ్ఞాస్సమ్ప్రవర్తన్తే న హోమా న చ సత్క్రియాః
ఉత్తరే పాపనాశస్య నార్ధయోజనదూరతః ॥ ౩౩
స వసత్యసదాచారః ఖలో బ్రాహ్మణహింసకః
తం సంహర దురాత్మానం సర్వలోకైకకణ్టకమ్ ॥ ౩౪
కృతస్తేఽనుగ్రహోఽస్మాభిస్సర్వదేవాత్మభిర్నృప

తా॥ రాజేంద్రా! మాకందరకు కుశలమే నీవు రాజ్యపరిపాలనముచేయుచుండగా ప్రజలకు కుశలములేకుండుటయుండదు కాని సింహాదుడను దైత్యేంద్రుడొక్కడు బ్రాహ్మణులను హింసించుచున్నాడు యజ్ఞములు హోమములు సత్కర్మలు జరుగుటలేమి అతడు చెరచుచున్నాడు అతడు శేషశైలమున పాపనాశతీర్థమునకు ఉత్తరభాగమున నివసించుచున్నాడు. అతడు బ్రాహ్మణహింసకుడు ఖలుడు అసదాచారుడు. మాయందు దయయుంచి నీ వాతని వధింపవలయును

చక్రవర్తి చెప్పుచున్నాడు —

అనుగ్రహేణ యుష్మాకం సంహరామి న సంశయః ॥ ౩౫
సింహాదః కీదృశస్తస్య బ్రూత కిం వా బలం బుధాః

తా॥ బ్రాహ్మణోత్తములారా! మీయనుగ్రహమువలన నేనాతని వధింపగలను. వాడుయెట్టివాడు, వానికేమి బలము వివరముగ తెలవిండు

బ్రాహ్మణులు చెప్పుచున్నారు.—

విరిఞ్చినా దత్తవరస్సింహాదః క్రూరవిక్రమః ॥ ౩౬
అవధ్యస్సర్వదేవానాం దేవస్య చ రథాఙ్గిణః
త్వమేవ తస్య రాజేన్ద్ర సంహర్తా న చ సంశయః ॥ ౩౭
దేవాః కుర్వన్తు సర్వేఽపి సన్నిధానం త్వయి ప్రభో

తా॥ ఓరాజా! ఆతదు బ్రహ్మచే వరముపొంది వరలాభముచేగర్వించిన క్రూరుడు అతనినెవ్వరును వధించలేరు. భగవానుడగు చక్రపాణిగూడ ఆతనినేమియు చేయజాలడు. నీవు సంహరించగలవు. దేవతలందరు నీకు సహాయపడుదురు

ఇత్యుక్త్వా బ్రాహ్మణాస్సర్వే సంప్రయుజ్య జయాశిషః ॥ ౩౮

అన్తర్ధానం గతాస్తత్ర తదద్భుతమివాభవత్

అథ రాజా మహాతేజాశ్చక్రవర్తీ సధార్మికః ॥ ౩౯

మన్త్రిభిర్మన్త్రయామాస వధోపాయం దురాత్మనః

నిశ్చిత్య కృత్యవిత్కృత్యం మన్త్రిభిస్సహ మన్త్రవిత్ ॥ ౪౦

జగామ వేఙ్కటేశస్య సన్నిధిం సన్నిధిం యథా

స్వర్ణపద్మైస్స్వర్ణపుష్పైస్తులసీదళసంయుతైః ॥ ౪౧

అర్చయిత్వా యథాపూర్వం వేఙ్కటేశం నృపోఽవదత్

తా॥ ఇట్లనిబ్రాహ్మణులుచెప్పి రాజునాశీర్వదించి అంతర్హితులై పోగా ఆచిత్రమునుజూచి చక్రవర్తి ఆశ్చర్యపడి మంత్రులనురావించి సింహాదవధోపాయమును తర్కించి వధించుట ఆవశ్యకమని నిశ్చయించుకొని శ్రీవెంకటేశుని సన్నిధికివచ్చి స్వర్ణపద్మములు స్వర్ణపుష్పములు తుళసీదళములతోచేర్చి భగవానునర్చించి భగవానునిట్లుప్రార్థించెను.

బ్రాహ్మణప్రవరాస్స్వామిన్ సింహాదేన నిపీడితాః ॥ ౪౨

తత్సంహారనియోగం మే ప్రదదుః కిం కరోమ్యహమ్

తా॥ ఓదేవదేవా! సింహాదునిచే దేవతలు పీడింపబడుచున్నారు. వాని సంహరించుటకు నాకు ఉత్తరువునీయ వేడెదను.

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు —

శఙ్ఖచక్రే ప్రదాస్యామి భావిసాయుజ్యసూచకే ॥ ౪౩

తథా కౌమోదకీం శార్ఙ్గం నన్దకం చ మహామతే

పఞ్చాయుధధరో భూత్వా దురాత్మానం సురద్రుహమ్ ॥ ४४
సబన్ధువర్గం సామాత్యం జహి సఙ్గ్రామమణ్డలే

తా॥ ఓభక్తవరా! నీకుభావిసాయుజ్యసూచకముగ ఇప్పుడే యుద్ధోపయుక్తముగ నా శంఖచక్రములను నీకిచ్చుచున్నాను కౌమోదకి శార్ఙ్గమునందకము వీనినికూడ ఇచ్చెదను ఈ పంచాయుధములను ధరించి దురాత్ముడగు సింహోదుని సమూలముగ యుద్ధమున జయింపుము ఇది నా సహాయము

ఇత్యుక్త్వా ప్రదదౌ తస్మై శుచయే చక్రవర్తినే ॥ ४५
శఙ్ఖచక్రగదాశార్ఙ్గఖడ్గాని మధుసూధనః
తతస్స రాజతనయః పునశ్చ స్వపురం గతః ॥ ४६
సేనాం సంయోజయామాస దేవతేజస్సమేధితామ్
సర్వదైవతతేజోభిరుపబృంహితవిగ్రహాః ॥ ४७
కైరాతం వపురాస్థాయ ప్రతస్థే సహసైనికః
కిరాతవపుషస్సర్వే సహితా విశ్వకద్రుభిః ॥ ४८
సమేతం మృగయాసక్తం చక్రవర్తినమన్వయుః
ఘ్నన్తో వ్యాఘ్రాన్ వృకాన్ సింహాన్ తరక్షూన్ శల్యకాన్ కిటీన్॥
ప్రతీరం పాపనాశస్య ప్రాపూ రాజేన్ద్రసద్భటాః
చోళరాజకుమారస్య వాహినీ బలగర్వితా ॥ ५०
మన్దం మన్దం ప్రతీయాయ ఘోరసింహోదకాననమ్

తా॥ ఇట్లని భగవానుడు చక్రవర్తికిచెప్పి తన పంచాయుధముల నాతని కనుగ్రహించెను. రాజు దివ్యాయుధములనుపొంది స్వస్థానమునకువచ్చి సేనను తీసికొని కిరాతవేషముతో యుద్ధమునకుపెడలెను. సైనికులుగూడ రాజునను సరించి కిరాతవేషముతోడనేవచ్చి మార్గమున క్రూరమృగములను వేటాడుచు పాపనాశ తీర్థమునకుచేరికొనెను. చోళరాజసేన దైవతేజస్సమన్వితమై బలముతో సింహోదుడుండు స్థలమునకువచ్చెను.

వనదుర్గాద్వినిష్క్రమ్య సింహాదో దైత్యభూపతిః ॥ ౫౧
ఆవైక్షత కిరాతాంస్తాన్నిర్విషాదస్స్మితాననః
న దేవా న చ దైతేయా న గన్ధర్వా న దానవాః ॥ ౫౨
న చక్రవర్తిన స్సైన్యాః కిమర్థం నో భయాకులా
ఇతి నిశ్చిత్య కిరాత్మా నిర్గతస్సైనికైస్సహ ॥ ౫౩
సింహాదస్సింహమారుహ్య ప్రతీయాయ ప్రభోర్బలమ్
కోటీశతసహస్రేణ ఖరస్సైన్యేన నిర్యయౌ ॥ ౫౪
సర్వతస్సహితస్సైన్యైః కడారష్షష్టికోటిభిః
పిఙ్గాక్షస్సప్తకోటీభిః కనకో దశకోటిభిః ॥ ౫౫
కద్రుకో న్యర్బుదానీకః కపిః పద్మసరావృతః
అన్యే చ దైత్యపతయస్స్వైస్స్వైస్సైన్యసమావృతాః ॥ ౫౬
ఆగతాస్సర్వ ఏవైతే మిళిత్వాఽక్షౌహిణీశతమ్

తా॥ సింహాదుడు యెన్నడుయెరుగని కిరాతసైన్యాక్రమణమును తన యాశ్రమమందుచూచి నిశ్చయముగా శత్రువునెదుర్కొనగోరి బయలుదేరెను "దేవదానవదైతేయగంధర్వాదులు నన్నెదుర్కొనజాలరు. మనుష్యమాత్రుడగు నతనిసేనయు చక్రవర్తియు నన్నేమిచేయగలరు" అని నిశ్చయించుకొని ఆతడు సింహమునెక్కి వెడలెను. శతసహస్రకోటిపరిమితమగుసైన్యముతో ఖరుడును, కడారుడు షష్టికోటి సైన్యముతోను, పింగాక్షుడు సప్తకోటిసైన్యముతోను, కద్రుకుడు న్యర్బుదానీక సైన్యముతోను, కపి పద్మకోటిసైన్యముతోను ఇతరదైత్య సేనాధిపతులు తమతమ సంఖ్యాతీత సైన్యబలముతోను కూడి అంతరుకలసి నూరు అక్షౌహిణులబలము ఒకటిగా సింహాదునివెంటవచ్చెను.

త్రిదశాక్షౌహిణీనాథశ్చక్రవర్తీ మహాబలః ॥ ౫౭
సింహాదేనసమం యుద్ధం చకార భగవత్ప్రియః
సేవయోరుభయోశ్చాథ సింహాదహరిభక్తయోః ॥ ౫౮

సమరస్సుమహానాసీద్గఙ్గాయమునయోర్యథా
విమానరత్నాన్యారుహ్య ప్రవీరవరణోత్సుకమ్ ॥ ౨౩

ఆగతం దేవగాణిక్యం మధ్యే గగనమణ్డలమ్
ఆగతా దేవతాస్సర్వాః పరమేష్ఠిపురోగమాః ॥ ౨౪

ద్రష్టుకామా మహాయుద్ధం దైత్యరాజాధిరాజయోః
తతో యుద్ధం సమభవత్సింహాదనృపసేనయోః ॥ ౨౫

వరార్థే కలహం చక్రుర్దేవ్యశ్చాప్సరసో మిథః

తా॥ ముప్పదిఅక్షౌహిణుల సేనలోకూడిన చక్రవర్తియు సింహాదునితో యుద్ధముచేయ నారంభించెను. ఆ యుద్ధము భయంకరమై గంగాయమునా సమాగమమునుబోలియుండెను. సమతను విమానములనెక్కి తుల్యబలసంపన్నులగు మహావీరుల యుద్ధరాసిక్యమును చూచుటకు దేవతాగణములు గగనమధ్యమున గుమికూడెను. బ్రహ్మాదిదేవతలందరును యుద్ధదర్శనకాంక్షతో చేరిరి. యుద్ధము క్షణక్షణము ఘోరతరమై వృద్ధియై యొప్పెను. యుద్ధహంతులై తమకు కావలసినంతమంది అతిథులురాగలరని అప్సరసలు యెదురుచూచు చుండిరి.

సేనాసు క్షీయమాణాసు చక్రవర్తీ ధృతాగ్రహః ॥ ౨౬

శార్ఙ్గం ధనురుపాదాయ సన్దధే నిశితాన్ శరాన్
బాణేనైకేన తారాజేన్ద్రో జఘాన చ వింశతిమ్ ॥ ౨౭

శతం సహస్రమయుతం నియుతం ప్రయుతం తదా
తస్య విక్రమమాలోక్య సింహాదస్సింహవాహనః ॥ ౨౮

గదయా రాజరాజాశ్వం నిజఘానాతిరంహసా
నిహతే తురగే రాజా గజమైరావతోపమమ్ ॥ ౨౯

ఆరుహ్య మఘవేవాన్యో గదాం కౌమోదకీం దధౌ
సా విసృష్టా నృపేన్ద్రేణ హత్వా సింహాదవాహనమ్ ॥ ౩౦

మమర్దాక్షౌహిణీష్షష్టిం పునా రాజానమాశ్రితా
మాయా మాస్థాయ సింహాదః ప్రభూతాం చ క్షణాన్తరే ॥ ౩౧

పునరుజ్జీవయామాస సేనాం కౌమోదకీహతామ్
సైనికోజ్జీవనం దృష్ట్వా సింహాదస్య మహౌజసః ॥ ౬౨
విస్మితాస్సస్మితాశ్చాసన్దివి దేవాశ్చ తాపసాః

తా॥ యుద్ధములో తన సేనలు నశించితగ్గిపోవుటనుచూచి చక్రవర్తి కోపముతో ధనస్సునెత్తి బాణములనుసంధించి విడచి పదులు, నూర్లు, వేలు, అయుతము, నియుతము ప్రయుతము, ఇట్లు లెక్కలేనంత సేననుచంపెను అదిచూచి సింహనాదుడును గదయెత్తికొట్టి చక్రవర్తిఅశ్వమును వధించెను చక్రవర్తి పెద్దయేనుగునెక్కి తనగదను త్రిప్పి విడువగా సింహాదుని వాహనమును పడగొట్టి మిదుమిక్కిలిగ సింహాదుని ఆరు అక్షౌహిణుల సేనను సంహరించి రాజు చేతికివచ్చివేరెను సింహనాదుడు మాయనుకల్పించి ఉత్తరక్షణములో హతమైన తనసేనను తాను పునరుజ్జీవింపజేసెను సింహాదుడు తనశక్తిచే తన సైనికులనందరను బ్రతికించుటను ఆకాశమునుండి చూచినదేవతలు తాపసులు ఆశ్చర్యముతోను ఆత్రతతోను చూచుచుండిరి.

అర్ధచన్ద్రేణ బాణేన శార్ఙ్గమాదాయ వీర్యవాన్ ॥ ౬౩
శతవారం చ చిచ్ఛేద సింహాదస్య శిరో నృపః
కృత్తం కృత్తం పునః కృత్తం పునర్జాతం పునః పునః ॥ ౬౪
వీక్షమాణాశ్శిరో దేవా విషాదం ప్రతిపేదిరే
అస్త్రం సన్ధాయ గాన్ధర్వం శార్ఙ్గే శ్రీపతివల్లభః ॥ ౬౫
ప్రాయుఙ్క్త వైరిసేనాయాం రామో మూలబలే యథా
ఖాదన్తః ప్రహరన్తశ్ఛిద్రైతేయాస్తే పరస్పరమ్ ॥ ౬౬
ఉన్మత్తా ఇవ భూతేన గ్రస్తా ఇవ చ బభ్రముః

తా॥ చక్రవర్తి సింహాదునిమాయను తెలిసికొని ధనుస్సున నర్ధచంద్ర బాణమును సంధించి నూరుసారులు సింహాదుని శిరస్సును ఖండించెను నరకబడినప్పుడెల్ల తిరిగి ఆశిరస్సు మొలచుచుండెను చూచెడివారలు ఈ సందర్భమునుచూచి భయమును దుఃఖమును చెందిరి. ఆవల ధనుస్సునెత్తి గాంధర్వాస్త్ర

మును సంధించి ప్రయోగించగా శత్రుసైన్యమంతయు దిగ్భ్రమచెంది ఒకరి నొకరు కొట్టుకొనుచు కరచి గ్రుంగుచు పిచ్చిపట్టినట్లు పిశాచములుపట్టినట్లు తిరుగనారంభించిరి

విరిఞ్చేనాభ్యనుజ్ఞాతో వాయుర్బ్రాహ్మణరూపధృత్ ॥ ౧౭
జజాప నృపతేః కర్ణే సౌదర్శన షడక్షరమ్

గోబ్రాహ్మణహితార్థాయ చక్రేణ నృపనన్దనః ॥ ౧౮
హర దైత్యశిరశ్శీఘ్రమిత్యుక్త్వాఽన్తర్దధేచ సః

తా॥ ఇంతలో బ్రహ్మదేవునిచే ఆజ్ఞాపింపబడివాయుదేవుడు బ్రాహ్మణ వేషమును ధరించి రాజుచెవిలో సుదర్శనషడక్షరీ మహామంత్రము నుపదేశించి ఓరాజా! గోబ్రాహ్మణులకుహితముచేకూరుటకై చక్రాయుధముచే దైత్యుని శిరమును ఖండించుము. అనిచెప్పి అంతర్ధానముజెందెను.

బ్రాహ్మణస్య వచశ్శ్రుత్వా చక్రవర్తీ మహామనాః ॥ ౧౯
సుదర్శనం సహస్రారమాదదే భగవానివ
చక్రపాణిం నృపం వీక్ష్య మత్వా చక్రధరం హరిమ్ ॥ ౨౦

భయవిభ్రాన్త చిత్తస్య సింహోదస్య శిరస్తదా
సుదర్శనేన చిచ్ఛేద చక్రవర్త్యపునర్భవమ్ ॥ ౨౧

అన్యే తు తస్యానుచరా దైత్యవీరాస్ససైనికాః
గాన్ధర్వమోహితాస్తస్థుస్తత్రైవ రణమణ్డలే ॥ ౨౨

తా॥ బ్రాహ్మణరూపధారియగు వాయుదేవునివచనమును శిరసావహించి సౌదర్శనాష్టాక్షరోపదేశబలముకలిగినరాజు చక్రాయుధముచే సింహోదుని శిరమును రెండవమారు ఉదయించకుండా ఖండించివైచెను ఇతర దైత్యులందరు నిశ్లే గాంధర్వాస్త్రముగ్ధులై యుద్ధభూమియందు పడియుండిరి.

తస్యోపరి నరేన్ద్రస్య పుష్పవర్షాణి జజ్ఞిరే
అథ చామరవాద్యాని వాద్యన్తేస్మ సమన్తతః ॥ ౨౩

అశరీరగిరం శ్రుత్వా చోళరాజస్య నన్దనః
అస్త్రస్య మోహనస్యాస్య న చక్రే ప్రతిసంహృతిమ్॥ ౭౪

తా॥ సింహాదవధజనితమగు సంతోషముతో దేవతలు పుష్పవర్షమును కురిపించిరి అప్పుడువినబడిన ఆకాశవాణివలన రాజు గాంధర్వాస్త్రము నుప సంహరించలేదు.

నారదుడు చెప్పుచున్నాడు—

ఏవముక్తమగస్త్యేన తథోక్తపి భవతోంమయా
అన్యచ్చ కిఞ్చిద్వక్తవ్యముచ్యతే చరితం మయా ॥ ౭౫

కలౌ యుగే నరాస్సర్వే తత్రాయోధనమణ్డలే
శ్రోష్యన్తి దైత్యవీరాణాం రాత్రౌ కోలాహలం సదా ॥ ౭౬

క్షేత్రపాలాజ్ఞయా సర్వే సింహాదాఽసురసైనికాః
నయనాగోచరాస్త్వాణాం భ్రమిష్యన్తి తతస్తతః ॥ ౭౭

తా॥ అగస్త్యుడుచెప్పిన ఈ కథను నేనుమీకుచెప్పితిని ఇంకకొంచెము మిగిలినకథకలదు. కలియుగమందలిప్రజలు అప్పటి ఆ యుద్ధభూమియందు గాంధర్వాస్త్రమోహితులై పడియుండిన దైత్యసైనికులు చేసెడి దిగ్భ్రమకోలాహలమును వినుచుందురు. అయితే క్షేత్రపాలాజ్ఞచే ఆ సైనికులస్వరూపము మాత్రము శబ్దమువినుచున్నవారలకు అగుపడదు.

తత స్సింహాదసంహారీ చక్రవర్తీ మహీపతిః
వ్యజిజ్ఞపత్స్వవృత్తాన్తం వేఙ్కటేశాయ సర్వతః ॥ ౭౮

శఙ్ఖచక్రగదాశాఙ్గనన్దకాన్నృపనన్దనః
అర్పయామాస హరయే వేఙ్కటాద్రినివాసినే ॥ ౭౯

తా॥ చక్రవర్తి జరిగిన సింహాదవధ వృత్తాంతమును శ్రీనివాసునకు నివేదించి దివ్యాయుధములను తిరిగియిచ్చివేసెను.

రాజానం చ తథా పఞ్చాయుధాన్యసి చ మాధవః
ఉవాచ మేఘనిర్ఘోషగమ్భీరిమభృతా గిరా ॥ ౮౦

రాజన్యదేచ్ఛసి జయమజయ్యే సామ్పరాయకే
తదేమాన్యాయుధాన్యచ్చై స్సాహాయ్యం కుర్వతాం తవ ॥ ౭౧

హేశఙ్ఖచక్రశార్ఙ్గాసే కామోదకి మహాగదే
రాజ్ఞోఽస్య కామదాః కాలే స్వస్వతీర్థేషు తిష్ఠత ॥ ౭౨

స్నాతానాం స్వస్వతీర్థేషు మమ సాయుజ్యభోగదాః
విహరధ్వం యథాకామం మయి ధ్యానపరాయణాః ॥ ౭౩

దత్తైర్యుష్మాభిరేతస్య సాయుజ్యం యదిహాదిశమ్
తన్న వ్యాహన్యతాం సద్యః పునరాగమనేన వః ॥ ౭౪

మానసా మే స్త సద్యోఽహం ప్రత్యక్షవిగతాయుధః
కఞ్చిత్కాలం వసిష్యామి తతః కేనాపి హేతునా ॥ ౭౫

తా॥ అంతటభగవానుడు రాజును, ఆయుధములనుచూచి ఇట్లనిచెప్పెను ఓరాజా! నీకుయుద్ధకాలమందవసరమైనప్పుడు ఈ యాయుధములు నీకు సాయపడగలవు. ఓదివ్యాయుధములారా! మీరు అయిదుగురును మీమీ తీర్థస్థానముల యందు వసియింపుడు. మీమీతీర్థములందుస్నానముచేసెడిభక్తులకు కామితార్థములనీయుడు. నాయందుమనసుతో నన్నుధ్యానించుచు, యథేచ్ఛముగ మీరు విహరించుడు, నాచేతిలోనుండనక్కరలేదు. ఈ చక్రవర్తికి నాసాయుజ్యపదవిని వాగ్దానముచేసితిని. నాయొద్దకు ఇప్పుడేమీరువచ్చి నావాగ్దానమునకు విరోధము చేయకుడు. నాచేత ఆయుధములులేకున్నను నాలోమీరుందురు. అయితే బాహ్యచక్షుస్సుకునేను విగతాయుధుడుగనుండెదను. కొంతకాలము ఆయుధములను చేతులందు ధరింపకుండుటకును కారణమేదోఉన్నది.

కలౌ కశ్చిన్మహాభాగశ్శఙ్ఖచక్రేతు కృత్రిమే
కారయిత్వా స్థాపయితా విమానాదీంశ్చ మే పునః ॥ ౭౬

తత స్తద్భక్తివశగస్సర్వప్రత్యక్షగోచరః
ఆకల్పం నివసిష్యామి వరాభయదహ స్తదః ॥ ౭౭

ఊర్ధ్వాభ్యామపిచాన్యాభ్యాం హస్తాభ్యామతిసున్దరే
దధానశ్శఙ్ఖచక్రేచ కల్పితే లోకతుష్టయే ॥ ౭౮

దత్తం హి మమ సాయుజ్యం మయా తే రాజనన్దన
గచ్ఛ ప్రశాధి రాజ్యం చ మాం సేవస్వ దివానిశమ్ ॥ ౮౯

తా॥ కలియుగమందు ఒక మహాభాగవతుడు నాకు లోహమయమగు శంఖచక్రములను నిర్మించి సమర్పించి నావిమానగోపురాదులను నిర్మించగలడు. ఆతడు నాభక్తుడు. ఆ శంఖచక్రముతోనే అనాటినుంచి నేను శంఖచక్రములు వరదాభయములు నాలుగుహస్తములందు ధరించినవాడనై కల్పాంతమువరకు సాన్నిధ్యము చెందియుందును. ఓరాజా! నీకు నాసాయుజ్యమునిచ్చితిని పొమ్ము. రాజ్యపరిపాలనము చేయుచు నన్ను సేవించుచుండుము

ఇత్యాజ్ఞప్తా భగవతా శఙ్ఖచక్రగదాఽసయః
శార్ఙ్గం చ స్వస్వతీర్థాని పుణ్యాని ప్రతిపేదిరే ॥ ౯౦

పుత్రోఽపి చోళరాజస్య దేవతాఽశాస్యవై భవః
జగామ నగరీం స్వీయాం మఘవేవామరావతీమ్ ॥ ౯౧

తా॥ ఇట్లురాజునాజ్ఞాపించి పంచాయుధములను జూచి వాట్లనుకూడ తమ తమ తీర్థములకుబొండని చెప్పగా అయ్యవి అట్లుచేసెను. చక్రవర్తియు భగవదనుగ్రహమునుపొంది తన రాజ్యమునకుపోయెను.

ఇత్థం నారదవాక్యాని శ్రుత్వా భృగురుదారధీః
వేఙ్కటేశే పరాం ప్రీతిమదిన్దత మహామనాః ॥ ౯౨

భృగురపి వృషభాచలప్రభావం మునివరసఙ్కథితంనిశమ్య భూయః
తదను స చ విలోకితుం రమేశం స్థిరరతినా మనసా యయౌ గిరీన్ద్రమ్

తా॥ ఇట్లుచెప్పిన నారదుని యుపదేశమునువినిన భృగుముని శ్రీ వేంకటరమణుని ప్రభావమును చక్కగా గ్రహించి ఆతనియందు పరిపూర్ణమగు పరమభక్తిని వృద్ధిపొందించుకొని ఆనందించెను.

ఇతి శ్రీబ్రహ్మాణ్డపురాణే తీర్థఖణ్డే భృగునారద సంవాదే శ్రీవేఙ్కటాచల మాహాత్మ్యే చక్రవర్తిపరాక్రమకథనం నామైకాదశోఽధ్యాయః.

ఇది బ్రహ్మాండపురాణమునందలి శ్రీవేంకటాచల మాహాత్మ్యమున పదునొకండవ అధ్యాయమునకు ఆంధ్రానువాదము

శ్రీరస్తు
శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః
శ్రియై పద్మావత్యై నమః
శ్రీమతే విష్వక్సేనాయ నమః

## శ్రీ పాద్మపురాణాన్తర్గత

# శ్రీ వేఙ్కటాచలమాహాత్మ్యము

(ఆంధ్రానువాద సహితము)

---

శ్రియః కాన్తాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్
శ్రీ వేఙ్కటనివాసాయ శ్రీనివాసాయ మఙ్గళమ్ ॥

హరిః ఓమ్

మేరుశిఖరమందుండు శుకుడు వేంకటాద్రికి వచ్చుట.

(దేవలుడు చెప్పుచున్నాడు)
'దేవదర్శన ! దేవర్షే బ్రహ్మభూయకరం పరమ్
ముకున్దానన్దనం బ్రూహి ధర్మం కర్మవిమోచనమ్' ॥

---

జయత్యాత్మశ్వరోన్నిద్రధ్యానసౌధప్రియాతిథిః
శ్రీమత్పత్రపురీవాసః శ్రీరామః సీతయా గృహీ ॥
శ్రీనివాసం నమస్కృత్య గురూనౌఖేయసూత్రిణః
శ్రీనివాసాధ్వరీంద్రాద్యాన్ వేదాన్తార్థ ప్రకాశకాన్ ॥
దేవభాషామయం కావ్యం వేంకటాచలవైభవమ్
ఆంధ్ర్యా వాణ్యా పార్థసూతో వివృణోతి యథామతి॥

తా॥ ఓ దేవదర్శనా ! దేవర్షీ ! చావుపుట్టుకలలో బాధపెట్టెడి ఈ సంసార బంధమునుండి విముక్తిచెంది మోక్షసామ్రాజ్యమును పొందుటకు మార్గమును నాకుపదేశింపుము.

దేవదర్శనుడు చెప్పుమన్నాడు.

'సాధు దేవల ! భూదేవ యత్పృష్టోఽహమిహ త్వయా
శృణు విద్వన్ ! విశేషేణ వక్ష్యామి తవ సువ్రత ॥ ౨

ఇతిహాసమిమం పుణ్యం చతుర్వర్గఫలప్రదమ్
యశస్కరం రఞ్జనకం ఆయురారోగ్యభూతిదమ్ ॥ ౩

పురా సుమేరుశిఖరే నానారత్నవిచిత్రితే
ఖచితానేకమాణిక్యే సౌవర్ణే కుట్టిమస్థలే ॥ ౪

అనుస్యూతస్రవద్దేవస్రవన్తీనిర్ఝరాఽఽప్లుతే
మయూఖోద్దామరత్నౌఘఖణ్డితధ్వాన్తకుఞ్జకే ॥ ౫

సాన్ద్రస్నిగ్ధతరుచ్ఛాయసురద్రుమవనోదరే
మకరన్దం స్రవన్తీభిః స్రగ్భిస్తు పరిలమ్బితే ॥ ౬

మాణిక్యస్తమ్భమహితే మకరాననతోరణే
విచిత్రరత్నప్రత్యుప్తస్వర్ణస్తమ్భచతుష్కకే ॥ ౭

సింహాసనే మహారత్నవిచిత్రాంశువిరాజితే
సావిత్ర్యా చ సరస్వత్యా సదాఽఽసీనః పితామహః ॥ ౮

గన్ధర్వైర్గర్వనిర్వాహైః గానవిద్యావిచక్షణైః
గాయద్భిః కిన్నరగణైః గీయమానశ్చ వీణయా ॥ ౯

స్తూయమానస్తుమ్బురుణా హాహాహూహూత్థతేజసా
సేవ్యమానః సహస్రాక్షప్రముఖైః సురసత్తమైః ॥ ౧౦

బ్రాహ్మీభిః శక్తిభిర్బ్రహ్మభాషాభూషాభిరాత్మభూః
అంశుకాభరణాలేపాకల్పహస్తాభిరన్తికే ॥ ౧౧

వసిష్ఠప్రముఖైః బ్రహ్మమునిభిః సిద్ధచారణైః
మార్కణ్డేయమరీచ్యత్రిభృగుపూర్వైః మహర్షిభిః ॥ ౧౨

శాపానుగ్రహసామర్థ్యసాధనైశ్చ తపోధనైః
మాహాత్మ్యం పుణ్యదేశానాం ఊచివద్భిః పరస్పరమ్ ॥ ౧౩

సమన్తతః సేవ్యమానః సేవారసవిశారదైః
నిషద్గణైరుపనిషద్గణైః శ్రుతిగణైరపి ॥ ౧౪

సాఙ్గైః సంశిక్షితమనా విశ్వసర్గవిలాసభూః
ఆస్తే సమాలపన్ బ్రహ్మా స్వపదాహ్లాదనిర్భరః ॥ ౧౫

ఓ దేవలమునిసత్తమా ! అడుగదగిన ప్రశ్న నడిగితివి, చెప్పెదను వినుము. ఈ చెప్పబోవు నితిహాసము పుణ్యమైనది. చతుర్వర్గఫలము నిచ్చును. యశస్సును ఆయురారోగ్యాదుల నొసంగును. ఒకానొకప్పుడు మేరు పర్వతశిఖరమునందు నానా రత్నవిచిత్రతమును మాణిక్యఖచితమునగు సౌవర్ణకుట్టిమస్థలము కలదియు నిరంతరముగ ప్రవహించెడి గంగా ప్రవాహముచే తడుపబడునదియు రత్నకాంతులతో వెడలగొట్టబడిన అంధకారముగల పట్టమగు ప్రాకారింప్లగలట్టియు దట్టమైన చల్లని నీడనిచ్చెడి కల్పవృక్ష సమూహముకలట్టియు మకరందమును స్రవించెడి పుష్పములు గలట్టియు మాణిక్యమయములగు స్తంభములతో పరిష్కరింపబడిన మకరతోరణములు కలట్టియు విచిత్రములగు రత్నములు చెక్కబడిన స్వర్ణమయములగు స్తంభములు కలట్టియు పుణ్య సభాస్థలమునందు మహారత్నముల విచిత్ర ప్రకాశముతోకూడిన దివ్యసింహాసనమునందు భార్యలగు సావిత్రీ సరస్వతులచేకూడి చతుర్ముఖుడు ఆసీనుడై యుండెను. ఆ సభయందు గాన విద్యాకుశలురగు గంధర్వులు కిన్నరులు గానముచేయగా తుంబురుడు మొదలగు వారలు స్తోత్రముల జేయుచుండిరి. దేవతలును బ్రాహ్మీ మాహేశ్వరి మొదలగు సప్తమాతలు వసిష్ఠ ప్రముఖులగు బ్రహ్మఋషులు శాపానుగ్రహ సమర్థులగు నితర తపోధనులు సభ నలంకరించుచు లోకములందలి పుణ్యక్షేత్ర మహిమలను ప్రసంగించుచుండిరి. వారల ప్రసంగములలో వేదవేదాంగ వేదాంతములందలి మహారహస్యములు చర్చించబడుచుండెను ఇట్టి మహాసభలో గొప్ప ఆనందానుభవముతో చతుర్ముఖుడు వారలగోష్ఠిలో వాదప్రతివాదములలో కాలముపుచ్చుచుండెను.

కథాప్రసఙ్గాదత్రైవ నారాయణగిరేర్మహత్
మాహాత్మ్యమావిర్భావఞ్చ శ్రీనివాసస్య శార్ఙ్గిణః ॥ ౧౬

శ్రుత్వా శుకః పరమఋషిః సభాయాం సముపస్థితః
స దేశం తం దిదృక్షుః సన్ కౌతూహలసమాకులః ॥ ౧౭

విజ్ఞాపయన్ బ్రహ్మణే తం నమస్కృత్య చ సర్వతః
జగామ తస్మాద్దేశాచ్చైవ దక్షిణాభిముఖః సుధీః ॥ ౧౮

వాసుదేవే వహన్ భక్తిం పురాణపురుషోత్తమే
తత్కథాలాపకుతుకః స్మయమానముఖో మునిః
దదర్శ నారాయణాద్రిం తత్ర నారాయణాశ్రమమ్ ॥ ౧౯

తా॥ ఇట్లు జరిగిన కథాసందర్భములలో పాల్గొని వినుచుండిన శుకబ్రహ్మర్షి శ్రీ వేంకటాద్రి మహిమను విని తుష్టుడై ఆ పుణ్యక్షేత్రమును దర్శించవలయునను నాశతో బ్రహ్మయనుమతి నడిగి సభనుండి వెడలి దక్షిణదిక్కుకై బయలువెడలి ప్రశాన్తమగు నారాయణాశ్రమమును నారాయణపర్వతమును చేరెను.

## శ్రీ వేఙ్కటాచలవర్ణనమ్

నీలజీమూతముదితనీలకణ్ఠవిడమ్బనమ్
శృఙ్గకోటీరవిశ్రాన్తవాలఖిల్యకులాకులమ్ ॥ ౨౦

తిగ్మాంశ్వశ్వఖురక్షుణ్ణశృఙ్గమాణిక్యమణ్డలమ్
అమృతాంశుకరస్పర్శనిర్యదిన్దుదృషద్ద్రవమ్ ॥ ౨౧

తుఙ్గశృఙ్గస్ఫురద్రత్నతరలీకృతతారకమ్
మాణిక్యకుణ్డలమహోమాద్యద్ద్యుమణిమణ్డలమ్ ॥ ౨౨

వియల్లిహోత్తుఙ్గశృఙ్గవిశఙ్కటవిటఙ్కకమ్
చన్ద్రికాన్తస్రవాస్వాదిచకోరకులసఙ్కులమ్ ౨౩

స్ఫాటికాశ్మదరీశృఙ్గనిర్యన్నిర్మలనిర్ఝరమ్
అధిత్యకారూఢపుల్లలోధ్రసింహావిడమ్బనమ్ ॥ ౨౪

మాకన్దకుసుమామన్దమకరన్దసముక్షితమ్
దన్తావలఘటాఘాతదర్దురప్రస్థకన్దరమ్ ॥ ౨౫

వ్యత్క్రమక్రమణాక్రాన్తశరభప్రస్థదుఃస్థలమ్
మహోఽన్ధకారమహిమదుర్నిరీక్ష్యమహర్షభమ్ ॥ ౨౬

ఆఘ్రాతవ్యాకులప్రాణివ్యాఘ్రభీమభృగుస్థలమ్
నిర్ఝరాపాతపర్యన్తగ్రస్తముస్తార్థసూకరమ్ ॥ ౨౭

యమవాహనదుర్దర్శనినదన్మహిషాకులమ్
శాఖాశిఖాక్రమచ్ఛాఖామృగసానుమహీరుహమ్ ॥ ౨౮

నికీర్ణశ్వాపదాసీకాధిత్యకోపత్యకాత్యఘమ్
అభ్రఙ్కషాగ్రవివిధవిటపాటవిపాటనమ్ ॥ ౨౯

ధాతుప్రస్థస్థలీనిర్యదోషప్రస్రవణాకులమ్
అన్తకాస్యప్రతీకాశగుహాగేహోషితార్ణకమ్ ॥ ౩౦

ఝిల్లికానాదబధిరీభూతదిక్చక్రవాలకమ్
దివ్యం విభూత్యపాదానం గాయద్భిరుషితాన్తరమ్ ॥ ౩౧

నానామణిమయూఖౌఘమహేన్ద్రాయుధవర్చసమ్
కృష్ణసారవరోద్రిక్తహరిణీకులసఙ్కులమ్ ॥ ౩౨

విదున్వద్వాలవిమలచమరీచఙ్క్రమోత్కటమ్
లాఙ్గూలవేల్లితలసద్గోలాఙ్గూలకులాకులమ్ ॥ ౩౩

ప్రవాలకాణ్డప్రస్తారమణ్డితాన్తరకన్దరమ్
ఇతస్తతస్తపస్యద్భిః ఋషిభిః నిర్ఝరాన్తికే ॥ ౩౪

ఆస్థాతవ్యప్రస్థదేశం బ్రహ్మధ్యానపరాయణైః
ఆశ్రితార్తిహరచ్ఛాయవిశాలవనపాదపమ్

టీ॥ ఆ పుణ్యప్రదేశ మిట్లున్నది. పర్వతశిఖరమునందు వాలఖిల్యులు వసియించుచున్నారు. సూర్యభగవానుని నిరంతర సంచారవేళలందు ఆతని రథమును లాగెడి అశ్వముల డెక్కలచే త్రొక్కబడిన మాణిక్యమండలముగల పర్వత శిఖరముకలది. అట్లే అమృతాంశువగు చంద్రభగవానుని శీత కిరణముల కాన్తిచే ద్రవింపజేయబడిన చంద్రకాంత శిలలచే ఒప్పారు శిఖరములుకలది. అట్టి చంద్రకాంత శిలలందుండి స్రవించెడి అమృతమును త్రావెడి చకోరపక్షి సంపూతముకలది. స్ఫటిక శిలలతో నిండిన సానువులందుండి ప్రవహించెడి నిర్మలమగు ఉదకములుకలది ఎత్తైన శిఖరములందు ప్రకాశించెడి రత్నములతో కలసిన తారకలుగలది. మాణిక్యకుండల కాంతితో తిరస్కరించిన సూర్యమండలము కలది ఆకాశమును తాకెడి విశాలశిఖరప్రదేశము కలది. అధిత్యకలందు ప్రకాశించెడి సింహ విడంబనములగు లోధ్రవృక్షములుకలది. మాకన్ద కుసుమామన్దమగు మకరందముచే తడుపబడినది. యేనుగుల సమూహము సంచరించెడి అవకాశము కలది. శరభ మాదిగాగల క్రూరమృగములకునిలయమైనది. గొప్ప వృషభములుకలది. భయంకరములగు వ్యాఘ్రముల సంచారముకలది. గొప్ప సెలయేళ్లలో మొలచిన గరిక దుంపలను తిని బలిసిన వరాహములు కలది. పెద్ద మహిషముల సంచారముకలది శాఖామృగముల సంచారమున కనువగు గొప్ప వృక్ష సంతతికలది అనేక శ్వాపదజంతువులు సంచరించునది. లెక్కలేని సెలయేళ్లు కలది. ఆకాశమును తాకుచుండిన యెత్తగు చెట్లుకలిగిన మహారణ్యములు కలది. చొరరాని భయంకరములగు గుహాప్రదేశములుకలది. ఝల్లికా జంతువులచే కలవరనాదములతో నిండిన దశదిశలుకలది. సర్వేశ్వరుని దివ్య విభూతిని గానముచేయు ప్రాణిజీవితముకలది. నానా మణిమయూఖమగు మహేంద్రాయుధ కాన్తికలది. మృగమృగీగణములుకలది. తోకలు విప్పి చిందులాడెడి చమరమృగములుకలది. తోకలు చుట్టుకొని యెగిరెడి గోగణములుకలది. ప్రవాల మణులచే ప్రకాశించెడి గుహాన్తరములుకలది. బ్రహ్మ ధ్యాన పరాయణులైన మహాపురుషులకు అచ్చటచ్చటి సెలయేళ్ల తీరమునందు నివాసయోగ్యములగు ఆశ్రమస్థానములుకలది. ఆశ్రితులగు తపస్వుల ఆర్తిని పోగొట్టగల నీడనిచ్చు వనపాదపములుకలది.

శుకుడు వేంకటాచలమందలి పుణ్యతీర్థములకేగుట

తస్య సానుమతః సోఽపి పాదానాశ్రిత్య సత్వరః ॥ ౩౫

నిర్ఝరేష్వాప్లవం కుర్వన్ విమలోదేష్వనన్యధీః
హ్రదేషు దేవఖాతేషు నదీప్రస్రవణేషు చ ॥ ౩౬

అన్యేష్వమలతీర్థేషు త్రివృష్పరిహృష్ట జపన్ మునిః
సంసారమోచనీం బ్రహ్మవిద్యాం విద్యావిజృమ్భిణీమ్ ॥ ౩౭

జపన్నుపాంశు మనసాఽవద్యావిద్యానిబర్హిణీమ్
నివసన్ రజనీమేకాం తత్ర తత్ర సమాహితః ॥ ౩౮

అటన్నిరితోఽఙ్జనగిరిం ప్రాప విప్రోపసేవనమ్

తా॥ ఆట్టి పర్వత ప్రదేశమునుచేరి అచ్చటచ్చటి సెలయేళ్ల దివ్యోదకము లందును పుష్కరిణులందును దేవఖాతములందును, నదులందును, ప్రస్రవణము లందును స్నానముచేయుచు భగవద్ధ్యానముతో సంసారమోచనియగు బ్రహ్మ విద్యను జపించుచు అక్కడక్కడ ఒక్కొక్క రాత్రి విశ్రాంతి తీసికొనుచు విప్రనివాసముగల ఒక ప్రదేశమును ఒక్కనాడు చేరుకొనెను

తత్ర తత్ర గుహాగేహేష్వాసీనైః మునిపుఙ్గవైః ॥ ౩౯

యోగిభిః సిద్ధసఙ్ఘైశ్చ విశుద్ధజ్ఞానశాలిభిః
వైఖానసైశ్చ మునిభిః కృతాతిధ్యసపర్యకమ్ ॥ ౪౦

శిలాతలేషు నివసన్ విపులేషు శనైఃశనైః
కుమారధారాం ధారాలచ్యవమానామలోదకామ్
ఆససాదాప్లవం చాత్ర చక్రే వ్యాసౌరసో మునిః ॥ ౪౧

తా॥ అక్కడక్కడ గుహలందు వసియించెడి మహర్షులును యోగు లును సిద్ధసంఘములు, విశుద్ధజ్ఞాన సంపన్నులగు వైఖానస మునులు మొదలగు వారలచే ఆతిధ్యమీయబడుచు శుకుడు సంచరించెను. ఇట్లు కాలముగడుపుచు మెల్లమెల్లగ నిర్మలోదక పూరితమగు కుమారధారా తీర్థమునుచేరి ఆ పుణ్యతీర్థ ములందాతడు స్నానముచేసెను.

### కుమారధారా తీర్థమాహాత్మ్యము

అస్యా మాహాత్మ్యమతులం తులితానన్యతీర్థకమ్
శక్తిప్రదం శక్తిపాణేః శరణ్యం శరణార్థినామ్
పురాఽమరైః ప్రార్థితేన శఙ్కరేణ పురారిణా ॥ ౪౨
బామాపత్యో బాహులేయః సైనాపత్యే నియోజితః
తదోద్ధుమసహన్ సోఽపి సైనాపత్యే నివిష్టధీః ॥ ౪౩
అనేకాపాయసదనముపాయరహితో గుహః
దైత్యారేః ప్రాప్తుకామస్సన్ తత్ప్రీతికారమాప్తవాన్ ॥ ౪౪
త్రిసన్ధ్యమాప్లవం కుర్వంస్త్రివృద్బ్రహ్మ జపన్ సుధీః
త్రిసన్ధ్యమర్చయన్ విష్ణుం దివ్యైః పుష్పైరనన్యధీః ॥ ౪౫
అస్యా నిర్ఝరధారాయాం తపస్తేపే సమీపతః

తా॥ ఈ కుమారధారతీర్థ మహిమము అతిశయితమైనది, శరణార్థుల కియ్యది శక్తినిచ్చునది, పూర్వకాలమందు దేవతలు ప్రార్థించగా శివభగవానుడు కార్తికేయుని గని ఆతనికి దేవసైనాపత్యము నిచ్చెను. సైనాపత్యభారమును వహించుటకు భయముచెందిన స్కందుడు శక్తి సంపాదనమునకై నారాయణ పర్వతమందలి కుమారధారా తీర్థమునకువచ్చి మూడు కాలములందును అందు స్నానానుష్ఠానములజేసికొని దివ్యపుష్పములచే శ్రీనివాసుని నర్చించుచు ఆ తీర్థ తీరముననే నివసించెను.

తపసా తస్య సన్తుష్టో భగవాన్ విష్టరశ్రవాః ॥ ౪౬
ఆవిర్భూయ దదౌ శక్తిం తస్మై సోఽపి తిరోదధే
కుమారస్తం ప్రణమ్యాథ దేవం స్వర్గం జగామ సః ॥ ౪౭
తస్మాత్కుమారధారేతి విఖ్యాతా విమలోదకా
ప్రథమానప్రశంసాఽభూత్ అప్రమేయఫలప్రదా ॥ ౪౮

తా॥ స్కందుని నిశ్చల తపసుచే భగవానుడు తృప్తిచెంది సైనాపత్య నిర్వహణమున కుపయోగముగ శక్త్యాయుధము నాతనికిచ్చి అంతర్హితు

డాయెను. అంతట భగవద్వర ప్రసాదమునుపొంది స్కందుడు స్వర్గలోక మునకు పోయెను. ఆ కారణముచే ఆ తీర్థమునకు కుమారధారయను వ్యవహారము కుమారస్వామివలన యేర్పడినది, ఈ తీర్థమహిమ మిక్కిలి కొనియాడబడినది ఈ తీర్థస్నానమువలన కలిగెడి ఫలము అంతులేనిది

పాపనాశన తీర్థమాహాత్మ్యము

తతో గతః పాపనాశం కృత్వా స్నానాదికం వశీ
ఉవాస త్రిదినం తస్య తీర్థస్య నికటే తటే ॥ ౯౯

యత్ర తీర్థే సకృత్ స్నాత్వా మఘవా వృత్రహా పురా
బ్రహ్మహత్యావిముక్తః సః ప్రాపచైన్ద్రీం పునః పదమ్ ॥ ౧౦౦

'పాపనాశః' స విఖ్యాతో నిర్ఝరో జర్ఝరైనసామ్
దేవతిర్యఙ్మనుష్యాణాం అవగాహాన్మలాపహామ్ ॥ ౧౦౧

ఆకాశగఙ్గామన్వాస్య సమస్తఫలదాయినీమ్
ఆసాద్యాస్యామాప్లవఞ్చ చకార నిరుపప్లవః ॥ ౧౦౨

తా॥ అచటినుండి పాపనాశతీర్థమునకు పోయి స్నానానుష్ఠానములజేసి కొని మూడు దినములుండి తరువాత సమస్త పుణ్యఫలప్రదమగు నాకాశగంగా తీర్థమునకేగి అందు స్నానానుష్ఠానముల జేసికొనెను,.

ఆకాశగంగా తీర్థమాహాత్మ్యము

యస్యాః సంసారార్ణవస్య కర్ణధారేఽమలేఽమ్భసి
దేవస్త్రియో నాగకన్యాః గన్ధర్వ్యః కిన్నరాఙ్గనాః ॥ ౧౦౩

సిద్ధాఙ్గనాశ్చ కుర్వన్తి స్నానం వైఖానసాఙ్గనాః

తా॥ సంసార మహాసముద్ర భయమునుండి సంరక్షించెడి తీర్థప్రభావము గల ఆ యాకాశగంగాతీర్థమునందు భూలోకమందు వసియించెడి మానవమాత్రులేగాక దేవకన్యలు నాగకన్యక లాదిగాగల లోకాన్తరవాసులును స్నానము చేయుదురు, వైఖానసాంగనలును స్నానముచేయుచుందురు.

వ్రతతీవర్తనీతీర్థ మహిమ — అశరీరి వాక్యోపదేశము

నారాయణగిరేః శౌరేః తదీశస్య ప్రభావకమ్
ప్రవదన్ మనసాఽతీవ స్మయమానో మహామునిః ॥ ౫౪

వ్రతతీవర్తనీతీర్థమాససాద మహామునిః
తత్రాఘమర్షణం చక్రే సూక్తం వైష్ణవముచ్చరన్ ॥ ౫౫

స్మరన్ భగవతో విష్ణోః జిష్ణోః ద్వైపాయనాత్మజః
జలే మగ్నతనోస్తస్యా ఉదభూద్వాగశరీరిణీ ॥ ౫౬

'అమృతోదన్వదుత్తుఙ్గతరఙ్గమహిమావలీ
శ్రీవత్సవక్షా నిత్యశ్రీః అదృశ్యశ్చ మలాత్మనామ్ ॥ ౫౭

అనన్తభోగాయతనోఽనన్తోఽనన్తఫలప్రదః
అతోఽస్మాదగ్నిదిగ్భాగే సార్ధయోజనమాత్రకే ॥ ౫౮

అస్య సానుమతః పాదమూలే కూలఙ్కషద్రుమే
నద్యాః సద్యోఽఘనాశిన్యాః స్వర్ణముఖ్యాస్తటే శుభే ॥ ౫౯

'పద్మ' మిత్యుత్తరే ఖ్యాతం పవిత్రం పరమం సరః
తస్య గత్వా తటే తూర్ణం అత్యుగ్రం తప ఆచర ॥ ౬౦

పశ్చాదచఞ్చలత్వం తే మనీషాయా భవిష్యతి
తదా స్యాద్భగవాన్ విష్ణుః ప్రత్యక్షః సర్వసాక్షిభూః'
ఏవం సాదరముక్త్వా వాక్ జనానాం శృణ్వతామపి ॥ ౬౧

ప్రక్షాలయన్తీ శమలం మునేర్యాతాఽశరీరిణీ

తా॥ శుకుడును ఆకాశగంగయందు స్నానమాడి నారాయణగిరియొక్కయు ప్రభువగు శ్రీనివాసునియొక్కయు మహిమను ప్రశంసించుచు వ్రతతీవర్తనీతీర్థమును చేరి అందు అఘమర్షణ స్నానముచేసి వైష్ణవ మంత్రములను జపించుచు భగవానుని స్మరించుచు ఉదకములో నిలచియుండగా ఆకస్మికముగ ఆకాశము నుండి యొక అమృతమయమగు అశరీరవాణి ఆయనకు వినవచ్చెను.

ఓ శుకమునివర్యా ! ఈ ప్రదేశము రమారమణుని యావాసము. ఇచ్చటికి ఒకటిన్నర యోజనముల దూరమున ఈ పర్వతపాద మూలముననే పాపనాశని యగు సువర్ణముఖరీ నదీతీరమున పుణ్యకాననములచే నిండిన పుణ్యప్రదేశమునందు పద్మసరోవరమను నొక పుష్కరిణికలదు నీవా పుష్కరిణీతీరమునకు పోయి ఉగ్రమగు తపస్సునుచేయుము. ఆపల నీ మనసు నివాత ప్రదీపమువలె చాంచల్యరహితమగును, అంతట శ్రీ మహావిష్ణువు నీకు దర్శనమిచ్చును. అని అత్యాదరముతో అచ్చటి జనులకందరకు వినబడునట్లు ఆకాశవాణి పలికెను.

అశరీరివాక్కు నాదరించి శుకుడు పద్మసరోవరమునకేగుట.

ఏవమేతాం నిశమ్యాసౌ జలాదుత్తీర్య తీర్థతః ॥ ౬౨

అతిస్నేహాద్విస్మితశ్చ వైయాసిః మునిరత్వరః
ఏవమాలోచయన్ బుద్ధ్యా శరీరాత్మవిశోధనీమ్ ॥ ౬౩

ప్రసాదసూచినీం విష్ణోః ప్రభవిష్ణోః ప్రశంసినీమ్
జగామ వేగాత్తం దేశం యత్ర పద్మసరోవరః ॥ ౬౪

ఇట్టి శుభవాక్యములను వినిన శుకుడుదకములనుండి వెలుపలకువచ్చి తనయందు భగవానునకు కలిగిన కృపను మహాభాగ్యముగ తలపోయుచు స్వర్ణముఖీతీరమునకువచ్చి పద్మసరోవరమును చేరెను.

పద్మసరోవర వర్ణనము

ప్రసన్నం సన్మన ఇవ వైడూర్యవిమలోదకమ్
ఉత్ఫుల్లైః పుణ్డరీకైశ్చ కహ్లారైః కనకామ్బుజైః ॥ ౬౫

నీలోత్పలైః కువలయైః రక్తాబ్జైరఞ్చితాన్తరమ్
మకరన్దమదోన్మత్తమధురాలికులోజ్జ్వలమ్ ॥ ౬౬

కారణ్డవైః కలరవైః వాచాటితదిగన్తరమ్
భ్రమద్భ్రమరబృన్దైశ్చ మధుపానమదోద్ధతైః ॥ ౬౭

గృహీతగ్రాహదుర్గ్రాహం వలమానసుమీనకమ్
వరాహసఙ్ఘైరభితో గ్రస్తముస్తైరలఙ్కృతమ్ ॥ ౬౮

మృణాలకవలాఽఽకీర్ణకరైః కరికదమ్బకైః
ఏణైః సశాబైరేణీభిః ఉపాన్తే పరితో వృతమ్ ॥ ౬౯

మదోన్మత్తైర్వనచరైః వయోభిరభితో వృతమ్
తపస్యత్తాపసక్లేశహరణం రమణం హరేః
శ్రీమదేతత్ పద్మతీర్థం మహాతీర్థం శుకో మునిః ॥ ౭౦

దదర్శ స గతక్లేశః స్నానపాననిషేవణైః

తా॥ పద్మసరోవరము సాధువుల మనస్సువలె నిర్మలమైన ఉదకములతో ప్రసన్నమైనది. వికసించిన బంగారు కలువలు తామరలు, నీలోత్పలములు మొదలగు ననేకపూవులతో కలకిల లాడుచున్నది, పూల మకరందములనుగ్రోలి మధించిన మధుకరములు సంచారముచేయునది. నలుప్రక్కల కారండవములాదిగాగల జలపక్షులని నాదములతో నిండినది. ఎక్కడచూచినను తేనె ద్రావి ధ్వనించెడి భ్రమర సమూహముకలది. బలిష్ఠములగు మీనములు వరాహములు ఆశ్రయించినది. మృణాలములను వెలికితీసి క్రీడించెడి వారణ సమూహములుకలది. చుట్టు పరిసరములందు సంచరించెడి మృగములతో ముచ్చట గొల్పునది. తీరమందు తపస్సుచేసికొను తాపసుల క్లేశము నపహరించునది. రమాకాంతుని కత్యంతప్రియమైనది. ఇట్టి పద్మసరోవరమునుదర్శించిన శుకుడు అధ్వక్లేశమును మరచి అందు స్నానపానములజేసికొని ఆశ్వాసముజెందెను.

శుకుడు పద్మసరసును శ్రీనివాసధ్యాన పూర్వకముగ స్నానాదులజేయుట

స్మరన్ నారాయణం విష్ణుమభూత్ నిశ్చలచేతనః ॥ ౭౧

ముహూర్తం తత్ర విశ్రమ్య సంయమీ నియమస్థితః
వన్యైరపాకైః పక్వైశ్చ ఫలైః స్వపతితైరపి ॥ ౭౨

దినస్య పశ్చకాలే వై కృతాహారోఽభవన్మునిః

తా॥ భగవానుని ధ్యానించుచు నిశ్చలుడై ముహూర్తకాలము విశ్రమించి వన్యములగు ఫలములనుదెచ్చి సాయంసమయమున భుజించెను.

శిశ్యే చ దర్భశయ్యాయాం స నివర్త్యాఽహ్నికీం క్రియామ్॥ ౨౩
బ్రాహ్మే ముహూర్తే చాన్యేద్యుః ఉత్థాయ ప్రయతో వశీ
చిన్తయన్ పుణ్డరీకాక్షం శఙ్ఖచక్రగదాధరమ్ ॥ ౨౪
కరుణారసకల్లోలతరఙ్గితకటాక్షకమ్
శరత్పార్వణేన్దువక్త్రాభం పీతకౌశేయవాససమ్ ॥ ౨౫
మహోరస్కముదారాఙ్గం శ్రీనివాసం మహామతిః
సన్ధ్యాముపాస్య విధివత్ స్నానపూర్వం సమాహితః ॥ ౨౬
దదర్శ సరసస్తస్య తీరే త్వభినవం వనమ్

తా॥ శుకుడు అచ్చట దర్భశయ్యయందా రాత్రి సుఖముగా శయనించి బ్రాహ్మముహూర్తమున లేచి ప్రయతుడై శంఖచక్ర గదాధరుడును, కరుణారస కల్లోలతరంగిత కటాక్షుడును శరత్పూర్ణేందు వక్త్రాభుడును పీతకౌశేయవాసుఁడును మహోరస్కుడును ఉదారాంగుఁడునగు శ్రీనివాసుని ధ్యానించుచు స్నాన సంధ్యానుష్ఠానములజేసికొని సరోవరతీరమున నభినవమగు వనమును తిలకించెను.

పద్మసరోవర తీరమందలి దివ్యారామవర్ణనము.

పున్నాగనాగపనసపాటలాశోకకింశుకైః ॥ ౨౭
కున్దమన్దారమాకన్దహరిచన్దనచన్దనైః
తాలచమ్పకహిన్తాలహరితాలతమాలకైః ॥ ౨౮
నక్తమాలైశ్చ సరలైః నారికేళైశ్చ కేసరైః
పనసైః కేతకైః సాలైః పాలాశైః పిప్పలైః వటైః ॥ ౨౯
ఖర్జూరైః ఖాదిరైః ప్లక్షైః రుద్రాక్షై రసనైర్ధవైః
సఙ్కీర్ణమభితః సాన్ద్రం మహేన్ద్రోపవనోపమమ్ ॥ ౩౦
మాధవీమల్లికాయూథీవనయూథీసుజాతిభిః
శతపత్రిభిరాకీర్ణం సుమనోభిః సుగన్ధిభిః ॥ ౩౧

దమనీమరుశాఖాభిః తులసీభిః విజృమ్భితమ్
కున్దమల్లికయోపేతం కుశకాశప్రకాశితమ్
విశ్వామిత్రైః పవిత్రైశ్చ ముఞ్జైరప్యభిజృమ్భితమ్ ॥ ౭౨

తా॥ దివ్యారామము పున్నాగనాగ పనస పాటలాశోక కింశుకకుందమందార మాకంద హరిచందన చందన తాల చంపక హింతాల తమాలనీక్తమాల సరల నారికేల కేసర పనస కేతక సాల పలాశ పిప్పల వట ఖర్జూర ఖాదిర ప్లక్ష రుద్రాక్ష అసనధవాది పుణ్యవృక్షములతో నిండి మహేంద్రుని వనమును మించియుండెను. మాధవీ మల్లికా యూధీవనయూధీ సుజాతిశతపత్ర దమనీ మరుశాఖా తులసీ కుందమల్లికాది పుష్పజాతులచేతను కుశకాశవిశ్వామిత్రములంజాదిదర్భజాతుల చేతను నిండియుండెను.

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవల దేవదర్శన సంవాదే సుమేరుశిఖరాత్ శుకస్య శ్రీఙ్కటాచలాగమన పద్మసరఃప్రాప్త్యాదివర్ణనం నామ చతుర్వింశోఽధ్యాయః.

ఇది శ్రీపాద్మపురాణమున క్షేత్రకాండమందలి శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున దేవల దేవదర్శన సంవాధమునందు శుకుడు వేంకటాచలమున కేగుటను, పద్మసరోవరమున చేరుటను చెప్పెడి యిరువదినాల్గవ అధ్యాయము.

---

# ఇరువదియైదవ అధ్యాయము.

దివ్యారామమునందు శుకబ్రహ్మర్షి మహాతపస్సునుచేయుట.

దేవదర్శనుడు చెప్పుచున్నాడు

తటే శ్రీపద్మతీర్థస్య పద్మవాటీపటీయసః
వటాటవీజటాఽఽటోపవిశఙ్కటవియత్తటే ॥ ౧

అధీతవేదవేదాన్తతాపసౌఘనిషేవితే
అనూదితబ్రహ్మఘోషైః అన్వితే వయసాం గణైః ॥ ౨

పతఙ్గాఽధ్యాపితాఽమ్నాయప్రమోదర్షికుమారకే
హుతవైతానవహ్న్యుత్థహవిర్గన్ధసుమోదితే ॥ ౩

మృగశావవిలూనాగ్రకుశగుల్మవిజృమ్భితే
మనఃసన్తోషకరణే సర్వోపకరణాన్వితే ॥ ౪

విచిత్రవివిధాఽఽమోదే వనే చైత్రరథోపమే
తపఃకరిష్యన్ దిష్ట్యా తు సమాహితమనా మునిః ॥ ౫

విచిన్తయన్ వియద్వాక్యం విమలాత్మా వ్యతిష్ఠత

తా॥ మహావృక్ష లతామంటపములందు కలిగి వేద వేదాన్తజ్ఞాన నిష్ఠులగు తాపస జనుల కావాసమై బ్రహ్మఘోషము ననువదించు పక్షిరావములు కలిగి నిరంతర వేదఘోషలను వినెడి పక్షులచే అధ్యాపింప బడిన ఋషికుమారులు కలిగి మహత్తరమగు శ్రౌతాగ్నులనుండి వెలువడిన హవిర్గంధముచే నిండి మృగ శాబములచే కొరకబడిన కుశపల్లములతోను మనస్సంతోషకారకములగు సమస్తో పకరణములతో కూడినదై చైత్రరథవనమును బోలి విచిత్ర వివిధామోదములచే నలరారెడి పద్మసరోవరతీర్థ తటమున సమాహితమనస్కుడై పరమానందముతో తపమాచరించుచు ఆకాశవాణి వాక్యములను చింతనచేయుచు నిర్మలాంతరంగుడై శుకబ్రహ్మర్షి కాలముగడుపుచుండెను.

స్వాధ్యాయం సమధీయానో విష్ణుమేవాగ్రతో యజన్ ॥ ౬
పర్ణాశనో హితాచారనియతో నియమస్థితః
మితభాషీ మితాహారః శాన్తో దాన్తో గురుప్రియః ॥ ౭
సాత్త్వికః సత్త్వసమ్పన్నో విష్ణుభక్తో బభూవ హ
శ్రీనివాసమనారాధ్య కిఞ్చిన్నాశ్నాతి నిత్యశః ॥ ౮
క్షుధాక్షామోఽప్య నైవేద్యం నోపజీవతి చైకదా
విష్ణుపాదోదకాదన్యత్ తృష్ణార్తోఽపి న చాపిబత్ ॥ ౯
నిర్ద్వన్ద్వో నిరహఙ్కారో ధీరో విగతమత్సరః
కుశేశయాఽసనాసీనః కుశాస్తరణభూతలే ॥ ౧౦
కుశాగ్రబుద్ధిరచలః కుశహస్తపవిత్రకః
కృష్ణాజినోత్తరాసఙ్గః కృష్ణవర్త్మ శిఖాజటః ॥ ౧౧
కృష్ణాజినామ్బరధరః కృష్ణద్వైపాయనాత్మజః
అక్షమాలాధరకరో విజితాక్షః క్షమాక్షమః ॥ ౧౨
నాసాగ్రన్యస్తనయనః ఆర్జవోర్జితకాయకః
దన్తైరసంస్పృశన్ దన్తాన్ జిహ్వాగూహితతాలుకః ॥ ౧౩
ధారణాధ్యానసమ్పన్నః ప్రాణాయామవిశుద్ధధీః
ఉపాంశుమానసజపగూఢోష్ఠస్ఫురణాననః ॥ ౧౪
వైకుణ్ఠేఽకుణ్ఠితమతిః గాయత్రీం వైష్ణవీం జపన్
వర్షాసు జలమధ్యస్థో గ్రీష్మే పఞ్చాగ్నిమధ్యగః ॥ ౧౫
అధ్యర్కదృక్సమద్వన్ద్వోపద్రవో వీతనిద్రకః
కాలానలప్రతిభటకాయః కమలలోచనః ॥ ౧౬
ఏవం ప్రవృత్తో ఘోరఞ్చ తపశ్చర్తుం తపోధనః

తా॥ ఆతనితపస్సు ఈరీతిగనుండెను. వేదాధ్యయనము, విష్ణ్వారాధనము, పర్ణాహారము, యమనియమాదినియమము, మితభాషణము, మితాహారము, శాన్తి,

దాన్తి, గురుప్రియత్వము, సాత్త్వికధర్మము సత్త్వసంపత్తి కలిగి విష్ణుభక్తుడై యుండెను. మరియు శ్రీనివాసుని కర్పించక యేపదార్థమును భుజించడు. ఆకలివేడసిన్నియు భగవన్నివేదనము చేసి శిష్టప్రసాదమునుగాని భుజించడు. దప్పి గొనియు విష్ణుపాదార్పిత పాదోదకమును తప్ప వేరు నీరు త్రాగడు. నిర్ద్వంద్వుడు నిరహంకారుడు ధీరుడు విగతమత్సరుడునై కుశాస్తరణమునందాసీనుడును కుశహస్తుడు కృష్ణాజినోత్తరాసంగుడును కృష్ణవర్త్మశిఖాజటుడును కృష్ణాజినాంబరధరుడును అక్షమాలను ధరించిన కరములు గలవాడును విజితాక్షుడును క్షమాక్షముడును నాసాగ్రన్యస్తనయనుడును ఆర్జవోర్జితకాయుడును దన్తములను దంతములతో కలియనీయకు తాలువులందుంచబడిన నాలుక గలవాడును ధారణాధ్యానసంపన్నుడును ప్రాణాయమముచే శుద్ధబుద్ధిగలవాడును ఉపాంశుమానస జపముచే గూఢోష్ఠస్ఫురణాననుడును వైకుంఠునియందు అకుంఠితమనస్సు గలవాడునువైష్ణవ గాయత్రిని జపించువాడును వర్షర్తువునందు జలములమధ్యమునందును గ్రీష్మర్తువునందును పంచాగ్ని మధ్యమునందును ఉండి ఊర్ధ్వదృష్టిగలిగి సమద్వంద్వుడై నిద్రారహితుడై కుశాగ్రబుద్ధియగు కృష్ణద్వైపాయనాత్మజుడు ఇట్టి విధముగనుండి ఘోరమగు తపముచేయనారంభించెను.

శుకముని తపోజ్వాలలచే లోకోపద్రవము కల్గుట

తపసా తస్య సన్తప్తా చచాల చ వసున్ధరా ॥ ౧౭

మార్తాణ్డశ్చణ్డకిరణో న తతాప నభోఽన్తరే
అబ్ధయః క్షుభితాః సర్వే వవర్షుః న బలాహకాః ॥ ౧౮

జాతవేదా న జజ్వాల విమానాని దివౌకసామ్
నభోమధ్యే న చేరుశ్చ బభూవేన్ద్రశ్చ శఙ్కితః ॥ ౧౯

వృత్రవైరీ మహేన్ద్రోఽపి కింకర్తవ్యవిమూఢధీః
చిన్తయన్నస్య తపసో విఘ్నమప్సరసస్తదా
సమాహూయాఽహ వచనం సాదరం సాన్త్వపూర్వకమ్ ॥ ౨౦

తా॥ శుకబ్రహ్మర్షితపస్సుచే భూమి కంపించెను, ఆకాశమార్గమున భాస్కరుడు ప్రకాశించలేకపోయెను, సముద్రములు క్షోభించెను, మేఘములు వర్షించంప

జాలకపోయెను. అగ్నిభగవానుడు జ్వలింపలేదు. ఆకాశమండలమున దేవతల విమానములు సంచరించజాలకుండెను. ఈ నిమిత్తములను గమనించిన ఇంద్రుడు లోకోపద్రవమును శంకించి యేమిచేయుటకుతెలియక ముందుగా ఆతని తపో విఘ్నముచేయుట అవసరమని నిశ్చయించుకొని అప్సరఃస్త్రీలను పిలచి ఇట్లనెను.

శుకుని తపమును భంగపరచుడని దేవేంద్రుడు రంభాదులతో చెప్పుట.

'విసృష్టా వేధసా యూయం విసర్గాత్ జగతో హితే
రూపయౌవనలావణ్యశాలిన్యః పద్మలోచనాః
మత్తమాతఙ్గగామిన్యో మన్దమన్థరగీతయః ॥ ౨౧

సుభ్రువశ్చ సుకేశాన్తాః ఘనపీనపయోధరాః
శుచిస్మితాః పక్వబిమ్బాధరోష్ఠా మదలాలసాః ॥ ౨౨

యుష్మాభిర్మోహితం విశ్వం ససురాసురమానుషమ్
వీక్షణాద్యైర్విలాసైస్తు నిర్జితా మమ శత్రవః ॥ ౨౩

కామినీః పురతో దృష్ట్వా కః సమాధౌ ప్రవర్తతే
నిర్యాతి మానసం తస్మాత్ కార్ముకాత్ సాయకో యథా ॥ ౨౪

యూయమాపది సర్వత్ర బలమస్మాకమేవ హి
నాశక్యమస్తి వః కిఞ్చిత్ సర్వేషు భువనేష్వపి ॥ ౨౫

ఉపస్థితమిదానీం నః సకలానర్థకం భువి
కర్తవ్యః ప్రశమస్తస్య భవతీభిః ఝటిత్యపి' ॥ ౨౬

తా॥ ఓ కామినీమణులారా! చతుర్ముఖునిచే మీరలు లోకోపకారార్థము సృష్టించ బడిరిగదా. మీరలు రూపయౌవనలావణ్యములుగలవారలు, పద్మాక్షులు, మత్తమాతంగ గమనలు, మందమంథరవాక్కులు, చక్కని కనుబొమ్మలు కేశాన్తము ఘనపీన వక్షోజాతములు కలవారలు, శుచియగుస్మితము పక్వబింబము బోలిన అధరోష్ఠముగలిగిన మదలాలసలు, సురాసురమానుష సంపదగలిగిన ప్రపంచ మంతటిని మీరువశపరచుకొనగలరు. మీయొక్కకటాక్షపూరిత వీక్షణ విలాసములచే నాశత్రువులను ఓడించగలరు. మీవంటి సుందరులను యెదుట

నుండగా చూచిన చైతన్యముగల యే పురుషుడు తన ధ్యాననిష్ఠలో నిలువగలడు? అట్టి వానియొక్క దుర్బల చిత్తము ధనుస్సునుండి విడువబడిన బాణమువలె వెంటనే పరుగిడ నారంభించును మావంటి దుర్బలులకు మహత్తరమగు ఆపద కలిగినప్పుడు కాపాడెడిభారము మీయందే ఉన్నది. ఈ చతుర్దశ భువనము లందును మీచేత సాధించరాని కార్యమొక్కటియైనను లేదు ప్రకృతమున ప్రపంచమును ముంచివేయవగిన ఆపద మనకు తటస్థించినది మీచేతనే దీనికి పరిహారము కావలసియున్నది

వాసవేనైవముక్తానాం ప్రధానాప్సరసాం పరా
ప్రణమ్య ప్రాఞ్జలిః ప్రాహ రమ్భా మధురభాషిణీ ॥ ౨౭

తా॥ ఈరీతిగా మహేంద్రునిచే ప్రార్థింపబడిన అప్సరసలలో ప్రధానమైన రంభ ముందుకువచ్చి మధురమగు మాటలతో ఇట్లని చెప్పనారంభించెను.

రంభ చెప్పుచున్నది·

మహేంద్రుని యెదుట రంభాదులు శపథము చేయుట

'యచ్ఛాససి సురేశాన! తదద్య విదధీమహి
భవత్కృతే జీవితం నః త్రిదశాధ్యక్ష కేవలమ్ ॥ ౨౮

శ్వేతద్వీపం బ్రహ్మలోకం కైలాసం వాఽన్యమూర్జితమ్
ప్రవేక్ష్యామో వయం దేశం వర్తన్తే యత్ర తేఽరయః ॥ ౨౯

మోహితాశ్చ భవిష్యన్తి తేఽస్మద్వీక్షణవీక్షితాః
ఏకాకినః సదైకాన్తభావాః సాత్త్వికసత్తమాః ॥ ౩౦

ప్రణమన్తి స్మ నః పాదాన్ శిరోభిః మోహితాః స్వయమ్'

తా॥ దేవా! తమ ఆజ్ఞను నిర్వర్తించగలము మీ యోగక్షేమముల రక్షణముకై మా ప్రాణముల నర్పించగలము. శ్వేతద్వీపమునుగాని కైలాసమును గాని ఇంక నెట్టి గూఢప్రదేశమునుగాని నిర్భయముగా మేము ప్రవేశించి తమ శత్రువులను చేరగలము. మా కటాక్షపాతములచే చూడబడెడినవారలు ఏకాన్త మనస్కులైనను సదైకాన్త భావులైనను సాత్త్విక సత్తములైనను యెంత

నియమ నిష్ఠులైనను మోహితులై పోయెదరు అట్లు మోహముజెంది మా పాదములపైబ్రాలి మా చెప్పుచేతలంలో అణగిపోయెదరు

ఏవముక్తస్తు దేవేశః తయా మధురభాషయా ॥ ३०
ఏవమాహ స సన్తుష్టో రమ్భామప్సరసాం వరామ్
'సత్యముక్తం త్వయా రమ్భే! మునిమోహనరూపయా ॥ ३१
భూమౌ కశ్చిత్ మునివరః 'శుక' ఇత్యేవ నామతః
సువర్ణముఖరీతీరే తపశ్చరతి దుశ్చరమ్ ॥ ३३
తత్ర గత్వా మునిశ్రేష్ఠం మోహయధ్వం వరాఙ్గనాః'

తా॥ ఈరీతిగా రంభ చెప్పిన ప్రియవాక్యములను వినిన దేవేంద్రుడు సంతుష్టుడై ఇట్లని రంభతో పలికెను ఓరామామణీ! నీవుచెప్పినదంతయు సత్యము. దాననే నేను నీకీ కార్యభారమును నివేదించితిని భూలోకమందు శుకుడను పేరుగల ఒకానొకముని సువర్ణముఖరీ నదియొద్దున తపమాచరించు చున్నాడు. అచటకేగి మీరాతని తపమును భంగపరచుడు,

ఇత్యుక్తా దేవరాజేన ప్రేషితాః సాదరం కిల
దేవస్త్రియస్తం ప్రణమ్య జగ్ముర్యత్ర తపోధనః ॥ ३४
మునేః సమీపతో గత్వా తాః స్త్రియో మధురం జగుః
మదోద్ధతాశ్చ ననృతుః వేణువీణారవాన్వితమ్ ॥ ३५
కన్దర్పదర్పకలితాః కథయన్తః కథా మిథః
వదన్తి స్మ హసన్తి స్మ క్ష్వేలయన్తి మదాలసాః ॥ ३६
స్థిత్వా పురస్తాత్ తస్యేత్థం మదాన్ధాః సురయోషితః
శృఙ్గారచేష్టాః చక్రుశ్చ వివిధాః చాటుపూర్వకమ్ ॥ ३७
ఇన్ద్రప్రచోదితస్తత్ర తపనో న తతాప చ
వాయుః కల్హారసురభిః వవౌ మన్దః సుఖావహః ॥ ३८
సుధానిధిశ్చ వవృధే మదయన్ సురసున్దరీః
కాలః సర్వర్తుకుసుమోపేతస్తత్ర బభూవ హ ॥ ३९

ఏవంవిధే మధూద్వేగమహితేఽస్మిం స్తపోవనే
ఇత స్తతః శమ్బరారిః విశఙ్కో విచచార హ ॥ ४०

అతశ్చానఙ్గవివశాః చేష్టయన్త్యోఽమరాఙ్గనాః
తా న శేకు స్తస్య నేత్రే నివర్తయితుమగ్రతః ॥ ४१

తా॥ ఇట్లని దేవేంద్రునిచే పంపబడిన అప్సరసాంగనలు శుకతపోవనమునకేగి మధురముగ పాడసాగిరి మదోద్ధతురై వేణువీణారవములతో సహకరించబడి నర్తనమాడిరి. కందర్పదర్ప కలితములగు కథలను చెప్పుకొనుచుండిరి. పరిహాసములను పలుకుచు మదాలసలై నగుచుండిరి శుకబ్రహ్మర్షియెదుట నిలచిన మదాంధలగు నా స్త్రీలు చాటూక్తిపూర్వకములగు వివిధములగు శృంగారచేష్టల జేయనారంభించిరి వీరలకుసహాయము చేయుటకువలె ఇంద్రాజ్ఞచే సూర్యుడు తీక్ష్ణకిరణములతో తపింపక చల్లగ నుండెను అట్లేవాయుదేవుడును కల్హారసురభియు సుఖావహుడునై మెల్లగవీచెను సురసుందరులను హెచ్చరించుటకువలె చంద్రుడును శైత్యభారముతో ప్రకాశించెను కాలమును సర్వర్తు కుసుమోపేతమై యుప్పెను ఇట్టిఅకాలవసంతోద్వేగ మాషితమగు శుక తపోవనమునందు కుసుమాయుదుడు స్వేచ్ఛావిహారము జేయనారంభించెను, అంతట మదనమదావేశముచే వివశలగు సురాంగనలు యెట్టి క్రౌర్యములతో మహానుభావుని మోహింప జూచియు యెంతమాత్రము వారల చేష్టలు మహర్షి చిత్తమును తాకజాలక పోయెను.

శ్రీనివాస ధ్యానముచే జితకాముడగు బ్రహ్మర్షినిజూచి రంభాదుల పరిహాసము

సోఽపి ధ్యాయన్ శ్రీనివాసం శఙ్ఖార్యబ్జగదాధరమ్
వాసుదేవం హృషీకేశం జగతాం కారణం పరమ్॥ ४२

సమాశ్రితార్తిహరణం సుహృదం సర్వదేహినామ్
నాచిన్తయచ్చాన్తికస్థాః తాః స్త్రియ స్తపసైధితః ॥ ४३

సమీక్ష్య తా స్తం దుర్ధర్షమూచురప్సరస స్తదా
లజ్జాక్రోధసమావిష్టా శ్చైవమూచుః పరస్పరమ్ ॥ ४४

'కో వా హ్యన్తేఽత్ర దుర్బుద్ధిః పృష్ఠి నిక్షిప్తవీక్షణః
ఉపస్థితముపేక్ష్యేమం గణమప్సరసాం స్వయమ్ ॥ ౪౫

సమీపస్థమసమ్ప్రేక్ష్య సర్వస్య తపసః ఫలమ్
దురాత్మనాఽతిమూఢేన అముత్ర కిం చిన్త్యతేఽధునా ॥ ౪౬

దృష్ట్వా ముఖాన్యప్సరసాం సహస్రాక్షః శచీపతిః
సురాధీశః సహస్రాక్ష్ణాం సాఫల్యం సమ్యగశ్నుతే ॥ ౪౭

యాగాదికాః క్రియాః సర్వాః కుర్వన్త్యస్మత్కృతే నరాః
దదుశ్చ ధనధాన్యాని తప్యన్తి స్మ తపాంసి చ ॥ ౪౮

యస్త్వస్మాకం ప్రియాలాపాన్ న శృణోతి మనోరమాన్
అచేతనో వృథాజీవీ భవత్యల్పమతిః స హి ॥ ౪౯

స్తనాశ్లేషం నరోఽస్మాకం లభతే యః సుదుర్లభమ్
స ధన్య పురుషో లోకే గణ్యతే పుణ్యకోవిదైః ॥ ౫౦

విద్యానామార్జనం బాల్యే యౌవనే విషయైషితా
వృద్ధత్వే తపసాం వృత్తిః ఇత్యూశన్తి మనీషిణః ॥ ౫౧

సుకుమారో యువాఽత్యన్తసుభగః తపసి స్థితః
శృఙ్గారిణీనాం శృఙ్గారః సున్దరీజనసున్దరః ॥ ౫౨

దేశకాలావతిక్రమ్య యత్కర్మ కురుతే నరః
తత్తస్య నిష్ఫలమితి ప్రవదన్తి మనీషిణః ॥ ౫౩

స్వధర్మాచారనిరతా వేదశాస్త్రవిశారదాః
కరస్థరత్నముత్సృజ్య మూఢధీః అన్యదిచ్ఛతి ॥ ౫౪

దివ్యాఙ్గనాః పూజనీయా మనుష్యాణాం విశేషతః
అయమస్మాన్ అనాదృత్య తిష్ఠత్యత్యన్తదుర్మతిః ॥ ౫౫

'పూజ్యపూజావిపర్యాసః శ్రేయో హన్తీత్యుశన్తి హి'

తా॥ శుకుడు, శంఖచక్రగదాధరుడును, వాసుదేవుడును, హృషీకేశుడును జగత్తులకు పరమకారణమైనవాడును, ఆశ్రితారిహరుడును; సర్వప్రాణధారులకు సుహృదుడును నగు శ్రీనివాసుని ధ్యానించుచు తపస్సునందె దృష్టినుంచుకొని తన సమీపమున విలాసచేష్టల జేయు సురస్త్రీలను కన్నెత్తి చూడకుండెను. అట్టి నిశ్చలచిత్తుని జూచిన స్త్రీలు లజ్జాక్రోధములచే నిండినవారలై తమలో తాము ఇట్లని చెప్పుకొన నారంభించిరి. 'ఎవడక్కడ సూర్యునిపై దృష్టిబెట్టుకొని తపసుచేయు దురాత్ముడు: తన యెదుట తాముగా సాక్షాత్కరించిన ఈ యప్సరోంగనలను చూడజాలక యేమరినాడు! అన్ని తపస్సులకు పరమఫలము మా సంగముకంటె వేరైన దెద్ది? పరలోకమును యెరుగజాలని ఆ మూఢు డెట్టి వ్యర్థుడు? దేవలోకాధిపతియగు దేవేంద్రునకు సహస్రనేత్రములుండిన ఫలము మా సౌందర్యము ననుభవించుటచేత గదా సాఫల్యము వెందినది లోకాంతరములందు నరులు మా సంగమమును కోరిగదా యాగాదిసమస్తకర్మల నాచరింతురు? మా సంగమము నుద్దేశించిగదా వారలు ధనధాన్యములను దానముచేయుటయు తపమాచరించుటయు గదా చేయుచున్నారు. మనోరమములగు మా ప్రియాలాపములను చెవులార వినలేనివాడు అల్పమతియగు అచేతనమగు వ్యర్థజీవియగును సుదుర్లభమగు మా స్తనముల నాలింగనము జేసికొనెడి మహాభాగ్యమును కలిగిన పుణ్యాత్ముడు గదా పుణ్యపురుషులచే ధన్యజీవిగా యెంచబడుట? మానవునకు బాల్యదశయందు విద్యార్జనము, యౌవనదశయందు విషయభోగము, వార్ధక్యమునందు తపస్సుచేసికొనుటలను న్యాయప్రాప్తములుగా పెద్దలు విధించియున్నారు. యౌవనవంతుడును, సుకుమారుడును, సుభగుడును, కామినులకు కామదాహమును తీర్చగల సుందరుడును నగు నొకానొకడు, దేశకాలముల స్వరూపమును యెరుగజాలక ఉన్మత్తప్రవర్తనము చేసినంతట, ఆతడు చేయు కార్యము యెంత గొప్పదైనను నిష్ఫలము కాగలదు ఇది ధర్మపరాయణుల మతము చేతికందిన రత్నమును జారవిడచి, మట్టిపెంకును కోరినట్లున్నది. మనుష్యులకు అప్సరః కామినులు పూజ్యగోష్ఠిలో చేరినవారు. అట్టిసందర్భమున నీ మనుష్యమాత్రుడు మనలను నిరాదరముగ చూచుచున్నాడు. పూజ్యపూజావ్యతిక్రమము మహాపాపముగను శ్రేయోఘాతిగను పర్యవసించునని పెద్దలందురు.

రంభాదులమాటలను వినిన శుకుడు పరితపించుట

తాస్విత్థం జల్పమానాసు సురయోషిత్సు సువ్రతః ॥ ౫౬
తపఃకృశతరాకారః కృష్ణద్వైపాయనాఽఽత్మజః
నాచిన్తయత్ సమస్తాస్తాః పుష్యన్తీరివ గర్దభీః ॥ ౫౭
ఉపస్థితం తపోవిఘ్నం చిన్తయామాస చ స్థిరః
"కేనేమాః ప్రేషితాః హ్యస్మత్తపోభఙ్గచికీర్షుణా ॥ ౫౯
అవ్యాజవైరిణా కశ్చిత్ లోభోపహతచేతసా
నిదానం పాపచేష్టానాం పాపీయస్యః స్వతః స్త్రియః ॥ ౬౦
అనేకానర్థసార్థాస్తాః వ్యక్తముక్తా మనీషిభిః
వ్రీడా విజ్ఞానమాస్తిక్యం పౌరుషం శ్రుతిరున్నతిః ॥ ౬౧
దర్శనాదేవ నశ్యన్తి స్త్రీణామేతాని సర్వశః
ధైర్యపారంగతః సర్వధర్మశాస్త్రవిశారదః ॥ ౬౨
యోషిద్దర్శనమాత్రేణ ముహ్యతి క్షుభ్యతి స్వయమ్
స్త్రియో హి నరకద్వారం నిర్మితం పరమేష్ఠినా ॥ ౬౩
తస్మాత్తద్దర్శనం పాపం నరాణాన్తు తపస్వినామ్
స్త్రీపుంవిభాగో జగతాం భూత్యై ధాత్రా వినిర్మితః ॥ ౬౪
తేన ప్రవర్తతే లోకః పురుషార్థాత్మకేన తు
అజ్ఞానినో నరా ముహ్యన్త్యన్యోన్యప్రణయాదిహ ॥ ౬౫
పురుషాశ్చ స్త్రియో దృష్ట్వా తాంశ్చ దృష్ట్వా చ తాస్తథా
తితీర్షుస్తపసాఽజ్ఞానమయం సంసారసాగరమ్ ॥ ౬౬
నివృత్తవిషయోఽత్రైవ స్థితోఽస్మిన్ విజనే వనే
విధినాఽఽపాదితశ్చైవాన్తరాయస్తపసో మమ ॥ ౬౭
స్త్రియస్తపోవిఘ్నకర్యః పరిహార్యాః ప్రయత్నతః
తితీర్షుం దుస్తరం ఘోరం మహాసంసారసాగరమ్ ॥ ౬౮
గృహ్ణాతి విషయగ్రాహో మధ్యే పురుషమిత్యుత"
తపోలోభభయాదిత్థం చిన్తయన్ సహసా మునిః ॥ ౬౯

సమదర్శీ తు సర్వత్ర జితక్రోధో జితేన్ద్రియః
కన్దర్పసాయకాన్ ఘోరాన్ జిత్వాఽక్షోభ్యో హి నిర్మమః
శ్రీనివాసం హృషీకేశం సహసా శరణం యయౌ ॥ ౩౦

తా॥ ఇట్లు దుర్వాక్యములను పలికెడి రంభాదులను చూచిన శుకుడు తపః కృశతరాకారుడై ఇనుమడించిన పరితాపము నొంది, వారల వాక్యములనుగాని, చేష్టలనుగాని లక్ష్యముచేయక, తనకిది పరీక్షాసమయమగు దైవ ప్రేరణముగా నెంచి ఇట్లని చింతింప నారంభించెను "నేను నిరపరాధిని, లోభోపహతచేతసు డగు నెవ్వనిచే నా తపోభంగమునుద్దేశించి ఈ స్త్రీలు ప్రయోగింపబడి యుండ నగును ? సహజముగ స్త్రీజాతియే పాపములకు మూలకారణము స్త్రీలజీవనమే పాపఫలము అనేకానర్థములకు పరమకారణమని స్త్రీల వృత్తమును పెద్దలు చెప్పుదురు, లజ్జయు, విజ్ఞానము, ఆస్తిక్యము, పౌరుషము, శ్రుతి, ఉన్నతి యను సుగుణసంపద యంతయు స్త్రీలను చూచినంత మాత్రముననే పురుషుని యందు నశించిపోవుచున్నవి ధైర్యపారంగతుడును, సర్వధర్మశాస్త్రవిశారదు డును అగు పురుషుడు స్త్రీవ్యక్తిని చూచినంతట స్వయముగా ముగ్ధుడై పోవు చున్నాడు పరమేశ్వరుని సృష్టియందె నరకలోకమునకు త్రోవగా స్త్రీలు నిర్మించబడిరి అందును, తపస్సుచేయు నావంటివారలకు స్త్రీలను తిలకించుట పాపము స్త్రీ పురుషులను రెండు జాతులు ఆదిలో సృష్టింపబడుట మంచికే ఉద్దేశింపబడినది. స్త్రీపురుషులు ఇరువురు ఉండుటచేతనే ధర్మార్థకామములు, వాట్లను అనుష్ఠించుటకు అవకాశమును కలిగి, ప్రజలు సృష్టియగుచున్నారు. అజ్ఞానముచే ముగ్ధులగువారలు స్వపరభేదము తెలియజాలక, ఒకనిభార్యను మరి యొకడును, ఒకతెపురుషుని మరియొకతెయు కోరుట అనర్థము. అజ్ఞానఫల మగు సంసారసముద్రమును దాటి నిత్యనిరతిశయానందపదవిని కోరి, ప్రపంచ విషయములను మరచి నేనీ నిర్జనవనములో తపస్సు చేసికొనుచున్నాను. నేటికి దైవయోగముచే నా తపస్సును భంగపరచుట కీ యప్సరోంగనలు తటస్థించిరి. తపోవిఘ్నకారణమగు నీస్త్రీలనుండి తప్పక నేను విడిపడవలెను. దుస్తరమగు నీ సంసార సాగరమును దాటుటకు స్త్రీయ పరమప్రతిబంధము మహాసముద్ర ములో తిరుగువానిని తిమింగిలము వలె స్త్రీలు సంసారసాగరపతితుని మ్రింగి వైతురు." ఇట్లని అనేక విధములుగ తన తపోవ్రతము చెడకుండ రక్షించుకొను

టకై తపోభంగనిమిత్తమును తొలగించుటనుగూర్చి శుకుడు చింతింప నారంభించెను. ఆవల సర్వత్రసమదర్శియు, జితేంద్రియుడును, జితక్రోధుడునై కందర్పబాణములను పూర్తిగా జయించిన శుకుడు నిర్మముడును అక్షోభ్యుడునై, హృషీకేశుడగు శ్రీనివాసునినే శరణము వేడుకొనెను

కమలవిభవలోభనైరనఙ్గాభినవవిభూతివిభాగభాగధేయైః
అధరితమునిమానసానుభావైః అవమతిమాకలయద్భిరవిలోకనైశ్చ॥

శిఖరదశనదీధితిప్రతానప్రసభనిరస్తతమశ్ఛటైః ప్రహాసైః
నటనవికటవిభ్రమైః చికీర్షన్నయనవిలాసభరైః తపోఽన్తరాయమ్॥

ఇతి విబుధవిలాసినీగణస్తం మునిమభితః పరివార్య చావతస్థే
వ్యవసితమతిరచ్యుతప్రపత్తౌ స చ న శశాప తపోవినాశభీరుః॥

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవలదేవదర్శన సంవాదే పాద్మసరస్తీరస్థదివ్యారామే శుకబ్రహ్మర్షేః మహానియమపూర్వక-తపఃకరణాదివర్ణనం నామ పఞ్చవింశోఽధ్యాయః

తా॥ కమల విభవలోచనములును, అనంగాభినవవిభూతి విభాగభాగధేయములును, అధరితమునిమానసానుభావములచే అవమతిని సూచించెడి కటాక్షములచేతను శిఖరదశనదీధితిప్రతానప్రసభనిరస్తతమశ్చటములగు ప్రహాసములచేతను, నయనవిలాసభరములగు నటనవికటవిభ్రమములచేతను, బహువిధముగ సురకామినులు శుకుని తపోభంగము చేయుటకు సంకల్పించి, నాలు వైపులను ముని నాక్రమించి నిలచిరి ఎంతటి మహాప్రయత్నము చేసినను వారలను లక్ష్యముచేయక అచ్యుతదత్తావధానుడైన శుకుడు తన తపఃప్రవృత్తినుంచి తడబడకయు, తపోనాశభీతిచే వారలను శపింపజాలకయు తటస్థుడై నిలచిపోయెను.

ఇది శ్రీ పాద్మపురాణమునందు క్షేత్ర కాండమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున దేవల - దేవదర్శన సంవాదమున పద్మసరోవరతీరస్థమగు దివ్యారామమునందు శుకబ్రహ్మర్షి మహానియమపూర్వకముగ తపస్సుచేయుట మొదలగు కధలు చెప్పెడి ఇరువదియైదవ అధ్యాయము.

---

# ఇరువదియారవ అధ్యాయము

రంభాదుల ప్రలోభనమునకు భీతిజెందిన శుకుడు శ్రీనివాసుని స్తుతించుట

అథ విబుధవిలాసినీషు విష్వక్ మునిమభితః పరివార్య తస్థుషీషు
మదవికృతివికత్థనప్రలాపాస్వవమతినిర్మితనైజచాపలాసు ॥ ౧

త్రిభువనముదముద్యతాసు కర్తుం మదనసహాసాఽగతిగర్వనిర్వహాసు
మధురసభరితాఖిలాత్మభావాస్వగణితభీతిషు శాపతః శుకస్య ॥ ౨

అతివిమలమతిర్మహానుభావో మునిరపి శాన్తమనాః నిజాత్మగుప్త్యై
అఖిలభువనరక్షకస్య విష్ణోః స్తుతిమథ కర్తుమనా మనాక్ బభూవ ॥

తా ॥ సురాంగనలు మదవికృతి వికత్థనప్రలాపములు గలవారలును, అవమతినిర్మితనైజచాపలముతో కూడినవారలుగను, త్రిభువనముదమును కలుగజేయు నుద్యోగము గలవారలుగను, మదనసహాసాగతినిర్వహాలుగను నై శుకబ్రహ్మర్షిని ఆవరించి నలుదిక్కులనుండి శుకబ్రహ్మర్షి శాపమునిచ్చునను భయము కూడ తలచక తమ చేష్టలను చేయుచుండినను, అతిపరిశుద్ధాంతఃరంగుడును. మహానుభావుడును నగు శుకుడు తన యాత్మరక్షణమునే వాంఛించుచు, అఖిలభువనరక్షకుడగు శ్రీనివాసమహాప్రభువునే స్తుతించవలయునను నిశ్చితాధ్యవసాయము నొందెను

"శ్రియః శ్రియం షడ్గుణపూరపూర్ణం
శ్రీవత్సచిహ్నం పురుషం పురాణమ్ ।
శ్రీకణ్ఠపూర్వామరబృన్దవన్ద్యం
శ్రియఃపతిం తం శరణం ప్రపద్యే ॥ ४

విభుం హృదిస్థం భువనేశమీడ్యం నిరాశ్రయం నిర్మలచిత్తచిన్త్యమ్
పరాత్పరం పారమపారమేనం ఉపేన్ద్రమూర్తిం శరణం ప్రపద్యే॥

స్మేరాతసీసూనసమానకాన్తిం సురక్తపద్మప్రభపాదహస్తమ్
ఉన్నిద్రపఙ్కేరుహచారునేత్రం పవిత్రపాణిం శరణం ప్రపద్యే ॥ ౬

సహస్రభానుప్రతిమోపలౌఘస్ఫురత్కిరీటప్రవరోత్తమాఙ్గమ్
ప్రవాలముక్తానవరత్నతారహారం హరిం తం శరణం ప్రపద్యే ॥ ౮

తా॥ మహాలక్ష్మికి అలంకారమును, షడ్గుణములచే పూర్ణుడును శ్రీవత్స మను దివ్యాసాధారణచిహ్నమును విశాలవక్షఃప్రదేశమునధరించినవాడును పురాణ పురుషుడును, పరమశివుడాదిగాగల దేవతాబృందముచే స్తుతియింపబడువాడును, శ్రీమహాలక్ష్మికి భర్తయు నగు శ్రీశ్రీనివాసుని స్తుతించెదను సర్వవ్యాపియు, సర్వప్రాణిహృదయవాసియు, చతుర్దశభువనములకు ప్రభువును, నిరాశ్రయుడును నిర్మలచిత్తము గలవారిచేతనే అనుభావ్యుడును, పరాత్పరుడును, పారమును అపారమును నగు నుపేంద్రమూర్తిని శరణము నందెదను. స్మేరాతసీసూన సమానకాంతియుతుడును, సురక్తపద్మప్రభపాదహస్తుడును, ఉన్నిద్రపంకేరుహ చారునయనుడును, పవిత్రపాణియునగు శ్రీనివాసుని శరణము నందెదను. వేయి మంది సూర్యులప్రభతో వెలిగెడి మణులకాంతిచే ప్రకాశించెడి దివ్యకిరీటమును ధరించిన శిరఃప్రదేశము కలిగినట్టియు, ప్రవాళముక్తానవరత్నతారహారములు కలగినట్టియు శ్రీ శ్రీనివాసమూర్తియే నాకు రక్షకుడు,

శకుడు స్తుతించిన దశావతారస్తోత్రము

'పురా రజోదుష్టధియో విధాతుః
అపాకృతాన్ యో మధుకైటభాభ్యామ్।
వేదానుపాదాయ దదౌ చ తస్మై
తం మత్స్యరూపం శరణం ప్రపద్యే ॥ ౧

పయోధిమధ్యే పృథుమన్దరాద్రిం ధర్తుం చ యః కూర్మవపుర్బభూవ
సుధాం సురాణామవనార్థమిచ్ఛన్ తమాదిదేవం శరణం ప్రపద్యే॥
వసున్ధరాందుర్భరదైత్యపీడితాం రసాతలాన్తర్వివరాభివిష్టామ్
ఉద్ధారణార్థఞ్చ వరాహ ఆసీచ్చతుర్భుజం తం శరణం ప్రపద్యే ॥
నఖైరురస్తీక్ష్ణముఖైర్హిరణ్యాం అరాతిమామర్దితసర్వసత్త్వామ్
విదారయామాస హి యో నృసింహో హిరణ్యగర్భం శరణం ప్రపద్యే ॥

యో యజ్ఞవాటమభిగమ్య పూర్వం బలేర్యయాచే త్రిపదీం భువశ్చ
పశ్చాద్దదౌ తత్పదమేవ తస్మై శ్రీవామనం తం శరణం ప్రపద్యే ॥
త్రిస్సప్తకృత్వః క్షితిపాలలోకం పరశ్వధేనాపి నిహత్య పిత్రే
దదౌ నివాపం తదసృగ్జలౌఘైః తం భార్గవం రామమహం ప్రపద్యే ॥
దశాననం దాశరథిః స భూయః ఛిత్త్వా శిరాంస్యేకశరేణ వీరః
లఙ్కాం దదౌ యశ్చ విభీషణాయ తం రామచన్ద్రం శరణం ప్రపద్యే॥
హలాయుధో యో యదువంశదీపః ప్రలమ్బపూర్వామరవైరిహన్తా
అభూద్వదాన్యో బలభద్రరామో విరాట్ పరం తం శరణం ప్రపద్యే ॥
వృష్ణ్యన్వవాయప్రభవం ధరిత్రీభారాపహారప్రథితప్రభావమ్
కృష్ణం పరం పాణ్డవభాగధేయం యోగీన్ద్రవన్ద్యం శరణం ప్రపద్యే॥
కలిం స్వతః కల్మషదుష్ప్రధర్షం కలానువిద్ధం వికరాలవేషమ్
సంహర్తుకామో భవితా చ కల్కిర్యస్తం ముకున్దం శరణం ప్రపద్యే॥

తా॥ ఒకానొకప్పుడు రజోగుణహతబుద్ధియగు చతుర్ముఖుని యేమార్చి వేదములను అపహరించి పోయిన మధుకైటభులను సంహరించి వారలనుండి తిరిగి వేదములను తెచ్చి బ్రహ్మకొసగిన మత్స్యరూపుని స్తుతించెదను మహోదధిని అమృతమునకై మథించునపుడు మస్థదండముగ నేర్పడిన మందర పర్వతమును ఉద్ధరించుటకై పర్వతమును మోసి, దేవతలను కాపాడుటకై, అమృతము నుత్పత్తిచేసిన కూర్మరూపుడగు శ్రీమహావిష్ణువును స్తుతించెదను, రాక్షసులదౌష్ట్యమును సహింపజాలక పాతాలమున మునిగిపోయిన భూమాతనుద్ధ రించుటకై వరాహరూపమునెత్తిన వరాహమూర్తిని స్తుతించెదను భక్తుడగు ప్రహ్లాదుని కాపాడుటకై భయంకరావతారమెత్తి శత్రుడగు హిరణ్యకశిపుని తీక్ష్ణ నఖాగ్రములతో చీల్చి చంపిన నృసింహమూర్తిని స్తుతించెదను దేవతలకు విరోధియగు బలిచక్రవర్తిని యాచించుటకై వటురూపమును ధరించి, మూడడు గుల నేలను దానముగా పొంది, అందుచే మూడులోకములను గెలిచి, మూడు లోకములను ఇంద్రునకిచ్చి, బలికి తనలోకము నొసగిన వామనమూర్తిని స్తుతించెదను ఇరువదియొక్కసారులు భూప్రదక్షిణముగా దిగ్విజయముచేసి,

దుష్టక్షత్రియులను సంహరించి వారిల రక్తప్రవాహములచే పితృతర్పణముజేసిన పరశురామమూర్తిని స్తుతించెదను దశాననుడగు రావణుని తలలను ఒకేబాణమున కెరజేసి ఖండించి, అతని సోదరుడగు విభీషణునకు లంకారాజ్యమునిచ్చిన దశరథరాముని స్తుతించెదను. యాదవ వంశమున నవతరించి, ప్రలంబుడాదిగా గల అసురుల సంహరించి వదాన్యుడై వెలసిన బలరామమూర్తిని స్తుతించెదను భూభారహరణమును సంకల్పించి, వృష్ణికులమునం దవతరించి మహాయశస్సు నార్జించి, మహాభారతయుద్ధమున పాండవులను కాపాడిన శ్రీకృష్ణమూర్తిని స్తుతించెదను. సహజకల్మషకలుషితమును, భయంకర దురాచారస్వరూపము నగు కలియుగము నుద్ధరించుటకై యవతరించబోయెడి కల్కిమూర్తిని శరణము వేడెదను

అహం మహత్త్వేన్ద్రియపఞ్చభూతతన్మాత్రమాత్రా ప్రకృతేః పురాణీ
యతః ప్రసూతా పురుషః తదాత్మా తమాత్మనాథం శరణం ప్రపద్యే॥
పురా య ఏతత్సకలం బభూవ యేనాపి తద్యత్ర చ లీనమేతత్
ఆస్తాం యతోఽనుగ్రహనిగ్రహౌ చ తం శ్రీనివాసం శరణం ప్రపద్యే॥
నిరామయం నిశ్చలనీరరాశినికాశసద్రూపమయం మహస్తత్
నియన్తృ నిర్మాతృ నిహన్తృ నిత్యం నిదానమేకం శరణం ప్రపద్యే॥
జగన్తి యః స్థావరజఙ్గమాని సంహృత్య సర్వాణ్యుదరేశయాని
ఏకార్ణవాన్తర్వటపత్రతల్పే స్వపిత్యనన్తం శరణం ప్రపద్యే॥ ౨౧
నిరస్తదుఃఖౌఘమతీన్ద్రియం తం నిష్కారణం నిష్కలమప్రమేయమ్
అణోరణీయాంసమనన్తమన్తః ఆత్మానుభావం శరణం ప్రపద్యే॥
సప్తామ్బుజీరఞ్జకరాజహంసం సప్తార్ణవీసంసృతికర్ణధారమ్
సప్తాశ్వబిమ్బస్థహిరణ్మయం తం సప్తార్చిరఙ్గం శరణం ప్రపద్యే॥
నిరాగసం నిర్మలపూర్ణబిమ్బనిశీథినీనాథనిభాననాథమ్
నిర్ణీతనీతిం నిగమాంతనిత్యనిశ్శ్రేయసం తం శరణం ప్రపద్యే॥
ద్వితీయహీనం రచితాజడాత్మనిజాన్తరారోపితవిశ్వవిశ్వమ్
నిస్సీమకల్యాణగుణాత్మభూతం నిధిం నిధీనాం శరణం ప్రపద్యే॥

## శ్రీ శ్రీనివాసునిగూర్చి శుకబ్రహ్మర్షి కోరినప్రార్థనము

త్వక్చర్మమాంసాస్థ్యసృగశ్రుమూత్ర-
శ్లేష్మాన్త్రవిట్శుక్రసముచ్చయేషు ।
దేహేష్వసారేషు న మే స్పృహైషు
ధ్రువం ధ్రువం త్వం భగవన్! ప్రసీద ॥ ౨౬

కారుణ్యపాథోనిధివల్గదూర్మిమాలాలసచ్ఛైవలకజ్జలాక్తైః
రాజీవరాజీరమణైరపాఙ్గైరనాథమానన్దయ నాకనాథ! ॥ ౨౭

భక్తిఃక్వ! మేత్వచ్చరణారవిన్దమధూదమాద్యన్మహిమాఽప్యనన్యా
బుద్ధిః క్వ! దుష్టేన్ద్రియవాజిరూఢా నైకత్ర తేజస్తిమిరస్థితిర్హి! ॥ ౨౮

న విద్యతే త్వత్పదపద్మపీఠనిషేవిణాం క్వాప్యశుభం నరాణామ్
ఉపస్థితం మే భయముత్పలాక్షీవిలోకనైర్లోపయ లోకనాథ! ॥ ౨౯

సమాధిభఙ్గోఽయమిహ ప్రవృత్తో దురాత్మనా కేన దురన్తచిన్తః
త్వమేవ మాం రక్ష భయాదముష్మాత్ త్వదన్యతోనాస్తిగతిర్ముకున్ద ॥

అనాథనాథ! ధిషణా మమ త్వయ్యేవ వర్తతే
సర్వథా సర్వకాలేషు తదాఽఽస్తాం త్వత్ప్రసాదతః ॥ ౩౧

ప్రసన్నే త్వయి గోవిన్దే లభ్యం సర్వత్ర కిం? ప్రభో
స్వర్గాపవర్గౌ భగవన్ త్వద్భక్తానామదుర్లభౌ ॥ ౩౨

భవతా వీక్ష్యతే యస్తు తస్య తద్భక్తిరూర్జితా
ఉపేక్ష్యతే తు యస్తస్య భోగేచ్ఛా చాభిజాయతే ॥ ౩౩

అతః శృఙ్గారయోగ్యస్త్రీభయవిహ్వలమత్ర మామ్
రక్ష త్వమేవ శరణం అనన్యశరణో గతః ॥ ౩౪

నమః సకలకల్యాణకారిణే కరుణాత్మనే
శ్రీవత్సవక్షసే తస్మై లక్ష్మీనారాయణాత్మనే" ॥ ౩౫

తా॥ ఓదేవా! త్వక్చర్మమాంసాస్థిరక్తాశ్రు మూత్రశ్లేష్మాన్త్రవిట్ శుక్లము లచే కూడిన యీ పాంచభౌతికదేహము లసారములు. వీనియందు నాకిచ్ఛ లేదు. అనుగ్రహింపుము. నాకలోకేశ్వరా! దయాసముద్ర తరంగముల నడుమ రాజించెడి కమలముల నుండివలె చల్లనై పారెడి నీకటాక్షములను నాపై ప్రసరింప జేయుము. ఓప్రభూ! నీ చరణకమలములందలి మధువును పానము చేయించ గలిగిన భక్తి స్వరూపమెక్కడ? దుష్టేంద్రియములను గజ్జములచే ఈడ్వబడిన నాబుద్ధి యెక్కడ! ప్రకాశము అంధకారమునను నీ రెండిటివలె నీ భక్తియు నాబుద్ధియు ఒకేచోట నిలమటకు యోగ్యత కలసిరాదు. లోకనాథా! నీ పాదార విందములను సేవించెడివారల కెట్టి అశుభమును రాదు. ఈ అప్సరస్సుల వీక్షణము నాకు భయమును కలుగజేయుచున్నది. ఓ ముకుందా! నాకిప్పుడు తపో భంగకారణము యే దుష్టునిచేతనో కావింపబడినది. ఈ ఆపదనుండి నన్నుద్ధ రించుటకు నీవుతప్ప గత్యంతరములేదు. ఓ అనాథరక్షకా! నీయందే నామనసు లగ్నమై పోయినది. యెట్టి ఆపద యందును. నా బుద్ధిని చలింపకుండ చేయుము. ఓ గోవిందా! నీవు ప్రసన్నుడవుకాగా యెట్టికొఱతయు కలుగదు. నీభక్తులకు స్వర్గమేమి మోక్షమేమి అతిసులభముగ లభించగలవు. ఓప్రభూ! నీయనుగ్రహము కలిగినచో నీయందు భక్తి అట్టివానిని తానుగా వరించును. అది లేనియెడల అట్టివానికి విషయేచ్ఛయే కలుగును. కావున ఈ యప్సరసలవలన కలుగుచున్న ఆపదనుండి నన్ను కాపాడుము. నేను ఇతరమగు దిక్కులేని వాడను. నిన్నే శరణమునొందితిని. సకల కల్యాణ దాయకుడును శ్రీవత్స వక్షసుడును లక్ష్మీనారాయణాత్మకుడునునగు నీకు నా నమస్కారము.

రంభాదులు విసగి తమనే నిందించుకొనుచు స్వస్థానమున కేగుట

పారాశరేబ్రహ్మమునౌ పురాణం పుమాంసమిత్థం శరణం ప్రపన్నే
దేవస్త్రియః కామశరేణ విద్ధా యథాగతం క్షీణధియః ప్రతీయుః ॥ ౩౬

అథ సురవనితాభిరీక్షణాద్యైః నిజవికృతైరగృహీతచిత్తవృత్తిః
విధురివ తమసా గృహీతముక్తో మునిరపి నిశ్చలధీః తపఃప్రపన్నః ॥

ఫలాన్యలభమానాసు తపోభఙ్గే మహామునేః
రూపవేషాభ్యసూయాసు నిర్గతాస్వప్సరస్స్వితః ॥ ౩౭

తా॥ ఈ విధముగ శ్రీ శుకబ్రహ్మర్షి పరమపురుషునివేడుచు తమవలలో పడకుండ కాపాడుకొనుటను చూచిన అప్సరస్త్రీలు కామబాణహంతులై విజయము నొందజాలకనే మరలిపోయిరి అట్లు వారిబాధను తొలగించుకొనిన బ్రహ్మర్షియు గ్రహణబాధనుండి తప్పించుకొనిన చంద్రునివలె తేజోవిశేషముతో ప్రకాశించెను. మహర్షిని తపోభ్రష్టుని చేయజాలని అప్సరసలు తమ రూపలావణ్యాదులందు జుగుప్సజెంది నిరాశులగుట ఆశ్చర్యముకాదు

భగవత్కృపచే శుకుడు ఇనుమడించిన శ్రద్ధతోనుండుట

తతః స్మరన్ భగవతో హృషీకేశస్య శార్ఙ్గిణః
ఇన్ద్రియగ్రామమఖిలం సంయమ్యాస్మై సమర్పయన్ ॥ ౩౯

పరాం కాష్ఠాం సమాకాఙ్క్షన్ కాష్ఠాశ్మసమకాయకః
అతితాపసచారిత్రంకుర్వన్నఙ్గుష్ఠభూమిగః ॥ ౪౦

భక్తార్తిభఞ్జనపరం భక్తవత్సలమవ్యయమ్
హృత్పుణ్డరీకనిలయం చిన్తయన్ పుష్కరేక్షణమ్ ॥ ౪౧

విజ్ఞానవైరాగ్యనిధిః కార్ష్ణిర్ద్వైపాయనిర్మునిః
అతిఘోరతరం క్రూరం చకార సుమహత్తపః ॥ ౪౨

తా॥ భగవానునిశక్తిచే విఘ్నములను గడచిన శుకుడును సకలేంద్రియ ములను వ్యాపారములను భగవదర్పితముజేసి తపస్సుకు పరమావధినిజెంది నిశ్చలకాయుడై పాదముల అంగుష్టములుమాత్రము భూమిని తాకునట్లు నిలచి భక్తవత్సలుడు భక్తార్తిభంజనచణుడు నగు పుష్కరేక్షణునే హృదయమున చింతించుచు దారుణముగ తపస్సుచేయ మొదలిడెను.

భగవంతుని సేవించిన శుకుడు పారవశ్యము జెందుట

తపసా తస్య సర్వాత్మా సన్తుష్టః పద్మలోచనః
సంహర్తా రక్షితా స్రష్టా భువనాని చతుర్దశ
అనుగ్రహీతాఽన్తర్యామీ నిగ్రహీతా నిరన్తరః ॥ ౪౩

శఙ్ఖచక్రగదామ్భోజరాజత్కరచతుష్టయః
ముక్తాతపత్రితానన్తసహస్రఫణమణ్డలః ॥ ౪౪

నవై రభినవాకల్పైః తపనీయమయాంశుకైః
సుమనోభిః దివ్యగన్ధైర్దివ్యాలేపనచన్దనైః ॥ ౪౫

అలఙ్కృతాఙ్గమహిమా స్మయమాన ముఖామ్బుజః
మకరన్దస్రవత్పద్మప్రభావగుణవీక్షణః ॥ ౪౬

ఆపాదచూడమాధుర్యమహిమా మహతో మహాన్
సేవావిశారదైః సార్ధం గణైస్తు కుముదాదిభిః ॥ ౪౭

విచిత్రహేతిహస్తేన విష్వక్సేనేన సేవితః
పఞ్చాయుధైః మూర్తిమద్భిః పరీక్షితసమీక్షణః ॥ ౪౮

మహర్షిభిః మరీచ్యత్రిభృగుపూర్వైః మహాత్మభిః
ఇన్ద్రాగ్నిదిభిః లో꞉పాలైః సేవానుగుణభూతిభిః ॥ ౪౯

త్రయస్త్రింశత్కోటిభిశ్చ దేవబృన్దైరభిష్టుతః
పఞ్చాత్మనః సుపర్ణస్య పఞ్చోపనిషదాత్మనః ॥ ౫౦

పఞ్చవక్త్రప్రతికృతేః పఞ్చాథర్వాఙ్గసమ్పదః
ఋగ్యజుస్సామవపుషో నాగాభరణభూషిణః ॥ ౫౧

అప్రమేయప్రభావస్య స్కన్దపీఠమధిష్ఠితః
అహంప్రథమపూర్వాభిః ద్వాత్రింశత్కోటిశక్తిభిః ॥ ౫౨

వైష్ణవీభిః సేవ్యమానో దేవః పద్మసరస్తటే
శ్రీభూమినీలాసహితః ప్రాదురాసీత్ పరః పుమాన్ ॥ ౫౩

తా॥ శుకుని తపసుకు సంతుష్టుడై జగత్సృష్టిస్థిత సంహార కారణమును అనుగృహీతయు అంతర్యామియు శంఖ చక్ర గదా పద్మములను ధరించిన నాల్గు భుజములు కలిగినట్టియు ఆదిశేషుని సహస్రఫణములచేత ఆవరింపబడిన శిరః ప్రదేశముగలట్టియు శ్రీనివాసుడు శుకునియెదుట సాక్షాత్కరించెను. దివ్య భూషణములు దివ్యాంబరములు పుష్పమాలికలు చందనానులేపనము ధరించిన దివ్యమంగళ విగ్రహము చిరునగవుతో ప్రకాశించెను. దేవదేవుని దివ్య కటాక్ష వీక్షణము మకరందమును చిమ్మెడి పద్మమువలె ఆహ్లాదకరమై యొప్పెను.

పాదాది చూడపర్యంతము దివ్యమోహనమగు మాధుర్యము మహాతో మహత్త్వ మును చాటుచుండెను. కైంకర్య పరవశులగు కుముదు డాదిగాగల పరిషద్గణము విచిత్ర హేతి హస్తుడగు విష్వక్సేనుడు విగ్రహములను ధరించిన పంచ దివ్యాయు ధములు మరీచి భృగ్వాది మహర్షులు ఇంద్రాదిలోకపాలకులు ముప్పది మూడు కోట్ల దేవతాగణము భగవానుని స్తుతించు చుండిరి. పంచోపనిషత్స్వ రూపు డును పంచాత్మకుడును పంచవక్త్ర ప్రతికృతియు పంచాధర్వాంగ సంపదుడును ఋగ్యజుస్సామ శరీరియు నాగాభరణభూషితుడును అప్రమేయ ప్రభావుడును నగు గరుడుని స్కంధపీఠము నధిష్ఠించి ముప్పదిరెండుకోట్ల పరిమితిగల వైష్ణవ శక్తులు పోటీచేయుచు ముందు నడచు చుండగా శ్రీభూమినిలా సహి తుడై పరమపురుషుడు సాక్షాత్కరించెను.

## శ్రీనివాసునికృపచే శుకునకు మోక్షప్రాప్తి

తత స్తపఃకర్శితాఙ్గో ముక్తః పరమపావనః
పురుహూతజితస్కన్ధం పురుపీఠమధిష్ఠితమ్
పురుహూతానుజం పూతం పురుషం తం పురాతనమ్ ॥ ౫౪

కటాక్షవీక్షావిధ్వ స్తశ్రితక్లేశభరం పరమ్
ప్రసన్నవదనం దృష్ట్వా విష్టరశ్రవసం విభుమ్ ॥ ౫౫

వైయాసిర్మునిశార్దూలః తపోవిగతకల్మషః
ససమ్భ్రమం సముత్థాయ నివిష్టః కుశవిష్టరాత్ ॥ ౫౬

రోమాఞ్చకఞ్చుకతనుః హర్షోత్ఫుల్లవిలోచనః
స హసన్ ఉత్తరాసఙ్గం ఛిన్దన్ కృష్ణమృగత్వచమ్ ॥ ౫౭

విక్షిపన్ అక్షమాలాఞ్చ తూర్ణం భిన్దన్ కమణ్డలుమ్
ఆనన్దాశ్రుపరీతాక్షో గద్గదద్గలకన్దరః ॥ ౫౮

తతశ్చ నర్తనం కర్తుం వికర్తనవిభాస్వరః
నివృత్తిధర్మనిష్ణాతో మునిః ప్రవవృతే ముదా ॥ ౫౯

తా॥ తపస్సుచే కృశించిన శరీరముగలిగి పవిత్రుడగు శుకుడు గరుడారూఢుడగు లక్ష్మీకాంతుని ముఖమండలమును దర్శించి విధ్వస్తార్తి శేషకల్మషుడై దిగ్గునలేచి శరీరమంతయు రోమాంచము గలుగగా హర్షోత్ఫుల్ల నేత్రుడై పెకిలినవ్వు నవ్వుచు ఉత్తరీయముగ ధరించిన కృష్ణమృగచర్మమును చేతధరించిన అక్షమాలను విసరి పారవైచికమండలమును పడద్రోచి ఆనందాశ్రు పరీతాక్షుడై నివృత్త ధర్మనిష్ణాతుడై గూఢ సూర్యకాంతితో జ్వలించుచు నర్తనము చేయ నారంభించెను.

మతఙ్గజక్రమభ్రమో భ్రమన్మతఙ్గజభ్రమః
సుధాభిలాషదేవభూః అమన్దమన్దవిక్రమః ।
నివాతదీపనిశ్చలః చలత్కరరవస్ఫుటత్
దిగన్తరాళమణ్డలో ననర్త నన్దయన్ విభుమ్ ॥ ౬౦

తా॥ ఏనుగు నడకవలె చలించుచు ఏనుగులను భ్రమింపజేయజాలినట్లు భగవదారాధన నియమిత దేహావయవ సర్వస్వముకలిగి అమన్ద మన్ద విక్రమముతో నివాతదీపమువలె నిశ్చలుడై కరతాడనముచే దిగన్తములు బ్రద్దలగు ధ్వనిని కల్పించిన శుకుని నర్తనము ఆశ్చర్యకరమైయుండెను.

పరిభ్రమన్ అదక్షిణం ప్రదక్షిణం పరిభ్రమన్
విభావయన్ విలోకయన్ అభావయన్ అలోకయన్ ।
శనైఃశనైరసఞ్చరన్ సుసఞ్చరన్ శనైఃశనైః
ముదావిలావలోకనో మదావిలావలోకనః ॥ ౬౧

తా॥ ప్రదక్షిణముగను అప్రదక్షిణముగను చింతనామగ్నుడై చూచుచును చింతారహితుడై చూడకను మెల్లగా నడవకను మెల్ల మెల్లగా నడచుచును సంతోష సూచకమగు విలోకములతోడను వికారసూచకమగు చూపుతోడను వేరు వేరు రీతిగ ఆ నర్తనముండెను.

తతస్తు తోటకం వృత్తం కరతాడనపూర్వకమ్
రచయ౯ దణ్డమాదాయ కరాభ్యామవలమ్బయన్ ।
ఆస్ఫోటయ౯ క్ష్వేలయంశ్చ స్వపదస్పర్శిమస్తకః
ననర్త పరమానన్దో వాచయ౯ నామ శార్ఙ్గిణః ॥ ౬౨

తా॥ చేత నొక కర్రనుపట్టుకొని కరతాడనము చేయుచు పెద్ద ధ్వనితో అరచుచు తనపాదములకు వంచిన శిరముతో వంగి లేచుచు తోటకవృత్తముచే కొన్ని పద్యముల నల్లి భగవన్నామమును పాడసాగెను

చరణం చటులం కలయ౯ కలయన్
కమలారసికం సరసం రమయన్ ।
నటనం ఘటయ౯ సుపదం సువద౯
హరినామ మునిః శుభదాయి శుకః ॥ ౬౩

తా॥ శుకుని శ్లోకవృత్తరచనము అందలి మాధుర్యమును కమలా కాముకుడగు పరమపురుషుని చిత్తమును చల్లజేయగలిగి నటనమునకు చక్కగా తోడ్పడుట శుకుని యదృష్టము.

అరుణారుణపఙ్కజసోదరదృక్ కరుణాపరిణామికటాక్షచణమ్ ।
రథనేమిలసత్కరనీరరుహం రమయన్నతసీకుసుమాఙ్గరుచిమ్ ॥

తా॥ ప్రభాతమున అరుణకాంతిచే వికసించిన కమలములవంటి నేత్రములు కలిగి సుదర్శనాయుధుడై అతసీ కుసుమ సమాన దివ్య దేహకాంతితో విరాజిల్లెడి పరమపురుష శుకుని నర్తనమాకర్షించెను.

సరసం విచర౯ పురతః పరితో విలసన్నసకృత్ మురవైరివిభోః ।
కరపఙ్కజతాడనతాలలసద్గమనం నిగమాన్తవిలాసభువః ॥ ౬౪

తా॥ సాక్షాత్కరించిన మురవైరిని వలుదెసలను తిరిగి కరతాడనములతో భజించుచు శుకుడుచేసిన నర్తనము వేదరాశిస్తవములవలె పరమపురుషుని నాకర్షించెను.

భుజబద్ధజటః కరయుగ్మభృతాఞ్జలికో మృగయూథపదృప్తవపుః ।
మృగయన్నివయూథపతింపరితః పునరప్యసకృత్ వికృతః సుకృతః ॥

తా॥ మదించిన మాతంగమువంటి దివ్యశరీరముతో పొంగిన శుకుడు భుజములందు కట్టుకొనిన జటాకలాపము కలిగి బద్ధాంజలియై యూథపుని వెదకెడి యేనుగువలె పలువికార చేష్టలను చేయుచుండెను

అతికుణ్డలితాఙ్గభుజఙ్గసమో నటనస్ఫుటకుట్టితకుట్టిమభూః ।
రజనీముఖతాణ్డవకుణ్డలితత్రిపురాన్తకరీతిపురశ్చరణః ॥ ౬౭

తా॥ పడగల నెత్తియాడెడి యహిరాజువలె తన నర్తనముతో చెదరిన భూభాగమంతయు కలిగిన శుకుడు సంధ్యాకాల తాండవమున కుండలితాంగుడగు త్రిపుర సంహారకునివలె కానవచ్చెను.

ఇతి దృఢకృతభక్తిః వాసుదేవే పరస్మిన్
అకలసకలమిశ్రశ్రేయసి శ్రీనివాసే ।
విగతకలిలకాయోఽపాయశూన్యాత్మభూతిః
విమలధిషణభూతః సంయమీ వ్యాససూనుః ॥ ౬౮

తా॥ నిష్కల సకల రూపియై పరమపురుషుడగు శ్రీనివాసుడు ప్రసన్నుడుకాగా పాపరహితుడును అపాయశూన్యాత్మభూతియు నిర్మలాంతః కరణుడునై వ్యాసపుత్రుడొప్పెను

హృదయకమలమధ్యాధ్యాసితం పఙ్కజాక్షం
పరిజనపరిబర్హాభూషణాస్త్రాది సేవ్యమ్ ।
బహిరివ పురతస్తం వీక్ష్య చక్షుఃపదస్థం
నియమితనిగమాన్తః పూర్ణకామో బభూవ ॥ ౬౯

తా॥ సమస్త పరివారనులతోడను దివ్యభూషణ దివ్యాస్త్రములతోను కూడి తన హృదయ కమలమందు నిరంతరము సాక్షాత్కరించుచుండిన పుండరీకాక్షుని కన్నెదుట సాక్షాత్కరించుకొనిన శుకుడు కృతార్థుడాయెను.

ఈదృశం తాదృశమ్మునిం భక్తివిహ్వలచేతసమ్
భక్తార్తిభఞ్జనకరో భగవాంస్తార్క్ష్యవాహనః ॥ ౭౧

దయామితామ్భోధితుఙ్గలోలకల్లోలకేళినా
సమీక్ష్య కమలాభోగభాగధేయేన చక్షుషా ॥ ౭౨

శబ్దబ్రహ్మమహావ్యూహగర్భం సంస్కృత్య స్వాముద్యతః
స్నేహగర్భేణ వచసా బభాషే హ్లాదయన్ హరిః ॥ ౭౩

తా॥ ఇట్లు భక్తివిహ్వలచేతసుడగు శుకుని జూచి గరుడవాహనుడు దయావృష్టితో నిట్లు పలికెను.

## శ్రీనివాసునికృపచే శుకునకు మోక్షప్రాప్తి

భగవానుడు చెప్పుచున్నాడు —

'మునే! తాపసశార్దూల! తపస్తప్తం సుదుశ్చరమ్
ఆనన్దకన్దసద్గర్భనిశ్శ్రేయసకరం పరమ్ ॥ ౭౪

ముక్తిర్దత్తా ముదాకారా సశరీరాఽవినశ్వరీ
కల్పక్షయే చ సాయుజ్యమస్మన్మన్త్రజపసమ్భవమ్' ॥ ౭౫

ఇత్యుక్త్వా భగవాన్ విష్ణుః కృష్ణద్వైపాయనాత్మజమ్
భక్తప్రతారితో భక్తైః తత్రైవాన్తర్దధే స్వతః ॥ ౭౬

తా॥ 'ఓ శుకమునీ! నీవు గొప్ప తపస్సుచేసితివి. ఇది ముక్తికి సాధనమైనది. ఈ శరీరముననే నీకు నిత్యానందమగు ముక్తి నిచ్చితిని. కల్పాంతమునందు నా మహామంత్ర జప మాహాత్మ్యము వలన నీకు నా సాయుజ్యము కలుగగలదు.' అని భక్తిపరవశుడగు పరమపురుషుడు శుకునికి వరమిచ్చి అంతర్హితుడాయెను

ముక్తః శుకో మునిరపి ముకున్దగతచేతనః
అప్రాకృతాఙ్గః ప్రథయన్ ప్రకృత్యా ప్రకృతిప్రభామ్ ॥ ౭౭

ప్రణమ్య దణ్డవద్భూమౌ సాష్టాఙ్గం తత్ర సత్వరః
అవాప్తాభీష్టకామః సన్ తత్రాఽస్తే సుఖమాశ్రమే ॥ ౭౮

ఇతి శ్రీ పాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీ వేఙ్కటాచలమాహాత్మ్యే దేవలదేవదర్శన-
సంవాదే శ్రీనివాసముద్దిశ్య రమ్భాద్యప్సరిస్సఙ్ఘభీత శుకస్తుత్యాది-
వర్ణనం నామ షడ్వింశోఽధ్యాయః

తా॥ ముకుంద పాదారవిందగత మనస్కుడగు శుకుడు దివ్యరూపముతో భగవానుని సాష్టాంగముగ నమస్కరించి కృతకృత్యుడై, తన ఆశ్రమమున సుఖముండెను.

ఇది శ్రీపాద్మపురాణమునందు క్షేత్రకాండమున శ్రీ వేంకటాచల
మాహాత్మ్యమున దేవల—దేవదర్శన సంవాదమున రంభాద్యప్సరసల చూపులకు
భయపడిన శుకుడు శ్రీనివాసుని ప్రార్థించుట, శుకస్తుతి, శుకునకు
ముక్తిలాభమును చెప్పెడి ఇరువదియారవ అధ్యాయము.

---

## ఇరువదియేడవ అధ్యాయము

### శుకుడు నిర్మించిన శుకపురమునందలి గృహనిర్మాణము

దేవదర్శనుడు చెప్పుచున్నాడు —

తత్ర శ్రీపద్మతీర్థస్య తీరేఽస్మిన్ నివసన్ శుకః
ధ్యానయోగపరోఽధ్యాత్మబ్రహ్మవిద్యావిశుద్ధధీః ॥ ౧

ఏకాన్తభావమాతిష్ఠన్ ఏకాయనవిదాం వరః
సాఙ్ఖ్యయోగపరో నిత్యం సద్ధ్యానాధ్యయనాన్వితః ॥ ౨

ద్వాదశాక్షరశిక్షః ప్రత్యక్షరనిరీక్షకః
పరాశరాత్మజసుతః సుతరాం పరమో మునిః ॥ ౩

ఉవాస సుచిరం కాలం శ్రీనివాసపరాయణః
స్వామిపుష్కరిణీతీర్థముపగన్తుమనాస్తతః ॥ ౪

చక్రే స్వనామ్నాఽగ్రహారమష్టోత్తరశతం ద్విజాన్
నిత్యత్రయీకాన్ త్రయ్యన్తముఖాన్ మఖముఖక్రియాన్ ॥ ౫

సువృత్తాఞ్ శుభ్రమనసో నివృత్తావైదికక్రియాన్
నానాగోత్రానబ్జదళైః నిర్మమే నను సాధిరాన్ ॥ ౭

తా॥ అచ్యుత పద్మసరస్తీరమున వసియించుచు. వకుడు చాలకాలము ధ్యానయోగపరుడును అధ్యాత్మబ్రహ్మవిద్యావిశుద్ధబుద్ధియునై ఏకాయనశాస్త్రమును, సాంఖ్యయోగమును అనుష్ఠించుచు, ద్వాదశాక్షరమహామంత్రార్థమును నిరంతరముగ ననుసంధానముచేయుచు కాలము గడిపి, తరువాత తిరుమలకొండయందు స్వామిపుష్కరిణీతీరవాసములకు చేరగోరి. తన జ్ఞాపకముగ 'శుక పురి' యను నొక విప్రావాసమును నిర్మించి. అందు వేదాధ్యయనసంపన్నులును, నిత్యాగ్నిహోత్రపరిచర్యానిరతులును, శీలసువృత్తసంపన్నులును. అనేక గోత్రోత్పన్నులు నగు నూటయేనిమిదిమంది విప్రవర్యులను కాపురముంచెను.

బలభద్రేణ బలినా మాయయా సహ మాయినమ్
దేవక్యా వసుదేవస్య యశోదానన్దగోపయోః ॥ ౮
ఆనన్దవర్ధకం కృష్ణం భద్రం భువనహర్షకమ్
భూభారం హర్తుకామఞ్చ కామరూపిణమవ్యయమ్ ॥ ౮
కుహనాగోపవపుషం మేఘశ్యామం పురాతనమ్
పారాశరిః పరమర్షిః ప్రతిష్ఠాప్యేహ భూతలే ॥ ౯
వ్యజిజ్ఞపత్ సన్నిధానం అత్ర బ్రహ్మమునిః శుకః

తా॥ ఆ యగ్రహారమునందు బలభద్రుని, దేవకీవసుదేవుల గర్భమున భూభారహరణమునకై కామరూపియై యవతరించి, మాయా గోపరూపముతో మేఘశ్యామలవర్ణుడై వెలసిన శ్రీకృష్ణభగవానుని అర్చారూపమున ప్రతిష్ఠింపచేసి భగవానుని ప్రార్థించుచు ఇట్లనికోరెను.

'వైకుణ్ఠే తు యథా వాసః క్షీరామ్భోధౌ యథా విభో! ॥ ౧౦
వాసో యథాఽన్తరాదిత్యే యోగినాం హృదయే యథా
తథా సదా కురుష్వాత్ర సన్నిధిం కమలేక్షణ!' ॥ ౧౧
ఇతి విజ్ఞాప్య దేవేశం దణ్డవత్ప్రణిపత్య చ

స్నిహ్యాతా మనసా ధ్యాయన్ వీక్షమాణః స్వచక్షుషా ॥ ౧౨
ఆజగామ ప్రసన్నాత్మా స్వామిపుష్కరిణీం ప్రతి

తా॥ 'ఓ ప్రభూ! శ్రీవైకుంఠమందును, క్షీరాబ్ధియందును, ఆదిత్యమండలమధ్యముననను, యోగిహృదయములందును నీవెట్టిప్రీతితో వసియింతువో ఆవిధముగ నీ విచట సాన్నిధ్యము చెందగలవు' అని ప్రార్థించుచు, స్నేహార్ద్రమగు మనసుతో ధ్యానించినవాడై, దండప్రణామముజేసి ప్రసన్నహృదయముతో స్వామిపుష్కరిణినిగూర్చి బయలుదేరెను.

శుకపురినుండి శుకుడు శేషశైలమునకు వచ్చుట

ఉపాన్తే చోక్షశైలస్యోపేత్య నిర్మలనిర్ఝరమ్ ॥ ౧౩
తత్ర త్రిషవణస్నానం కృత్వా వ్యాసౌరసో మునిః
ఉపత్యకాయామాసీనం ఉదయాదిత్యవర్చసమ్ ॥ ౧౪
ఉపాంశుమానసజపం ఉదారం దారసంయుతమ్
మహోత్పలనిభం త్ర్యక్షం మహోపనిషదఙ్గకమ్ ॥ ౧౫
అగ్నిజ్వాలాజటాజాలలసద్గఙ్గేన్దుభోగినమ్
వ్యాఘ్రాజినోత్తరాసఙ్గవాససం కృత్తివాససమ్ ॥ ౧౬
కాలకూటస్ఫురత్కణ్ఠనాళం నళినవక్త్రకమ్
సమీక్ష్య హృష్టమనసా నమస్కృత్య చ తం హరమ్ ॥ ౧౭
ఉషిత్వా త్రిదినం తత్రోపాసకః పూర్ణమానసః
ద్రష్టుకామోఽఖిలాశ్చర్యం పునరప్యఞ్జనాచలే ॥ ౧౮
సిద్ధైర్విద్యాధరైః సార్ధం యోగిభిః కన్దరస్థితైః
శనైః శనైః సఞ్చరంశ్చ నిర్ఝరేషు కృతాఽఽప్లవః ॥ ౧౯
ధ్యాయన్ బ్రహ్మసభావృత్తం వృత్తాన్తం తస్య వై గిరేః
స్వామిపుష్కరిణీతీరమాససాద శుభాస్పదమ్ ॥ ౨౦

తా॥ శేషశైల సమీపమునకు వచ్చి పర్వతసానువునందు కపిలతీర్థమున స్నానానుష్ఠానముల జేసికొని అచ్చటనే ఆసీనుడై నట్టియు, ఉదయకాల సూర్యుని వలె ప్రకాశించుచున్నట్టియు, ఏకాంతముగ మనసా తారకనామము జపించుచు, ప్రక్కనున్న యర్ధాంగితో నున్నట్టియు మహోత్పలాకారుడును, త్రినేత్రుడును, మహోపనిషదంకుడును, అగ్నిజ్వాలా జటాజాలమునందు విలసిల్లెడి గంగా చంద్రులు గలట్టియు వ్యాఘ్రాజినోత్తరాసంగనసనుడును, కృత్తివాసుడును, కాలకూటస్ఫురత్కంఠనాలుడును, నలినముఖుడును నగు పరమశివుని దర్శించి, మహానందముతో నమస్కరించి పూజించి మూడుదినము లచ్చటనే యుండి, అక్కడ సంచరించెడి సిద్ధవిద్యాధరులు, గుహలందుండెడి యోగిపుంగవులతో కలిసి మెల్ల మెల్లగా సెలయేళ్ళయందు స్నానము జేసికొనుచు సాక్షాత్తుగ బ్రహ్మ సభావృత్తాంతమును స్మరింపజేసెడి శ్రీవేంకటాద్రిని స్మరించుచు కొండ నెక్కి స్వామిపుష్కరిణీతీరమున జేరెను

### స్వామిపుష్కరిణీతీరవర్ణనము

సుగన్ధపుష్పవల్లీభిః వేల్లితైః వకులైర్యుతమ్
ఖర్జూరైః నారికేళైశ్చ కేతకైః స్వర్ణకేతకైః ॥ ౨౧

పటీరపాటలాశోకకింశుకాసనచమ్పకైః
నక్తమాలైశ్చ పనసైః మధూకైః సరళైః ధవైః ॥ ౨౨

పున్నాగసురపున్నాగశిశుపున్నాగపూగకైః
కదళీకృష్ణకదళీమహాకదళికాగణైః ॥ ౨౩

హారిద్రాభిః శృఙ్గబేరైః కస్తూరీరజనీకులైః
మల్లికామాలతీభిశ్చ మాధవీభిః మదూత్కటైః ॥ ౨౪

యూథిభిః శతపత్రీభిః జాతిభిః వనజాతిభిః
నన్ద్యావర్తాదిసుమనఃకక్షైః కుక్షిపదఙ్గతైః ॥ ౨౫

సమన్తతః సమాకీర్ణం సాన్ద్రచ్ఛాయాసమఞ్జసైః
సౌగన్ధికైః సుగన్ధాఢ్యైః తుళసీభిః సుమోదితమ్ ॥ ౨౬

దమనీభిః పుష్పగన్ధగర్భపుష్పలతాశతైః
అతిమృష్టామోదపుష్పామోదితాశావకాశకమ్ ॥ ౨౭

తాపసైః తరుణాదిత్యవర్చోభిః అభితో వృతమ్
వరాహసింహశార్దూలమాతఙ్గకులసఙ్కులమ్ ॥ ౨౮
సితాసితైః సారమేయగణైః దుర్వారగర్వకైః
సేవితో నాతిభీమేన క్షేత్రపాలేన పాలితమ్ ॥ ౨౯
విచరన్నత్ర విపినే మునిః విగతతృట్ శుచిః
పరమాం ముదమాపన్నో ముకున్దానన్దకన్దధీః ॥ ౩౦
స్వామిపుష్కరిణీం పుణ్యాం దదర్శ విమలోదకామ్

తా ॥ శ్రీస్వామిపుష్కరిణీ తీరమిట్లున్నది సుగంధమును జిమ్ము పుష్ప లతలచే చుట్టుకొనబడిన వకుళవృక్షములు, ఖర్జూర నారికేళ కేతక స్వర్ణకేతక పటీర పాటల అశోక కింశుక అసన చంపక నక్తమాల పనస మధూక సరల ధవ పున్నాగ సురపున్నాగ శిశుపున్నాగ కదళీ కృష్ణకదళీ మహాకదళీ వృక్షములు, హరిద్రా శృంగబేర కస్తూరీ రజని మొదలగు పొదలచేతను, మల్లికా మాలతీ మధూత్కటములగు మాధవీ యూధి శతపత్ర మొదలగు లతలు, మందారరుధి పుష్పలతలు, సాంద్రఛాయల నిచ్చు సౌగంధికములు, తులసీ వివిధజాతులగు పుష్పలతలచే యొసంగబడిన సుగంధము దిక్కుల వ్యాపించుచుండెను. చుట్టును చేరి తపస్సంపన్నులగు తాపసులు నివసించునట్టిది. వరాహ సింహ శార్దూల మాతంగములు, సితాసితములగు సారమేయగణములచే పరివారింపబడిన అతి భయంకరుడగు క్షేత్రపాలకుని పర్యవేక్షణముక్రిందనున్నది. అట్టిపరిసరములలో సంచరించెడి శుకుడు ఆకలిదప్పులు మరచి, ముకుందానుభవానందముతో తృప్తి పడి, ఒకనాడు విమలోదకపూరితయగు స్వామిపుష్కరిణిని దర్శింపగలిగెను.

స్వామిపుష్కరిణీవర్ణనము

కాఞ్చనామ్బుజకహ్లారకమలైః శ్వేతపఙ్కజైః ॥ ౩౧
నీలోత్పలైః ఉత్పలైశ్చ ఫుల్లైః కువలయైరపి
కైరవైరపి కీర్ణాన్తాముద్గిరత్ పుణ్యగన్ధకైః ॥ ౩౨
తరఙ్గాన్తరసఞ్చారైః మత్స్యైః కారణ్డవైరపి
తారాభిశ్చ తరన్తీభిః అన్యైః జలపతత్రిభిః ॥ ౩౩

కలహంసకలాలాపైః వాచాలితదిగన్తరామ్
తస్యాస్తీరసముల్లాసిసమగ్రాభీష్టసన్తతేః ॥ ౩౪
తీర్థం తోయముపస్పృశ్య లక్ష్మ్యా సఞ్చిన్తయన్ విభుమ్
ప్రసన్నమానసోల్లాసః చక్రే తత్రాఘమర్షణమ్ ॥ ౩౫
బద్ధపద్మాసనాసీనోఽభితటం యోగమేయివాన్
పరమైకాన్తిభిః సార్ధం బ్రహ్మవిత్ బ్రహ్మదర్శనః ॥ ౩౬
తత్రైవ సుచిరం కాలం ఉవాస పరమర్షిభిః
రహస్యన్యోన్యసల్లాపస్వాన్తాన్తేవాసిసన్తతైః ॥ ౩౭

తా॥ స్వర్ణమయములగు కల్హారములు, కమలములు, శ్వేతపంకజములు, నీలోత్పలములు, ఉత్పలములు, వికసించిన కైరవములు అసంఖ్యాకములుగ పరిమళమును వెదజల్లు పుష్కరిణియందుండెను. పుష్కరిణియందలి యాహార మును కడుపునిండ గ్రోలి, ప్రవాహతరంగముల నడుమ సంచరించెడి కారండవ ములు, అట్లే జలజంతువులు అందు కలవు. అందలి కలహంసల మధురాలాప ములచే దిగంతరములు మ్రోగుచుండెను. తీరమందుండెడి వారలకు సకలాభీష్ట ముల నీయగల పుష్కరిణీపుణ్యతీర్థమున నాచమనముచేసి, లక్ష్మీసహాయుడగు శ్రీనివాసుని ధ్యానించుచు ప్రసన్నమానసము నుల్లాసమున నుప్పొంగుచు శుకుడా తీర్థమున నఘమర్షణస్నానము జేసెను పద్మాసనమున నాసీనుడై యోగమందు నిలచిన మనసుతో పరమైకాంతులగు బ్రహ్మవిత్తులతో కూడుకొని ఆ తీరముననే చాలకాల ముండిపోయెను.

## శ్రీనివాసుడావిర్భవించుట

కదాచిత్ భగవాన్ విష్ణుః కారుణ్యాగణ్యపుణ్యధీః
దర్శయన్ సకలాం ల్లోకాన్ సాక్షివీక్షిపథం గతః ॥ ౩౮
దివ్యానన్దమయాకారైః గరుత్మచ్ఛేషసైనికైః
పఞ్చాయుధైః పరికరైః గణైస్తు కుముదాదిభిః ॥ ౩౯
పరిబర్హాభూషణాన్యజినవస్త్రాంశుకాని చ
ఆయుధాన్యప్రమేయాని దధానైః బ్రహ్మశక్తిభిః ॥ ౪౦

శక్తిభిః శాఙ్కరీభిశ్చ సేవ్యమానో ముదాఽన్వితః
శ్రీభూమినీలాపూర్వాభిః అపూర్వాకల్పభూతిభిః ॥ ౪౧

మహిషీభిః ముదానన్దం ఆవహన్తీభిరీశితుః
ముమోద స హి సర్వాత్మా క్రీడాడమ్బరడామ్బికః ॥ ౪౨

తా॥ ఇట్లు కొంతకాలము గడచిన తరువాత ఒక్కనాడు శుకునియందు కరుణించి సకలలోకములను ప్రదర్శించుచు భగవానుడు శుకునియెదుట సాక్షాత్కరించెను. దివ్యానందమయాకారులగు గరుత్మదాదులు, పరికరములగు పంచాయుధములు, కుముదాది పరిషద్గణము, పారిబర్హములు, దివ్యభూషణ దివ్యాంబర దివ్యాయుధములు, బ్రహ్మశక్తులు, శాంకరశక్తులు, శ్రీ భూమి నీళాది దివ్య మహిషులు వీరలచే సేవింపబడుచు, క్రీడారంభకదాండికుడగు శ్రీనివాసుడు శుకునియెదుట గన్పట్టెను.

లీలావిభూతివిహితవివిధానన్దవేషభాక్
కాలకాదమ్బినీకాన్తాకుఞ్చితాలకబన్ధనః ॥ ౪౩

ఉద్యద్ద్యుమణిబిమ్బశ్రీః శిఖామణిమహామహాః
అష్టమీన్దుకళాకారలలాటస్థోర్ధ్వపుణ్డ్రకః ॥ ౪౪

సౌవర్ణపద్మకహ్లారపుష్పకర్ణావతంసకః
సేవాన్తరరసాశాసిశార్ఙ్గభ్రూమణ్డలద్వయః ॥ ౪౫

అతిసూక్ష్మస్ఫురత్తారాఽకర్ణపూర్ణారుణేక్షణః
కరుణాబ్ధిసముద్భూతలోలపద్మవిలోచనః ॥ ౪౬

తిలపుష్పసమాకారనాసాకాణ్డపుటద్వయః
పక్వబిమ్బఫలాకారరమణీయోష్ఠయుగ్మకః ॥ ౪౭

ప్రభావిసారిశిఖరిదశనావలివక్రకః
భాకారకర్ణపాశాత్తముక్తామాణిక్యకర్ణికః ॥ ౪౮

శరన్నిర్మలపూర్ణేన్దుమణ్డలాననమణ్డలః
కమ్బుకణ్ఠో వృషస్కన్ధో భోగిభోగోల్లసద్భుజః ॥ ౪౯

శార్ఙ్గజ్యాహతికార్కశ్యరమణీయప్రకోష్ఠకః
విశాలవక్షోవిలసచ్ఛ్రీవత్సః కౌస్తుభోజ్జ్వలః ॥ ౫౦

శఙ్ఖచక్రగదాపద్మపరిష్కృతచతుర్భుజః
నిమ్ననాభిసముల్లాసిమాణిక్యోదరబన్ధనః ॥ ౫౧

మేఖలాలఙ్కృతకటీతటీచ్ఛురికయోద్భటః
హస్తిహస్తసదృక్షోరుజానుమణ్డలమణ్డితః ॥ ౫౨

క్రమవృత్తాయతాఽఽభోగజఙ్ఘాకాణ్డసుపార్ష్ణికః
కూర్మపృష్ఠప్రపదకః కిఙ్కిణీహంసకాఙ్ఘ్రికః ॥ ౫౩

శిఞ్జన్మాణిక్యమఞ్జీరప్రభాసితపదామ్బుజః
నానాసేవారసోద్భాసిచన్ద్రబిమ్బనఖావలిః ॥ ౫౪

సుధాసూతిగృహోద్దామస్ఫురదఙ్గుష్ఠసౌష్ఠవః
పఙ్కజశ్రీపరిచితాన్యోన్యతుల్యాఙ్ఘ్రిపఙ్కజః ॥ ౫౫

అతసీకుసుమజ్యోతిఃప్రఖ్యవిఖ్యాతవిగ్రహః
సంవీతవివిధాశ్చర్యతప్తచామీకరామ్బరః ॥ ౫౬

ఆంసాదాప్రపదాలమ్బివనమాలావిరాజితః
విచిత్రరత్నఖచితతపనీయకిరీటకః ॥ ౫౭

హారకేయూరకటకకఙ్కణాఙ్గదభూషితః
మణికుణ్డలతాటఙ్కవీరపట్టాఙ్గుళీయకః ॥ ౫౮

అంసలమ్బిసమాయుక్తసౌవర్ణబ్రహ్మసూత్రకః
త్రిపఞ్చసప్తసరిభిః ముక్తాదామభిరఞ్చితః ॥ ౫౯

సర్వాభరణసంయుక్తః సర్వగన్ధానులేపనః
సర్వర్తుకాలోత్థపుష్పదామోద్దామభుజాన్తరః ॥ ౬౦

భక్తానుకమ్పాసహితః శ్రీనివాసః పరః పుమాన్
ఆవిర్బభూవ భగవాన్ స్వామిపుష్కరిణీతటే ॥ ౬౧

తా॥ భగవానుడు లీలావిభూతి విహితమగు వివిధానంతవేషము గలిగి యుండెను. సుందరమై కుంచితములగు అలకాబంధముకలవాడును ఉదయించెడి సూర్యుని బోలిన ప్రకాశముగల శిఖామణి కాంతిగలవాడును, అష్టమినాటి చంద్రునిబోలిన ఊర్ధ్వపుండ్రమును లలాటమందు ధరించినవాడును, సౌవర్ణ పద్మకల్హారములను అలంకారములుగా చెవులందు ధరించినవాడును, సేవాన్తర రసమును ఆశ్వాసించెడి శార్ఙ్గమువంటి కనుబొమలుగలవాడును అతి సూక్ష్మముగ స్ఫురించెడి కంటిపాపలతో ఆకర్ణపూర్ణమగు నరుణేక్షణములు కలవాడును, కరుణాసముద్రమందుదయించిన లోలములగు పద్మములవంటి నయనములుగలవాడును, తిలపుష్పసమానాకారముగల నాసికయందు రెండు పుటములుకలవాడును, పక్వబింబఫలాకారమును రమణీయమగు ఓష్ఠద్వయముకలవాడును, తేజస్సును వెదజల్లెడి దంతముల పంక్తిగల వక్త్రముకలవాడును, సుందరములగు చెవులందు ధరించిన ముక్తామాణిక్య భూషణములు కలవాడును, శరత్కాల పూర్ణచంద్ర బింబమువలె ఆనందమయమగు ముఖముకలవాడును, కంబు కంఠుడును, వృషస్కంధుడును భోగిభోగములవంటి భుజప్రదేశములు కలవాడును, శార్ఙ్గ ధనుస్సు వల్లెత్రాటిని ప్రయోగించిన కార్కశ్యముచే రమణీయమగు ప్రకోష్ఠము కలవాడును, విశాలవక్షఃప్రదేశమున ధరించబడిన శ్రీవత్స కౌస్తుభములు కలవాడును, శంఖచక్ర గదా పద్మములచే యలంకరింపబడిన నాలుగు భుజములుకలవాడును, నిమ్నమగు నాభిభాగమున ప్రకాశించెడి మాణిక్యమయమగు మొలనూలు కలవాడును, మేఖలాదామమున నమర్చబడిన ఖడ్గాయుధముకలవాడును. యేనుగు తొండములబోలిన ఊరుప్రదేశమును జాను ప్రదేశమును కలవాడును. క్రమవృత్తాయతాభోగజంఘా కాండములుగల పార్ష్ణిప్రదేశములు కలవాడును, కూర్మ పృష్ఠముబోలిన ప్రపదములుగలవాడును, కింకిణీహంసకములను నాభరణములు గల మడిమెలుకలవాడును, చిరుమ్రోతమ్రోయు మాణిక్యశింజీరములచే భాసించెడి పాదపద్మములుకలవాడును, నానా సేవారసములచే భాసించెడి చంద్రబింబము వంటి నఖప్రదేశముకలవాడును, సుధాసూతి గృహమువలె ముక్కలిగ స్ఫురించెడి అంగుష్ఠసౌష్ఠవముకలవాడును, పంకజ సౌందర్యముతో ఒకదాని నొకటి పోలిన పాదద్వయము కలవాడును, అతసీ కుసుమకాంతిని వెదజల్లెడి కాంతిగల ప్రఖ్యాత విగ్రహుడును సర్వవిధముగ వివిధములగు బంగారపు సరిగెతో నేయ

బడిన దివ్యాంబరములు కలవాడును, భుజమూలమునుండి పాదపద్మములవరకు సమర్పింపబడిన వనమాలను కంఠమునందు ధరించినవాడును, విచిత్రరత్నములచే తాపటముచేయబడిన మహోన్నతమగు కిరీటము కలవాడును, హారములు కేయూరములు కటకములు అంగదములు కంకణములు కింకిణీహారములు మణికుండల తాటంకములు కటిపట్టము అంగుళీయకములు కలవాడును, భుజప్రదేశమునందు వ్రేలాడుచుండిన సువర్ణ యజ్ఞోపవీతము కలవాడును, మూడు ఐదు యేడు పేటలుగల ముత్యాల హారములు ధరించినవాడును, సర్వాభరణ సంయుతుడు సర్వగంధాను లేపనము సర్వపుష్పవిరాజితుడు శ్రీవత్సాంకప్రతోద్దామ భుజాన్తరము కలవాడునునై భక్తానుకంపాపరిహితుడగు శ్రీనివాసుడా ర్యావ సమయమున శుకునకు సాక్షాత్కరించెను

శుకబ్రహ్మర్షికృత శ్రీనివాసస్తుతి

వ్యాసాత్మజో మునిర్ముక్తః తం దృష్ట్వా హృష్టమానసః
ప్రణమ్య దణ్డవద్భూమౌ అవాఙ్మనసగోచరమ్
తుష్టావ చ హృషీకేశం కేశవం క్లేశనాశనమ్ ॥ ౬౨

తా॥ శుకుడు ఆనందముతో భగవానుని యెదుట దండప్రణామముజేసి అవాఙ్మానసగోచరుడగు ప్రభువు తన మాంసచక్షువులకు గోచరించినందుకు కృతజ్ఞతతో ఇట్లని స్తోత్రముచేయ నారంభించెను.

"జితం తే పుణ్డరీకాక్ష వాసుదేవామితద్యుతే !
రాగాదిదోషనిర్ముక్తసమగ్రగుణమూర్తయే ॥ ౬౩
నాథ ! జ్ఞానబలోత్కృష్ట ! నమస్తే విశ్వభావన !
సఙ్కర్షణ ! విశాలాక్ష ! సర్వజ్ఞ ! పరమేశ్వర ! ॥ ౬౪
నమస్తేఽస్తు హృషీకేశ ! సర్వేశ్వర ! జగన్మయ !
దేవ ! ఐశ్వర్యవీర్యాత్మన్ ! ప్రద్యుమ్న ! జగతాం పతే ! ॥ ౬౫
స్థిత్యుత్పత్తిలయత్రాణహేతవే శక్తితేజసే
జయానిరుద్ధ భగవన్ ! మహాపురుష ! పూర్వజ ! ॥ ౬౬
జితం తే పుణ్డరీకాక్ష ! నమస్తే విశ్వభావన !

నమ స్తేఽస్తు హృషీకేశ ! మహాపురుష ! పూర్వజ ! ॥ ౬౭
శ్రీనివాస ! జగన్నాధ ! నారాయణ ! దయానిధే !
కృతార్థోఽహం కృతార్థోఽహం కృతార్థాః సర్వజ న్తవః ॥ ౬౮
ప్రసీద భగవ న్విష్ణో ! ప్రసీద పురుషో త్తమ !
ప్రసీద పుణ్డరీకాక్ష ! ప్రసాదాదాత్మసాత్కురు " ॥ ౬౯
ఇతి స్తువ న్తమాగత్య మహర్షిం ఫుల్లలోచనమ్
ఆనన్దనిర్భరాపూర్ణమానసం శ్రీశుకం మునిమ్ ॥ ౭౦
సమీక్ష్య సుప్రసన్నం తం ప్రసాదప్రణయాన్వితః
దివ్యైః పరిజనైః సార్థం శ్రీనివాసః తిరోదధే ॥ ౭౧

తా॥ ఓ పుండరీకాక్షా ! నీకు జయమగుగాక ! నీవు వాసుదేవుడవు. అమిత తేజస్సంపన్నుడవు. రాగాది దోషనిర్ముక్తుడవు. సకల కల్యాణగుణాకరుడవు. లోకనాథా ! జ్ఞానబలాధికుడవు. విశ్వభావనుడవు. నీకు నమస్కారము ఓ సంకర్షణా ! విశాలాక్షా ! సర్వజ్ఞా ! పరమేశ్వరా ! హృషీకేశా ! సర్వేశ్వరా ! జగన్మయా ! నీకు నమస్కారము. ఓ దేవా ! జగత్పతీ ! ఐశ్వర్య వీర్యములను ముఖ్యముగా కలిగి ప్రద్యుమ్న స్వరూపమును ధరించినవాడవు. జగదుత్పత్తి స్థితి సంహారములకు నీవే కారణమవు. ఓ మహాపురుషా ! పూర్వజా నీవు అనిరుద్ధ రూపివి. పుండరీకేక్షణా ! విశ్వభావనా నీకు నమస్కారము. ఓ హృషీకేశా ఓ మహాపురుషా ! పూర్వజా ! శ్రీనివాసా ! జగన్నాధా ! నారాయణా ! దయానిధీ ! నీకు నమస్కారము. ముమ్మాటికి నేను కృతార్థుడనైతిని. జగత్తంతయు నావలె నీ యావిర్భావముచే కృతార్థతజెందినది. జగద్వ్యాపీ ! ప్రసన్నుడవు కమ్ము. ఓ పుండరీకాక్షా ! నీ యనుగ్రహముచే నన్ను నీలో చేర్చుకొనుము. ఈ విధముగా ఆనందము చిందులాడగా స్తోత్రముచేయుచున్న శుకబ్రహ్మర్షిని కటాక్షించిన శ్రీనివాసుడు ప్రసన్నుడై ఆశ్వాసపరచి తన పరిజనములసహితుడై అంతర్హితుడాయెను.

మునిః పునః ప్రణమ్యాత్ర దణ్డవచ్చ ముహుర్ముహుః
పరమైకాన్తిభిః యోగివరైః ఆర్యైః సహాపరైః ॥ ౭౨

అర్చావతారవిభవపరవ్యూహాన్తరాదికాన్
ఆవిర్భావాన్ స్మరన్ విష్ణోః యయౌ మేరుగిరిం ప్రతి ॥ ౨౩

ఇతి శ్రీ పాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీ వేఙ్కటాచలమాహాత్మ్యే దేవల-
దేవదర్శన సంవాదే శుకమునికృత శుకపురాష్టోత్తరశత విప్రగృహ
నిర్మాణాదివర్ణనం నామ సప్తవింశోఽధ్యాయః.

తా॥ అంతట శుకుడు భగవానుని మనసుతో ధ్యానించుకొనుచు పలు మారులు భూమిపైబడి ప్రణామములు చేయుచు పరమైకాంతులగు యోగులతో కూడి భగవానుని పరవ్యూహాది స్వరూపములను చేష్టితములను తలచుకొనుచు మేరుపర్వతమునకు పోయెను.

ఇది శ్రీపాద్మపురాణమునందు క్షేత్రకాండమున శ్రీ వేంకటాచల
మాహాత్మ్యమున దేవల—దేవదర్శన సంవాదమున శుకముని నిర్మించిన
శుకపుర మందలిఅగ్రహారకథ మొదలగు నంశములుగల
ఇరువది ఏడవ అధ్యాయము,

---

## ఇరువది యెనిమిదవ అధ్యాయము

### శ్రీ వరాహావిర్భావ వృత్తాంతము

దేవలుడు అడుగుచున్నాడు —

సింహాసానుమతః కుక్షౌ స్వామిపుష్కరిణీతటే
శ్వేతస్య పోత్రిపోతస్య ప్రాదుర్భావః కథం విభో! ॥ ౧

తా॥ శ్రీ వేంకటాచలమందలి స్వామి పుష్కరిణీతీరమందు శ్వేత వరాహదేవుని యవతార మెప్పుడెట్లు జరిగినదో దయచేసి చెప్పుడు.

దేవదర్శనుడు చెప్పుచున్నాడు —

చరాచరగురోరస్య చారిత్రం చారుపోత్రిణః
శృణు విద్వన్! విశేషేణ వ్యాచక్షేఽహం విచక్షణ! ॥ ౨

పురా ధర్మద్విషో దృష్ట్వా దైత్యాః స్వేచ్ఛావిహారిణః
ఛాయాం స్వకీయామపి చ హన్తుకామా మదోద్ధతాః ॥ ౩

మునిభిః గౌతమాద్యైః యే శప్తా భూమిం గతా ఇతి
తేఽభిజాతే కులే జాతా రాజ్ఞామాజ్ఞావిలఙ్ఘినః ॥ ౪

పాపిష్ఠా హ్యసురశ్రేష్ఠా నృపశ్రేష్ఠవపుర్ధరాః
నక్తన్దివం హి బాధన్తే త్రిలోకీంధూమకేతవః ॥ ౫

క్షోభం మహీక్షితామేవం దుర్దర్పబలశాలినామ్
సర్వంసహాఽసహమానా నిమమజ్జ రసాతలే ॥ ౬

తా॥ ఓ దేవలా ! శ్రీవరాహభగవానుని చరిత్రమును చెప్పెదనువినుము. ఒకప్పుడు ధర్మనాశకులగు దైత్యులు ప్రమత్తులై ఒడలెరుగక తమ నీడనే తాము సంశయించి కలహింపుచుండగా తపస్సంపన్నులగు గౌతము డాదిగాగల ఋషులు వారల నందరను భూలోకమందుపతరింపుమనట్లు శపించగా శాపఫలాను భవమునకై వారు భూమియందవతరించి ధర్మపరిపాలకులగు రాజుల తావులందు రాజవేషములతో అవతరించి ప్రపంచమును క్షోభింపజేయుచుండిరి. వారలదౌష్ట్య మునకు తాళజాలక సర్వం సహయైనను భూమాత దుఃఖముతో పాతాలమునకు పోయెను.

పాతాళమునకుపోయిన భూమి నుద్ధరించుటకై మహావిష్ణువు అవతరించుట.

భూతధాత్ర్యాం నిమగ్నాయాం అధోభువనసద్మని
సంరక్షకః సర్వసాక్షీ కరుణావాన్ అధోక్షజః ॥ ౭

సముద్ధర్తుమనాస్తూర్ణం పాతాళనిలయాం భువమ్
మహావరాహో భగవాన్ బభూవ పరమః పుమాన్ ॥ ౮

తా॥ భూమాత పాతాలమునకు పోగా పరమకారుణికుడగు శ్రీ మహా విష్ణువు ఆమెనుద్ధరించుటకై వరాహరూపమును ధరించెను.

యత్కిరీటస్థరత్నాని సత్యలోకనివాసినః
అకాణ్డోదితమార్తణ్డప్రచణ్డామలమణ్డలమ్ ॥ ౯

పఞ్చోపనిషదాత్మనః సిద్ధా ముక్తాశ్చ మేనిరే
యస్య శ్రోత్రైకదేశస్థం స్వపదం శబ్దమాత్రకమ్ ॥ ౧౦

తేజాంసి నిమమజ్జుశ్చ నేత్రయోః వివరాన్తరే
నాసాగ్రే చ సమాయుక్తో మాతరిశ్వా బభూవ హ ॥ ౧౧

బభూవ పారావారోదో పాదపఙ్కజపఙ్కదః
ఖురోదరే కణకణాః సురాద్రిశ్చ కులాద్రయః ॥ ౧౨

దశోత్తరైరావరణైః లోకాలోకాచలః స్థితః
బభూవ బాహ్యావయవభావనాశేషవేషభాక్ ॥ ౧౩

తా॥ వరాహరూపమెత్తిన పరమపురుషుని కిరీటమందలి రత్నకాంతిని సత్యలోకనివాసులు అకాలమందుదయించిన సూర్యభగవానుని ప్రచండ అమందామలమండలముగసేవించిరి. ఆయన శ్రోత్రభాగమున నిలచినది ఆకాశభూతమని సిద్ధులు ముక్తులు తలచిరి. ఆయన నేత్ర భాగమునందు తేజోభూతముతోచెను. నాసాగ్రమందు వాయుభూతముతోచెను. మహాసముద్రములాయన పాదానసేజనోదకమాయెను. మేరుపర్వతము ఇతర కులాచలములు ఆయన డెక్కలచే త్రొక్కబడి చూర్ణమాయెను. ఒకదానిని క్రమింగిన ఒకటియైయొప్పెడి బ్రహ్మాండముల పదియావరణములకు పైనున్న లోకాలోకపర్వతమా దివ్యశరీరమునకు యెల్లగా తోచెను,

పోత్రిపాదైకరోమాన్తర్వివరస్థాం వసున్ధరామ్
సపత్నీం పద్మవాసిన్యాః సర్వభూతనివాసినీమ్ ॥ ౧౪

ముస్తాభిః పూర్ణపఙ్కాఙ్కాం మార్గమాణో బభూవ హ
తాం దృష్ట్వా వేపమానాఙ్గీం లజ్జాలోలవిలోచనామ్ ॥ ౧౫

పోత్రిరోమాన్తరాసీనాం పావనీం పరమేశ్వరీమ్
వైకుణ్ఠో౽కుణ్ఠితోదన్తః కణ్ఠమూలమధోక్షజః ॥ ౧౬

రహస్యస్యాః సమాఘ్రాయ వరాహవపురాత్మభూః
గాఢాఙ్గపాలీకబలీభూత గూఢాఙ్గపాలికామ్ ॥ ౧౭

సత్యసన్ధో హి ముముదే నవోఢాం చ వధూమివ

తా॥ తన మహారూపమున కాలిక్రింద తగిలిన భూమాతను వెతకి కనిపెట్టి లజ్జతో వణకుచున్న ఆ భార్యను యెత్తి కంఠప్రదేశమును ఆఘ్రాణించి పైకెత్తి నష్టద్రవ్యలాభముగల్గిన చందమున ఆనందపడెను.

శరత్ప్రిత్యగ్రపఙ్కేజాధినవాభోగలీలయా ॥ ౧౮

స్నేహకామనయా దృష్ట్యా అభివీక్ష్య విగతజ్వరః
తాం బభాషే సురసయా సుధాకల్లోలలీలయా ॥ ౧౯

నర్మభావనయా వాచా శ్రీమాన్నళినలోచనః

తా॥ అత్యంత దయారసముతో స్నేహదృష్టిని పరపి భూమాతతో [illegible] నర్మవాక్యములతో భాషింప నారంభించెను.

పాతాళమందు ధరణీదేవితో వరాహదేవుని నర్మప్రసంగము

'వసుధే దేవి! భద్రం తే భద్రే భద్రాణి పశ్యసి ॥ ౨౦
స్థాపయాఖిలభూతాని స్వస్థా స్వస్థానమాస్థితా'

తా॥ ఓ దేవీ! భయపడకుము. నీకు మంగళముకలుగును. నిన్ను యథాస్థానమున ప్రతిష్ఠించెదను. సర్వభూతములకు ఆధారమవై ముందువలె కాలక్షేపము చేయుము.

వరాహదేవునికి భూదేవిచెప్పిన ప్రతివాక్యము

ఏవం వరాహవపుషా పుంసా భూమిః సుభాషితా ॥ ౨౧

స్నేహసాగరపూర్ణేన వ్రీడాలోలవిలోకినా
నేత్రాఞ్చలేన స్వపతిం వీక్ష్య కోలాననమ్ విభుం ॥ ౨౨

స్నేహసన్దర్భగర్భేణ మాదురీమహితాఽత్మనా
త్రిస్థానస్థేన వచసా ధర్మశ్రవణతత్పరా ॥ ౨౩

బభాషే పురుషశ్రేష్ఠం పోత్రివక్త్రం పురాతనమ్
"భగవన్! దేవదేవేశ! దైత్యామిత్ర! దయానిధే! ॥ ౨౪

దైత్యదానవదుర్ధర్ష! భారాత్ మగ్నాం రసాతలే
రక్ష మాం పక్షిరాడ్వాహ! సర్వభారక్షమాక్షమామ్ ॥ ౨౫

ఆధారశక్తయే తుభ్యం అనన్తశిరసే నమః
అవ్యాజసుహృదే భూయో నమోఽనన్తవిభూతయే" ॥ ౨౬

తా॥ ఇట్లు పలికిన భర్త పలుకుల నాలించిన భూమాత మధురమగు వాక్కులతో దైత్యాంతకా! దయాసముద్రుడా! దైత్యదానవులవలనకలిగిన దుస్సహభారముచే నేను క్రుంగి పోయినాను. నీవుచెప్పినట్లు భూతముల కాధారమై నిర్భయముగా నిర్విచారముగా నేను నిలమనట్లనుగ్రహింపుము. నాకును నీవే ఆధారమవు. నిర్వ్యాజబాంధవుడవు అనన్తమహావిభూతిగలవాడవు.

ఏవం వసుధయా దేవ్యా వేపమానాఖిలాఙ్గయా
విజ్ఞాపితో విశ్వరక్షాదీక్షితః ప్రత్యువాచ తామ్ ॥ ౨౭

"సాధు దేవి! త్వయా పృష్టం శృణు వక్ష్యే వసున్ధరే!
సర్వంసహా విశ్రుతా త్వం తథ్యనామా భవ ప్రియే!" ॥ ౨౮

వరాహరూపీ భగవాన్ ఏవముక్త్వా వసున్ధరామ్
దేవీమశిక్షయద్ధర్మం స్వభారభరణక్షమమ్ ॥ ౨౯

శిక్షితా వసుధా దేవీ తేన శుద్ధమనా ధరా
బభూవ మహితా తేన స్వభారభరణక్షమా ॥ ౩౦

తా॥ ఇట్లు భయవిహ్వలయై ప్రార్థించిన భూమాత ప్రార్థనను వినిన వరాహదేవుడిట్లనెను. ఓ దేవీ. నీమాటలను వింటిని. నీకు సర్వంసహాయను పేరు అన్వర్థమైనది. నీవు దిగులుపడకూడదు. అని యోదార్చి స్వధర్మ పరతను రక్షించగా ఆ మహాదేవి ఆనందముతో ప్రభుని యుపదేశమునందా శ్వాసముజెంది విచారమును విడచి సుఖముగా నుండెను.

**ధరణీదేవితోకూడి వరాహమూర్తి శేషాచలమునకు వచ్చుట.**

తదాప్రభృతి దేవేశో వరాహవపుః ఊర్జితః
పాతాళలోకాత్ లోకేఽస్మిన్ కౌతుహలసమాకులః ॥ ౩౧

స్వామిపుష్కరిణీకూలే పశ్చిమేఽస్మిన్ ధరాతలే
వల్మీకబిలమాసాద్య తద్వాచా విజిహీర్షయా ॥ ౩౨

గమనాగమనం కుర్వన్ తదధో భువనం ప్రతి
భూత్వా శ్వేతః పోత్రిపోతః సఞ్చరన్ ఆత్మనాయకః ॥ ౩౩

దివ్యైర్గణైః సేవ్యమానః కదాచిత్ అనపాయిభిః
భూషణైః పారిబర్హైః స్వైః ఆయుధైః చేతనాత్మభిః ॥ ౩౪

అవ్యాజమిత్రోఽత్ర పోత్రీ వర్తతే దివ్యగాత్రభృత్
హ్లాదయన్ ఆత్మనః సర్వాన్ జ్ఞానానన్దమయాన్ సురాన్ ॥ ౩౫

తా॥ ఆనాటినుండి వరాహరూపియగు భగవానుడు పాతాళమునుండి భూమియందు శేషాచలమున నివసించవలయునని ఆశపడి స్వామిపుష్కరిణి పశ్చిమభాగమున నొక వల్మీకమును ప్రవేశించెను. ఆ వల్మీకమునుండియే లోకాంతరములకు రాకపోకలను సాగించుచు ఒకానొకప్పుడు ఏకాకిగాను మరి యొకప్పుడు పరిషద్గణ పరివృతుడయ్యు ఒకప్పుడు నిత్యసూరి పరివారముల తోను దివ్యభూషణ దివ్యాంబర దివ్యాస్త్రములతోను విహరించుచు తనతోపాటు జ్ఞానానంద స్వరూపులగు పరిజనులను ఆనందింపచేయుచు భూలోకమందే వల్మీ కమున స్థిరవాసము నేర్పరచికొని నిలచిపోయెను.

దుర్వాసుని శాపముచేత కిన్నర దంపతులు కిరాతులగుట.

పరావరాణాం భూతానాం అన్తర్యామిణి శార్ఙ్గిణి
ఏవం హి వర్తమానేఽత్ర పవిత్రే చిత్రపోత్రిణి ॥ ౩౬

కదాచిత్ స్వాఽఽశ్రమే పుణ్యే దుర్వాసాః కోపనో మునిః
క్రీడన్తౌ కామమోహేన దృష్ట్వా కిన్నరదమ్పతీ ॥ ౩౭

శశాప నిర్ఝరే పుణ్యే సింహనామ్ని మహీధరే
"కైరాతం మిథునం స్యాతాం వన్యాఽఽహారౌ యువామితి"॥ ౩౮

తతః కిన్నరదమ్పత్యోః నిర్విణ్ణమనసోః సతోః
శాపమోచన మాచఖ్యౌ కృపయా స చ తాపసః ॥ ౩౯

'తత్ర స్వామిసరస్తీరే సఞ్చరన్ శ్వేతసూకరః
శాపాత్మదీర్ష్యావిహితాత్ మోచయిష్యతి తౌ యువామ్" ॥ ౪౦

'తథేతి' దీనమనసా ఉక్త్వా కిన్నరదమ్పతీ
తూర్ణం తం దేశమాగత్య జజ్ఞాతే వ్యాధదమ్పతీ ॥ ౪౧

తా॥ చరాచరముల కంతర్యామియగు వరాహభగవానుడు ఇట్లు శేషాచలమందు విహరించుచుకాలమున నొకప్పుడు తపస్సుచేసికొనుచున్న దుర్వాసఋషి తన యాశ్రమమున లజ్జను విడచి కామమోహితులై క్రీడించుచున్న కిన్నర దంపతులనుచూచి కోపించి వారలను వేంకటాద్రియందు కిరాతదంపతులై పుట్టుదురుగాక యని శపించెను వారు పశ్చాత్తప్తులై శాపమోక్షమును కోరగా శ్రీస్వామి పుష్కరిణీ తీరమున శ్వేతవరాహముడు మీశాపవిమోచనము ననుగ్రహించునని చెప్పెను. అంత నాకిన్నరదంపతులు వల్లెయని వెంటనే శేషాచలమున కిరాత దంపతులుగా అవతరించిరి.

కిరాతదంపతులకు పుత్రోత్పత్తి మొదలగు వివరము

శాకమూలఫలాహారైః దుష్టసత్త్వనిబర్హణౌ
ఆసాతే సుచిరం కాలం అస్మిన్ సింహశిలోచ్చయే ॥ ౪౨

ఋక్షశార్దూలశరభసింహేభవ్యాలదుర్గమే
ఆరణ్యేఽగణ్యపుణ్యౌఘే భీషణే రోమహర్షణే ॥ ౪౩

వసత్ కిరాతమిథునం పుష్పాసవమదోద్ధతమ్
అసూత పుత్రం చిత్రాఙ్గం చిరకాలసమీప్సితమ్ ॥ ౪౪

తా॥ శాకమూల ఫలముల నాహారముగాగొని దుష్టజంతువులను సంహరించుచు చాలకాలమక్కడ నా దంపతులు కాలము గడిపిరి. కొంతకాలమునకు వారలకు చిత్రాంగదుడను నొక కుమారుడు కలిగెను.

ప్రసూతం తం సమీక్ష్యాథ సుకుమారం సుతం తదా
శబరః శబరీ చైతౌ ఆస్తాం సమ్పూర్ణ మానసౌ ॥ ౪౫

స్తన్యైః వన్యరసైరన్యైః తమాపఞ్చషవర్షకమ్
తావవర్ధయతాం పుత్రం చిత్రావయవమర్భకమ్ ॥ ౪౬

తా॥ ఆ పుత్రునిజూచి తలితండ్రులానంద పరవశులై స్తన్యపాన దివ్యాహారాదులచే ఐదు సంవత్సరములబిడ్డగా వృద్ధిచేసిరి.

సింహహస్తనఖత్రోటీనిశాతశతధారకః
విభిన్నమత్తమాతఙ్గకుమ్భోద్భిన్నోరుమౌక్తికైః ॥ ౪౭

దణ్డశేఖరవాసోభిః బర్హైశ్చ బర్హిపతత్రిణామ్
త్రిమదోద్రిక్తమాతఙ్గమదపఙ్కద్వయైరపి ॥ ౪౮

శ్రేయసః సరసాం స్వామిసరసః శ్వేతమృత్స్నయా
అలఞ్చక్రతురన్యోన్యం పితరౌ సుతరాం సుతమ్ ॥ ౪౯

తా॥ క్రమముగా ఆబిడ్డ కా తలిదండ్రులు సింహపుగోళ్లతోను ముత్యములతోను వన్నె వన్నెలగు పక్షి పింఛాదులతోను భూషణముల నమర్చి యేనుగుల మదముతో చందనాలంకారమును, స్వామిపుష్కరిణియందలి శ్వేతమృత్తిక (తిరుమణి) తో ఊర్ధ్వపుండ్రములను పెట్టి అలంకరింప జొచ్చిరి.

కదాచిత్ పర్యటం స్తత్ర విపినే స వనేచరః
కస్యచిద్వటవృక్షస్య సమీక్ష్య స్కన్ధకోటరే ॥ ౫౦

పక్వం కార్తస్వరనిభం ప్రియఙ్గు ప్రియదర్శనమ్
గృహీత్వా శబరః సర్వం గృహిణ్యై తత్ సమర్పయత్ ॥ ౫౧

సాఽపి ప్రైయఙ్గవం ధాన్యం ఉచ్ఛోష్య చ సమాచినోత్
తతః సస్యం చక్రతుశ్చ ప్రైయఙ్గవమతన్ద్రితౌ ॥ ౫౨

వృత్తిభిః గోపయన్తౌ తౌ శుశ్రూషాభిః సమన్తతః
అపక్వఫలమాకాఙ్క్షన్ మిథునం తద్బభూవ హ ॥ ౫౩

గోపనార్థం హి తస్యైవ పుత్రం ప్రేషితవాన్ స్వయమ్
తుష్టో బభూవ చ క్షేత్రం వీక్ష్య పక్వఫలోద్ధతమ్ ॥ ౫౪

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీ వేఙ్కటాచలమాహాత్మ్యే దేవల-
దేవదర్శన సంవాదే శ్రీవరాహావిర్భావవృత్తాన్తవర్ణనం నామ
అష్టావింశోఽధ్యాయః.

తా॥ ఆట్లు కాలము జరుగుచుండగా నొకనాడు ఒకానొక వటవృక్షపు కోటరమందుకచుబడిన బంగారువలె మెరయుచున్న ప్రియంగు ధాన్యపు గింజలనుచూచి దానిని భద్రముగా తెచ్చి కిరాతుడు తన భార్యకిచ్చెను. ఆపెయు ఆ గింజలను భూమిపైచల్లి క్రమముగా సేద్యముచేయ నారంభించగా ప్రియంగు ధాన్యము ఫలించెను. ఫలముఖమగు ధాన్య క్షేత్రమునకు మట్టు కంచెను భద్రముగ అమర్చి పంటవరకు ఆ క్షేత్రము నాదంపతులు కాపాడిరి, ఒకప్పుడు ఆ దంపతులుతమకు సహాయముగ కుమారునిగూడ కాపుకై పంపుచు కాపాడు చుండగా కాలక్రమమున చేను ఫలించెను.

ఇది శ్రీపాద్మపురాణమునందు క్షేత్రకాండమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున దేవల—దేవదర్శన సంవాదమున శ్రీవరాహదేవుని ఆవిర్భావ కథనము మొదలగు నంశములుగల ఇరువదియెనిమిదవ అధ్యాయము.

---

# ఇరువది తొమ్మిదవ అధ్యాయము

## కిరాతుని సమీపమునకు వరాహదేవుడువచ్చుట

దేవదర్శనుడు చెప్పుచున్నాడు —

ప్రియఙ్గావళితో గుప్తే వాధ్రాభిః వృత్తిభిస్తతః
తప్తచామీకరాభోరుపక్వధాన్యభరానతే ॥ ౧

శబరస్తం సమీక్ష్యాథ మధ్యే కృత్వా తు మఞ్చికామ్
తద్రక్షణార్థం తత్రైవ అతిష్ఠన్నక్తన్దివం స్వయమ్ ॥ ౨

కదాచిత్ భగవాన్ శ్వేతః పోత్రిపోతో బుభుక్షయా
వల్మీకరన్ధ్రాత్ నిర్గత్య క్షేత్రమధ్యం నివేశ హ ॥ ౩

తం దృష్ట్వా బహుశః సోఽపి శబరో విస్మయం యయౌ
తతస్తన్మణ్డలేశాయ రాజ్ఞే విజ్ఞాపితుం ద్రుతమ్ ॥ ౪
రాజధానీం ప్రవిశ్యాస్యాఽవేదయచ్చక్రవర్తినః

తా॥ కంచెలతో భద్రపరచి చేనును కాపాడివచ్చుచున్న కిరాతుడు ఫలిత కాలమున క్షేత్రమధ్యముననే ఒక మంచెనువేసుకుని పక్షులు యెలుకలు నక్కలు మొదలగు వాటచేత నష్టము రాకుండ కాపాడుటకై రాత్రింబవళ్లు చేనునందే నివాసమేర్పరచికొనియుండెను. ఇట్లుండగా ఒకనాడు శ్వేతవరాహరూపుడగు భగవానుడు ధాన్యము తినవలెనని తలచి చేనులో ప్రవేశించెను. కిరాతుడా దివ్య మృగమునుచూచి ఆశ్చర్యముతో ఆమృగముచేయు చేష్టలను చాలసార్లు చూచి యేమియు తోచక ఆ ప్రదేశపు రాజునకు ఆ వర్తమానమును నివేదించెను.

## వరాహమును చూచుటకు రాజు శేషాచలమునకు వచ్చుట.

తచ్ఛ్రుత్వా సార్వభౌమస్తు రాజా కౌతూహలాన్వితః ॥ ౫
మృగయావేషభృత్ భూత్వా పదాతిః ఉపనిష్క్రమన్
ఏకాకీ తేన సార్ధం హి జగామ జగతాం హితః ॥ ౬

స్వామిపుష్కరిణీం పుణ్యాం విగాహ్య విగతక్లమః
దణ్డవత్తాం ప్రణమ్యాథ వ్యాధవాక్యవిచిత్రతామ్ ॥ ౭

మనసాఽఽలోచయన్ సమ్యక్ సత్యకాన్యపరాక్రమః
ప్రియఙ్గోః క్షేత్రమాసాద్య ప్రియఙ్గుప్రియదర్శనః ॥ ౮

చతుస్తమ్భసమాయుక్తాం చతురశ్రాం సముచ్ఛ్రితామ్
మృదుపల్లవసంస్తీర్ణాం ఉపాస్తీర్ణమృదుత్వచమ్ ॥ ౯

ఆదాయ సశరం చాపం తుఙ్గశృఙ్గవినిర్మితామ్
మఞ్చికామారురోహైతాం తేన సార్ధం నరాధిపః ॥ ౧౦

తా॥ ఆ మాటలను వినినరాజు కుతూహలముతో వేటవేషమును ధరించి కాలినడకతో ఏకాకిగనే కిరాతుని కలసి శేషాచలమునకువచ్చెను. అచ్చట కిరాతుడు వెంటరాగా శ్రీస్వామి పుష్కరిణియందు స్నానముచేసి భగవానునికి ప్రదక్షిణనమస్కారములుజేసి వరాహవృత్తాంతమును ఆశ్చర్యముగా మనసులో ధ్యానించుకొనుచు ప్రియంగు క్షేత్రమునకుచేరి పై శరీర చాపములను ధరించినవాడై కిరాతకునిపాటుగ మంచెపై నెక్కెను. వారిరువురును ఆరాత్రి యంతయు మేల్కొని చూచుచుండిరి.

**రాజు వల్మీకమునుండి వచ్చెడి వరాహమును దర్శించుట**

వల్మీకవివరాచ్చిత్రసూకరో నిర్జగామ హ ॥ ౧౧

వృతిం విలఙ్ఘ్య వాద్రాభిః ప్రాశైరప్యతిదుర్గమామ్
క్షేత్రమధ్యఞ్చ ధావన్తం సూకరం సుభగాఙ్గకమ్ ॥ ౧౨

ఆత్తాభిలాషమాహారే దంష్ట్రాగ్రదీధితిసఞ్చయైః
ధ్వాన్తం శకలయన్తఞ్చ భాస్వద్దివ్యాఙ్గసఙ్గతైః ॥ ౧౩

రాజా తం వీక్ష్య సహసా విస్మయం పరమం గతః
సజ్యే ధనుషి సన్ధాయ సాయకం సాధువిక్రమః ॥ ౧౪

తూర్ణమాకర్ణమాకృష్య చలలక్ష్యప్రవేధినమ్
గ్రహీతుకామో నృపతిః తేన సార్ధం తమన్వగాత్ ॥ ౧౫

తా॥ వల్మీకమునుండి వరాహము బయటికివచ్చి చేనుకు చుట్టుకట్టిన కంచెలను కోరళ్లను బలాత్కారముగభేదించి దాటి చేనుమధ్యకువచ్చెను. ఆకలితో పరుగులిడుచు రాత్రి చీకటిని తన కోరలకాంతితో పోగొట్టి ప్రకాశముచేయుచు అందమైన రూపముతోనున్న ఆ వరాహముయొక్క దివ్యరూపమునుచూచిన రాజు ఆశ్చర్యపరవశుడై బాణమును సంధించిన వింటిని ఆకర్ణాంతము ఆకర్షించి వరాహమువెంట పరుగెత్తసాగెను.

సూకరో వీక్ష్య ధావన్తం చాపహస్తం మహీపతిమ్
ఝటితి క్షణమాత్రేణ వల్మీకవివరం యయౌ ॥ ౧౬

వ్యర్థప్రతిజ్ఞో నృపతిః ప్రాజ్ఞః ప్రఖ్యాతవిక్రమః
వల్మీకమూలమాగత్య ద్రష్టుం సూకరమత్వరః ॥ ౧౭

శిశ్యే చ దర్భశయ్యాయాం స్వప్నం కాఙ్క్షన్ క్షితీశ్వరః
ప్రబుద్ధః ప్రాకృతః ప్రాతః అదృష్ట్వా స్వప్నదర్శనమ్ । ౧౮

కింకర్తవ్యత్వశూన్యాత్మా చిన్తయన్ కాయశోధనమ్
మహదాశ్చర్యమాహర్తుం స్నాత్వా స్వామిసరోజలే ॥ ౧౯

తపోవేషం సమాస్థాయ ధ్యాయన్ సూకరమీశ్వరమ్
కర్తుం ప్రవవృతే వీరః తతః ప్రాయోపవేశనమ్ ॥ ౨౦

నిర్ద్వన్ద్వోఽవన్ధ్యనిష్ఠశ్చ నిష్ఠావాన్ అస్య దర్శనే
ఏవం హి వర్తమానేఽస్మిన్ నృపతౌ నియతాత్మని ॥ ౨౧

శబరేణ శబర్యా చ పరిష్కృతసపర్యకే
వృత్తం విష్ణుపదే వాక్యం విశుద్ధమమృతోపమమ్ ॥ ౨౨

తా॥ వరాహము తనను వెంటనంటి పరుగిడెడి చాపహస్తుడగు రాజును చూచి క్షణమాత్రములో తన నివాసమగు వల్మీకమును చేరెను. వరాహమును చూడవలయునను ప్రతిజ్ఞచేసిన రాజుకూడ పుట్టచెంతకేగి వరాహమును దర్శించి తీరవలయునను నభిసంధితో నచ్చటనే దర్భలను పరచి రాత్రి అంతయు శయనించెను. తెల్లవారినదే రాజు లేచి వరాహవృత్తాంతము తనకు రాత్రి నిద్రయందు స్వప్నమూలముగ తెలియనందుకు దుఃఖించి శ్రీ స్వామిపుష్కరిణీ పుణ్యజలములందు స్నానము చేసి తపస్వి వేషమును ధరించి నిరాశుడై, ప్రాయోపవేశమును సంకల్పించి అట్లుండెను. నియతాత్ముడై ప్రాయోపవేశము జేసి శబరదంపతుల ఆతిధ్యమున సత్కరించబడిన రాజునుద్దేశించి ఆకాశమునం దొక అశరీరవాణి వినవచ్చెను

రాజునుగూర్చి అశరీరవాణి పలుకుట

'ద్రష్టుకామో యది భవా౯ సాధువృత్త! మహీపతే!
తపసాఽలం సగర్వేణ సూకరార్భకదర్శనే ॥ ౨౩

యత్తస్య వృత్తం తచ్ఛ్రుత్వం యద్వక్ష్యామి చ సువ్రత
సవత్సాఽసితగోక్షీరధారాభిః అభిషేచయ ॥ ౨౪

అచ్ఛిన్నసన్తతాభిశ్చ వల్మీకస్థం వరాహకమ్
ఏవం సిక్తః స భగవా౯ ప్రోత్రివక్త్రః పురాతనః ॥ ౨౫

ప్రాదుర్భవిష్యతి తతో వల్మీకవివరాత్ విభుః
ఏవముక్త్వా తు వాక్యం తత్ పునర్నోవాచ కిఞ్చన ॥ ౨౬

తా॥ ఓ రాజా! నీవు వరాహదేవుని దర్శించగోరినచో ఈ ప్రాయోపవేశమాదిగాగల వ్యర్థప్రయత్నములుచేయకుము. నేను చెప్పినట్లు చేయుము. వత్సలతోకూడిన నల్లనిగోవులక్షీరములచే ఏకధారగా ఈవల్మీకవివరమందు దాగిన వరాహదేవుని కభిషేకముచేయుము అట్లుచేసినచో వరాహరూపియగు భగవానుడు ప్రత్యక్షము కాగలడు. అని పలికి మిన్నకుండెను.

నృపతిః తం నిశమ్యాఽశు విస్మయో విస్మయం గతః
తం ప్రయత్నం ప్రవవృతే ప్రయతోఽప్రాకృతాత్మనః ॥ ౨౭

అస్య నారాయణగిరేః లక్ష్మీనారాయణేశితుః
వసతేర్దక్షిణే భాగే ద్వియోజననియోజితే ॥ ౨౮

తీరే స్వర్ణముఖర్యాశ్చ దక్షిణే దక్షిణక్రమే
ప్రాగ్భాగే గణ్డశైలస్య సర్వోపకరణాన్వితే ॥ ౨౯

గ్రామే సఙ్గ్రామవిజయీ సమాహితమనాస్తతః
సంచిన్త్య సర్వాన్ సంభారాన్ తస్మాదాహృత్య సత్వరః ॥ ౩౦

తం వరాహఞ్చ వల్మీకమభిషేక్తుమనా మనాక్
విశుద్ధవాసా నిష్ణాతో వైష్ణవః పూర్ణమానసః ॥ ౩౧

తా॥ ఆ ఆకాశవాణిని వినిన రాజు ఆశ్చర్యముతో భగవానుని దర్శనమును ఆత్రతతో కోరినవాడై అట్లు చేయుటకు సంకల్పము చేసెను. నారాయణాద్రికి దక్షిణదిక్కున రెండు యోజనములలో స్వర్ణముఖికి దక్షిణమునను గండశైలమునకు ప్రాగ్భాగమునను ఉండిన తనరాజధానికిచేరిన గ్రామమందు అభిషేకమునకు కావలసిన సకలసంభారములను సేకరించి తెచ్చి వరాహునికి, వల్మీకమునకు అభిషేకము చేయవలయు నను నాత్రముతో రాజు భగవత్కైంకర్యమునందే నిలిపినమనసుతో నుండెను.

నిష్ణాతః తత్ప్రపర్యాయాం బభూవ వసుధాధిపః
సావధానః సహామాత్యైః సాపత్యైః శబరాన్వితః ॥ ౩౨

అతన్ద్రితః సాధు సాన్ద్రం అశరీరివచః స్మరన్
గోక్షీరైః హేమకుమ్భస్థైః వల్మీకవివరోదరమ్ ॥ ౩౩

అనుస్యూతాచ్ఛిన్నధారైః అభిషేక్తుం ప్రచక్రమే

తా॥ సావధానమనస్కుడైన రాజుకిరాతునితోకూడి అశరీరవాక్కును స్మరించుకొనుచు వల్మీకవివరమున దాగిన వరాహదేవుని బంగారుబిందెలతో అవిచ్ఛిన్నధారగోక్షీరములనభిషేకించుట కారంభించెను.

క్రియమాణేఽభిషేకే తు వల్మీకవివరాన్తరాత్ ॥ ౩౪

## వరాహదేవు డావిర్భవించుట

ఆవిర్బభూవ భగవాన్ వరాహవపురీశ్వరః
కోటీరకోటివిలసన్మణిమణ్డలమణ్డితః ॥ ౩౫

అమృతాంశుకళాకల్పదంష్ట్రాద్రిదన్తురపోత్రకః
లలాటపట్టఘటితవేణుపత్త్రోర్ధ్వపుణ్డ్రకః ॥ ౩౬

కమ్బుబిమ్బసదృక్కణ్ఠో మాంసలస్కన్ధమణ్డలః
సుపారిజాతవిటపవిడమ్బితచతుర్భుజః ॥ ౩౭

శఙ్ఖచక్రధరో వామ ఊరుపీఠే స్థితాం మహీమ్
దేవీం త్రపాగోపితాక్షీం లోలావిలవిలోచనామ్ ॥ ౩౮

సర్వాత్మసమ్భృతదయాకాయినీం హర్షదాయినీమ్
గాఢంగాఢం సమాలిఙ్గ్య అస్యా అఙ్గం పదద్వయమ్ ॥ ౩౯

గృహ్ణానః సాన్ద్రహర్షేణాలోకయన్ వక్త్రపఙ్కజమ్
విశాలవక్షాః శ్రీవత్సకౌస్తుభాభ్యాఞ్చ లాఞ్ఛితః ॥ ౪౦

యజ్ఞోపవీతోత్తరీయదృఢబన్ధనబన్ధురః
హారకేయూరకటకరమ్యహీరాఙ్గులీయభృత్ ॥ ౪౧

సమభ్యర్థితవామాఙ్ఘ్రిశిఞ్జన్మఞ్జీరహంసకః
నవరత్నాన్తరప్రోతముక్తాహారభుజాన్తరః ॥ ౪౨

అప్రమేయైరభినవైః ఆకల్పైః ఆత్మహారిభిః
తపనీయైశ్చిత్రవస్త్రైః చిత్రైశ్చీనాంశుకైరపి ॥ ౪౩

మాలాభిరమలామోదమాలాభిః మధుసూతిభిః
అష్టాత్మగర్భసన్దర్భైః అపారైశ్చ పరిష్కృతః ॥ ౪౪

ఆజాను చావిర్భవతి పురుషే సూకరాత్మని
విచ్ఛిన్నా క్షీరధారాఽభూత్ ధారాలా తు ప్రమాదతః ॥ ౪౫

తా॥ ఇట్లు అభిషేకము గావింపగా వల్మీకవివరమునుండి వరాహదేవు డావిర్భవించెను. అనేక మణులకాంతితో ఆదివ్యమంగళవిగ్రహ మగుపడెను. చంద్రకాంతిసీను కోరలు, లలాటభాగమునందు వేణుపత్రమును బోలిన ఊర్ధ్వ పుండ్రము, శంఖమువంటి కంఠము, బలసిన భుజములు, పారిజాతవృక్షమును బోలిన నాలుగుభుజములు, శంఖచక్రములు వామోరువందు లజ్జానమ్రాంగియగు మహీమాతయు మహీమాతనాలింగనము చేసికొని ఆమె రెండు పాదములను చేతనెత్తి ముఖపంకజమును సంతోషముతో తిలకించుట శ్రీవత్సకౌస్తుభములను ధరించిన విశాలవక్షఃస్థలము, యజ్ఞోపవీతము ఉత్తరీయబంధము హారకేయూర కటకరమ్యహారాంగులీయకములు యెత్తిన వామపాదము, పాదములయందు మంజీరములు, కంఠమున నవరత్నాంతరప్రోత ముక్తాహారములు, మనశ్చిత్త హారములగు ననేక దివ్యాభరణములు దివ్యాంబరములు పుష్పదామములు అనేక ములగు స్వర్ణాభరణాంతరములు ఇవన్నియు దివ్యమంగళవిగ్రహమందగుపడెను. కాని ఆదివ్యమంగళవిగ్రహము జానువులకు పైభాగము మాత్రమే అగుపడగా గోక్షీరధారయు హఠాత్తుగ నిలచిపోయెను. జానువులకు క్రిందిభాగము దృష్టి గోచరము కాకపోయెను.

తావాఁ ప్రత్యక్ష్యదృష్టః స తదధో న హ్యదృశ్యత
పశ్చాదనేకవిధయా రాజాఽపి ద్రష్టుమక్షమః ॥ ౪౬

ప్రయత్నాదప్రతీకారోఽతిష్ఠత్ తూష్ణీం సతృష్ణధీః
శుష్కజిహ్వోకణ్ఠసృక్విణోష్ఠః సోష్ణం వినిశ్శ్వసన్ ॥ ౪౭

విదీర్ణ మానసో మాసి విక్షీర్ణాఙ్గో విఘూర్ణితః
ఏవం వృత్తే రాజ్ఞి తదా భగవాఁ భూతభావనః ॥ ౪౮

తా॥ జానువులకు క్రిందిభాగమును కూడ దర్శింపవలయునను నాశతో రాజు అనేక ప్రయత్నములుచేసి ఫలించకపోగా శరీరమంతయు శుష్కమై ఉష్ణ మగు నిట్టూర్పులు విడచుచు మిన్నకుండెను.

వరాహరూపవిభవః పురాణపురుషోత్తమః
ఉవాచ వచనం శ్రీమాఁ కరుణాపరిణామభూః ॥ ౪౯

రాజునుగూర్చి భగవదాదేశము

రాజన్ ! అలమలం వ్యర్థప్రయత్నేనాతిభూయసా
ఏతావాం_స్తవ దృశ్యోఽహం తదధో న నృపాధిప ! ॥ ౫౦
ఏతద్రూపం ప్రతిష్ఠాప్య శుద్ధయా శిలయా నృప !
తస్మై దేహ్యఖిలాన్ భోగాన్ పూర్ణో భూత్వా సుపుష్కలాన్ ॥
అప్రాకృతాఙ్గో విరజాః సాత్త్వికోఽయమితి స్మరన్
వైఖానసైర్మహర్షిభిః అర్చయ త్వం నరాధిప ! ॥ ౫౨
పశ్చాన్మామాప్స్యసి యాః గచ్ఛ సాధు శాధి వసున్ధరామ్

తా॥ నిరాశతో దుఃఖితుడై యున్న రాజునుచూచిన భగవానుడు దయతో ఓ రాజా ! నీవు ఇకనేమియు ప్రయత్నముచేయవద్దు ఇంతవరకే నాస్వరూపము కాననగును. జానువుల క్రిందిభాగము కనుబడదు. ఈ స్వరూపమునే శుద్ధమగు శిలచే విగ్రహమును నిర్మింపజేసి ఆవిగ్రహమునకు సమస్తభోగములనర్పింపుము. ఈ శిల మీకు కనుబడు ప్రాకృతద్రవ్యముకాదు. ఇది పంచోపషదాత్మకమగు అప్రాకృత ద్రవ్యమని ధ్యానింపుము. మహానుభావులును తపస్సిద్ధులునగు శ్రీవైఖానససూత్రానుష్ఠాతలు నగు బ్రాహ్మణశ్రేష్ఠులచే నిత్యారాధనాది సకల కైంకర్యములను చేయింపుము. ఆవల నా చెంతకు రమ్ము ! అని చెప్పెను.

ఏవముక్త్వా కోలవపుః రాజ్ఞోఽమూం కాలయాపనామ్ ॥ ౫౩

కిన్నరమిథునమునకు శాపమోక్షప్రకారము

కిరాతవపుషా వీక్ష్య విష్ణుః కిన్నరదమ్పతీ
మునిశాపాన్మోచయిత్వా దదౌ తాభ్యాం స్వకం పదమ్ ॥ ౫౪
తతశ్చా_న్తర్దధే దేవో వరాహవపురత్ర వై

తా॥ రాజునకిట్లుచెప్పిన భగవానుడు కిరాతదంపతులను మునిశాపము నుండి విడిపించి స్వలోకమునకుపంపి అంతర్హితుడాయెను.

రాజు శ్రీవరాహమూర్తి విగ్రహమును ప్రతిష్ఠించుట

తతః పూర్ణమనా రాజా దివ్యం త్వష్టారమాహ్వాయత్ ॥ ౫౫

దేవం నిర్మాపయామాస మనసా విశ్వకర్మణా
భూవరాహశిశుం పూర్ణం రాజానం నాకవాసినామ్ ॥ ౫౬

వారాహవపుషం శౌరిం దణ్డవత్ప్రణిపత్య చ
శిరస్యఞ్జలిమాబధ్నన్ స్మరన్నాశ్చర్యమీదృశమ్ ॥ ౫౭

జితేన్ద్రియో జితక్రోధో జితప్రకృతిసంస్తరః
జితామిత్రో జితాశేషో రాజర్షిః స్వాం పురీం యయౌ ॥ ౫౮

తదా ప్రభృతి దేవేశో వరాహవపురాత్మభూః
అనన్తాచలశృఙ్గేఽన్తర్నిక్షిప్తాఙ్ఘ్రిసరోరుహః ॥ ౫౯

దేవ్యా వసుధయా సార్ధం స్వామిపుష్కరిణీతటే
సుఖమాస్తే సురేశానః సుఖీ రహసి సున్దరః ॥ ౬౦

తా॥ రాజు సంతుష్టుడై దేవశిల్పిని పిలిపించి భూవరాహదేవునికి చిన్న దివ్యమంగళవిగ్రహమును నిర్మింపజేసి ప్రతిష్ఠింపజేసి యెదుట దండవత్ప్రణామ మాచరించి అంజలి సమర్పించి నిర్మముడు భగవన్న్యస్త సమస్తభరణుడునై స్వపురమునకేగెను. నాటనుండి వరాహదేవుడు దేవియగు వసుధతో సుఖముగా శేషాచలమందు వసియించుచుండెను

శ్రీనివాసుడు స్వామిపుష్కరిణి దక్షిణతీరమందుండుట

శ్రీనివాసోఽపి శేషాద్రౌ తతః స్వామిసరస్తటే
నివసన్నాత్మనః కుర్వన్ అర్వాచీనాన్ సుఖాత్మనః ॥ ౬౧

సచ్చిదానన్దసన్దోహో వృద్ధిక్షయవివర్జితః
కారుణ్యపుణ్యపదవీ కమలాకాముకః కవిః ॥ ౬౨

అభూమిరాపదాం భూమిఃసమ్పదాం సంవిదుద్గమః
సమస్తసామసఙ్గీతసచ్చరిత్రః పవిత్రహృత్ ॥

పురాణపురుషో ధాతా పురుషః తమసః పరః
వైకుణ్ఠపూర్వవసతిం త్యక్త్వేదానీం హి తిష్ఠతి ॥ ౬౪

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే
దేవల దేవదర్శనసంవాదే ప్రియయజ్ఞగోష్ఠ్యకిరాత
సమీపం ప్రతి వరాహాగమన శ్రీవరాహా
విర్భావాదివర్ణనం నామైకోనత్రిం
శోఽధ్యాయః.

తా॥ సచ్చిదానంద సందోహుడను వృద్ధిక్షయవర్జితుడును కారుణ్యాపూర్ణా పదవియు కమలాకాముకుడును కవియు అపరిలంఘనీయుడును సంపదలకునిధియు సమస్త సామములచేత కీర్తింపబడెడి సచ్చరిత్రము కలవాడును పవిత్రహృదయుడును పురాణపురుషుడును ధాతయు తమస్సుకావల నుండువాడు నగు శ్రీనివాసుడును తరువాతి వేతనుల్లకు సకలార్థముల ననుగ్రహించుటకై స్వామిపుష్కరిణీ తీరమున వసతిని కల్పించికొని నేటికిని అచ్చటనే ఉన్నాడు

ఇది శ్రీపాద్మపురాణమువందు క్షేత్రకాండమున శ్రీవేంకటాచలమాహాత్మ్యమున
దేవల దేవదర్శన సంవాదమున శ్రీవరాహదేవుని ఆవిర్భావ
కథనము మొదలగు నంశములుగల ఇరువదితొమ్మిదవ
అధ్యాయము.



## ముప్పదవ అధ్యాయము

శ్రీనృసింహాచలమందలి నీలకంఠక్షేత్రవర్ణనము

దేవలుడు పృచ్ఛించుచున్నాడు —

'సఙ్కృన్కరే సపర్యాం క్వ : నీలకణ్ఠో మహేశ్వరః
వైకుణ్ఠస్యాముత్ర గోత్రే నరకణ్ఠీరవాకృతేః ' ? ॥ ౧

తా॥ ఓ దేవదర్శన మహర్షీ ! శ్రీనృసింహమూర్తియొక్క శ్రీవైకుంఠాద్రియందు నీలకంఠుని కైంకర్యమెట్టిది చెప్పుము

దేవదర్శనుడు చెప్పుచున్నాడు :—

'శృణు విప్ర ! సమాచక్షే పురారాతేః పురావిదః
చరితం చరితార్థానాం యోగినాం భోగసాధనమ్ ॥ ౨

అభీష్టఫలదం రమ్యం చతుర్వర్గఫలప్రదమ్
నరకేసరిణో విష్ణోః పరబ్రహ్మస్వరూపిణః ॥ ౩

ప్రసాదప్రసవప్రాప్తిహేతుబన్ధనిబన్ధనే
ఇత ఉత్తరభాగే తు త్రింశద్యోజనసమ్మితే ॥ ౪

ప్రదేశే భీషణే రోమహర్షణే భూతభీషణే
కశ్చిత్ క్షితిధరః కుక్షికక్షక్షితిరుహోఽక్షయః ॥ ౫

త్ర్యశ్రశ్రమః పక్షియూథవాసప్లక్షాక్షకోటరః
విశఙ్కటతటారూఢవృక్షగుల్మగుహాతమాః ॥ ౬

శృఙ్గక్రోడగుహావాసవైఖానసవనేచరః
తుఙ్గశృఙ్గదరీనిర్యద్యోఘనిర్మలనిర్ఝరః ॥ ౭

నిర్ఝరాపాతపర్యన్తస్నిగ్ధానోకహవాటికః
తప్తహాటకసఙ్కాశగైరికాకీర్ణకన్దరః ॥ ౮

భానూపలముఖోత్కీర్ణచిత్రభానుశిఖాశతః
చన్ద్రప్రభాభిన్నముఖచన్ద్రికాన్తసుధాద్రవః ॥ ౯

కణ్ఠీరవనఖత్రుట్యత్కుఞ్జరీకుమ్భమౌక్తికః
గలితైః మౌక్తికైః విష్వక్ ఆకీర్ణప్రస్థమఃస్థలః ॥ ౧౦

మాణిక్యధామన్యగ్భూతరవిమణ్డలచణ్డరుక్
నానావిధమణివ్రాతమయూఖోద్ద్యోతఖస్థలః ॥ ౧౧

విద్రుమప్రతతివ్రాతసంవృతాన్తరకన్దరః
వికీర్ణపద్మపాషాణపాటలస్థలకుట్టిమః ॥ ౧౨

శృఙ్గకోటీరసఙ్గీతసంవివాద్యప్సరోగణః
లతాకుసుమసంక్లృప్తలీలాలయనివాసిభిః ॥ ౧౩

మిథునైః కిన్నరాణాం హి తాలశ్రుతివికల్పనైః
దివ్యావిర్భావచరితం సఙ్గాయద్భిరితస్తతః ॥ ౧౪

అధిష్ఠితభృగుప్రాన్తః ప్రస్థగుఞ్జాభిరఞ్జితః
గన్ధర్వైః గర్వవిభవైః గీతవాద్యవిశారదైః ॥ ౧౫

మన్త్రిమధ్యోచ్చమహితైః మహితానేకకన్దరః
మార్తణ్డమణ్డలక్షిప్తస్ఫురన్నయనమణ్డలైః ॥ ౧౬

పుణ్డరీకసుహృచ్ఛణ్డమయూఖీమణ్డలాదిభిః
తాపసైః చణ్డతేజోభిః మణ్డితోచ్ఛృఙ్గకన్దరః ॥ ౧౭

క్వచిడ్డమరుకోన్మూర్ణత్కరైరుగ్రోర్ధ్వకేశకైః
విఘూర్ణమాననయనైః మదస్ఖలితకాయకైః ॥ ౧౮

భైరవైః భైరవీభిశ్చ నిబిడాడమ్బరైర్యుతః
దేవానాం పూర్వదేవానాం సిద్ధానాం యోగినామపి ॥ ౧౯

భూతానాం యోగినీనాఞ్చ మాతౄణాం యక్షరక్షసామ్
అన్యేషాం దేవయోనీనాం ఆవాసోపత్యకాశ్రయః ౨౦

ధ్యాయద్భిశ్చ పరం బ్రహ్మ క్వచిత్ యోగాసనస్థితైః ॥
యోగివర్యైః ఆర్యభావైః యోగాభ్యాసవిచక్షణైః ॥ ౨౧

ఏకాయనైః ఏకభావైః ఆలక్షితగుహాశయః
కృష్ణసారపురోయాయిహరిణీకులసఙ్కులః ॥ ౨౨

పరస్పరపరిత్యక్తవైరైః భీమైః మృగైః వృతః
అప్రమేయప్రభావో యః ప్రసిద్ధః పర్వతోత్తమః ॥ ౨౩

తస్య పర్వతవర్యస్య పుణ్యారణ్యసమీపతః
ప్రత్యగ్రపల్లవైః కీర్ణసుబిల్వవనవాటికైః ॥ ౨౪

ప్లక్షైః రుద్రాక్షవృక్షైశ్చ శ్లక్ష్ణైః సుశ్లక్ష్ణపర్ణకైః
అభ్రంలిహోర్ధ్వశాఖాగ్రైః అజ్ఞాతజ్ఞాతసంజ్ఞికైః ॥ ౨౫

యజ్ఞశాఖిభిరాకీర్ణం సఙ్కీర్ణం యజ్ఞవాటకైః
అనోకహైః అవిరళైః సరళైః సర్వతో వృతమ్ ॥ ౨౬

సమాశ్రితార్తిహరణసాముచ్ఛ్రాయం సమన్తతః
అహిర్బుధ్న్యతపఃక్షేత్రం క్షేత్రక్షేత్రజ్ఞబన్ధురాత్ ॥ ౨౭

నరకణ్ఠీరవస్థానం కణ్ఠీరవవరపోద్ధతమ్
భైరవాభైరవాశ్చర్యం భూరిభీషణభీషణమ్ ॥ ౨౮

తా॥ ఓ దేవల ద్విజవర్యా వినుము. ఇచ్చటికి ముప్పది యోజనముల కుత్తరముగ శ్రీ నృసింహుని సాన్నిధ్యముగల చతుర్వర్గ ఫలప్రదమగు నొక పర్వతమున్నది. అందు పరమశివుని దివ్యాశ్రమము కలదు. అనేక పుణ్య వృక్షములు గుల్మములు నిర్మలోదక ప్రవాహములుగల సెలయేళ్లు గైరికాదిస్వర్ణ మయధాతువులు సూర్యకాన్తములు చంద్రకాన్త శిలలు కంఠీరవములచే వధింప బడిన గజరాజముల దంతములనుండి వ్రాలిన ముత్యములు నానావిధములగు ననేక రత్నములు పర్వతసానువులందు వనేచరులగు వైఖానసాది మహర్షులు దివ్యనాదములను వాద్యములను ప్రయోగించెడి అప్సరసలు కిన్నరగంధర్వ విద్యా ధర యక్షకూటములు ఘోరమగు తపస్సున సమాహితులై యున్న తాపసులు సిద్ధులు, భూతప్రేత పిశాచములు పరబ్రహ్మ నిష్ఠులగు సాధువులు కొల్లలుగ నా పర్వత సానువులందు వసియించుచుందురు. అచ్చట పర్వతమందలి పుణ్యా రణ్యసమీపమున ఆకాశము నంటిన యెత్తుగల దట్టమగు స్నిగ్ధ ఛాయలనీనెడిది యీ శివభగవానుని దివ్యాశ్రమము.

నీలకంఠాశ్రమమునందలి పుష్కరిణీవర్ణనము

పవిత్రమత్ర విపినే వైడూర్యవిమలోదకా
కాఞ్చనామ్బుజకహ్లారకమలేన్దీవరోత్కటా ॥ ౨౯

ప్లవమానప్లవా మీనమకరగ్రాహమణ్డితా
మరాళమల్లమహితా కారణ్డవకులాకులా ॥ ౩౦

తారాతరళకల్లోలమాలాలోలాన్తరాళకా
ఉత్ఫుల్లకైరవా ఫుల్లపుణ్డరీకపురస్కృతా ॥ ౩౧

మకరన్దరసాస్వాదమాద్యద్వనపయోగణా
త్రిమదోన్మత్తమాతఙ్గమదవార్యావిలాఽమలా ॥ ౩౨

దేవర్షిభిః తపస్యద్భిః రాజర్షోయ్ఘైః మహాత్మభిః
ఉపాన్తపర్యన్తభువి నివసద్భిః సమన్తతః ॥ ౩౩

తపోవిమలవిశ్వాన్తైః విశఙ్కటతటోత్కటా
మన్త్రం షణ్ణవతీభేదం జపద్భిర్నారసింహకమ్ ॥ ౩౪

నిష్కలం సకలం మిశ్రమాశ్రితావనవిశ్రుతమ్
శ్రీవత్సాఙ్కం నారసింహగర్భా గర్భకమద్భుతమ్ ॥ ౩౫

జ్ఞానానన్దమయం జ్ఞానగమ్యం వైరాగ్యభోగ్యకమ్
ధ్యాయద్భిస్తత్ పరం బ్రహ్మ అతీన్ద్రియం విజితేన్ద్రియైః ॥ ౩౬

బ్రహ్మర్షిభిః సేవ్యమానా బ్రహ్మభూయఙ్గతైః సదా
పురుజిచ్చరణస్పర్శపూతా పురుషపావనీ ॥ ౩౭

పురాణపుణ్యభవనం పురుషోత్తమపూర్తిదా
పూర్వసేవాపురస్కారిపుంమణ్డలపురస్కృతా॥ ౩౮

పుణ్యపుష్కరిణీ స్వామిపుష్కరిణ్యాత్మభూమికా
దర్శనాత్ స్పర్శనాత్ పానాత్ సర్వేషాం సర్వకామదా ॥ ౩౯

పవిత్రమగు నా యాశ్రమమునందు వైడూర్యములవలె విమలమగు నుదకము గలదియు బంగారుమయములగు తామరలు కలువలు నిర్భయముగ సంచరించెడి జలచర సమూహముగలదియునగు నొక దివ్యపుష్కరిణియున్నది. ఆ సరస్తీరమున ననేకమంది మహాత్ములు నారసింహ మహామంత్రమును నియమపురస్సరముగ పునశ్చరణము చేయుదురు. దేవతలందరును ఆయాకాలములం దచ్చటికి వచ్చి స్నానానుష్ఠానముల జేసికొనిపోవుచుందురు.

ఉపల వటవృక్షమూలమునందలి నీలకంఠాశ్రమవర్ణనము.

తస్యాస్తీరే మహాన్ అశ్మన్యగ్రోధో గిరికన్దరే
శాఖాశతైః పరిచ్ఛన్నదశాశాచక్రవాలకైః ॥ ౪౦

సంవర్ధితాన్ధతమసః స్వాన్తధ్వాన్తమలాపహః
తాపత్రయార్తమనసాం జన్తూనాం ఆర్తిహారకః ॥ ౪౧

కల్పవృక్షప్రతినిధిః నిధిః నిగమవర్చసామ్
నరాణామాశ్రితవతాం మహాపాతకనాశనః ॥ ౪౨

తస్యోపలవటాఖ్యస్య మూలే శూలిన ఆశ్రమమ్
హరిణైః హరిణీభిశ్చ నారసింహవివర్ధితైః ॥ ౪౩

సమాధ్యాసితపర్యన్తభూతలం వృషమూర్తిభిః
చణ్డక్రమైః పుణ్డరీకైః మణ్డితాశాన్తమణ్డలైః ॥ ౪౪

వైశ్వామిత్రైః కుశైః ముఞ్జైః కాశైశ్చాపి సమావృతమ్
మన్దారకున్దమాకన్దహరిచన్దనచన్దనైః ॥ ౪౫

పాటలాశోకతిలకకృతమాలతమాలకైః
నక్తమాలైః నాళికేరైః పనసైరసనైః ధవైః ॥ ౪౬

పున్నాగపూగరుద్రాక్షవకులాక్షహరీతకైః
సమన్తతః సచ్ఛాయమయం వన్యైః అన్యైః అనోకహైః ॥ ౪౭

నన్ద్యావర్తైః జాతియూథీకరవీరాతివీరకైః
శతపత్రైః దమనకమాధవీమాలతీద్రుభిః ॥ ౪౮

తుళసీభిః గన్ధలతాజాతిభిః పరితో వృతమ్
పఞ్చభిః పారిజాతాదిపాదపైశ్చ పరిష్కృతమ్ ॥ ౪౯

పవిత్రేఽస్మిన్ హరిక్షేత్రే హరిం నరహరిం హరః
అభ్యర్చితుమనాః స్థాణుః ఆజగామ జగన్మయః ॥ ౫౦

తా॥ ఆ సరస్తీరమందు మహారణ్యమధ్యమున ఉపలవటమను నొక మఱ్ఱి వృక్షముకలదు. ఆ వృక్షము మహాపాపాదుల నొనరించిన జీవులకు మనశ్శాన్తి నిచ్చి పాపములను పరిహరింపగల శక్తికలది. అనేకములగు పుణ్యవృక్షములా వటవృక్షమును నేత్రానందము గ నావరించికొని ఆ వృక్షములును లతలతోను పుష్పములతోను ఫలములతోను మధుకరములతోను రకరకములగు విహంగ ములతోను అలరారుచున్నవి. పారిజాతాది దేవతా తరువులందుగలవు. ఆ విధమగు పుణ్యక్షేత్రమునకు పరమశివుడు నృసింహుని గురించి తపస్సుచేయ గోరివచ్చెను.

నీలకంఠుని నృసింహారాధన సంకల్పము.

స్నాత్వాఽస్యాం పుణ్యపూర్వాయాం పుష్కరిణ్యాం పురాన్తకః
హరో దివ్యామ్బరధరో హరిచన్దనచర్చితః ॥ ౫౧

సర్వర్తుకాలోత్థఫలమాలా శతపరిష్కృతః
దివ్యైరాభరణైః ముక్తాఫలరత్నప్రవాళకైః ః ౫౨

సమలఙ్కృతసర్వాఙ్గః తుఙ్గమఙ్గళసంయుతః
కల్యాణవేషకలితైః నన్దిప్రముఖకైర్గణైః ॥ ౫౩

సేవితో భూతతతిభిః సేవారసవిశారదైః
సితాసితైః సారమేయైః దుర్వారైః ప్రమథైః సహ ॥ ౫౪

నరసింహసపర్యాయాః ప్రత్యూహప్రతిఘాతినా
సేవితః క్షేత్రపాలేన సుప్రసన్నో మహేశ్వరమ్ ॥ ౫౫

పరావరాణాం భూతానాం స్రష్టారం పరమేశ్వరమ్
సంహర్తారఞ్చ పాపానాం నిగ్రహీతారమచ్యుతమ్ ॥ ౫౬

అనుగ్రహీతారమీశం ఈశానస్య తపఃఫలమ్
సకలం నిష్కలం మిశ్రం పరస్మాత్ పరమవ్యయమ్ ౫౭

లక్ష్మీనృసింహం సంహారనృసింహం దివ్యసింహకమ్
అఖిలార్తిహరం వీరం ఉగ్రం ప్రత్యగ్రవిగ్రహమ్ ॥ ౫౮

శబ్దబ్రహ్మమయం శబ్దాతీతం శబ్దవిజృమ్భణమ్
అర్థబ్రహ్మవపుః పూతం పురాణం పుణ్యపూరణమ్ ॥ ౫౯

అవ్యాజమిత్రం శత్రుఘ్నం శరణ్యం శరణాత్మకమ్
భక్తార్తిభఞ్జనపరం ఆత్మనామభయప్రదమ్ ॥ ౬౦

సచ్చిదానన్దసన్దోహం వృద్ధిక్షయవివర్జితమ్
పూర్ణషాడ్గుణ్యవిభవం త్రైగుణ్యవిభవాస్పదమ్ ॥ ౬౧

శ్రీవత్సలక్షణం సర్వం సర్వలక్షణలక్షితమ్
అప్రపఞ్చం ప్రపఞ్చాత్మప్రపఞ్చితపరాక్రమమ్ ॥ ౬౨

విశ్వేశం తత్పరం బ్రహ్మ ధ్యాయన్నేకాగ్రమానసః
వసానః కృత్తివసనం పౌణ్డరీకోత్తరచ్ఛదః ॥ ౬౩

పాఞ్చరాత్రవిధానేన పఞ్చకాలపరాయణః
తస్యోపలవటస్యాధో నరకేసరిణః స్వయమ్ ॥ ౬౪

సర్వలోకహితార్థాయ సర్వావాసస్య శార్ఙ్గిణః
సపర్యాం సుకృతీ కర్తుం అగ్నిరేతాః ప్రచక్రమే ॥ ౬౫

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవల-
దేవదర్శనసంవాదే శ్రీనృసింహాచలస్థ నీలకణ్ఠతపః క్షేత్రాది-
వర్ణనం నామ త్రింశోఽధ్యాయః

తా॥ ఆ వనస్థలిదమున నివాసమేర్పరచుకొనిన శివభగవానుడు అందు స్నానానుష్ఠానముల గావించుకొని దివ్యాంబరములను ధరించి హరిచందనము నలంకరించికొని దివ్యాభరణములు ముక్తాఫలములు దివ్యపుష్పములచే కట్టబడిన మాలలను ధరించి మంగళ విగ్రహుడై యుండెను. నందీశ్వరుడాదిగాగల ప్రమథబృందము క్షేత్రపాలులు శివునికి తపోభంగము రానీయక పరిసరములను సంరక్షించుచుండిరి. శివుడు మహానియమ నిష్ఠుడై యలంకారములనువీడి

గజచర్మమును ధరించి సకల పరావరభూతజాత స్రష్టయు రక్షకుడును రసంహా కుడును ధర్మరక్షణ దక్షుడును అధర్మనాశకుడును సకల యజ్ఞఫలభోక్తయు ఫలదాతయు సమస్తకల్యాణగుణపరిపూర్ణుడునగు శ్రీనారసింహుని ప్రసాదమును కాంక్షించుచు అతనినే నిశ్చలచిత్తముతో ధ్యానించుచు పూజించుచు తపస్సు చేయనారంభించెను

ఇది శ్రీపాద్మపురాణమున క్షేత్రకాండమునందు శ్రీవేంకటాచల మాహాత్మ్యమున దేవల దేవదర్శన సంవాదమున శ్రీనృసింహాచలమందలి నీలకంఠ తపఃక్షేత్రాది వర్ణనమనునది ముప్పదవ అధ్యాయము.

---

## ముప్పదియొకటవ అధ్యాయము

నీలకంఠునిచే జేయబడిన నృసింహారాధన విధివర్ణనము.

దేవదర్శనుడు చెప్పుచున్నాడు :—

శ్రీకణ్ఠః శఙ్కరః శాన్తో నరకణ్ఠీరవం మహః
వైకుణ్ఠం వైజయన్త్యాఢ్యమకుణ్ఠితమనాః స్మరన్ ॥ ౧

సర్వలోకహితాకాఙ్క్షీ స్థాణుః స్వస్థాత్మమానసః
అస్మిన్ న్యగ్రోధమూలస్య మూలే వైయాఘ్రచర్మణి ॥ ౨

అగర్భసాగ్రదర్భాగ్ర్యసన్దర్భాక్షతనిర్మితే
పద్మాసనే సమాసీనః సంయమీ సమదర్శనః ॥ ౩

కారుణ్యార్ణవకల్లోలలోలలీలాకులేక్షయా
త్రీక్ష్ణత్యా వీక్షయన్ విష్వక్ త్రిలోకీం త్రిపదాఙ్కితామ్ ॥ ౪

తరుణాదిత్యకిరణసహోదరజటాసటః
నీలకణ్ఠః పశుపతిః శ్రీకణ్ఠః పరమేశ్వరః ॥ ౫

కపర్దజూటకలితకమలారికలాలయః
విలయోదన్త వీరశ్రీః ఇన్ద్వర్కాగ్నిత్రిలోచనః ॥ ౬

జటాటవీలసద్గఙ్గాశిరోమాలాభిమణనః
అష్టమూర్తిరనన్తాత్మా విశిష్టవిభవేష్టభూః ॥ ౭

శరన్నిర్మలపూర్ణేన్దుమణ్డలాననమణ్డలః
ఉద్యత్సంవర్తమార్తాణ్డచణ్డరుచ్యఙ్గమణ్డనః ॥ ౮

పవిత్రితాఙ్గో ఽహిర్బుధ్న్యః చికీర్షన్ విశ్వరక్షణమ్
దక్షిణామూర్తిరవ్యగ్రః సమగ్రద్రవ్యసాధనః ॥ ౯

శత్రువిధ్వంసకం బ్రహ్మ నృకేసరికిశోరకమ్
నిష్కలం సకలీకృత్య నిత్యాభ్యర్చనకాముకః ॥ ౧౦

కారుణ్యపుణ్యపదవీ మృడః కాత్యాయనీసఖః
చరాచరాణాం సర్వేషాం అమీషాం మిత్రమాత్మనామ్ ॥ ౧౧

ఆనన్దకన్దమహిమా బభూవ భువనేశ్వరః

తా॥ సర్వలోక క్షేమార్థమై పరమశివుడు ఏకాగ్రచిత్తుడై శ్రీన-సింహమూర్తిని ధ్యానించుచు తపస్సుచేయు రీతి ఆశ్చర్యకరమైయుండెను. ఉపలవట మూలమున వ్యాఘ్రచర్మమును పరచి అందు ఆగర్భదర్భాగ్ర్య పందర్భాక్షత నిర్మిత పద్మాసనమందాసీనుడై త్రినేత్రములతో త్రిలోకములను కరుణామృత తరంగిత వీక్షణములచే తిలకించుచుండి ప్రసన్నుడై శ్రీనరకేసరి విగ్రహమును ప్రతిష్ఠచేసికొని ఆరాధించుచు బ్రహ్మానందముతో తాండవమాడుచుండెను.

## నృసింహ భగవానుని వర్ణనము

నృసింహాగర్భం సకలం శత్రుసాదకరం పరమ్ ॥ ౧౨
త్రీక్షణీకోణనిర్యత్కృష్ణవర్త్మశిఖాజటమ్
దంష్ట్రాకోటివిటఙ్కాగ్రనిస్సరద్వహ్నికీలకమ్ ॥ ౧౩
ఊరూపరి సముత్తానవిపాతితహిరణ్యకమ్
నఖత్రుటితదైత్యేన్ద్రవక్షోవివరగహ్వరమ్ ॥ ౧౪
అసురాసృక్కణ్ఠశిరోయణ్ఠాకానేకబాహుకమ్
అనేకశస్త్రాస్త్రధరానేకబాహుహసన్రకమ్ ॥ ౧౫
ఘోరాట్టహాసనినదవిపాటితవియత్తటమ్
భవస్వభావాత్మకం బ్రహ్మ నాసకం భక్తవత్సలమ్ ॥ ౧౬
అతిఘోతిరూపం దేవం విభవానన్దదాయకమ్
దేవానాం పూర్వదేవానాం సామాన్యమధిదైవతమ్ ॥ ౧౭
రత్నప్రతానసంయుక్తకిరీటమకుటోజ్జ్వలమ్
ద్యుమణిప్రతికాశాఢ్యం కుణ్డలాఢ్యం విరాజితమ్ ॥ ౧౮
నవరత్నాన్తసంప్రోతమౌక్తికత్రిసరాన్వితమ్
పఞ్చసప్తసరీభిశ్చ మణ్డితోరుభుజాన్తరమ్ ॥ ౧౯
స్ఫురత్కటకకేయూరకఙ్కణాఙ్గుళిభూషణమ్
ఉత్తరీయబ్రహ్మసూత్రోదరబన్ధనబన్ధురమ్ ॥ ౨౦
ఘణ్టానినాదలుణ్టాకఘణ్టికాదామనాదకమ్
ప్రపదప్రస్ఫురద్రోచిర్మణిమఞ్జీరహంసకమ్ ॥ ౨౧
ఛిన్నవీరుత్సమాయుక్తకిఙ్కిణీపాదశోభితమ్
ప్రత్యగ్రోత్ఫుల్లరక్తాబ్జప్రతిమాఙ్ఘ్రికరస్థలమ్ ॥ ౨౨
విచిత్రరత్నఖచితపీతకౌశేయవాససమ్
సర్వర్తుకామోదయుక్తప్రసూనస్రగలఙ్కృతమ్ ॥ ౨౩

దివ్యసద్గన్ధసన్దర్భగర్భారుణవిలేపనమ్
అనేకచీనాంశుకస్రగాలేపాలఙ్కృతాఙ్గకమ్ ॥ ౨౪
సేవ్యమానం సురశ్రేష్ఠపురుహూతపురోగమైః
బృన్దారకైశ్చ మన్దారపుష్పాఞ్జలిలసత్కరైః ॥ ౨౫
సమన్తతః సేవ్యమానం సనన్దసనకాదిభిః
సప్తతన్త్రీనాదగర్భాధర్వశ్రుతివిలాసినా ॥ ౨౬
ఉపవీణయతాఽనన్తాపదానం భక్తితో మయా
సంస్తూయమానం గన్ధర్వైః తుమ్బురుప్రముఖైః ముదా ॥ ౨౭
పక్షీన్ద్రవిష్వక్సేనాభ్యాం గణైస్తు కుముదాదిభిః
రహస్యదాత్మపర్యస్తే సంవృతం పరిచారకైః ॥ ౨౮
పరిబర్హాభూషణాని హేతిమిఙ్గితవేదినీమ్
దధతీభిః వైష్ణవీభిః శక్తిభిః వృతమన్తికే ॥ ౨౯
రౌద్రీభిః శక్తిభిశ్చైవ బ్రాహ్మీభిః పరితో వృతమ్
పరమాత్మానమాత్మీయమాత్మనామభయప్రదమ్ ౩౦
సేవ్యమానం సిద్ధసఙ్ఘైః సప్తలోకనివాసిభిః
నరసింహాత్మకం బ్రహ్మ ప్రతిష్ఠాప్యేహ భూతలే ॥ ౩౧

తా॥ నారసింహుని దివ్యమంగళవిగ్రహము శత్రుసంహారమును సూచించుచున్నది. త్రినేత్రములనుండి అగ్నిజ్వాలలను క్రక్కుచున్నట్లుండి ముఖమండలము భయంకరములగు కోరలుగల నోరుతో నొప్పినది. సంఖ్యకు మిక్కిలియగు అసురుల కంఠములను నరకగల దివ్యాయుధములను ధరించిన దీర్ఘబాహువులుకలది. ఊరూపరిభాగమున నుంచికొనిన హిరణ్యకశిపుని హృదయమున చీల్చివేసిన వ్రేళ్లగోళ్లుకలది, ఘోరాట్టహాసముచేకల్గిన నాదముచే బ్రద్దలు చేసిన భూమ్యాకాశములు కలది. అంతులేని ఐశ్వర్యములను భక్తులకిచ్చి యాదరించెడి దేవదానవ సాధారణ దైవతమైనది. రత్నప్రతాన ప్రత్యుప్త కిరీటమకుటోజ్జ్వలమైనది. ద్యుమణి ప్రకాశమగు కుండలములచే ప్రకాశించునది. నవరత్నాన్తరప్రోతమౌక్తికములచే నిర్మించబడిన మూడు సరములు అయిదు

ఏడుపేటయిగల హారములచే నలంకరించబడిన భుజమధ్యప్రదేశముకలది. ప్రకాశములగు కటకకేయూర కంకణాంగదాదిభూషణములుకలది ఉత్తరీయబ్రహ్మసూత్రోదరబంధనబంధురమైనది. ఘంటానినాదలుంటాకములగు చిరిగంటలచే నున్న మొలత్రాటి ధ్వనికలది. భిన్నవీరుత్సమాయుక్త పాదకింకిణీశోభితమైనది. నూతనముగవికసించిన రక్తకమలములవలె ఎర్రనైన కరపాదప్రదేశములుకలది. విచిత్రరత్నఖచితమగు పీతకౌశేయవస్త్రముకలది సర్వర్తు కుసుమామోదయుక్త పుష్పమాలికలుకలది. దివ్యసుగంధసందర్భగర్భారుణ విలేపనముకలది. అనేక చీనాంబరస్రగా లేపాదులచే అలంకృతమైనది. సురశ్రేష్ఠులగు దేవేంద్రాదులచే సర్వకాల సర్వావస్థలయందును ఆశ్రయించబడునది. సనకాదులాదిగాగల దేవతలందరును పుష్పాంజలిలసత్కరులై సేవింప ప్రతిభగలది. తుంబురు నారదాదులు యెల్లపుడును భక్తిపరవశులై దివ్యవీణాగానములచే స్తుతించుచుండునట్టిది అనంతగరుడవిష్వక్సేనాది పరిషద్గణముచే పరిచర్యనందునట్టిది. ఇట్టి నారసింహుని దివ్యమంగళమును ప్రతిష్ఠించి నీలకంఠుడారాధింపుచుండెను.

సన్నిధిం ప్రార్థ్య సర్వేషాం దృష్టాదృష్టఫలప్రదమ్
ఉపచారైః సమభ్యర్చ్య సంస్కారైః సంస్కృతో భవాన్ ॥
పరావరాణాం భూతానామీశ్వరః స మహేశ్వరః
సమతిష్ఠత సర్వాత్మా కుర్వన్ నయనమాత్మని ॥ ౩౩
ధర్మం భాగవతం తత్ర చరన్ భగవతీసఖః
పురాణే సుఖమాస్తేఽస్మిన్ పురారిః పురుషః సదా ॥ ౩౪

తా॥ సర్వ ంతువులకు దృష్టాదృష్ట ఫలముల ననుగ్రహించగలట్టి శ్రీనారసింహుని దివ్యసాన్ని ్యమును కాంక్షించుచు ఆ యాశ్రమమందు నీలకంఠుడు పరమభాగవత ధర్మానుష్ఠాన తత్పరుడై శ్రీనారసింహు నారాధించుచు సుఖముగానుండెను.

నృసింహ సాన్నిధ్యముచే ఆశ్రమము విశిష్టతనొందుట.

తస్మాదయం నీలకణ్ఠః ప్రసిద్ధః సర్వతో మహాన్
జన్తూనామపి జీవాతుః జఙ్గమాజఙ్గమాత్మనామ్ ॥ ౩౫

పుణ్యపుష్కరిణీ సేయం పుణ్యా పుణ్యఫలప్రదా
పురుషార్థప్రదా పుంసాం పురారిప్రీతిపూరణీ ॥ ౩౬
నవమేతదహిర్బు`ధ్న్యతపః క్షేత్రం పవిత్రభూః
పుణ్యారణ్యం యత్ర తప్తం తపః కోటివిధం భవేత్ ॥ ౩౭
అసావత్రోప-వటః పటుః పాపవినాశనే
సకృద్దర్శనమాత్రేణ సర్వాభీష్టఫలప్రదః ॥ ౩౮
నరకణ్ఠీరవతనోః మన్దిరం త్విన్దిరాపతేః
శ్రీకణ్ఠార్చనతృప్తస్య వైకుణ్ఠస్య మహాత్మనః ॥ ౩౯
సింహాహార్యో హరః పాపాత్ కృతశౌచస్త్వహోబిలే
నీలకణ్ఠాశ్రమ ఇతిస్థానాని నృహరేః హరేః ॥ ౪౦
ఏతేషామపి పఞ్చానాం స్థానానాం స్థాణుసేవితమ్
స్థానమేతత్ సముద్దిష్టం ప్రథితం సుప్రతిష్ఠితమ్ ॥ ౪౧
నీలకణ్ఠాశ్రమే సింహమహీధరమహాహ్వయమ్
మహితాశ్చర్యమాహాత్మ్యభూమిః భూమిః నిరాగసామ్॥ ౪౨

తా॥ ఆ కారణముచే ఈ యాశ్రమము నీలకంఠాశ్రమమను ప్రసిద్ధ వ్యవహారము కలిగియున్నది పురారిప్రీతిపూరణియగు నిందలి పుష్కరిణియు పనిము పురుషార్థము నీయగలదియైనది. ఈ పుణ్యక్షేత్రమునందు చేయబడిన తపము కోటిగుణితముగ ఫలించును, ఇచ్చటి అశ్వత్థన్యగ్రోధవృక్షము కూడనట్టి మహామహిమగలది శ్రీకంఠార్చనముచే తృప్తుడగు నారసింహుని నొక్కపర్యాయము సేవించినను చాలును. అట్టివారలకు సకలాభీష్టములు సిద్ధించును. ఇచ్చట పుణ్యప్రదములగునట్టి స్థానములైదుకలవు. శ్రీనారసింహుని ఆలయము, అశ్వత్థన్యగ్రోధవృక్షము, పుష్కరిణి, సింహగిరి, నీలకంఠాశ్రమము అను నీ యైదింటిలో నీలకంఠాశ్రమము నారసింహసాన్నిధ్య విశేషముచే అత్యంతమాదరింపదగినది

పాండవతీర్థ మాహాత్మ్యము

కిఞ్చ వక్ష్యామి విప్రర్షే : సమాహితమనాః శృణు
ప్రాచీనబర్హిషః హరితి శ్రీనివాసగిరేః సరిత్ ॥ ౪౩

ప్రసృతా ప్రస్థతః స్వామిపుష్కరిణ్యవిదూరతః
విద్రావిణీ చావద్యానాం నిరవద్యాఽతిభూమిదా ॥ ౪౪

మాయావినో మహావిష్ణోః మహామాయాసమాశ్రయాః
పురా జ్ఞాతివధం కృత్వా పాణ్డవాః చణ్డవిక్రమాః ॥ ౪౫

సమేత్య యత్ర తత్పాపనుత్తయే దీనమానసాః
కాళీయవ్యాళకాలేన వాసుదేవేన చోదితాః ॥ ౪౬

సమ్పూర్ణమానసాశ్చక్రుః ఆప్లవం నిరుపప్లవాః
మలప్రధ్వంసినీం మాయాం మహిషాసురమర్దినీమ్ ॥ ౪౭

సమ్పూజ్య సంస్తూయతేఽపి శ్రీనివాసమధోక్షజమ్
అతీన్ద్రియం సమభ్యర్చ్య స్వామిపుష్కరిణీతటే ॥ ౪౮

నిరేనసః శుద్ధధియో యయుః తస్మాత్ యథాగతమ్
విధిజ్ఞా విమలప్రజ్ఞా నానాజ్ఞానవిలాసినః ॥ ౪౯

అమూముశన్తి సరితం తీర్థం పాణ్డవమిత్యతః

తా॥ ఓ దేవల ద్విజోత్తమా ! ఇంకను చెప్పెదను వినుము ఇచ్చట శ్రీనివాసాద్రినుండి పూర్వదిశను స్వామి పుష్కరిణి సమీపములో ఒక పుణ్య తీర్థము కలదు అది సకలపాపములను శమింపచేయగలమహిమకలది మాయావి యగు మహావిష్ణుని మాయా సమాశ్రయులగు పాండవులు పూర్వము జ్ఞాతివధ చేసిన మహాపాతకదోషమును తప్పించుకొనుటకై శ్రీకృష్ణపరమాత్మయొక్క ప్రేరణచేత ఈ తీర్థమునందు స్నానముచేసి పాపముక్తులైరి. దీనినే పాండవ తీర్థమని పెద్దలు చెప్పుదురు

## నారాయణగిరిప్రభావకథనము

పశ్చాత్ తస్యాః పుష్కరిణ్యా నారాయణగిరిః మహాన్ ॥
యస్య దర్శనమాత్రేణ ముచ్యన్తే జన్తవః స్వతః
సంపద్గోదితదుర్దర్శసహస్రకిరణప్రభః ॥ ౫౧

తేజః పుఞ్జైరఞ్చితాశః కఞ్జకిఞ్జల్కపిఞ్జరః
పర్వతాధిపతిస్తత్రసుఖమాస్తే సురోత్తమః ॥ ౫౨

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవల-
దేవదర్శనసంవాదే నీలకణ్ఠాశ్రమవర్ణనే నీలకణ్ఠకృతనృసింహారాధన
విధ్యాదికవర్ణనం నామైక త్రింశోఽధ్యాయః

తా॥ ఆ పుష్కరిణికి పశ్చిమమున నారాయణగిరియను పుణ్యపర్వత మున్నది. ఆ పర్వతము దర్శనమాత్రమున సకలజనులు ముక్తినందెదరు మహాప్రలయకాలోదిత దుర్దర్శసహస్రకిరణ ప్రకాశముతో దశదిశలందును తన తేజస్సును వెదజల్లెడి నారాయణగిరినాథుడగు శ్రీనివాసుడచ్చట నిత్యవాసముతో విరాజిల్లును

ఇది శ్రీపాద్మపురాణమున క్షేత్రకాండమునందు శ్రీవేంకటాచల మాహాత్మ్యమున
దేవల దేవదర్శన సంవాదమునందు నీలకంఠాశ్రమవర్ణన ప్రస్తావమున
నీలకంఠకృత నృసింహారాధన విధ్యాదికథనము ముప్పదియొకటవ ధ్యాయము.

---

## ముప్పదిరెండవ అధ్యాయము

నారాయణాద్రియందు భైరవుడను క్షేత్రపాలుని ఉదన్తము

దేవలుడు అడుగుచున్నాడు—

కుక్షావృషక్షితిభృతో దివ్యదేశస్య వైభవమ్
దేవదర్శన! మాఽఽచక్ష్వ వైష్ణవం వైదికర్షభ! ॥ ౧

తా॥ వృషభాచలమునందలి శ్రీవైష్ణవక్షేత్రముయొక్క మహిమను ఓ దేవదర్శనా విస్తరించిచెప్పుము.

దేవదర్శనుడు చెప్పుచున్నాడు—

శృణు దేవల! మేధావిన్ సమాహితమనా మునే!
కణ్ఠీరవగిరేర్వృత్తం వైకుణ్ఠవసతేరిదమ్ ॥ ౨

వైకుణ్ఠాదీన్ దివ్యలోకాన్ సన్త్యజ్య భగవాన్ స్వయమ్
మాయావీ తత్ర రసికః శ్రీనివాసః పరః పుమాన్ ౩
సర్వావాసః సహస్రాక్షః పరమాత్మా సనాతనః
ఇచ్ఛావృత్తప్రపఞ్చోఽసౌ హృషీకేశశ్చ కేశవః ॥ ౪
తం దేశం రక్షతి సదా భైరవః పరిచారకః
అసితైః సారమేయైశ్చ ప్రమథైః మథితాసురైః ॥ ౫
కాకోదరాలఙ్కృతాఙ్గః స్ఫురత్ఖడ్గకపాలభృత్
రవస్ఫూర్జడ్డమరుకత్రిశూలః శూలిభృత్యకః ॥ ౬

తా॥ శ్రీవేంకటాద్రి పుణ్యపర్వతమునకు సంబంధించిన నారసింహదివ్య క్షేత్రమహిమను చెప్పెదను వినుము. శ్రియఃపతి శ్రీవైకుంఠమును విడచి వేంకటాద్రియందలి ప్రీతిచే భక్తరక్షణార్థమై యిచ్చటికివచ్చి నిత్యానపాయినియగు శ్రీమహాలక్ష్మితో కూడి వసియించుచున్నాడు. ఈ దేశమును భైరవుడను క్షేత్రపాలకుడు జాగరూకుడై రక్షించుచున్నాడు భైరవునకు సహాయముగ దివ్యశక్తిగలకుక్కలు కలవు. ఆతడు శరీరమా పాదమస్తకము పాములచే అలంకరింపబడియుండును. కఱుకత్తియు కపాలము డమరుకము త్రిశూలమునను నాలుగాయుధములు నాలుగు హస్తములలో ధరించియుండును ఈతడు శివపరివారములోనివాడు

**పార్వతి నారాయణగిరియందు తపస్సుచేసి ఈశ్వరునియర్ధాంగియగుట**

ప్రాచీనే తస్య దేశస్య స్థితోఽఞ్జనగిరేస్తటే
తరుణాదిత్యసఙ్కాశాఽఖిలాభీష్టఫలప్రదా ॥ ౭
పరిభూతా పురా గౌరీ దక్షయాగే పురారిణా
అన్తర్హితాఽభూత్ ఉద్వేగాత్ కపర్దీ చ తిరోదధే ॥ ౮
ఆహర్తుకామా వామార్ధం తనోస్తస్య హరస్య సా
తపస్తప్తుమనాస్తూర్ణం ఆజగామ తటీమిమామ్ ॥ ౯
సమాహితమనాస్తస్యాం సా తేపే దుర్గమం తపః
ఘోరేణ తపసా తాంతు "దుర్గే" త్యూచుర్మహర్షయః ॥ ౧౦

ప్రీతః కపర్దీ దత్త్వాఽస్యై శరీరార్ధం ప్రసాదతః
అర్ధనారీవపుః రుద్రో యయౌ సోఽపి యథాగతమ్ ॥ ౧౧

తా॥ శ్రీనివాసమునకు తూర్పుగ అంజనాద్రితటమునందు తపస్సుచేసిన శ్రీ పార్వతి యొకప్పుడు దక్షయాగమున తండ్రిచేపరిభూతయై అగ్నియందు శరీరత్యాగముచేసిన సతీదేవి ఉత్తరజన్మమునెత్తి పరమేశ్వరుని అర్ధాంగియైయుండుటయ సంకల్పించి తపస్సుచేసి సంకల్పసిద్ధినందినది ఆమె ఘోరమగు తపస్సునకు ప్రీతుడగు కైలాసాధిపతి ఉమెను పరిణయమాడి తనయర్ధశరీరమునిచ్చిన విషయము ప్రసిద్ధము

స్వామిపుష్కరిణీ మాహాత్మ్యము

పురారిదయితా పుణ్యపురుషార్థఫలప్రదా
సమీపే శ్రీనివాసస్య సైషాఽఞ్జనగిరేస్తటే ॥ ౧౨

స్వామిపుష్కరిణీ తత్ర పురాణీ పుణ్యపూరణీ
స్వర్భూపాతాళవాసిన్యాః త్రిస్రోతసః ప్రసూతిభూః ॥ ౧౩

త్రివిక్రమకృతో విష్ణోః సపర్యాయై యదాత్మజా
సురజ్యేష్ఠేన నియమాత్ కమణ్డలుసముద్ధృతా ॥ ౧౪

యస్యాస్తీరే చ విన్దన్తి చతుర్వర్గాన్ అభీప్సితాన్
సురా నరాశ్చ తిర్యఞ్చః ప్రపఞ్చీకృతకారణాః ॥ ౧౫

మాహాత్మ్యమూచిరే తస్యాః పరస్పరమతీన్ద్రియమ్
ఆప్లుతా విమలప్రజ్ఞా మునయో బ్రహ్మవాదినః ॥ ౧౬

తా॥ పార్వతీదేవియొక్క అభీష్టమునొసంగిన పుణ్యతీర్థమిది త్రిపథగామినియగు గంగానదికి జన్మస్థానము, శ్రీమహావిష్ణుని త్రివిక్రమావతార సమయమున భగవత్పాదావనేజనమునకై చతురాననుని కమండలునందు పూజింపబడిన పుణ్యతీర్థము. బ్రహ్మవాదులగు మహాత్ములు ఈ పుష్కరిణీతీరమందు వసియించు వారలకు చతుర్వర్గఫలములు స్వచ్ఛందముగ సమకూరునని ప్రశంసించుచున్నారు.

అత్రి వచనము :—

జపం కుర్వన్ అపాం మధ్యే 'తద్విష్ణోరి'తి యః సకృత్
స్వామిపుష్కరిణీస్నాతో ముచ్యతే పాతకాత్స తు ॥ ౧౩

తా॥ "తద్విష్ణోః" అను వైష్ణవమంత్రమును జపించుచునిత్యము స్వామిపుష్కరిణి ఉదకములందు స్నానముచేయువారల పాపములు తొలగును.

వ్యాసవచనము :—

అవగాహ్య జలే స్వామిపుష్కరిణ్యాః సమాహితః
వ్యపోహ్య భ్రూణహత్యాఘం అశ్నుతేఽభీష్టసమ్పదమ్ ॥ ౧౮

తా॥ శ్రీస్వామిపుష్కరిణి స్నానముచే భ్రూణహత్యాపాపము నశించి అభీష్టసిద్ధికలుగును.

వసిష్ఠ వచనము :—

యః స్నాయాద్వారిణి స్వామిపుష్కరిణ్యాః స్మరన్ హరిమ్
సప్తజన్మకృతం పాపం సహసా స వ్యపోహతి ॥ ౧౯

తా॥ స్వామిపుష్కరిణి పుణ్యోదకములందు స్నానముచేసినంతట క్రిందటి యేడు జన్మములందుచేసిన పాపముపోవును.

పరాశర వచనము :—

యః కరోత్యాప్లవం స్వామిసరసీజలమధ్యతః
సోఽతీత్య నిరయం సర్వం బ్రహ్మభూయాయ కల్పతే ॥ ౨౦

తా॥ స్వామిపుష్కరిణియందు స్నానముచేసిన యెడల నరకమును విడిపించుకొనిబ్రహ్మసాయుజ్యమునందును.

గౌతమ వచనము :—

కీర్తయిత్వా జలేఽన్యత్ర 'స్వామిపుష్కరిణీ'తి యః
స్నాయాద్ధ్యాయన్ శ్రీనివాసం ముచ్యతే సోఽతిపాతకాత్ ॥ ౨౧

తా॥ ఇతర యేతీర్థములందు స్నానముచేయు సమయములందుగాని స్వామిపుష్కరిణిని ధ్యానించి స్నానముచేసినయెడల మహాపాపములు తొలగును.

భరద్వాజవచనము :—

ప్రాతరుత్థాయ యే ప్రాజ్ఞాః 'స్వామిపుష్కరిణీ' తి వై
కీర్తయన్త్యాహితాత్మానః తే యాన్తి పరమం పదమ్ ॥ ౨౨

తా॥ ఉదయమున నిద్రనుండి మేల్కాంచుచు స్వామిపుష్కరిణిని స్మరించు వారలకు పరమపదము కలుగును

మనువచనము :—

స్వామిపుష్కరిణీతీర్థజలం ప్రీతాః పిబన్తి యే
తేఽపి నిర్ధూతపాప్మానో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ॥ ౨౩

తా॥ ప్రీతితో స్వామిపుష్కరిణీ జలమును త్రాగువారలు బ్రహ్మసాయుజ్యము నొందెదరు.

యమ వచనము :—

స్వామిపుష్కరిణీకూలే నరా నక్తందివఞ్చ యే
వసన్త్యభోజనాస్తేఽపి లభేరన్ పరమం పదమ్ ॥ ౨౪

తా॥ స్వామి పుష్కరిణీ తీరమందే రాత్రింబవళ్ళు సంచరించువారలు అపాత్రులైనను పరమపదము నొందెదరు.

యజ్ఞవల్క్య వచనము :—

విగాహ్య స్వామిసరసో జలం వీతక్లమా జనాః
ప్రార్థితం ప్రాప్నుయుః ప్రాజ్ఞాః ప్రజాపతిరువాచ హ ॥ ౨౫

తా॥ ఉత్సాహముతో స్వామిపుష్కరిణీ తీర్థమును త్రాగెడివారు సమస్త కామములను పొందెదరని చతురాననుడు ప్రతిజ్ఞచేసి చెప్పెను.

హారీత వచనము :—

హరిం స్మరన్తః కుర్వన్తి స్నానం స్వామిసరోజలే
వీతాంహసో వీతనిద్రా విశన్తి విమలం పదమ్ ౨౬

తా॥ హరినామమును స్మరించుచు స్వామిపుష్కరిణిలో స్నానమాడు వారలు వీతపాపులై పరమపదము చేరెదరు.

అఙ్గిరో వచనము :—

యేఽనుతిష్ఠన్త్యనుష్ఠానం స్వామిపుష్కరిణీజలే
అనేకజన్మజనితమేషామేనో వినశ్యతి ॥ ౨౭

తా॥ స్వామిపుష్కరిణీ జలములలో నిత్యకర్మానుష్ఠానము నాచరించు వారలు అనేక జన్మసంచిత పాపములనుండి ముక్తులగుదురు.

ఉశనసుని వచనము :—

ఉదీరయన్తి యే నిత్యం 'స్వామిపుష్కరిణీ'తి చ
దుష్కర్మపఙ్కం నిర్ధూయ అశ్నువతే తేఽపి సత్ఫలమ్ ॥ ౨౮

తా॥ స్వామిపుష్కరిణిని స్మరించినమాత్రమున పాపపంకమునుండి విడివడి సత్ఫలము నొందెదరు.

సంవత్తర వచనము ·—

యే కీర్తయన్తి సర్వత్ర సదా స్వామిసరోవరమ్
తేఽప్యవద్యం వినిర్ధూయ నిరవద్యా భవన్తి వై ॥ ౨౯

తా॥ సర్వకాల సర్వావస్థలందును స్వామిపుష్కరిణిని స్మరించువారలు పాపముక్తులై పరమపదముచేరుదురు.

ఆపస్తంబ వచనము :—

స్వామిపుష్కరిణీతోయే స్నానపానాదికర్మ యే
కుర్వన్తి పాపస్తమ్భం తే పరిత్యజ్యాఽప్నువన్తి సత్ ॥ ౩౦

తా॥ స్వామిపుష్కరిణీ జలములందు స్నానదానాదులను చేయువారు సద్గతి నొందెదరు.

మరీచి వచనము :—

నారాయణగిరేః ప్రాన్తే స్వామిపుష్కరిణీతటే
యః కిల్బిషీ వసత్యేకం దినం నిష్కిల్బిషీ భవేత్ ॥ ౩౧

తా॥ స్వామిపుష్కరిణీ తీరమందొక్క దినమాత్రము వసించినను అట్టివాడు పాపరహితుడగును.

మృకండు వచనము :—

కణ్ఠీరవగిరేః కుక్షౌ పక్షిరాడ్వాహహర్ష కే
యం సేవతే స్వామిసరః స నరః సురసజ్జతః ॥ ౩౨

తా॥ నరసింహాద్రియందు పక్షివాహనహర్షకమగు స్వామిపుష్కరిణిని సేవించువాడు సర్వసమ్మతుడగును

పులస్త్య వచనము :—

క్రోడే వేఙ్కటశైలస్య సరః క్రోడాభినన్దకమ్
గాయతే యస్త్రిషవణం స నరః సర్వసమ్మతః ॥ ౩౩

తా॥ వేంకటాద్రియందు వారాహదేవతా శ్రీకరమగు సరస్సును మూడు వేళలందు కీర్తించువాడు సర్వసమ్మతు డగును.

కాత్యాయన వచనము :—

వైకుణ్ఠస్య ప్రీతికరే కణ్ఠీరవగిరేస్తటే
స్వామిపుష్కరిణీం యోఽసౌ సేవతే స మహాన్ భవేత్ ॥ ౩౪

తా॥ నారసింహ పర్వతమందు స్వామిపుష్కరిణిని సేవించువాడు గొప్ప వాడగును.

బృహస్పతి వచనము :—

కుక్షావఞ్జనగిరేః స్వామిపుష్కరిణ్యప్సు యో నరః
కృతాప్లవః సకృత్ సత్యం కృతకృత్యో భవేన్నరః ॥ ౩౫

తా॥ అంజనాద్రి పొదరిండ్లనడుమ స్వామిపుష్కరిణీ తీర్థములందు స్నానముచేసిన నరుడు కృతకృత్యుడగును.

భృగువచనము :—

ప్రాతరుత్థాయానుదినం స్వామిపుష్కరిణీం స్మరన్
గోఘ్నో యో మాసమాసీత గోప్రదానాత్ స శుద్ధ్యతి ౩౬

తా॥ ఉదయమునలేచి స్వామిపుష్కరిణిని స్మరించుచు ఒక మాసము వసియించినచో గోవధ పాపముకూడ నశించును.

వాల్మీకి వచనము :—

స్వామిపుష్కరిణీతీరే యో వసత్యుపపాతకీ
మాసం గోదానతః శుద్ధో భవేత్ నర ఇతి శ్రుతిః ॥ ౩౭

తా॥ ఉపపాతకముల జేసినవాడు మాసకాలము స్వామిపుష్కరిణీ తీర మందుండి గోదానముచేసినచో పాపవిముక్తుడగును.

శంఖలిఖితుల వచనము :—

పారే స్వామిసరో విద్వాన్ స్మార్తం శ్రౌతం కరోతి యః
సహస్రధా కృతం తేనేత్యూశన్తి బ్రహ్మవాదినః ॥ ౩౮

తా॥ స్వామిపుష్కరిణీ తీరమందు చేయబడిన శ్రౌతస్మార్తకర్మలన్నియు ఒకటి వేయి గుణములుగ ఫలమునిచ్చును

శాతాతప వచనము —

హవ్యకవ్యాత్మకం కర్మ స్వామిపుష్కరిణీతటే
వార్ధుషిః నాస్తికో వాఽపి యః కరోతి స సత్ఫలః ॥ ౩౯

తా॥ స్వామిపుష్కరిణీ తీరమందు హవ్యకవ్యముల నిచ్చినవాడు వృద్ధి వ్యాపారము చేయువాడైనను నాస్తికుడైనను సత్ఫలము నొందును.

బోధాయన వచనము —

స్వామిపుష్కరిణీతీరనివాసీ హరిమేధసః
అశ్వమేధాదికం యజ్ఞం యః కరోతి మహేశ్వరః ॥ ౪౦

తా॥ స్వామిపుష్కరిణీ తీరమందు అశ్వమేధము జేసినవాడు పరమ శివుడగును.

మార్కండేయ వచనము :—

మృగరాడద్రికుహరే హరేరానన్దదాయిని
కీర్తయన్ స్వామిసరసీం నావసీదతి మానవః ॥ ౪౧

తా॥ ఆనందదాయినియగు సింహగిరి కుహరమందలి స్వామిపుష్కరిణిని కీర్తించువాడెన్నటికిని చెడడు.

మాండవ్య వచనము :—

గోవిన్దమన్దిరే స్వామిపుష్కరిణ్యాస్తటే వసన్
వాసుదేవపరో మర్త్యో భవేద్వాసవపూజితః ॥ ४२

తా॥ శ్రీ వేంకటాద్రియందు స్వామిపుష్కరిణీ తీరమున భగవన్నామ చింతకుడు దేవతలచే పూజింప బడును.

శాండిల్య వచనము :—

స్వామిపుష్కరిణీతీరే పఞ్చకాలపరో వసన్
అపఞ్చత్వో భవేన్ముక్తః పఞ్చోపనిషదాత్మకః ॥ ४३

తా॥ స్వామిపుష్కరిణీ తీరమందు పంచకాలపరాయణుడై వసించువాడు జరామరణములకు అతీతమగు పంచోపనిషచ్ఛరీరముతోనుండును.

కాశ్యప వచనము :—

యో నరః స్వామిసరసి స్మరన్ శౌరిం కృతాప్లవః
కర్మనిర్మూలకో ధీరః కృతకృత్యో భవేత్ స హి ॥ ४४

తా॥ భగవానుని ధ్యానించుచు స్వామిపుష్కరిణీ పుణ్యోదకములందు స్నానమాచరించువాడు కర్మబంధ విముక్తుడై కృతకృత్యుడగును.

కణ్వ వచనము :—

స్వామిపుష్కరిణీతీర్థం యః పిబేత్ చులుకత్రయమ్
అహోరాత్రకృతం పాపం తత్క్షణాదేవ నశ్యతి ॥ ४५

తా॥ స్వామిపుష్కరిణీ జలమును మూడుదోసెళ్ళు త్రాగినవాడు అహోరాత్ర కృతపాపమునుండి ముక్తుడగును.

అగస్త్య వచనము :—

ఇన్ద్రియైః కర్మభిః జ్ఞానైః మనసా సహ యత్కృతమ్
ఆప్లవాత్ స్వామిసరసి తదేనః శుద్ధ్యతి క్షణాత్ ॥ ४६

తా॥ జ్ఞానేంద్రియ కర్మేంద్రియములచేతను మనస్సు చేతను తెలిసిచేసిన సకలపాపములును స్వామిపుష్కరిణీ స్నానమువలన నశించును.'

దుర్వాస వచనము :—

కీర్తయేత్ స్వామిసరసీం సహ సర్వేన్ద్రియైర్హి యః
పూజ్యతే సిద్ధసఙ్ఘైః స సనన్దసనకాదిభిః ॥ ౪౭

తా॥ సమస్తేంద్రియములను ఏకముచేసి స్వామి పుష్కరిణిని స్మరియించు వాడు సనకసనందనాదులచే పూజింపబడును.

విశ్వామిత్ర వచనము —

పవిత్రం స్వామిసరసి స్పృష్ట్వా తోయం నిరేనసః
విజ్ఞానసమ్పదో విష్ణుం ద్రష్టుకామా భవన్తి హి ॥ ౪౮

తా॥ పవిత్రములగు స్వామిపుష్కరిణీ జలములను స్పృశించినంత మాత్రమున జ్ఞానముకలిగి మహావిష్ణుని చూడగోరెదరు.

శక్తి వచనము :—

పవిత్రవన్తః పరమాః పఞ్చసన్మన్త్రవిగ్రహాః
భవన్తి తేఽవగాహన్తే యే స్వామిసరసీజలమ్ ౪౯

తా॥ స్వామిపుష్కరిణీ జలములందవగాహనము చేయువారలు నిత్య విభూతియందు దివ్యశరీరములతో వసియింతురు.

శుక వచనము :—

స్వామిపుష్కరిణీ సైషా పురాణీ పుణ్యపూరణీ
సురాణాఞ్చ నరాణాఞ్చ తిరశ్చాఞ్చాత్మశోధినీ ॥ ౫౦

యస్యాం కోలవపుర్భూత్వా శ్రీనివాసః పరః పుమాన్
దేవీభిః శక్తిభిశ్చైవ క్రీడానుగుణభూతిభిః ॥ ౫౧

విచిత్రవివిధానేకశృఙ్గయన్త్రధృతిక్రమైః
జలక్రీడాం వితనుతే విశ్వాప్యాయకరీం సదా ॥ ౫౨

తా॥ అతిప్రాచీనమైనదియు పుణ్యపూరణియునగు స్వామిపుష్కరిణి దేవ మానవతిర్యగ్భూతములకు ఆత్మశోధకము. ఈ పుణ్యజలములందు వరాహ శరీరియగు శ్రీనివాసుడు దివ్యమహిషీపరివృతుడై జలక్రీడల నాచరించును.

శౌనక వచనము :—

> నైషా హి స్వామిసరసీ సమఞ్జసజగద్ధితా
> కీర్తనస్నానపానైశ్చ తాపత్రయనివారిణీ ॥ ౫౩

తా॥ సర్వజన హితయగు స్వామిపుష్కరిణీ జలములందు కీర్తన స్నాన పానముల చేసెడి వారలు తాపత్రయములనుండి విడివడుదురు.

నారద వచనము :—

> మాధవానన్దజననీ మదనజ్వరమాథినీ
> మదయత్యాత్మజాతాని స్వామిపుష్కరిణీ హ్యసౌ ॥ ౫౪

తా॥ శ్రీస్వామిపుష్కరిణి మాధవప్రియకారిణి యగుటచే పామరుల ప్రాకృత వాంఛలను తొలగించుచున్నది.

క్రతు వచనము :—

> స్వామిపుష్కరిణీ సౌమ్యా సోమపీథీ సురర్షభః
> యస్యామవభృథస్నానం కురుతేఽద్యాపి విశ్వసూః ॥ ౫౫
> కుఞ్జరారిగిరేః కుఞ్జే వ్యఞ్జితాఖిలభావనాః
> సాధవః స్వామిసరసి స్నానాత్ సంసారతారితాః ॥ ౫౬
> వేదప్రధానా విబుధా యస్యాం స్నాత్వా నిరంహసః
> విష్ణుం సాక్షాత్కర్తుకామాః స్వామిపుష్కరిణీ హి సా ॥ ౫౭

తా॥ స్వామిపుష్కరిణి సౌమ్య ప్రకృతికలది. చతురానను డెల్లపుడును అశ్వమేధావభృథమునీ పుణ్యోదకములందుచేయును. సాధువులిందు స్నానము చేసి సంసారమును తరింతురు. భక్తులు శ్రీమహావిష్ణుదర్శనమునకై యీపుష్కరిణీ జలములందు స్నానముచేయుదురు.

సత్యాషాఢ వచనము :—

> ఆషాఢానామాశ్రమశ్రీః ఆశ్రమాచారశాలినామ్
> అన్యేషాం భూతిభూమిశ్చ నైషా స్వామిసరోఽభిధా ॥ ౫౮

తా॥ బ్రహ్మచర్యవ్రతము సలుపువారలకాశ్రయము. ఇతరాశ్రమస్థుల కైశ్వర్యప్రదమునగునది స్వామిసరోవరము.

కుండిన వచనము :—

కుహరే సింహశైలస్య సరసీ స్వామిపూర్వికా
శీలాచారవతాం నృణాం అశీలానామపీష్టదా ॥ ౫౯

తా॥ సింహాద్రి కుహరమందలి స్వామిసరోవరము పుణ్యాత్ములకు పాపాత్ములకుకూడ ముక్తినీయగలది.

హారీత వచనము

జయస్త్రీ చాపదాం భూమిః సమ్పదాం సర్వకామదా
సరసీ స్వామ్యుపపదా సైషా విష్ణుపదీజనిః ॥ ౬౦

తా॥ విష్ణుపాదోద్భవమగు నీసరోవరము సర్వాపన్నివారణముచేసి సంపదల నీయగలది.

జైమినివచనము :—

శిరస్యఞ్జలిమాబధ్నన్ స్వామిపుష్కరిణీం స్తువన్
స్మరన్ హరిం స్వానుష్ఠానం యః కరోతి స పుణ్యభాక్॥ ౬౧
స్నానం సకృత్ కుర్వతే యే స్వామిపుష్కరిణీజలే
హవ్యకవ్యేషు తే యోజ్యా నరా నారాయణప్రియాః ॥ ౬౨

తా॥ శిరమున నంజలిని ధరించి స్వామిసరస్సున భగవద్ధ్యానముతో జపము చేయువాడు పుణ్యాత్ముడు. ఒక్కసారి స్నానముచేసిన వారలు హవ్యకవ్యములకు తగిన పాత్రము కాగలరు.

జాబాలివచనము :—

స్నానాదన్యేషు తోయేషు స్వామిపుష్కరిణీం స్మరన్
కృతకృత్యః కృతాత్మా స మర్త్యః తత్ఫలమాప్నుయాత్ ॥

తా॥ ఇతర తీర్థములందు స్నానము చేయునపుడు స్వామిపుష్కరిణిని స్మరించినంతట ఆ స్మరణముచే స్వామిసరస్స్నానఫలము కలుగును.

పితామహవచనము :—

స్వామిపుష్కరిణీతీర్థపరిచర్యాపరో హి యః
స మర్త్యో వైష్ణవీం భూతిం మర్త్యత్వే సమవాప్నుయాత్ ॥

తా ॥ స్వామిపుష్కరిణీ తీర్థపరిచర్యచేయువాడు ఇహజన్మమునవనే వైష్ణ వైశ్వర్యము నందును.

సనకవచనము :—

యస్యాస్తీరే నివసతి శ్రీనివాసః పరాత్ పరః
సా ధన్యా స్వామిసరసీ సేవతే తాం య ఆత్మవాన్ ॥ ౬౫

తా॥ ఏ సరస్సుతీరమున పరాత్పరుడగు శ్రీనివాసుడు వసించుచున్నాడో ఆస్వామిసరస్సు ధన్యమైనది. అచ్చట వానఫలము పుణ్యాత్ములకుగాని లభించదు.

సనందనవచనము :—

విష్ణుపాదోద్భవం బ్రహ్మకరస్పర్శపవిత్రితమ్
పవిత్రితేశానజటాజూటం స్వామిసరోజలమ్ ॥ ౬౬

తా॥ విష్ణుపాదములందు జనించి చతురాననకరస్పర్శచే పూతమై ఈశుని జటాజూటపాతముచే పవిత్రమైనది స్వామిపుష్కరిణీజలము.

సనత్కుమారవచనము :—

యా పునాత్యాప్లవాత్ సమ్యక్ భువనాని చతుర్దశ
స్వామిపుష్కరిణీ ధన్యా సా సర్వఫలదాయినీ ॥ ౬౭

తా ॥ చతుర్దశభువనములను స్నానమాత్రముచే పవిత్రములుగాజేసి సర్వ కామముల నీయగల స్వామిపుష్కరిణి ధన్యమైనది.

వామదేవ వచనము :—

సరాంసి యాని దివ్యాని సన్తి త్రిజగతీతలే
తేషామేషా స్వామినీ హి 'స్వామిపుష్కరిణీ' త్యతః ॥ ౬౮

తా ॥ మూడు లోకములను పవిత్రము చేయగల శక్తిగల్గి, వాట్లకు ప్రభు స్థానమున నుండుటచే దీనికి స్వామిపుష్కరిణి యను పేరు వచ్చినది.

సనాతనవచనము :—

యే నరాః ప్రాతరుత్థాయ తామిమాం కీర్తయన్తి తే
స్వామిపుష్కరిణీం భక్త్యా విశన్తి విమలం పదమ్ ॥ ౬౯

తా ॥ ఉదయమున లేచి స్వామిపుష్కరిణిని కీర్తించు తీర్థభక్తులు పరమ పదమును జేరుదురు.

దేవదర్శనునివచనము :—

ఇత్యూచివాంసో విద్వాంసః కృతకృత్యా హ్యమర్షణాః
తస్యాస్తీరే పుణ్యభూమౌ ఆసతే మునిపుఙ్గవాః ॥ ౭౦

క్వచిత్ కదాచిత్ క్రీడార్థం దివ్యైః పరిజనైః సహ
శేషసేనేశగరుడప్రధానైః సేవితం శుభమ్ ॥ ౭౧

సేవమానాః శ్రీనివాసం సాక్షాత్ అక్షిపథం గతమ్
చతుర్భుజముదారాఙ్గం అతసీగుచ్ఛసచ్ఛవిమ్ ॥ ౭౨

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవల-
దేవదర్శన సంవాదే అత్ర్యాదిపఞ్చాశన్మహర్షికృత స్వామి
పుష్కరిణీ ప్రశంసనం నామ ద్వాత్రింశోఽధ్యాయః

తా ॥ కృతకృత్యులును వీతరాగులు నగు మహాత్ములందరును చతు ర్భుజుడును, అతసీగుచ్ఛసచ్ఛాయుడును అనంతగరుడాది పరివారవృతుడు నై విహరించెడి శ్రీనివాసుని స్వామిమందిరముననుండి సేవించుచు సంచరించు చుందురు.

ఇది శ్రీ పాద్మపురాణమున క్షేత్రకాండమునందు శ్రీ వెంకటాచల మాహాత్మ్యమున దేవల దేవదర్శన సంవాదమునందు అత్ర్యాదిపంచాశన్మహర్షి కృత స్వామిపుష్కరిణీప్రశంసనము ముప్పదిరెండవ అధ్యాయము.

## ముప్పదిమూడవ అధ్యాయము

### దైత్యులవలని బాధల నెరింగించుటకై బ్రహ్మాదులు క్షీరాబ్ధికేగుట

దేవలుడు చెప్పుచున్నాడు :—

స్వామిపుష్కరిణీకూలే నారాయణగిరేర్భృగో
ఆవిర్భావః కథం విష్ణోః శ్రీనివాసస్య శార్ఙ్గిణః ॥ ౧

తా॥ నారాయణగిరితటమున స్వామిపుష్కరిణీతీరమున శ్రీనివాసదేవుని యావిర్భావవిధానమును తెలుపుము.

దేవదర్శనుడు చెప్పుచున్నాడు :—

శృణు బ్రహ్మన్! సమాచక్షే సమాహితమనా మునే!
ప్రశ్నం సర్వాణ్డగర్భస్య ప్రాదుర్భావాత్మకం విభోః ॥ ౨

పురా దుర్మేధసా దైత్యప్రవరేణామరారిణా
పీడితా రుద్రభక్తేన భృశం బ్రహ్మాదయః సురాః ॥ ౩

శాన్తాగ్నిసదృశాః శుష్కవదనాః శోకవిహ్వలాః
పరాజితా జడాత్మానః కింకర్తవ్యావివేకినః ॥

దైత్యారిం శరణం ప్రాప్తుం ప్రయతా యతమానసాః
క్షీరాబ్ధిం ప్రాపురప్రాప్తస్వావాసాః తస్య శాన్తయే ॥ ౪

తుష్టువుస్తత్ర దైతేయవిధ్వంసనవిచక్షణమ్
లక్ష్మ్యుపలక్షితం విష్ణుం విశ్వరక్షణదీక్షితమ్ ॥ ౫

తా॥ దేవలా వినుము — పూర్వకాలమం దొకప్పుడు రుద్రభక్తుడగు దుర్మేధసుతుడను దైత్యుడు తమను హింసించగా బ్రహ్మాదిదేవతలు దుఃఖితులై. దైత్యారియగు నారాయణుని శరణము వేడుకొనుటకై క్షీరసాగరమునకు వచ్చి మహాలక్ష్మీసమేతుడై శయనించియుండిన విశ్వరక్షణదీక్షితుడగు విష్ణుదేవుని స్తోత్రముజేయసాగిరి.

## బ్రహ్మాదికృత క్షీరాబ్ధినాథ స్తోత్రము

దేవతలు స్తుతించినప్రకారము —

ఓం నమో దేవదేవాయ పూర్వదేవాయ ఖడ్గినే
శ్రీవత్సాఙ్కాయ చ నమః పరస్మై పరమాత్మనే ॥ ౭

నమః పరస్మై వ్యూహోపవ్యూహాన్తరవిభూతయే
విభవాయ నమస్తస్మై విశ్వాన్తర్యామిణేఽణవే ॥ ౮

అర్చావతారాయ నమః అజన్మనే జన్మభాజినే
మాయావినే జగత్స్రష్ట్రే లక్ష్మీనారాయణాత్మనే ॥ ౯

జగత్స్థిత్యవరోహాయ జగదానన్దినే నమః
జగన్మఙ్గళభూతాయ జాహ్నవీజనకాఙ్ఘ్రియే ॥ ౧౦

జఙ్గమాజఙ్గమజగద్ధాతుః జననకారిణే
జనార్దనాయ జమ్భారేః అనుజాయ నమో నమః ॥ ౧౧

శ్రియఃపతే ! నమస్తుభ్యం సభ్యసన్దోహసఙ్గినే
సదావిష్ణో ! మహావిష్ణో ! విష్ణోఽపారాదిరూపిణే ॥ ౧౨

నమో నళిననేత్రాయ నేత్రభూతాయ నాకినామ్
నారాయణాయ నాథాయ నాగభోగశయాయ తే ॥ ౧౩

విశ్వేశ్వరాయ విశ్వాయ విశ్వాతీతాయ తే నమః
విశ్వాధ్యక్షాయ వీశానవాహనాయాదివేధసే ॥ ౧౪

నిత్యాయ నిరవద్యాయ నిరాకారాయ నీతయే
నిస్సీమకల్యాణగుణగణాతీతాయ తే నమః ॥ ౧౫

సచ్చిదానన్దసన్దోహ ! దేహవృద్ధిక్షయాక్షమ !
అచ్యుతానన్త ! గోవిన్ద ! నమస్తుభ్యం మహాత్మనే ॥ ౧౬

అపారకరుణామ్భోధే ! నిస్తరఙ్గాత్మనిశ్చల !
లక్ష్మీవిలక్షణ ! విభో ! విచక్షణ ! నమోఽస్తు తే॥ ౧౭

ఋత ! సత్య ! పరబ్రహ్మ ! కృష్ణ ! పిఙ్గళపూరుష !
ఊర్ధ్వరేతాః ! విరూపాక్ష ! విశ్వరూప ; నమోఽస్తుతే ॥ ౧౮

నమో నమః కారణకారణాయ నమో నమోఽనన్తమహావిభూతయే
నమో నమః శఙ్ఖరచాపహారిణే నమో నమః శాశ్వతశార్ఙ్గధన్వనే ॥
నమోఽన్తరాదిత్యహిరణ్యరూప ! నీరూప ! తుభ్యంపురుషోత్తమాయ
నమోనమోభిః నిగమాన్తభూతైః కృతస్తుతప్రస్తుతభావనాయ॥ ౨౦

ప్రసీద పుణ్డరీకాక్ష ! ప్రసీద పురుషోత్తమ !
ప్రసీద పరమానన్ద ! ప్రసీద పరమేశ్వర ! ॥ ౨౧
ప్రసీద కమలాకాన్త ! ప్రసీద కరుణాకర !
ప్రసీద భక్తార్తిహర ! ప్రసీద విబుధర్షభ ! ॥ ౨౨

తా ॥ భగవానుని దివ్యాత్మదివ్యవిగ్రహగుణములను శక్తివంచన లేక అనేకవిధములుగ ననుసంధానము చేసిన యీ స్తోత్రము యథాతథముగ పారాయణము చేయదగినది. హే లక్ష్మీరమణా ! భక్తులమగు మాకు సంక్రమించిన దైత్యబాధలనుండి మమ్ములను రక్షింపుము — కాపాడుము.

బ్రహ్మాదిదేవతల యెదుట క్షీరాబ్ధినుండి లక్ష్మిచెలికత్తె యుద్భవించుట

దేవదర్శనుడు చెప్పుచున్నాడు :—

దేవ మేవం స్తుతవతాం దేవానాం మహితాత్మనామ్
హిరణ్యగర్భపుర్వాణాం భవిష్యద్భూతభావినామ్ ౨౩
ప్రాదుర్బభూవ పురతః క్షీరాబ్ధేర్దుహితుః సఖీ
పుండరీకనిభాసాఽపి పుణ్డరీకాఽయతేక్షణా ॥ ౨౪
పుణ్డరీకాఽననా పుణ్యా పుణ్డరీకాక్షశాసనాత్
అఖిలక్లేశహారిణ్యా వ్యాహారిణ్యార్థసమ్పదామ్ ॥ ౨౫
సుధాం ప్రపన్న్యా వాచా చ బభాషే తాన్ దివౌకసః

తా ॥ ఇట్లు స్తుతించుచున్న దేవతల యెదుట క్షీరాబ్ధిమధ్యమునుండి భగవదాజ్ఞను శిరసావహించి, దివ్యమంగళవిగ్రహ సౌందర్యము గలట్టి ఒక వనిత యవతరించెను. ఆ యమ శ్రీమహాలక్ష్మిచెలికత్తె. ఆమె వారలనుద్దేశించి అమృతమయవాక్కుల పలికెను.

భగవానుని నివాసస్థలమును చెప్పి ఆమె వారల కభయమిచ్చుట

స్వాగతం భవతామస్తు కార్యసిద్ధిశ్చ దేవతాః ! ॥ ౨౬
బాధా క్వచిదిదానీం కిం ? సురా దైత్యాసురైరపి
తేషాం తు నిధనం కర్తుం ధ్రువమవ్యాజరక్షకః ॥ ౨౭
శ్రీవత్సలక్షణః శార్ఙ్గీ దక్షిణోవశ్చరక్షణే
మాభైషిష్ట సురా యూయం మా ప్రత్యూహో భవిష్యతి ॥
అచిరాద్భగవాన్ విష్ణుః శ్రీనివాసః స్వరాడ్విభుః
ప్రత్యక్షో భవితా వశ్చ సర్వం సిద్ధం సమీహితమ్ ॥ ౨౯
ఆమోదాదీన్ దివ్యలోకాన్ సన్త్యజ్య భగవాన్ హరిః
ఇదానీం రమతే లక్ష్మ్యా నారాయణగిరేస్తటే ౩౦
స్వామిపుష్కరిణీతీరే సర్వాన్తర్యామ్యధోక్షజః
సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ ॥ ౩౧
తదితో దక్షిణం భాగం భూమేర్గచ్ఛత సత్వరాః
అవిఘ్నమస్తు వః కార్యం బ్రహ్మేన్ద్రత్రిదివౌకసః ! ॥ ౩౨
ఇత్యుక్త్వా తు సఖీ లక్ష్మ్యాః సహసాఽన్తర్దధేఽపి చ

తా॥ ఓ దేవతలారా! మీకు స్వాగతము. మీరు వచ్చినకార్యము సిద్ధించును. అవ్యాజకరుణాపూర్ణుడగు శ్రియఃపతి మీకు సంక్రమించిన అన్ని కష్టములనుతీర్చి మిమ్ములను రక్షించును. త్వరలో మీయెదుటనే సాక్షాత్కరించి మీ యిష్టార్థముల నొసగగలడు. భయపడవద్దు. ఇప్పుడు భగవానుడు ఆమోద సమ్మోదవైకుంఠములను, దివ్యలోకములను పూర్తిగా త్యజించి తన మహిషి యగు మహాలక్ష్మితో కూడి నారాయణగిరితటమందలి స్వామిపుష్కరిణీతీరమం దున్నాడు. ఇచ్చటనుండి మీరు సరిగా దక్షిణదిక్కునకు పొండు — అని చెప్పి అంతర్ధానమునందెను.

తస్యాః శ్రుత్వా వచో విష్ణుపత్నీసఖ్యాః సమాహితాః ॥ ౩౩
ప్రణమ్య దణ్డవద్దేశం తం పరీయుః ప్రదక్షిణమ్
సమ్ప్రీతమానసా దేవా సావధానాః ససమ్భ్రమాః
తస్మాద్దక్షిణతో భూమిభాగం గన్తుం ప్రచక్రముః ॥ ౩౪

తతస్తే విబుధాః సర్వే పరమేష్ఠిపురోగమాః

తా॥ ఆమె మాటలు వినిన ఆ దేవతలు ప్రదక్షిణ నమస్కారములతో ఆదేశమును పూజించి సంతుష్టాంతరంగులై పయనమైరి

బ్రహ్మాదులు నారాయణాద్రికి చేరుకొనుట

భూయో నారాయణగిరేః పాదానాశ్రిశ్రియుర్ముదా ॥ ౩౫
పుణ్యాతిపుణ్యతోయాని సరాంసి సరితశ్చ హి
సేవమానాః కృతాతిథ్యాః సిద్ధసఙ్ఘైశ్చ తాపసైః ॥ ౩౬
మిథునైః కిన్నరాణాం హి లతాగృహనివాసిభిః
గీయమానాని గీతాని ప్రాదుర్భావాత్మకాని చ ॥ ౩౭
మన్ద్రమధ్యోచ్చమహిమమాధురీధూర్వహాణి చ
శిలాతలేషు శృణ్వన్తః సర్వా యేషు సమాశ్రితాః ॥ ౩౮
సప్తతన్త్రీనాదగర్భసప్తస్వరవిభావనమ్
వేణువీణామృదఙ్గాఢ్యం నవనాట్యరసాన్వితమ్ ॥ ౩౯
ఆవిర్భావాత్మకం కాలశ్రుతికల్పితమూర్ఛనమ్
అప్సరోగణసఙ్గీతం లోకయన్తోఽథ తే శనైః
వీతక్లేశా వీతమోహాః విమలానన్దభావనాః ॥ ౪౦
నారాయణాద్రౌ ప్రాపుశ్చ స్వామిపుష్కరిణీతటమ్
క్రౌఞ్చైః కారణ్డవైర్హంసైః సారసైః సరసస్వరైః ॥ ౪౧
తారాభిశ్చ బలాకాభిః అన్యైర్వనవయోగణైః

తా॥ బ్రహ్మ మొదలగు దేవతాగణమంతయు వెంటనే నారాయణాద్రిని చేరికొనిరి. అచ్చట పుణ్యవృక్షములను, పుణ్యతోయములు గల సరస్సులను సేవించుచు, సర్వేశ్వరుడగు శ్రీనివాసుని శ్రవణప్రేయముగ గానముచేసికొనుచు శిలాతలములందు కాలక్షేపముచేయుచు, కిన్నరుల దివ్యగానములను, అదేపనిగ భగవచ్చేష్టల నభినయించెడి అప్సరసల నాట్యములను తిలకించుచు, శ్రీ స్వామి పుష్కరిణీతీరమున చేరిరి.

శ్రీ స్వామి పుష్కరిణీతీరవర్ణనము

నిబిడాన్తరకల్లోలకోలాహలసమాకులమ్ ॥ ౪౨

తమాలైస్తిలకైః పూగైః నారికేళైశ్చ పాటలైః
కేతకైః సురపున్నాగైః పున్నాగైః పుత్రదీపకైః ॥ ౪౩

జమ్బీరైశ్చమ్పకైశ్చూతైః లికుచైః కుటజైర్వృతైః
మన్దారైః కేసరైః శ్వేతమన్దారైః హరిచన్దనైః ॥ ౪౪

కింశుకాశోకసన్తానసాలనీపహరీతకైః
శ్రీవృక్షైశ్చన్దనైర్బిల్వైః కదళీభిశ్చ దాడిమైః ॥ ౪౫

మాతులుఙ్గైః కురవకైః కున్దైః ఆమలజమ్బుభిః
సమన్తతః సమాకీర్ణం సాన్ద్రచ్ఛాయైశ్చ భూరుహైః ॥ ౪౬

వీరుద్భిర్దమనీభిశ్చ మాధవీమాలతీధవైః
ఫలపుష్పద్రుమైః ఫుల్లైః మల్లికావనజాతిభిః ॥ ౪౭

జాతీభిః శతపత్రీభిః పరాభిః విష్ణుపర్ణకైః
తుళసీ కృష్ణతుళసీ వళర్ణతులసీశతైః ॥ ౪౮

నన్ద్యావర్తైస్త్రిసన్ధిభిః జపాభిః కరవీరకైః
శృఙ్గబేరైర్హరిద్రాభిః కర్పూరైః రజనీకులైః ॥ ౪౯

పనసైరార్ద్రపనసైః అనేకైః కన్దజాతిభిః
పుణ్యగన్ధం కిరన్తీభిః లతాతతిభిరావృతమ్ ॥ ౫౦

కల్హారకమలానీకమధుమత్తమధువ్రతైః
కూజద్భిః కోకిలైశ్చాపి మదాన్ధైః మహితాన్తరమ్ ॥ ౫౧

సమాశ్రితార్తిహరణసాన్ద్రచ్ఛాయం సమన్తతః

తా॥ స్వామిసరోవరము క్రౌంచములు, కారండవములు, సరసస్వరములగు హంసములు, సారసములు, తారలు, బలాకములాదిగాగల జలజంతువులు చేయు మధురశబ్దములకు తావైనది. తమాలములు, తిలకములు, పూగములు, నాళికేరములు, పాటలములు, కేతకములు, పున్నాగములు, సురపున్నాగములు, పుత్ర

ప్రదీపకములు, జలనీరములు, చంపకములు, చూతములు, నికుచములు, కుటజములు, వటములు, మందారములు, కేసరములు, శ్వేతమందారములు, హరిచందనములు, కింశుకములు, అశోకములు, సంతానములు, సాలములు, నీపములు, హరితకములు, శ్రీవృక్షములు, చందనములు, బిల్వములు, కదలి దాడిమములు, మాతులుంగములు, కురవకములు, కుందములు, జంబువులు ఆదిగాగల వృక్షములచే నలుదిక్కుల పరివృతమైనది మదనమాలతీ మాధవీధవాదులు, ఫలపుష్పములు, వికసించిన మల్లిక వనజాతి జాతిశతపత్ర విష్ణుపర్ణకము లాదిగాగల తీగలు, తుళసి, కృష్ణతుళసి, వలక్షితుళసి, నంద్యావర్త త్రిసంధి, జపాకరవీరశృంగిబేర హరిద్రాదులచేతను, రజనీకుల పనసభేదములచేతను, కందజాతులచేతను, పుణ్యగంధమును వెదజల్లు లతాసమూహము చేతను, కల్హారములందు మధువుకై సంచరించెడి మధువ్రతములు, లే జిగుళ్ళను భ్రమింగిన మత్తములగు కోకిలారావములచేతను, ఆశ్రితసంతాపహరణఛాయతోను విరాజిల్లుచుండెను

బ్రహ్మాదులు శ్రీనివాసదర్శనమునకై ప్రయత్నించుట

తత్ర స్థిత్వా ముహూర్తం తే బ్రహ్మాద్యా దేవతాగణాః ॥ ౫౨

క్షీరాబ్ధికన్యాసఖ్యాస్తు సంస్మరన్తో వచః శుభమ్
శ్రియఃశ్రియం శ్రీనివాసం శ్రీవత్సకృతలక్షణమ్ ॥ ౫౩

శ్రీకణ్ఠకృతకైఙ్కర్యం శ్రీమహీమహితం హితమ్
ఏకమేకాయనవిదామేకాన్తహృదయాలయమ్ ॥ ౫౪

ద్వితీయామ్నాయనిష్ఠానామాత్మనామాత్మషూతిదమ్
త్రిమూర్తిమత్రిగుణకం త్రివిధాత్మకకాలకమ్ ॥ ౫౫

చతుర్మూర్తిధరం శాన్తం చతుర్వింశతిమూర్తికమ్
చతుర్థావస్థాతిభూమిం చతుర్వర్గఫలప్రదమ్ ॥ ౫౬

పఞ్చోపనిషదాత్మానం పఞ్చరాత్రప్రవర్తకమ్
పఞ్చాధర్వశిరోరత్నం పఞ్చమూర్తిధరం పరమ్ ॥ ౫౭

షడధ్వమయచక్రస్థషట్కోటిగృహమేధినమ్

సప్తార్చిః పఞ్జరావాసహంసం పరమహంసకమ్ ॥ ౫౮
అష్టాఙ్గయోగవిత్సిద్ధసంఘహృత్పద్మవాసకమ్
దశావతారచతురం దశాననశిరశ్ఛిదమ్ ॥ ౫౯
చరమోపాయసుగమం చరాచరగురుం హరిమ్
గఙ్గాజన్మగృహాఙ్ఘ్రిష్ఠపాదపఙ్కజవైభవమ్ ॥ ౬౦
ప్రణతార్తిహరం ప్రాజ్ఞం ప్రణవార్థప్రబావకమ్
ప్రసాదమాత్రప్రభవప్రమామాత్రప్రమాణకమ్ ॥ ౬౧
అవ్యాజమిత్రం శత్రుఘ్నం శరణ్యం శరణార్థినామ్
జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజోవిజృమ్భితమ్ ॥ ౬౨
రజస్తమస్సత్త్వసఙ్గవిమోహితజగత్త్రయమ్
సంసృష్టిస్థితిసంహారనిగ్రహానుగ్రహాత్మకమ్ ॥ ౬౩
భక్తానామప్యభక్తానాం చిన్తనాన్మోక్షకారణమ్
నాదాన్తగగనావాసం శుద్ధం సూక్ష్మం నిరఞ్జనమ్ ॥ ౬౪
నిరవద్యం నిరాకారం నిరాబాధం నిరామయమ్
నిరాశ్రయం నిస్తరఙ్గనీరరాశినిభం విభుమ్ ॥ ౬౫
అతీన్ద్రియం పరం బ్రహ్మ చేన్ద్రియైః స్పృష్టుమిచ్ఛవః
వ్యాహాత్మకమిదం సూక్తం సుపర్వాణః సముత్సుకాః
ఉదాత్తముచ్చైరుచ్చేరుః సమ్ప్లుతం నిరుపప్లవాః ॥ ౬౬

తా॥ ఆ సరోవరతీరమందు కొంచెముకాలముండి తమకు క్షీరసాగర తటమున లక్ష్మీదేవి చెలికత్తె చెప్పిన మాటలను ధ్యానించుచు, భగవత్సాక్షాత్కారమునకై సర్వేశ్వరునికల్యాణగుణములను ప్రశంసించుకొనుచుండిరి. మనకెపుడు శ్రీనివాసుని దర్శనముకాగలదు. అతడు శ్రీదేవికి శ్రీనిచ్చువాడు, శ్రీవత్సకృతలక్షణుడు, శ్రీకంఠకైంకర్యమును పొందువాడు, శ్రీమహీయుతుడు. హితుడు. భక్తియుక్తుల హృదయములందు వసించువాడు, ప్రసన్నులకు అనుభావ్యుడు, త్రిమూర్తిరూపి త్రిగుణాత్మకుడు, త్రికాలరూపి. చతుర్మూర్తిధరుడు, శాంతుడు, చతుర్వ్విం

శతి మూర్తిధరుడు, చతురవస్థాతిభూమి, చతుర్వర్గఫలప్రదుడు, పంచోపనిషదాత్మ భగవచ్ఛాస్త్రప్రవర్తకుడు, పంచాధర్వశిరోరత్నము, పంచమూర్త్యాత్మకుడు, షడధ్వమయచక్రములందుండువాడు, షట్కోటిగృహమేధి, సప్తార్చిఃపంజరావాస హంసము, పరమహంసము, అష్టాంగయోగవేత్తలగు సిద్ధసంఘహృత్పద్మము లందు వసియించువాడు, దశావతారవేషధారణ చతురుడు, రావణ సంహారము చేసినవాడు, చరమోపాయసుగముడు, చరాచరగురుడు, పాపహరుడు, గంగ జన్మించిన పాదాంగుష్ఠము గలవాడు, ప్రణతార్తిహరుడు, ప్రాజ్ఞుడు, ప్రణతార్ణ ప్రభావుడు, ప్రసాదమంత్ర ప్రభవప్రమామాత్ర ప్రమాణకుడు, అవ్యాజ మిత్రుడు, శత్రుహితశరణాగతులకు రక్షకుడు, జ్ఞానశక్తిబలైశ్వర్యతేజోవీర్యసంపూర్ణుడు రజస్తమస్సత్త్వములచే త్రిలోకములను మోహింపజేయువాడు, సృష్టిసంహార నిర్వాహకుడు, భక్తులైనను అభక్తులైనను చింతనమాత్రముచే ప్రసాదమునిచ్చు వాడు, నాదాన్తగగనమందు విహరించువాడు, పరిశుద్ధుడు, అణుస్వరూపుడు, నిరంజనుడు, నిర్వికారుడు, నిరవద్యుడు, నిరాకారుడు, నిరామయుడు, నిరాశ్రయుడు, నిస్తరంగ నీరరాశినిభుడు, అతీంద్రియుడు నగు నా పరబ్రహ్మమును కంటితో సేవించి, చేతితో పూజించి, సకలేంద్రియములతో యథోచితముగ నర్చించు భాగ్యము మనకెట్లు లభించును — అని ఉవ్విళ్ళూరుచు బ్రహ్మాదు లీ దిగువరీతిని భగవచ్ఛాస్త్రసంసిద్ధమగు 'జితంతే' స్తోత్రమును ముక్తకంఠముతో పాడదొడగిరి.

### బ్రహ్మాదులొనరించిన 'జితంతే' స్తోత్రము

"జితం తే పుణ్డరీకాక్ష! నమస్తే విశ్వభావన!
నమస్తేఽస్తు హృషీకేశ! మహాపురుష! పూర్వజ! ॥ ౭౭

నమః శ్రీధామనిలయ! నమః శ్రీవత్సలక్షణ!
నమస్త్రిధాత్మనే తుభ్యం నమః శ్రీఘనమోహన! ॥ ౭౮

నాకౌకఃప్రత్యనీకారే నారాయణ! నమోఽస్తు తే
నాగపర్యఙ్కశయన అనాథనాథ! నమో నమః ॥ ౭౯

విశ్వస్రష్ట్రే విశ్వభర్త్రే విశ్వత్రాత్రే విచక్షణ!
విశ్వాన్తర్యామిణే తుభ్యం విశ్వోత్తీర్ణ! విభో! నమః" ॥ ౮౦

తా॥ ఓ పుండరీకాక్షా! నీకు జయమగుగాక. విశ్వభావనా! హృషీకేశా! మహాపురుషా! పూర్వజా! నీకు జయమగుగాక. శ్రీధామనిలయా! శ్రీవత్స లక్షణా! త్రిధాత్మా, ఘనమోహనా! నాకౌకారిప్రత్యనీకా! నారాయణా! నాగ పర్యంకశయనా! నాథనాథ! విశ్వసర్గకర్తా! విశ్వభరణా! విశ్వపాలకా, విచక్షణా! విశ్వాంతర్యామీ! విశ్వాతీర్ణా! విభో! నమస్కారము

భగవదావిర్భావము

ఏవముచ్చరతాం తేషాం హర్షోత్ఫుల్లాస్యచక్షుషామ్
అగ్రే సుధాన్ధమావ్యగ్రమనసాం సమ్ప్రదర్శినామ్ ॥ ౨౧

న్యక్కృతాఖిలతేజస్కం చక్షుర్హారి సమీక్షితమ్
పశ్చిమే స్వామిసరస్తీరే ప్రత్యగ్రవిగ్రహమ్ ॥ ౨౨

విమానమావిర్బభూవ విమలానన్దకారకమ్
దివ్యదున్దుభినిర్ఘోషజయశబ్దసమన్వితమ్ ॥ ౨౩

ద్యోతయచ్చ దిశః సర్వాః పుష్పవృష్టిపురఃసరమ్

తా॥ ఇట్లని హర్షవికసితాస్యనయనులై నిలచి స్తోత్రము జేయుచున్న దేవతల యెదుట ఆనందకారకమగు దివ్యవిమానము సాక్షాత్కరించెను. లోక మందలి తేజఃపదార్థముల నన్నిటిని తిరస్కరించెడి ప్రకాశముతో నయనానంద కరముగ నా విమానము స్వామిసరోవర పశ్చిమతీరమున ప్రత్యక్షమాయెను. ఆకాశమునం దా సందర్భమున దివ్యదుందుభులు మ్రోగెను. దశదిక్కులను ప్రకాశింపజేయుచు పుష్పవృష్టి కురిసెను.

తద్వీక్ష్యానిమిషాః సర్వే విమానం విస్మయాన్వితాః
అభితుష్టువురాత్మేశం శ్రీనివాసం సమఞ్జసమ్ ॥ ౨౪

తా॥ ఆ విమానమును సేవించిన దేవతలు శ్రీనివాసుని తిరిగి తిరిగి స్తోత్రము చేయదొడగిరి.

బ్రహ్మాదులు శ్రీనివాసుని స్తుతించుట

జయ శ్రియఃపతే! విష్ణో! జయ! సత్యాచ్యుతానిశమ్
జయాఽనిరుద్ధ! భగవన్! జయ! పూరుషపూర్వజ! ॥ ౨౫

జయేశ! సర్వజగతాం జయ శ్రీకణ్ఠపూజిత!
జయాఽఽత్మేశ్వర జీవాతో! జయ త్వమపరాజిత" ॥ ౩౬

తా॥ ఓ శ్రియఃపతీ! సర్వవ్యాపకా! సత్యస్వరూపా! అచ్యుతా! అనిరుద్ధా! సనాతనపురుషపుంగవా! ఆత్మేశ్వరా! అపరాజితశక్తిసంయుతా! షాడ్గుణ్యపరిపూర్ణా! నీకు జయమగుగాక

శ్రీ శ్రీనివాసావిర్భావఘట్టము

స్తుత్యాఽనయా ప్రసన్నోఽస్మిన్ విమానే పరమః స్వరాట్
సహస్రాదిత్యసఙ్కాశః సహస్రేన్దు సమప్రభః ॥ ౭౭

సహస్రహుతభుక్ప్రఖ్యో విఖ్యాతవిభవోదయః
చతుర్భుజః శఙ్ఖచక్రవరావనతహస్తకః ॥ ౭౮

శ్రీవత్సకౌస్తుభోరస్కో వైజయన్త్యా విరాజితః
ఉద్యత్ప్రచణ్డమార్తాణ్డప్రతీకాశకిరీటకః ॥ ౭౯

మాణిక్యకణ్ఠహారశ్రీవీరపట్టవిరాజితః
కర్ణపాలీసమాలమ్బిమకరాననకుణ్డలః ॥ ౮౦

హారకేయూరకటకకఙ్కణాఙ్గదసున్దరః
అఙ్గులీయచ్ఛన్నకరోదరబన్ధనశోభితః ॥ ౮౧

ప్రవాళముక్తాప్రత్యుప్తనవరత్నసుదామకః
శృఙ్ఖలాబద్ధకౌక్షేయకిఙ్కిణీకకటిస్థలః ॥ ౮౨

పీతకౌశేయవసనో దీప్తమఞ్జీరహంసకః
కిఙ్కిణీదామాఙ్గుళీయవిరాజితపదామ్బుజః ॥ ౮౩

సర్వాభరణసంయుక్తః సర్వావయవసున్దరః
పుణ్డరీకావిశాలాక్షః పుష్పదామవిరాజితః ॥ ౮౪

అష్టాఙ్గైర్ధూపకైర్దివ్యాఽలేపనైః పుణ్యగన్ధిభిః
సమ్యక్స్నానాఙ్కితాఙ్గశ్రీః పూర్ణచన్ద్రనిభాననః ॥ ౮౫

అప్రాకృతాఙ్గమహిమా ప్రాకృతాఙ్గవిడమ్బనః
ప్రాదుర్బభూవ భగవాన్ భక్తభావాఽత్మకః పుమాన్॥ ౬౬

తా॥ దేవతల పై స్తోత్రమును ఆలకించి శ్రీనివాసుడా దివ్యవిమానమున సాన్నిధ్యము జెందెను సహస్రాదిత్యులతోడను, సహస్రచంద్రులతోడను, సహస్రాగ్నిదేవులతోడను, ఆ దివ్యమంగళ విగ్రహ కాంతి తుల్యముగ ప్రకాశించెను చతుర్భుజములు, శంఖచక్రవరదాభయహస్తములు, శ్రీవత్సము, కౌస్తుభము, వైజయంతి, ఉద్యత్ప్రచండ మార్తాండ ప్రకాశము గల కిరీటము, శ్రీవీరపట్టవిరాజితమగు మాణిక్యకంఠహారము, కర్ణముల నలరారు మకరకుండలములు, హారకేయూర కటక కంకణాంగదములు, అంగుళీయములు, ఉదరబంధనము, ప్రవాళముక్తాప్రత్యుప్త నవరత్నదామములు, శృంఖలాబద్ధకౌక్షేయ కింకిణీకములు, పీతకౌశేయవసనము, దీప్తమంజీర హంసకములు, కింకిణీదామాంగుళీయకములు ఆదిగాగల దివ్యాభరణములు ఆ దివ్యమోహనుని కలంకరింపబడెను. పుండరీకవిశాలలోచనములు కలిగిన ఆ మూర్తి, సుగంధ పుష్పమాలికలచే అలంకరింపబడి, దివ్యచందనము అలది, దివ్యధూపములచే పరిసరములందు ధూపము సమర్పింపబడుచుండెను నిలచియుండిన యవస్థానముతో అప్రాకృతదేహుడు ప్రాకృతశిలారూపియై భక్తులయందలి కృపాపారవశ్యముచే అచ్చట నిలచెను

### భగవానుడు బ్రహ్మాదులను కుశలప్రశ్నలడుగుట

ఈషదుత్స్మయమానస్తు గీర్వాణాన్ వీక్ష్య విస్మితాన్
బభాషే చ సురశ్రేష్ఠః పూర్వాన్ పూర్వవిదాత్మభూః॥ ౬౭
కచ్చిద్దేవాః స్వాగతం వః సహస్రాక్షపురోగమాః
పితామహం పురస్కృత్య కిమర్థం యూయమాగతాః॥ ౬౮
కచ్చిత్పాపియేణ బాధ్యధ్వే ధ్రువమవ్యాజశత్రుభిః

తా॥ ఎదుట నిలచిన దేవతాబృందమును చూచిన భగవానుడు సర్వజ్ఞుడైనను వారలనిట్లు ప్రశ్నించెను. దేవతలారా! మీకు స్వాగతము. చతురాననుని వెంట నిడికొని యేదో కార్యార్థమై వచ్చియుందురు. నిష్కారణవైరు లగు నసురులచే మీకేదైన బాధ కలిగినదా అనిరి.

### బ్రహ్మ దైత్యబాధలను గురించి నివేదించుట

ఏవముక్తే హృషీకేశే కేశవే కేశిమర్దనే ॥ ౮౯

ప్రత్యూచే విబుధశ్రేష్ఠః ప్రణిపత్య పితామహః
'జాగరూకేఽత్ర భవతి భగవన్! భక్తవత్సలే ॥ ౯౦

సర్వత్రారిష్టమాపన్నం త్వదధీనా వయం హి తత్
కిం వాఽకుశలమస్మాకం జీవితం కఞ్జలోచన! ॥ ౯౧

ఇన్ద్రాదయో లోకపాలా వివర్ణవదనా ఇమే
స్వపదప్రచ్యుతా దుఃస్థాః స్వస్థా న ప్రచకాశిరే ॥ ౯౨

దైవతానామమీషాం తు భీతివిహ్వలచేతసామ్
నక్తం దివం న చేరుశ్చ విమానాని వియత్తలే ॥ ౯౩

ఏతే హి ద్వాదశాదిత్యాః తమోవిధ్వస్తదీప్తయః
గ్రస్తా ఇవ తమోభిస్తు న బభుః విగతప్రభాః ॥ ౯౪

అష్టౌ వసుగణాః ప్రాయో నాసత్యౌ ద్వౌ చ నాకినౌ
బభాసిరే న పీతాభాః ప్రణష్టవసుకా ఇవ ॥ ౯౫

మమ లోకే నివాసశ్చ దుఃస్థితోఽస్వస్థచేతసః
కైలాసవాసో రుద్రస్య మహాక్లేశకరోఽభవత్ ॥ ౯౬

స్వకృతిప్రీడయా సోఽపి తత్రైవ వ్యవతిష్ఠతే
కశ్చిన్నిదానమేతేషాం తృణీకృతజగత్త్రయః ॥ ౯౭

అమరారిరితి ఖ్యాతో దైతేయేన్ద్రో మహేన్ద్రజిత్
శిపివిష్టం సముద్దిశ్య దుర్వినీతగణాధిపమ్ ॥ ౯౮

ఘోరాకారో ఘోరతరం చకారాతిచిరం తపః
తపసా తేన సన్తుష్టః పివాకీ స చ తామసః ॥ ౯౯

అజయ్యత్వమవధ్యత్వమమరైరమరాధిపైః
అన్యైరతిబలైశ్చైవ తస్మై దుర్మేధసే దదౌ ॥ ౧౦౦

అమరారిర్దివిషదాం అనేషాఞ్చ సతామరిః
దుష్టాత్మా దుష్టచేతాః స త్రిషు లోకేషు చేష్టతే ॥ ౧౦౧
విశేషతో దేవవర్గా౯ దరిద్రాన్ దీనమానసాన్
దివానిశం సదా క్రూరః తదాప్రభృతి బాధతే ॥ ౧౦౨

తా॥ ఇట్లని యడిగిన భగవానునిజూచి నమస్కరించి బ్రహ్మయిట్లనెను. నీవు మా కండయైయుండియు మా పాపముచేత అసురబాధలు కల్గుచున్నవి. మా కెక్కడ కుశలము, యెక్కడ జీవయాత్ర లోకములో వీరందరును తమ తమ స్థానములనుండి పారిపోయి నిలచు నీడలేక దుఃఖించుచున్నారు ఈ ద్వాద శాదిత్యులు గ్రహణకాలబాధలో పడి ప్రకాశించుటలేదు. అష్టవసువులు అశ్వినీ దేవతలు తల యెత్తుటలేదు. నాకును సత్యలోకము దక్కలేదు. రుద్రునికి కైలాసము పోయినట్లే. స్వయంకృతాపరాధముచే ఖిన్నుడై అతడు క్రక్కలేక మ్రింగలేక అక్కడనే మూల దాగియున్నాడు దీనికి మూలకారణ మొక దైత్యుడు మహేంద్రజిత్తు అను పేరుగల అతడు శంకరునిగూర్చి ఘోరమగు తపస్సుచేసి శంకరుని స్వాధీనపరచికొని, అజయ్యత్వము, అవధ్యత్వము నను వరములను పొందెను అతడు విశేషించి దేవతలను. తక్కిన సాధువుల నందరను బాధించుచున్నాడు తపస్సిద్ధిపొందిన దాదిగ దివారాత్రులు నిర్భయ ముగ వాడు హింసాకాండమును వ్రతముగా పెట్టుకొని సంచరించుచున్నాడు.

దైత్యారిర్దేవతామిత్రం శార్ఙ్గీ ఖడ్గీ చ చక్రభృత్
దేవః ప్రమాణం సర్వేషామన్తర్యామీ భవా౯ స్వతః ॥ ౧౦౩
నమస్తే కమలాకాన్త నమః కమలలోచన !
నమః కారుణ్యపుణ్యశ్రీః నమః కాలాత్మక ! ప్రభో ! ॥౧౦౪
అర్దితానసురేన్ద్రేణ దుర్హృదా చామరారిణా
అస్మానసేకవిధయా భవా౯ రక్షతు రక్షతు'

తా॥ నీవు దైత్యులకు శత్రువు, దేవతలకు మిత్రుడవు. శత్రుసంహారము చేసి మిత్రుల కాపాడుటకై నీవు చక్రాది దివ్యాయుధములను ధరించితివి. నీకు తెలియనిది మేము చెప్పలేము. ఓ కమలాకాంతా ! ఓకమలనేత్రా ! కరుణానిధే ! కాలస్వరూపా దైత్యశిక్షకా ! దైత్యబాధనుండి మమ్ములను నీవు రక్షింపుము.

భగవానుడు అభయప్రదానమిచ్చుట

ఇతి బ్రువాణే గిర్వాణగణే శ్రేయోభిశంసిని ॥ ౧౦౫

శరత్ప్రీత్యగ్రఫుల్లాబ్జవక్త్రాభే పరమేష్ఠిని
కారుణ్యామృతవారాశికల్లోలామృతలీలయా ॥ ౧౦౬

వీక్షయా వీక్ష్య విశ్వాత్మా విధ్వస్తజరయాఽఽదరాత్
ఉవాచ భగవాన్ విష్ణుః స్మయమానముఖామ్బుజః ౧౦౭

దన్తపఙ్క్తిద్యుతిజ్యోత్స్నాస్నపితాఽఽశాన్తరాలకః
'మా బిభ్యతు భవన్తోఽహం కరిష్యే తత్ప్రీతిక్రియామ్ ॥

స్వస్మిన్ స్వస్మిన్ పదే యూయం స్థాతారోఽనార్తమేవ చ
వధ్య ఏవ త్వవధ్యత్వం ప్రాప్తవానపి శూలినః ॥ ౧౦౮

అమరారిరముష్యాస్తు త్రిలోక్యా దుష్టకణ్టకః'

తా॥ ఇట్లు ప్రార్థింపబడిన భగవానుడు పరమకరుణతో బ్రహ్మ ననుగ్రహించి చూచి, "మీరు భయము జెందకుడు. మీ మీ చోటులందు పోయి మీరు సుఖమున నుండుడు. దైత్యుడు వధ్యుడే. అతనికి శివవరముచే అవధ్యత్వము వరముగా వచ్చినది. వాడు తన వరదానశక్తిని దుర్వినియోగము చేసికొనుటచే వధ్యుడగును.

భగవానుడు రక్షోగణ సంహారమునకై కుముదాక్షుని నియోగించి అంతర్హితుడగుట.

ఇత్యుక్త్వా తాన్ సురగణాన్ సుప్రసన్నః సురర్షభః ॥ ౧౧౦

ఇఙ్గితాకారచేష్టాజ్ఞమిన్దిరారమణః ప్రభుః
కుముదాక్షం గణాధ్యక్షం గదాపాణిముదైక్షత ॥ ౧౧౧

శ్రీవత్సకౌస్తుభాభ్యాఞ్చ యుతే సారూప్యసమ్పదమ్
విష్వక్సేనాభిధానఞ్చ సేనాపత్యం ప్రదాయ చ ॥ ౧౧౨

నియుజ్య తం తస్య వధేఽమరారాతేః గణాధిపమ్
దేవాన్ సమ్భాష్య సహసా సర్వాన్ స్వపదకాఙ్క్షిణః ॥ ౧౧౩

కృత్వాఽభయప్రదానఞ్చ దత్త్వాఽఽశిషమనేకశః
స్మయమానముఖః శ్రీమాన్ అచ్యుతస్తు తిరోదధే ॥ ౧౧౪

తతో దేవా దేవదేవాభిహితం వచనం హితమ్
శ్రుత్వా ప్రీత్యా ప్రణమ్యైతం దేశముద్దిశ్య చోర్జితమ్ ॥ ౧౧౫

శిరస్యఞ్జలిపుఞ్జానప్యాబధ్నన్తః సుధాన్ధసః
ప్రదక్షిణం పరిక్రమ్య యయుః సంహృష్టమానసాః ॥ ౧౧౬

తా॥ ఇట్లని దేవతల కభయమిచ్చి భగవానుడు గదాపాణియై యెదుట నిలచియున్న కుమాదాక్షుని విష్వక్సేనునిచూచి వారలకు సేనాపత్యమొసంగి దేవతల నోదార్చి అభయమిచ్చి ఆశీర్వదించి వెంటనే అంతర్హితుడాయెను దేవతలును సంతుష్ట మానసులై భగవానుని ధ్యానించుచు స్వస్థానముల కేగిరి

శ్రీనివాసావాసస్థలముయొక్క సర్వఫలప్రదత్వము

ఇతి దేవార్యమిత్రస్య సర్వాన్తర్యామిణో విభోః ।
ఆవిర్భావో మయాఽఽఖ్యాతః శ్రీనివాసస్య దేవల ॥ ౧౧౭

శృణ్వతాం పఠతాం చైవ చతుర్వర్గఫలప్రదః ।
ఏతద్ధ్యై వైష్ణవం క్షేత్రం పవిత్రం చిత్రవైభవమ్ ॥ ౧౧౮

అనాయాసేన జగతామభీష్టఫలదాయకమ్ ।
ముక్తిభాజాం ముముక్షూణాం లక్ష్మీవైభవకాఙ్క్షిణామ్ ॥ ౧౧౯

కిన్నరాణాం నరాణాఞ్చ సురాణాం సుఖశాలినామ్
భూతానాం భూతయోనీనాం భైరవాభైరవాత్మనామ్ ॥ ౧౨౦

పరమైకాన్తినాం పఞ్చకాలాకలుషితాత్మనామ్ ।
పఞ్చశాఖాథర్వవిదాం పఞ్చోపనిషదాత్మనామ్ ॥ ౧౨౧

నిత్యానాం నియమస్థానాం నివాసో యోగినామపి ।
మహాత్మ్యమస్య దేశస్య వక్తుం వర్షశతైరపి ।

తా॥ ఓ దేవలా! భగవానుని యావిర్భావ కథను చెప్పితిని. ఈ కథను వినినవారలకు చదివిన వారలకు భగవానుడు పురుషార్థములను కావలసిన వాట్లి నిచ్చును. భగవదావిర్భావముచే పవిత్రమైన ఈ దేశము చిత్రమహిమకలది. భక్తి ముక్తుల నిచ్చును. ఈ దేశ మహిమను సంపూర్ణముగ చెప్పుట కెవ్వరికిని సాధ్యముకాదు.

శ్రీనివాసావతార దేశకాల నిర్ణయము

అశక్యం దేవల ! భవాన్ కృతకృత్యః శుచిశ్రవాః ॥ ౧౨౨

ఇత్థమాత్మభువః కల్పే హార్ద్రామ్భోజభువో హరేః ।
ఆదౌ కృతయుగే జంబూద్వీపే భారతవర్షకే ॥ ౧౨౪

గఙ్గాయా దక్షిణే భాగే యోజనానాం శతద్వయే ।
పఞ్చయోజనమాత్రే తు పూర్వామ్భోధేస్తు పశ్చిమే ॥ ౧౨౪

మాసే భాద్రపదే విష్ణుతిథౌ విష్ణుసమన్వితే ।
సిద్ధయోగే సోమవారే గిరౌ నారాయణాఽహ్వయే ॥ ౧౨౫

స్వామిపుష్కరిణీతీరే పశ్చిమే భూత్యపశ్చిమే ।
బృందారకాణాం బృన్దైస్తు ప్రార్థితో లోకరక్షకః ॥ ౧౨౬

ఆవిర్బభూవ భగవాన్ శ్రీనివాసః పరః పుమాన్ ।
శ్రీనివాసాయ మహతే నిష్కలానిష్కలాత్మనే ।
నమోఽస్తు పద్మనేత్రాయ పవిత్రాయాదివేధసే ॥ ౧౨౭

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాండే శ్రీవేంకటాచలమాహాత్మ్యే
శ్రీ శ్రీనివాసావిర్భావవర్ణనం నామ త్రయస్త్రింశోఽధ్యాయః

తా॥ దేవలా! నీవు ధన్యుడవు ఆదిబ్రాహ్మకల్పమున జంబూద్వీప భాగమైన భరతవర్షమునందు గంగానదికి రెండువందలయోజనముల దక్షిణమునను పూర్వసముద్రమునకు ఐదు యోజనముల పశ్చిమమునను నారాయణ పర్వతమునందు స్వామిపుష్కరిణికి పశ్చిమతీరమున భాద్రపదశుక్ల ద్వాదశి తిథియందు శ్రవణ నక్షత్రముకూడిన సోమవార శుభదినమునాడు సిద్ధయోగ శుభసమయమున

బృందారక బృందములచే ప్రార్థింపబడి పరమపురుషుడగు శ్రీనివాస భగవాను డవతరించెను. అట్టి తేజోమూర్తియు సకల నిష్కలమూర్తియు పద్మనయను డును పవిత్రుడను ఆదిపురుషుడునగు శ్రీనివాసమూర్తికి నమస్కారము,

ఇది శ్రీపాద్మపురాణమునందు క్షేత్రకాండమున శ్రీవేంకటాచల మాహాత్మ్యమున శ్రీ శ్రీనివాసావిర్భావ కథనము ముప్పది మూడవ అధ్యాయము,

---

## ముప్పదినాల్గవ అధ్యాయము.



దేవలుడు అడుగుచున్నాడు —

దేవదర్శన ! భూయోఽపి శ్రోతుం కౌతూహలం హి మే ।
పద్మాఖ్యసరసో బ్రహ్మన్ ! మాహాత్మ్యం జన్మ మే వద ॥ ౧
యస్మింస్తపస్యతో వైయాసకేః సిద్ధిరుపాగతా ।
శుకస్తు ముక్త ఇతి వై ప్రసిద్ధః జగతీతలే ॥ ౨
బ్రహ్మలోకాదాగతో యః శుకోఽన్యో వా వదస్వ మే ।
కృపాం మయి కురుష్వాద్య వద సర్వజ్ఞ మే గురో !' ॥ ౩

తా॥ ఓ గురూత్తమా దేవదర్శనా ! శ్రీవేంకటేశుని మహిమను ఎంత వినినను తృప్తికలుగుటలేదు శ్రీ పద్మసరోవర మహాత్మ్యమును వినవలెనని ఆశవొడముచున్నది శుకుడచ్చట సిద్ధిబొందుట యననేమి ? శుకుడు ముక్త డనియు బ్రహ్మలోకవాసి యనియు చెప్పుదురుగదా ? ఆతడే యీ శుకుడా లేక ఆపేరుతో యవతరించిన మరియొక ఋషియా నాయందు దయయుంచి పద్మసరోవరకథను శుక చరిత్రమును వివరించి చెప్పుము

దేవదర్శనుడు చెప్పుచున్నాడు —

**భృగు పాదాహతినందిన భర్తపై కోపించిన లక్ష్మి పాతాళమునకుపోవుట.**

శృణు పద్మాఖ్యసరస ఉత్పత్తిం దేవలాద్య భోః ! ।
భృగోః ఖ్యాత్యాం సముత్పన్నా శ్రీః పూర్వం ధర్మనాయక !! ౪

భృగుపాదాహతస్యాస్య విష్ణోః వైకుంఠవాసినః ।
విప్రపాదరజఃస్పృష్టా కుపితా కపిలాఽలయమ్ ॥ ౫
గత్వా పాతాలమూలం సా మునినా తేన పూజితా ।
శ్రీమతా సా హి తేనైవ కపిలేన కృతాఽలయా ॥ ౬
పూజితా చ చిరం కాలం తత్ర వాసం తదాఽకరోత్ ।

తా॥ విను ము పూర్వమొకప్పుడు శ్రీమహావిష్ణువును భృగుమహర్షి వక్షఃస్థలముపై తన్నినందున కోపించిన మహాలక్ష్మి పాతాళమునకేగెను. పాతాళమునకుపోయి కపిలుని యాతిథ్యమున చాలకాల మచ్చటనేయుండెను.

లక్ష్మిని వెదకుచు భగవానుడు భూలోకమునకు వచ్చుట.

ధరణీ సహితో విష్ణుః లీలయా ధృతచామరః ॥ ౭
తం మునిం పూజయిత్వాఽథ భృగుం బ్రహ్మర్షిసత్తమమ్
నీలాం నిఃక్షిప్య వైకుణ్ఠే భూదేవ్యా భూమిమాగతః ॥ ౮
శఙ్ఖచక్రగదాకున్తపాణిః పద్మదలేక్షణః
శ్రీదేవ్యన్వేషణం కుర్వన్ నానారూపీ జనార్దనః ॥ ౯
షట్పఞ్చాశత్సు దేశేషు విచిన్వన్ పురుషోత్తమః
కొల్హాపురం సమాగమ్య శ్రియోఽధిష్ఠానముత్తమమ్ ॥ ౧౦
తత్రాపశ్యన్మహాలక్ష్మీం అర్చారూపేణ రాజతీమ్
అగస్త్యారాధితాం పూర్వం ప్రతిష్ఠాప్యాఽలయోత్తమే ॥ ౧౧
తాం దృష్ట్వా తత్ర దేవేశో మహితాం మునిసత్తమైః
అర్చయంశ్చ స్వయం విష్ణుః ఉవాస దశవత్సరాన్ ॥ ౧౨

తా॥ శ్రీమహావిష్ణువు రమావిరహమును సహించనివాడై భృగువు నాశ్వాసపరచిపంపి శ్రీవైకుంఠమున నీలాదేవినుంచి భూమాతతోకూడి భూమికివచ్చెను. శ్రీమహావిష్ణువు శంఖచక్రగదా కుంతములను నాయుధములను ధరించి భారతదేశమందలి యేబదియారు దేశములందు తిరిగి శ్రీదేవిని కానక కడపట లక్ష్మి

వాసస్థానముగ ప్రసిద్ధిచెందిన కొల్హాపురమునుచేరి అర్చాసమాధియందు సమస్తోపచారములచే ఆరాధింపబడుచున్న మహాలక్ష్మినిచూచెను అగస్త్యు లచ్చట మహాలక్ష్మి నిగ్రహమును యెప్పుడో ప్రతిష్ఠించియుండినట్లు తెలిసికొనెను. అచ్చట శ్రీమహాలక్ష్మినిచూచి స్వయముగా తానును ఆమెను అర్చించుచు పది సంవత్సరముల కాలమచ్చటనే ఉండిపోయెను

భగవంతునుద్దేశించి అశరీరవాక్కు పలుకుట.

అథాబ్రవీత్తదా విష్ణుం అశరీరా సరస్వతీ
విష్ణోః ప్రసీద భగవన్ ! లక్ష్మీదర్శనలాలస ! ॥ ౧౩
ఇతో దక్షిణతో గచ్ఛ కృష్ణావేణ్యోశ్చ దక్షిణే
ద్వావింశద్యోజనే విష్ణో ! సువర్ణముఖరీ నదీ ॥ ౧౪
తీరమాసాద్య తస్యాస్త్వం ఉత్తరం మునిసేవితమ్
కున్తేనాఽహత్య తత్తీరే సరః కృత్వా తపః కురు ॥ ౧౫
ఆహృత్య దేవలోకాత్త్వం సువర్ణకమలాని చ
సంస్థాప్య తస్మిన్ సరసి సర్వాణి కమలాని చ ॥ ౧౬
తత్తీరే పుష్పజాతీశ్చ పుష్పవృక్షశతాని చ
పద్మాఽరామే చ సరసి పద్మాయాః పద్మవల్లభ ! ॥ ౧౭
జపన్నేకాక్షరమనుం సహస్రాక్షరమేవ వా
అర్చయన్ కమలైః పద్మాం ద్వాదశాబ్దం వస ప్రభో ! ౧౮
తతః ప్రసన్నా సా దేవీ స్వయమావిర్భవిష్యతి
సువర్ణకమలే దేవ ! సువర్ణకమలాకృతిః ॥ ౧౯
ఊనషోడశవర్షా సా శ్రీః పద్మనయనా తవ
గచ్ఛ శీఘ్రమితో విష్ణో! సువర్ణముఖరీతటమ్ ॥ ౨౦

తా॥ అట్లు దశవర్షకాలము గడచిసపిదప అశరీరవాణి ఆకాశమునుండి భగవానుని నిట్లు చేయుమనిచెప్పెను. ఓ ప్రభూ ! ప్రసన్నుడవుకమ్ము చింతింపకుము. నీ అర్చనము ఫలించినది. నీవు లక్ష్మీదర్శనము కావలయుననికోరు

మన్నావు. ఇచ్చటనుంచి దక్షిణముగ పొమ్ము. కృష్ణవేణీనదికి దక్షిణభాగమున యిరువదిరెండు యోజనముల దూరములో సువర్ణముఖరీనదియున్నది. ఆ నదీ తీరమున సమీపముననే ఉత్తరభాగమున నీ కుంతాయుధముతో త్రవ్వి ఒకచిన్న సరోవరమును నిర్మించుము. తపసుచేయుము. ఆ సరోవరమునందు దేవలోకమునుండి కమలములను తెప్పించి నాటుము చుట్టుప్రదేశము నందంతటను చక్కని పుష్పవనమును పెంచుము ఏకాక్షర మంత్రమునుగాని సహస్రాక్షర మంత్రమునుగాని పురశ్చరణముచేయుచు సరోవరమందలి స్వర్ణకమలములచే లక్ష్మి నారాధించుచుండుము. అప్పుడు దేవి ప్రసన్నయై సాక్షాత్కరించును. ఒకానొక స్వర్ణకమల కుసుమమందు పదునారువత్సరములుగలకన్యయై నీకు ప్రత్యక్షము కాగలదు. ఇక నీకిక్కడ కార్యములేదు. వెంటనే సువర్ణముఖరీ తటమునకు వెడలిపొమ్ము ' అని చెప్పెను.

భగవానుడు సువర్ణముఖరీ తీరమునకు వచ్చుట.

ఇతి సౌమ్యం వచః శ్రుత్వా విష్ణురాకాశసమ్భవమ్
జగామ గరుడారూఢః సువర్ణముఖరీతటమ్ ॥ ౨౧

పశ్యంశ్చ వివిధాన్ దేవాన్ పర్వతాంశ్చ వనాని చ
వరాహాధిష్ఠితం పుణ్యం అఞ్జనాద్రిం సురారిహా ॥ ౨౨

స్వామిపుష్కరిణీం దృష్ట్వా భూవరాహస్య సన్నిధౌ
గరుడాదవతీర్యాసౌ స్నాత్వా స్వామిసరోజలే ॥ ౨౩

తా॥ ఇట్లని అశరీరవాక్కులను వినిన భగవానుడు గరుడారూఢుడై, సువర్ణముఖరీతీరమునకు బయలుదేరెను. మార్గమధ్యమున అనేక దేశములు, పర్వతములు, వనములు, శ్రీవేంకటగిరి స్వామిపుష్కరిణి, భూవరాహదేవుడు వీరల నందరిని దర్శనము చేసికొనుచు రాగా, వరాహక్షేత్రమహిమను జ్ఞాపక పరచికొని గరుడునినుంచి దిగి స్వామిపుష్కరిణియందు స్నానమాడి అర్చకులగు శ్రీ వైఖానసులచే యాదరింపబడి యెవరికి తన నిజస్వరూపము తెలియనీయక రాజవేషముతోడనే ఆ రాత్రి వేంకటాద్రియందు గడిపి మరునాడుదయము బయలుదేరి దక్షిణదిక్కుగా సాగి సువర్ణముఖీనదిని చేరి అచ్చట గరుడవాహనమునుండి దిగెను.

వైఖానసైశ్చ మునిభిః ఆతిథ్యేన సుపూజితః
స జ్ఞాతో రాజరూపేణ మునిభిః పురుషోత్తమః॥ ౨౪
యయౌ ప్రాతః సముత్థాయ మునీనామన్త్ర్య తాన్ విభుః
అశ్వరూపస్తు గరుడమారుహ్య పురుషోత్తమః॥ ౨౫
గదాకున్తధరో దేవో గిరేర్దక్షిణతో వ్రజన్
సువర్ణపఙ్కజాకీర్ణం సువర్ణముఖరీం హరిః॥ ౨౬
దృష్ట్వా సవిస్మయో భూత్వా గరుడాదవరుహ్య చ

భగవానుడు పద్మసరోవరమును నిర్మించుట

తత్ర పుణ్యే సమే దేశే కున్తేనాఽహత్య భూతలమ్॥ ౨౭
గోకర్ణమాత్రవిస్తారం చకార రుచిరం సరః
స్మృత్వా వాయుం సమాహూయ తమువాచ మహామనాః॥
‘ఇన్ద్రస్యానుమతే వాయో! రుక్మపద్మాని చాహర
స్థాపయిష్యామి సరసి లక్ష్మీపూజావిధౌ మరుత్!॥ ౨౯
తచ్ఛ్రుత్వా వాయురాహైనం ‘అస్యాం నద్యాం హి సన్తి వై
కాఞ్చనాని చ పద్మాని కిమర్థం సురలోకతః’॥ ౩౦

శ్రీ భగవాన్ :

‘కొల్హాపురే మహావాణీ హ్యశరీరాఽబ్రవీత్పురా
దేవలోకాత్సమానీయ కాఞ్చనాబ్జాని చార్చయ॥ ౩౧
ఇతి మామబ్రవీద్వాయో! తస్మాదానయ మేఽమ్బుజమ్’
గత్వా లోకం తతో వాయురిన్ద్రలోకాదుదారధీః॥ ౩౨
దేవేన్ద్రానుమతేః శీఘ్రమానయామాస తాని వై
కాఞ్చనాబ్జాని నిఃక్షిప్య తస్మిన్ సరసి మాధవః॥ ౩౩
విష్ణుః సూర్యం ప్రతిష్ఠాప్య ప్రాఙ్ముఖం సరసస్తటే
అర్చయన్ పఙ్కజాధీశం కమలాఽఽవాప్తయే విభుః॥ ౩౪

తా॥ అచ్చట సమతలమగు భూప్రదేశమును ఆయవ్యయాదిసిద్ధముగ నిర్ణయించి తన చేతి కుంతముతో త్రవ్వి విస్తృత మగు నొక పుష్కరిణిని భగవానుడు నిర్మించెను. చక్కని జలము నిండెను. ఆవల వాయుదేవుని బిలచి స్వర్లోకమునుండి స్వర్ణకమల కందముల దెప్పించి సరోవరమున నాటించెను. కమలములు సలక్షణముగ వికసించుటకై కమలబాంధవుడగు సూర్యభగవానుని విగ్రహము నచ్చట సమీపముననే ప్రతిష్ఠించి లక్ష్మి నారాధింపుట కుపక్రమించెను.

భగవానుని తపఃప్రకారము

శక్తిపూర్వం శ్రియో బీజం కామబీజమతః పరమ్
ఆద్యన్తప్రణవోపేతమక్షరత్రయసమ్పుటమ్ ॥ ౩౫

త్రిసహస్రం జపన్నిత్యం దశాంశం తర్పయన్ విభుః
అర్చయన్ పద్మసాహస్రైః దివ్యైః కాఞ్చనసమ్భవైః ॥ ౩౬

తర్పయన్ పద్మసరసో రసేనోషసి మాధవః
క్షీరాహారో యతాహారో లక్ష్మ్యారాధనతత్పరః ॥ ౩౭

తద్భానుసన్నిధౌ తీరే పశ్చిమాభిముఖో విభుః
దీక్షాం వివేశ దేవేశో ద్వాదశాబ్దమనన్యధీః॥ ౩౮

తా॥ ప్రణవపూర్వకముగ శక్తి - శ్రీ - కామబీజము లను మూడక్షరముల మహామంత్రమును ప్రతిదినము మూడువేలు జపించి మంత్రశాస్త్రరీతి ననుసరించి దశాంశతర్పణ హోమ బ్రాహ్మణభోజనాది నియమములనుపాటించి వేయి బంగారు కమలములచే ఉదయకాలమందు మహాలక్ష్మిని పూజించుచు సరోవరతీరముననే యుండి భగవానుడు క్షీరాహారుడై సూర్యభగవానుని ఆలయమునందు పశ్చిమాభిముఖముగ నిలచి ద్వాదశవర్షదీక్షతో మహాతపస్సు నారంభించెను.

ఇంద్రాది దేవతలు తపోవిఘ్నము చేయ జూచుట

ఏవం స్థితే మహావిష్ణౌ శ్రీకాంక్షిణి సమాహితే
ఇన్ద్రాదిదేవాః సంక్షుబ్ధా మాయామోహసమన్వితాః॥ ౩౯

భూపతేః పార్థివేన్ద్రస్య విష్ణోర్మానుషరూపిణః
విఘ్నఞ్చ తపసః కర్తుం ఉద్యమం చక్రురుద్ధతాః ॥ ౪౦

ఆహూయాప్సరసః సర్వాః ప్రోచుః సేన్ద్రాః దివౌకసః
యూయం గచ్ఛత భూలోకం అఞ్జనాద్రేః సమీపతః ॥ ४०

సువర్ణముఖరీ నామ నదీ మునినిషేవితా
తస్యా ఏవోత్తరే తీరే కుమ్భయోనేః మహానాశ్రమః ॥ ४२

తదాశ్రమాత్పూర్వభాగే కశ్చిద్రాజా తపస్యతి
కనకాబ్జసరస్తీరే పురస్తాద్భాస్కరస్య చ॥ ४३

త్రైలోక్యలక్ష్మీమాకాఙ్క్షన్ మాయావీ స చతుర్భుజః
క్షోభయధ్వం నృత్యగీతైః అన్యైః శృఙ్గారచేష్టితైః ॥ ४४

తా॥ ఇట్లు తపమునసుండెడి భగవానుని నిజరూపము తెలియని ఇంద్రాదులు ముగ్ధులై, ఆ తపస్వి యెవ్వడో రాజకుమారుడు ఇంద్రపదవి నాకాంక్షించి తపము చేయుచున్నాడను భ్రాంతితో తపోభంగము చేయదలచి అప్సరసలను రావించి దేవతలు వారలతో నిట్లు చెప్పిరి "ఓ అప్సరాంగనలారా! మీ రిప్పుడు భూలోకమున నంజనగిరి ప్రక్కనున్న సువర్ణముఖరీ నదీతీరమునకు పోవలయును. అచ్చటి అగస్త్యాశ్రమమున పూర్వదిక్కు నందొక రాజు తపము చేయుచున్నాడు. ఆతడు సూర్యభగవానుని దివ్యాలయమున చతుర్భుజములతో నున్నాడు. మీ శృంగారేంగిత చేష్టల నాతనిపై బంపి, తపస్సును విఘ్నపరచవలయును అని యాదేశించిరి

ఇతి దేవైః సమాదిష్టాః సర్వా హ్యప్సరసాం వరాః
వసన్తకామసహితా జగ్ముః పద్మసరోవరమ్ ॥ ४५

అవతీర్ణో వసన్తస్తు జజృమ్భే తద్వనే భృశమ్
చూతకింశుకమన్దారకర్ణికారానతోజ్జ్వలైః ॥ ४६

కోకిలైర్భృఙ్గరాజైశ్చ శోభితైః వివిధైః ఖగైః
రమ్యే వనే తపస్యన్తం పురుషం సుభగాకృతిమ్ ॥ ४७

దృష్ట్వా చతుర్భుజం చిత్రం మోహితాశ్చాప్సరోగణాః
జగుః కలఞ్చ ననృతుః తదగ్రే తా వరాఙ్గనాః ॥ ४८

కహ్లారశీతలో వాయుః చాలయన్ పుష్పవాటికామ్
వవౌ మలయసమ్భూతో మదయన్ వనవాసినః ॥ ౪౯

తా॥ ఇట్లు దేవతలచే కోరబడినవారలలో ముఖ్యులు వసన్తర్తువుచేతను, మన్మధునిచేతను సహకరింపబడి పద్మసరోవరతీరము చేరిరి అందుకు సాక్షిగ అకాలమున హఠాత్తుగ వసంతలక్షణములు ఆవరించెను. వారలు చతుర్భుజుడును దివ్యమోహనాంగుడు నగు భగవానుని జూచి ముగ్ధులైరి. మలయమారుతము వీచి మన్మధోద్దీపనము చేయ నారంభించెను.

భగవానుడు తపోవిఘ్నపరిహారమును సృజించుట.

ఏతస్మిన్నన్తరే విష్ణుః కిఞ్చిదున్మీల్య చక్షుషీ
మాయామన్యాం విససృజే తాసాం సమ్మోహనాయ వై ॥ ౫౦
తాం విష్ణుమాయాం వీక్ష్యైవ వివశా వినతాననాః
స తు పద్మాని సఞ్చిన్వన్ చచార సరసీజలే ॥ ౫౧
యథాపూర్వం పూజయంశ్చ నిర్వికారో నిరఞ్జనః
తం దృష్ట్వా నిర్వికారం తా వికర్తుం పురుషోత్తమమ్ ॥ ౫౨
అశక్తా జగ్మురాకాశం విష్ణుమాయావిమోహితాః
తాం మాయాం భగవానాహ 'లోకపూజ్యా భవిష్యసి ॥ ౫౩
ఇక్షుచాపాసిచక్రాబ్జపుష్పబాణధరా సతీ
చతుర్వర్గప్రదా పుంసాం పర్ణక్షీరాదిపూజితా' ॥ ౫౪
ఇత్యాదిశ్య చ తాం దేవీం అర్చయామాస పద్మినీమ్

తా॥ ఈ యవస్థలో భగవానుడు తపోవిఘ్నకరములగు నిమిత్తములగాంచి ఉద్విగ్నహృదయుడై క్షణకాలము కనులుమూసి వారలను మోహింపజేయ దలచి ఒక విచిత్రమాయను సృష్టించెను. వైష్ణవమాయకు వారు వశముజెంది చూచుచుండిరి. భగవానుడు యథాపూర్వకముగ తన నిత్యకృత్యములను నిర్వర్తించుకొనుచుండెను. అట్లు నిర్వికారుడగు మహాపురుషుని గాంచి కదలజాలక సిగ్గుపడిన అప్సరసలు అతిప్రయత్నముతో స్వస్థానమునకుపోయిరి. భగవాను

డును ఇక్షుచాపాసిచక్రాబ్జపుష్పబాణములను ధరించి యెదుట ప్రాంజలియై నిలచిన వైష్ణవమాయను అనేక విధములుగ కృతజ్ఞతతో ఆదరించిపంపి తన కృత్యము లందు నిమగ్నుడాయెను ఆ వైష్ణవమాయయే పద్మాక్షీరాదులచే భక్తులచే ఆరాధింపబడి వారలకు చతుర్వర్గఫలముల నొసంగుటకై ఉపకరించుచున్నది

పద్మసరోవరమునుండి లక్ష్మి అవతరించుట.

ఏవం తపస్యత స్తస్య ద్వాదశాబ్దా గతా ద్విజ ॥ ౫౫

తతస్త్రయోదశే వర్షే కార్తికే శుక్లపక్షకే

పఞ్చమ్యాం శుక్రవారే చ ముహూర్తే మైత్రసంజ్ఞకే ॥ ౫౬

వవుః పుణ్యాః సుఖా వాతా ఉత్తరాషాఢతారకే

ప్రసన్నం సలిలం సర్వం త్రైలోక్యా న్తర్గతం ద్విజ ॥ ౫౭

సుప్రభో భానుమానాసీత్ ప్రసన్నాని మనాంసి చ

తతః పద్మసరోమధ్యే తేజోరాశిః మహానభూత్ ॥ ౫౮

బాలభానుసహస్రాభః సువర్ణసదృశచ్ఛవిః

తన్మధ్యే కాఞ్చనైః పద్మైః నిర్మితో రథ ఉత్తమః ॥ ౫౯

పద్మిభిర్ధృతపార్శ్వశ్చ చతుర్భిర్మదగన్ధిభిః

తన్మధ్యే కాఞ్చనే పద్మే సహస్రదళశోభితే ॥ ౬౦

తత్పద్మకర్ణికామధ్యే పద్మాఽసనసమన్వితా

పద్మహస్తా పద్మనేత్రీ రక్తపద్మపదద్వయా ॥ ౬౧

సువర్ణపద్మముకుళద్వయశోభికుచానతా

స్మేరపద్మరజోగన్ధిసముచ్ఛ్వాసముఖామ్బుజా ॥ ౬౨

బిమ్బాధరసుసంవృద్ధస్మితశోభిసుధారసా

సమ్పల్లక్ష్మీసమావాసవిశాలనయనద్వయా ॥ ౬౩

సర్వరత్నసముత్కీర్ణ హాటకాభరణవిభూషణా

కర్ణికోత్పలతాటఙ్కమౌక్తికాలకబన్ధనా ॥ ౬౪

ఆముక్తముక్తామకుటకటకాఙ్గదకఙ్కణా
విద్యుత్పుఞ్జప్రతీకాశవిచిత్రామ్బరచిత్రితా ॥ ౬౫

మన్దస్మితా మనోజ్ఞాఙ్గీ మాధవం వీక్ష్య సాదరమ్
కహ్లారమాలామాదాయ యక్షకర్దమలేపనామ్ ॥ ౬౬

సుగన్ధితుళసీదూర్వామధూక కమలోత్పలామ్
స్థితా పద్మరథే దేవీ దేవం వీక్ష్య చతుర్భుజమ్ ॥ ౬౭

తా॥ ఇట్లు వ్రతనిష్ఠుడై భగవానుడు తపస్సు చేయుచుండగా పండ్రెండు సంవత్సరముల దీర్ఘకాలము గడచెను పదిమూడవ సంవత్సరమునందు కార్తిక శుక్లపక్ష పంచమీ తిథి ఉత్తరాషాఢా నక్షత్రములోకూడినది కాగా శుక్ర వారమునాడు మైత్రముహూర్తమునందు చల్లని వాయువువీవసాగెను. త్రిలోకము లందుండెడి ఉదకములన్నియు ప్రసన్నములై కానవచ్చెను సూర్యభగవానుడు ప్రసన్నుడై ప్రకాశించెను. సాధువుల హృదయములు ప్రసన్నములైయుండెను. ఆ సమయమున పద్మసరోవర మధ్యమునుండి ఒక ఆశ్చర్యకరమైన తేజోరాశి ఉదయించెను. ఆ తేజోరాశి బాలసూర్యులవేయిమంది వంటి సువర్ణకాంతి గలదై తోచెను. ఆ రాశిమధ్యమునందు కాంచనమయములగు కమలములతో చేయబడిన ఒక దివ్యరథము కానవచ్చెను. ఆరథమును నాలుగు దిక్కులందు నాలుగు యేనుగులు కట్టబడియుండెను ఆ రథ మధ్యప్రదేశమున నొక విశాల మైన సహస్రదళ కాంచనపద్మము ఆపద్మముయొక్క కర్ణికామధ్యమున పద్మాసన మున గూర్చుని రెండు చేతులందు రెండు పద్మములను ధరించియు పద్మముల వంటి నేత్రములు పద్మములవంటి హస్తపాదములు పద్మముకుళబోలిన స్తన ద్వయము స్మేరపద్మరజోగంధి సముచ్ఛ్వాస సముఖాంబుజయు సర్వరత్నసముక్షిప్త జాంబూనద విభూషణములు దరస్మితశోభి సుధారసజనక బింబాధరము సంపల్లక్ష్మీ సమావాసవిశాలనేత్రద్వయము కర్ణికోత్పలతాటంకమౌక్తికాలకబంధనము ఆముక్త ముక్తామకుట కటకాంగదకంకణములు విద్యుత్పుంజ ప్రతీకాశ విచిత్రాంబరములు కలిగియు మందస్మిత మనోజ్ఞాంగియునై పద్మావతీదేవి భగవానునిసాదరముగవీక్షిం చుచు యక్షకర్దమలిప్తమును సుగంధి తులసీ దూర్వామధూక కమలోత్పలబద్ధము నగు కహ్లారమాలను చేతులందెత్తుకొని పద్మరథమునసుండియే చూచుచునిలచెను.

బ్రహ్మాదులు పద్మసరోవరమునకువచ్చుట

తతో దేవగణాః సర్వే వాదయన్ దేవదున్దుభీః
శఙ్ఖానాపూరయామాసుః వీణాశ్చ ముముచుః స్వరాన్ ॥ ౭౮

షడ్జాదీన్ సమతాలేన గన్ధర్వా లలితం జగుః
ననృతుర్దివ్యాప్సరసః సుస్వరం గీతలాలసాః ॥ ౭౯

తూర్యఘోషేణ మహతా కృత్స్నమాపూరితం జగత్
తేన ఘోషేణ విజ్ఞాయ శ్రియః ప్రత్యక్షతాం విధిః ॥ ౮౦

హంసారూఢః సహమునిః బ్రహ్మా తత్ర సమాయయౌ
కైలాసాత్ శఙ్కరశ్చాపి గౌరీగణసమన్వితః ॥ ౮౧

ఇన్ద్రః శచ్యా లోకపాలైః శ్రుత్వా శఙ్ఖధ్వనిం యయౌ
వసిష్ఠాద్యాశ్చ మునయః సనకాద్యాశ్చ యోగినః ॥ ౮౨

కాఞ్చనాబ్జసరస్తీరం పద్మనాభాశ్రమం యయుః
సర్వలోకేశ్వరీం తత్ర శ్రియం పద్మరథస్థితామ్ ॥ ౮౩

దృష్ట్వా విద్యాధరాః సర్వే పుష్పవృష్టిముచో దివి
విస్మితాః సస్మితాః సర్వే దేవాస్తస్థుశ్చ సస్పృహాః ॥ ౮౪

దైతేయా దానవాశ్చాపి నాగాః పాతాళవాసినః
సాభిలాషా రమాం వీక్ష్య స్థితా మదనమోహితాః ॥ ౮౫

మామాశ్రయేన్మామాశ్రయేత్ ప్రత్యేకం మేనిరే హృది

తా॥ అప్పుడు దేవతలు దుందుభులను శంఖములను ఇతర వివిధమంగళ వాద్యములను ప్రయోగించిరి. అప్సరసలు నాట్యమాడిరి. పదునాలుగు భువనములును తూర్యఘోషరవముచే నిండిపోయెను. ఈశబ్దమును వినిన చతురాస్యుడు మహాలక్ష్మి అవతరించినదని సంతోషముతో బయలుదేరి హంసవాహనారూఢుడై

పద్మసరోవరతీరమునకువచ్చెను. పార్వతీదేవిని ప్రమథగణములను వెంట నిడుకొని కైలాసమునుండి శంకరుడు శచీదేవిని లోకపాలకులను వెంటదీసుకొని స్వర్గలోకమునుండి మహేంద్రుడు వసిష్ఠాది బ్రహ్మర్షులు సనకాది బ్రహ్మమానసపుత్రులుకూడ నచ్చటికి వచ్చిచేరిరి పద్మరథమున నిలచియున్న పద్మావతినిచూచి విద్యాధరులు పుష్పవృష్టిని కురిపించిరి. దేవతాగణమంతయు ఆసన్నివేశమును తిలకించి పరమాశ్చర్యముతో నిలచి చూచుచుండిరి. దైతేయులు దానవులు పాతాలవాసులు అదిగాగల దేవాదివర్గముకూడ వేడుకనుచూచి ముగ్ధులై ఆ యవతారమూర్తి తమలో యెవరినైనను వరించగూడునని తలపోయుచుండిరి.

### పద్మావతి భగవంతుని వరించుట.

ఇతి తేషు స్మరత్స్వేవ దేవదానవభోగిషు ॥ ౭౬

ఉత్థాయ సస్మితా లక్ష్మీః ఆగత్య హరిమఞ్జసా
కల్హారమాలాముమ్మచ్య విష్ణోః కణ్ఠే సమర్ప్య చ ॥ ౭౭

ఆలిఙ్గ్య తం చతుర్బాహుం సర్వలోకా న్వ్యలోకయత్
హరివక్షఃప్రతిష్ఠాయాః శ్రియో దృష్ట్యఽచ్ఛలేక్షితాః ॥ ౭౮

స్వస్వాధికారా న్సమ్ప్రాపుః దేవదానవయోగినః
శ్రియా సమేతో భగవా న్కృతార్థః కమలాపతిః ॥ ౭౯

తా॥ ఇట్లు లక్ష్మి తమలో యెవరిని వరించునోయని అచ్చట చేరినవారలు చింతించుచుండగా మహాలక్ష్మి మహాదరముతోలేచి తన చేతనున్న కల్హారమాలను భగవానుని కంఠమునందు సమర్పించి యాతనిని గాఢముగా నాలింగనముచేసికొని నలుదిక్కుల పారజూచెను. భగవంతుని వక్షస్థలమునచేరి చిరవిశ్లేషవిరహమును వీడుటచే నూతనోత్సాహభరితయగు జగన్మాత చూచిన చల్లని అమృతదిగ్ధకటాక్షపాతముచేత అనసూయులై అచ్చట గుమిగూడిన దేవదానవనాగాది సమస్తలోకము సంతోషముతో తమ తమ నిలయములకు పయనమై వెళ్లిరి. భగవానుడును చిరకాలార్జితతపఃఫలము సిద్ధించి కృతకృత్యుడాయెను.

భగవానుడు పద్మసరోవరమునకు వరమిచ్చుట

పాద్మం సరః సమీక్ష్యాథ వరం తస్మై దదౌ హరిః
'హే సరస్తవ ! తీరేఽస్మిన్ పద్మకాన్తస్య భాస్వతః ॥ ౭౦
తపః కుర్వన్నహం పద్మామాప్తవానస్మి శాశ్వతీమ్
తస్మాత్త్వమద్యప్రభృతి 'పద్మవాపీ'తి నామతః ॥ ౭౧
'పాద్మం' 'పద్మసర'శ్చేతి పద్మాప్రీతికరం భువి
త్రిలోకీప్రథితం భూయా హృద్దేశకమలాలయ' ॥ ౭౨
ఇత్యుక్త్వా గరుడేశానమధిరుహ్య రమాసఖః
భోగిరాజగిరిం గత్వా స్వామిపుష్కరిణీతటే ॥ ౭౩
రమతే రమయై కాన్తే రమణీయే శ్రియఃపతిః

తా॥ అంతట భగవానుడు పద్మసరోవరమువంక చూచి ఇట్లని చెప్పుచు వరమొసంగెను. "ఓ పద్మసరోవరమా ! నీ తీరమందు సూర్యనారాయణుని పరమానుగ్రహముచే తపమాచరించికొని నాప్రియసఖియగు పద్మాలయను చాల కాలము విశ్లేషము నొంది తిరిగి కూడికొనగలిగితిని. నీవు నీ తీరవాసము చేసిన మహోపకారమునకు నేను కృతజ్ఞుడను. నీయందు నా సఖి అవతరించి నన్ను స్వీకరించిన హేతువుచే నీకు పద్మసరోవరమను పేరు ప్రసిద్ధము అగుగాక" అని శాశ్వతప్రతిష్ఠారూపమగు వరము ననుగ్రహించి గరుడవాహనారూఢుడై శ్రీ వేంకటాద్రికి విజయముచేసి మహాలక్ష్మితో నచ్చట అర్చారూపమై సుఖముండెను.

నారదాదులు పద్మసరోవరమును ప్రశంసించుట

తం దృష్ట్వా మునయః సర్వే ప్రశశంసుః సరోవరమ్ ॥ ౭౪

తా॥ లక్ష్మీనారాయణుల అన్యోన్యసంశ్లేషానందమును సేవించిన నారదాది మహర్షులు పద్మసరోవరమును బహుభంగుల స్తుతించిరి.

నారదుడు చెప్పుచున్నాడు —

యః పద్మసరసి స్నాతః సప్తజన్మాఘనాశనే
శ్రియమాప్నోతి విమలాం శ్రియఃపతిరివామలః ॥ ౭౫

తా ॥ పద్మసరోవరమునందు స్నానము చేసినవాడు యేడు పూర్వజన్మము లందు చేసిన పాతకములు పోయి సంపన్నుడగును

వసిష్ఠుడు చెప్పుచున్నాడు —

రుక్మాబ్జసరసి స్నాతో రుక్మనద్యాస్తటోద్భవే
కోటిజన్మకృతైః పాపైః ముచ్యతే శ్రియమాప్నుయాత్ ॥ ౧౬

తా ॥ పద్మసరోవరమునందు స్నానము చేసినవాడు కోటి పూర్వజన్మము లందు చేసిన పాపములనుండి విముక్తుడై సుఖించును.

మరీచి చెప్పుచున్నాడు —

సువర్ణముఖరీకూలే స్నాతః పద్మసరోవరే
మహాపాతకయుక్తో యః స ముచ్యేతాంహసః క్షణాత్ ॥ ౧౭

తా॥ సువర్ణముఖరీతీరమందలి పద్మసరోవరమందు స్నానము చేసినవాడు మహాపాతకియైనను పాపవిముక్తుడగును

అత్రి చెప్పుచున్నాడు —

అత్ర పద్మసరఃస్నాతో యో రుక్మతటినీతటే
స సర్వపాపనిర్ముక్తః శ్రియమాప్నోత్యసంశయమ్ ॥ ౧౮

తా ॥ సువర్ణముఖరీతీరమున నున్న పద్మసరోవరమున స్నానము చేసిన వాడు సర్వపాపవినిర్ముక్తుడై సద్గతిచెందును.

అంగిరసుడు చెప్పుచున్నాడు —

భ్రష్టరాజ్యస్తు యో రాజా స్నాత్యస్మిన్ మణ్డలం యమీ
పద్మాకరాఖ్యే సరసి స రాజ్యం ప్రాప్నుయాచ్ఛ్రియమ్ ॥ ౧౯

తా ॥ రాజ్యభ్రష్టుడైన రాజు ఒక మండలకాలము పద్మసరోవరమున స్నానము చేసినయెడల నష్ట రాజ్యమును తిరిగి పొందగలడు.

పులస్త్యుడు చెప్పుచున్నాడు —

విప్రో యః పద్మసరసి వ్రాత్యో మన్త్రవివర్జితః
సోఽపి పూతస్త్రిషవణాత్ దినేనైకేన శుద్ధ్యతి ॥ ౨౦

తా॥ పరమవ్రాత్యుడును, మంత్రవర్జితుడు నగు విప్రుడు పద్మసరోవరమున ఒకే దినము త్రిషవణస్నానము చేసిన యెడల సద్బ్రాహ్మణుడై పంక్తి పావనుడు కాగలడు.

పులహుడు చెప్పుచున్నాడు —

వైశ్యో యో వఞ్చనాజీవీ వ్యవహారవిశారదః
స పద్మసరసి స్నాత్వా రాజా భవతి ధార్మికః ॥ ౯౧

తా॥ వ్యవహారజ్ఞానముతో లోకమును వంచించి వ్యాపారముచేయు వైశ్యుడు పద్మసరోవరమందు స్నానము చేసినయెడల ఉత్తరజన్మలో వంచనా జీవనమును పోగొట్టుకొని ధార్మికుడగు పైవర్ణములో రాజుగా జన్మించును.

క్రతువు చెప్పుచున్నాడు —

శూద్రస్స్వాచారవిభ్రష్టో దేవబ్రాహ్మణదూషకః
స పద్మసరసి స్నాత్వా పూతో వైశ్యో భవిష్యతి ॥ ౯౨

తా॥ స్వకులాచారభ్రష్టుడై దేవబ్రాహ్మణులను నిందించెడి శూద్రుడు పద్మసరోవర స్నానముచే పవిత్రుడై ఉత్తరజన్మమున వైశ్యుడుగా జన్మించును

దేవదర్శనుడు చెప్పుచున్నాడు —

ఇతి ప్రస్తూయ మునయో యయుస్తే స్వాశ్రమాన్మనే !
ఉత్పత్తిః పద్మసరసస్తవోక్తా దేవలామలా ॥ ౯౩

తా॥ ఇట్లు సంగ్రహముగ పద్మసరోవరమును ప్రశంసించి చెప్పుచు వారలువారలు తమతమ నెలవులకు పోయిరి

శుకచరిత్రవర్ణనము

ఇతః పరం శుకోత్పత్తిం వదామి శృణు దేవల !
పురా శుకో బ్రహ్మచారీ సాక్షాద్వ్యాసకిః మహాన్ ॥ ౯౪

లబ్ధ్వా బ్రహ్మోపదేశన్తు రుద్రాత్ జ్ఞానీ బభూవ హ
తపఃసిద్ధో జగామైవ పశ్యన్ బ్రహ్మాత్మకం జగత్ ॥ ౯౫

ఏవం జగౌ చ సతతం జ్ఞానోన్మత్తః స బాలవత్
ఊనషోడశవర్షోఽసౌ సాక్షాత్కృష్ణ ఇవోజ్జ్వలః ॥ ౯౬
మాతా చ కమలా దేవీ పితా దేవో జనార్దనః
బాన్ధవా విష్ణుభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ ॥ ౯౭
ఇత్యుక్త్వా వ్యాసమున్ముచ్య భానుం ప్రతి జగామ హ
గచ్ఛన్తం సుఖమాలోక్య తీవ్రాంశోశ్చ సమీపతః ॥ ౯౮
వ్యాసః పుత్రేతి చుక్రోశ పుత్రేతి చ పునః పునః
ఆలోక్యాథ శుకం భానుః ఉవాచ ప్రణయాత్ వటుమ్ ॥ ౯౯
హే వటో ! గచ్ఛ భూలోకమపుత్రస్త్వమవాక్ఛిరాః
ముక్తః పితృఋణాత్పుత్రం ఉత్పాద్యాఽగచ్ఛ శీఘ్రతః ॥ ౧౦౦
అపుత్రస్య గతిర్నాస్తి తపః కృత్వాఽపి భూతలే
యజ్ఞం కృత్వాఽపి లోకార్థీ స్వర్గం నైవాఽప్నుయాత్పుమాన్ ॥

తా॥ దేవలా ! ఇకమీద శుకమహర్షికథను చెప్పెదను వినుము. పూర్వము వ్యాసభగవానుని కుమారుడగు శుకబ్రహ్మర్షి బ్రహ్మచారియైయుండి కైలాసనాథుని వలన నుపదేశమును పొంది బ్రహ్మజ్ఞానియై తపస్సిద్ధి పొందెను. ఆవల ప్రపంచమునంతను బ్రహ్మత్వకముగా ననుభవించుచు తన్మయుడై జ్ఞానోన్మాదముచే బాలభావముననే నుండెను. తపస్సిద్ధిచే పదునారు వత్సరముల బాలుడై, అగ్నిభగవానునివలె ప్రకాశించుచుండెను. ఆతనికి సాక్షాజ్జగన్మాతయగు మహాలక్ష్మియే తల్లియు, జనార్దనుడు తండ్రియు, విష్ణుభక్తులగు మహాభాగవతులు ఆత్మబంధువులుగను తలంపు కలిగియుండెను. ఆ దశలో తండ్రియగు వ్యాసభగవానుని నాశ్రమమందు అసహాయునిగ విడచి దేశాటనముకై బయలుదేరెను. ఆ పుత్రవిశ్లేషమునకు దుఃఖార్తుడైన వ్యాసుడు 'కుమారకా' యని పలువరించుచు దుఃఖించెను. అట్లు పోవుచుండిన విరక్తుడగు శుకుని సూర్యభగవానుడు కరుణతో ఆశ్వాసపరచి 'ఓ బాలకా ! నీవు ఊర్ధ్వలోకమునకు పోగల శక్తిని సంపాదించలేదు గనుక నీవీ ప్రక్కకు రాకూడదు - రాజాలవు. పురుషుడుగా భూమియందు

పుట్టిన వాడు తన పితరుల ఋణమును తీర్చిననే గాని ఋణవిముక్తుడే సద్గతికి పోజాలడు. నీవు తిరిగి యా లోకమునకు పోయి గృహస్థాశ్రమమున భార్యతో సంసారములో నుండి పుత్రుల గని యజ్ఞములజేసి రావలెను. లేనియెడల ఈ లోకమునకు నీవు రాజాలవు' పొమ్ము అని చెప్పెను.

ఛాయాశుకుని ఉత్పత్తిక్రమము

ఇతి భానువచః శ్రుత్వా శుకో ధ్యాత్వా జనార్దనమ్
ఆత్మచ్ఛాయామధఃశీర్షామసృజత్త్వాత్మపూరుషమ్ ॥ ౧౦౨
ఛాయాశుకశ్చ త్వం కృత్వా స్వాత్మపుత్రమివాఽఽత్మవాన్
'పితుర్మే శోకనాశం తం కురు పుత్రత్వమాగతః' ॥ ౧౦౩
ఇత్యుక్త్వా భానుమాలోక్య వివృతం తత్పథం గతః

తా॥ ఇట్లని సూర్యుని మాటలు వినిన శుకుడు చింతించి, భగవానుని మనసులో ధ్యానించి ధైర్యముతో వెనుకకు మరలి తన ఆత్మనుండి అదశ్శిరస్సు నొక ఛాయను సృజించి, ఆ ఛాయను ఛాయాశుకుడని సంబోధించి, అతనిని వ్యాసాశ్రమున కేగి వ్యాసభగవానుని పుత్రవియోగ తాపమును, తన పితరుల నిర్విపోదకహానిచే కలుగబోవు భవిష్యత్తాపమును తీర్చుమనిచెప్పి అదే క్షణమున సూర్యభగవానునివంక చూడగా తన ఆదేశప్రకారము సద్యఃపుత్రలాభమును కని పితృ ఋణము తీర్చినందుకు సూర్యుడు శుకునిపై దయతో స్వర్గద్వారము వివృతము గావింపగా సూటిగా శుకు డూర్ధ్వలోకములకు చనెను.

ఛాయాశుకః సమాగత్య వ్యాసం క్రోశన్తమాత్మజమ్॥ ౧౦౪
నమస్కృత్య పితుః పాదౌ శ్రుత్వా భాగవతం సుధీః
కృత్వా వైవాహికం కర్మ పుత్రానుత్పాద్య పుణ్యధీః ॥ ౧౦౫
పురాణం శ్రీభాగవతం ప్రతిష్ఠాప్యావనౌ సుధీః
కృష్ణప్రసాదాత్స శుక ఋషిత్వఞ్చ ప్రపద్య చ ॥ ౧౦౬
సశరీరో బ్రహ్మలోకం గత్వా ప్రీతో వసన్ సుధీః

తా ॥ ఛాయాశుకుడును తండ్రిమాటలను విని సూటిగా వ్యాసాశ్రమునకు చేరి తండ్రిపాదములకు నమస్కరించి ఆశీస్సులనంది శ్రీభాగవత మహాపురాణమును నిర్మించి లోకమునకు మహోపకారము చేసి వివాహమాడి పుత్రులగని పితృ ఋణము దీర్చి బ్రహ్మర్షియై, మానవశరీరముతో బ్రహ్మలోకమునకు పోయి విహరించుచుండెను.

శ్రీవేఙ్కటాద్రిమాహాత్మ్యం శ్రుత్వా పద్మసరోవరమ్ ॥ ౧౦౭
ప్రాప్య కృత్వా తపస్తీవ్రం సరోఽమ్బుజదళైః సృజన్
ససభ్యాన్మానసాన్ పుత్రానష్టోత్తరశతం ద్విజాన్ ॥ ౧౦౮
తానధ్యాప్య బ్రహ్మవిద్యాం తైః సహాద్రిం గతో మునిః
మాసి భాద్రపదే పుణ్యే బ్రహ్మణా నిర్మితోత్సవే ॥ ౧౦౯
వర్తమానే శ్రీనివాససేవార్థం వ్యాసపుత్రకః
ఉత్సవే వాహనాన్ కృత్వా శతమష్టోత్తరాన్ ద్విజాన్ ॥ ౧౧౦
ఉత్సవాన్తే చావభృథే శ్రవణర్క్షే ప్రసన్నధీః
స్నాత్వా చ స్వామిసరసి తైర్ద్విజైః కమలోద్భవైః ॥ ౧౧౧
సభాయాం వేఙ్కటేశస్య వాహకార్థం వ్యజిజ్ఞపత్
స్వనామ్నా యత్పురం దేవ ! మయాక్లప్తం సురేశ్వర ॥ ౧౧౨
తత్క్షేత్రసమ్భవం సస్యం జీవితం శ్రీపతే ! కురు
సేవాం కుర్వన్త్వాప్రళయం వాహకా ఉత్సవేషు తే ॥ ౧౧౩
శ్రుత్వా మునివచో దేవః శ్రీనివాసస్తథాఽస్త్వితి
ఛాయాశుకస్యాత్మజానాం సభ్యానాం జీవమబ్రవీత్ ॥ ౧౧౪
బ్రహ్మలోకం జిగమిషుః పునః ఛాయాశుకో మునిః
కృష్ణఞ్చ బలభద్రఞ్చ భానుం పద్మసరోవరమ్ ॥ ౧౧౫
ప్రదక్షిణీకృత్య శుకః స్థీయతామితి చాత్మజాన్
భరద్వాజాదిషడ్గోత్రాన్ శతమష్టోత్తరం సుధీః
సభ్యాన్ సభాసదః పాద్మాన్ ఉక్త్వాఽఽకాశం జగామ హ॥

తా॥ అచ్చటనుండి భూమియందు శ్రీ వేంకటాచల పుణ్యక్షేత్రమాహాత్మ్యమును విని పరవశుడై భూలోకమునకు వచ్చి పద్మసరోవరమును చూచి సరోవరమున తామరకమలములను పైరుచేసి మహాలక్ష్మిని పూజించుచు తపము చేయ నారంభించెను. అచ్చట తనకు మానసపుత్రులుగా నూటయెనిమిదిమంది సభ్యపురుషుల నుత్పత్తిచేసి వారలకు భగవచ్ఛాస్త్రమునుచెప్పి ఒకనాటి వేంకటేశుని ప్రతి సాంవత్సరిక బ్రహ్మోత్సవకాలమందు వారలతో కూడి తాను సేవార్థమైవెళ్లి అచ్చట శ్రీ వేంకటేశ్వస్వామివార్ల వాహనములను మోయుటకు నూటయెనిమిది మంది బ్రాహ్మణులను దాయహరులుగ నియమించి ఆ యుత్సవాంతమున చక్రస్నానదినమగు శ్రవణనక్షత్ర శుభదినప్రసన్నుడై శ్రీవాహకబ్రాహ్మణులతో కూడ తానును స్నానానుష్ఠానములు చేసికొని వారలను వాహనవాహకులుగ భగవానుని సన్నిధానమున పారంపర్యముగ నుండునట్లు అంగీకరింపుమని ప్రభునిఉత్తర్వును ప్రార్థించెను. అట్లు కైంకర్యముచేయుచు తాను నిర్మించిన పద్మసరోవరతీర పురమును తన పేరిట శుకపురమని పిలువబడవలయుననియు, ఆ క్షేత్రమందు ఫలించెడి సస్యసంపద నంతను వాహక (సభ్య) బ్రాహ్మణు లనుభవించవలయుననియు, కల్పాంతముపరకు వారలే శ్రీ స్వామికి మహోత్సవములలో వాహన వాహకులుగ నుండవలయుననియు విజ్ఞాపించెను. భగవానుడు శుకుడు కోరినట్లు అంగీకరించెను. తిరిగి తన నిర్దిష్టకార్యములను పూర్తిగావించికొని బ్రహ్మలోక ప్రయాణమునకు ముందుగా ఛాయాశుకుడు కృష్ణుని బలభద్రుని సూర్యభగవానుని పద్మసరోవరమును ప్రదక్షిణ నమస్కారములచే అర్చించి తన ఆత్మజాతులగు వాహక (సభ్య) ద్విజులను ఆశీర్వదించి ఆకాశమున కెగిరిపోయెను. ఆ నూటయెనిమిదిమందిలో భారద్వాజులాదిగా ఆరు గోత్రములవారు కలరు

ఫలశ్రుతిః —

దేవల దేవదర్శన సంవాదము

ఉక్తం పద్మసరోజన్మ ఛాయాశుకమునేరపి
సభార్హాణాం ద్విజాతీనాం శుకమానసజన్మనామ్ ॥ ౧౧౭

దేవదర్శన ! సర్వజ్ఞ ! కృతార్థోఽస్మి నతోఽస్మి తే
నాస్తి శ్రోతవ్యమేతస్మాత్ సంశయో విగతో మమ ॥ ౧౧౮

హరిః ఓమ్ ॥ తత్సత్ ॥

తా॥ ఓ దేవలా ! పద్మసరస్సు ఛాయాశుకోత్పత్తి, సభ్యద్విజోత్పత్తి వీట్లను చెప్పితిననగా దేవలు డానందపరవశుడై కృతజ్ఞతను తెలిపి కృతార్థుడ నైతినని ముగించెను.

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవల దేవదర్శన సంవాదే పద్మసరోవరమాహాత్మ్యాదివర్ణనం నామ

చతుస్త్రింశోఽధ్యాయః

ఇది శ్రీ పాద్మపురాణమున క్షేత్రకాండమున శ్రీవేంకటాచలమాహాత్మ్యమున దేవల దేవదర్శన సంవాదమందు పద్మసరోవరమాహాత్మ్య కథనము ముప్పదినాల్గవ అధ్యాయము.

ఇతి శ్రీ పాద్మపురాణాన్తర్గత వేఙ్కటాచలమాహాత్మ్యమ్

॥ సమ్పూర్ణమ్ ॥

---